మధ్యవృత్తస్రస్తమృదునీవి యప్రయత్నపయోధరాంబరంబు। సంతప్తశర్కరాస
హపదన్యాసంబు నచలరజోధూమ లాలకంబు। సరణి తరుణతరుచ్ఛాయశమితఖే
ద। మలసమృదులాంగకంబు నై యరుగుదెంచు। నన్నిజపరిగ్రహముఁ గూర్మినాద
రించి। పలుకువింధ్యాద్రినిర్బంధబాంధవుండు॥౧౨౯॥ మ॥ వనితా చూచితె మాల్యవం
తము ప్రభావంతంబు నానామణీ। జనకోదంచితసానుకాంతము మరుత్సంపూర్ణచం
ద్రాశ్మనా। జనకేళీసదచంద్రకాంతము నభస్సంబాధకృత్కూటవ। ర్ధనదుర్దాంతము
సర్వపర్వతకథాప్రాగ్వర్ణితోదంతముఁ॥౧౩౦॥ సీ॥ ఇవె యూపవృతశాఖులివె లూన
ముఖదర్భసందర్భపేశాంతసైకతంబు। లివె శబ్దసహమృగయువయుగంబులివి రేవల
కాకపక్షవ స్తకులుబ్రహ్మ। చారులు నిజహోమసౌరభేయీతర్ణకములనీడలనిల్చికా
చియున్న। వారు సామోదితస్వరసంశయమునొంది చిలుకకోయిలని డెతెలియనడిగె।
భసలకలభకులాస్పృష్టకుసుమవిసర। మస్పృణమకరందమయమైనమావిమోక। కిసల
యచ్ఛవిపునరుక్తిన సలుమసలు। బుషులచెంగావివలువ చందు సిందువదన॥౧౩౧॥ క॥ ని
ర్ధూతపాతకములు హా। నిర్ధూతమలతాగ్రలాస్యవిలసనశిఖా। ధూర్ధరములు నిజభజన
వి। నర్ధితసుకృతంబు లిచటివాయువు లబలా॥౧౩౨॥ ఉ॥ ఓలలితాంగి యిందు
సుఖముండు మృకండుకనాదగాధివా। ధూలముఖాతిరిక్తచరితుండు మతంగమహా

---

త = చూపఁబడిన. వృత్త = వట్రువైన. స్రస్త = జాఱిన. నీవి = పోకముడిగలది. పయోధరాంబరం
బు = అప్రయత్నముగ జాఱిన స్తనములగలది — పైఁటగలది. సంతప్త...న్యాసంబు = కాలిన గులకరాలకు
నోర్వనియడుగు పెట్టుటగలది — ఎండచేత కాలిన గులకరాళ్లపై అడుగుపెట్టఁజాలక యడుగుపె
ట్టుచున్నది అనుట. అచల...కంబు = కొండయందలి దుమ్ముచేత నలుపు మించగలసిన యెఱుపువన్నె
గల ముంగురులు గలది. సరణి = మార్గమునందలి. తరుణ = లేఁతవైన. శమిత ఖేదము = అణఁపఁబడిన
బడలిక గలది. అలసమృదులాంగకంబు = బడలిన మెత్తని దేహము గలది. నిజపరిగ్రహముఁ = తన భా
ర్యను. వింధ్యాద్రినిర్బంధబాంధవుండు = అగస్త్యుడు॥౧౨౯॥ ప్రభావంతంబు = ప్రకాశము గలది.
నానా...తము = అనేకములయిన రత్నములకు పుట్టుచోట్లయి మెఱుపు నట్టి చఱియలచేత మనోజ్ఞమ
యినది. మరు...కాంతము = దేవతాస్త్రీలకు క్రీడాస్థానమైన చంద్రకాంతపు రాళ్లు గలది. నభ...
దుర్దాంతము = ఆకాశము నొరయుచున్న శిఖరములు పెరుగుటచేత అణఁపరానిది. ప్రాగ్వర్ణితో
దంతము = మున్ను చెప్పఁబడిన వృత్తాంతము గలది॥౧౩౦॥ యూపవృతశాఖులు = యూపస్తం
భములచేత ఆవరింపఁబడిన వృక్షములు. లూన = కోయఁబడిన. సందర్భ = కూడిక గల. పేశాంతసై
కతంబులు = కొంచెము నీటిపడియల వెంబడియిసుక దిబ్బలు. సహ = సహించునట్టి. కాకపక్ష =
పిల్లజుట్లతోడి. సౌరభేయీతర్ణకములఁ = ఆవుల లేఁగదూడలను. సామోదిత = సామవేదమువ
లనఁ బుట్టిన. భసల...మయము = కొదమతుమ్మెదల సమూహముచేత తాఁకఁబడని పువ్వుల సమూ
దాయము వలని తేనెటీఁగులు చేయుచున్నతేనెవిశారము గలది. మావిమోక = మామిడి మొలక. కిసల
యచ్ఛవి = చిగుళ్ల కాంతి. పునరుక్తిఁ = ఇబ్బడించుటచేత. అసలుమసలుఁ = బురదగొనును —
అతిశయించును. ఇందువదన = చంద్రునివంటి ముఖము కలదానా॥౧౩౧॥ నిర్ధూత = భ్రాంతిగా తొ
లఁగింపఁబడిన. హానిర్ధూత = పెంపుపొందనది. లాస్యవిలసన = నాట్యపు చతురత్వమును.
ధూర్ధరములు = భారమును వహించినవి. నిజభజన = తమ్ము సేవించుటచేత॥౧౩౨॥ అతిరిక్త =

తపస్విసే। షోడళిగళుండు నిర్వ్యళిగాత్రుండు నిర్నిటలేక్షణుండుని। ర్వ్యళీకభూష ణుండు నగనంబరకేశుఁ డనంగఁ బెంపుగాంచె ॥ ౧౩౩ ॥ తే ॥ చూచె మధురాసి తప్రభనీ మహాత్ము। నాశ్రమము బొందు వనియద్రి యంతికమున। పలుదయైమింటిను నవ్వం టవలఁతి నెలఁత। చంటి కడనంటు మృగనాభి చర్చవోలె ॥ ౧౩౪॥ ఉ॥ భూరితరాభ్రవిభ్రమము పుష్కరదర్శకగంబు దానల। క్ష్మీరుచిరంబు సత్వగుణకీర్తితమూ ర్తియు వాలిసాలసం। హారవిహార కారణము నౌరఘుకుంజర భర్తము న్న సం। చారమొనర్చె నీయచల సానుతలంబున నంబుజాననా॥ ౧౩౫ ॥ సీ ॥ పద్మినీపన్నా తపత్రంబు శిథిలపత్రాగ్రమై రాయంచ యాశ్రయించెఁ। దాలుస్రవత్ఫేనజాలం బుతో ఘోణీపంచల రొంపిగలంచియాడె। దూరోద్గమద్ధావధూమము నంబుదబుద్ధి నెమ్మిలోపౌఁదనంచి సికిరిచూచె। జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి సామజంబురు ప్రకటిఁజల్లుకొనియె। సరసిపైఁ సీము సలసల దెరలె విపిన। సకలవీథులు నిర్మృగోచ్చ యములయ్యె। ఎట్టను ధ్యాన మిది సుధామధురవాణి। యప్పు డమితోష్ణబథశ్రమ మపనయింప ॥ ౧౩౬ ॥ వ ॥ అనుచు సభార్యుండై వింధ్యాహార్య స్తంభయిత సంభృతానురాగంబున నిగిడిచని ॥ ౧౩౭ ॥ క ॥ నటనోద్భటుఁడైన మహా। నటునిజటా జూటమురిలినం దొరఁగుమరు। తటి నదియిదియనుచుఁ జని। యటుగని మెండుంగ భద్రనఘుముఖముద్రన్ ॥ ౧౩౮ ॥ శా ॥ గంగా సంగమ మిచ్ఛగించు నెమదిన్ గా

---

మించిన. నిష్కాళిగళుండు = నల్లఁదనము లేని మెడగలవాఁడు. నిర్వ్యళిగాత్రుడు = ... రూపు(అర్ధ)శరీరమంచు లేనివాఁడు. నిర్నిటలేక్షణుండు = నొసట కన్ను లేనివాఁడు. నిర్వ్యళీకభూషణుండు = పాముల సొమ్ములు లేనివాఁడు. అంబరకేశుఁడు = శివుఁడు ॥౧౩౪॥ అసితప్రభ = నల్లని కాంతి. అంతికమునన్ = సమీపమునందు వలుద = వట్రువ ప..టు వలతి = భూమి. చర్చ = పూఁత ॥ ౧౩౫॥ భూరితరాభ్రవిభ్రమము = మిక్కిలి యెచ్చైన మబ్బు యొక్క విలాసము. పుష్కర = తెల్లదామర. తొండము యొక్క కొన. దానలక్ష్మీ = ఈవి కలిమి; చెక్కిటిమదము కలిమి. వాలిసాలసంహారవిహారకారణము = వాలి యొక్కయు ఏడు చెట్ల యొక్కయు చంపుటయనెడు వినోదసంచారమునకు హేతువైనది. వాలి = (మొగ్గ)—పుని. సాల = వృక్షములను. సంహార = నాశము చేయునట్టి. విహార = వినోదసంచారమునకు. కారణము = హేతువు. రఘుకుంజరభర్త = రఘువంశశ్రేష్ఠుఁడైన శ్రీరాముఁడు. రఘువంశస్థుఁడైన ఏనుఁగుల రాజు. సాను = చరియ ॥౧౩౬॥ పద్మినీపన్నాతపత్రంబు = తామరతీఁగయొందలి కమ్మ యనెడి గొడుగను. శిథిలపత్రాగ్రము = తూఁట్లుపడిన కొనలుగలది. తాలుస్రవత్ఫేనజాలంబులోన్ = దవుడలనుండి కారుచున్న నురుగుతెట్టెలతో. ఘోణి = పంది. దూరోద్గమద్ధావధూమము = దూరముననుండి వెగసిన కార్చిచ్చు పొగ. అంబుదబుద్ధిన్ = మేఘమనెడి తలఁపు చేత. నెమ్మి = నెమలి. లోపౌఁద = పొదలలోపలి భాగము. జఠరస్థ = కడుపునందుండెడి. నాసానాళమునన్ = ముక్కుగొట్టము నుండి. సామజంబు = ఏనుఁగు. సరసి = సరస్సు. తెరలెన్ = తెర్లెను = ఉడికెను. నిర్మృగోచ్చయములు = మృగసమూహములు లేనివి. పథశ్రమము = త్రోవనడచుటవలని బడలికను అపనయింపన్ = పోఁగొట్టుకొనను ॥౧౩౭॥౧౩౮ ॥ నటనోద్భటుఁడు = నాట్యము చేయుటయందు మెచ్చినవాఁడు. మహానటుని = శివుని యొక్క. ఉరిలినన్ = పీడినను. తొరఁగు = స్రవించునట్టి. మరుత్తటినది = ఆకాశగంగ. అఘముఖముద్రన్ = పాపములమొఖముఁ కుముద్రయైనదానిని —

వేరి దేవేరిగా । సంగీకారమొనర్చు నేయమునతో నానందముం బొందునే । రంగ
త్తుంగతరంగహస్తముల నారత్నాకరేంద్రుండు నీ । యంగం బంటి సుఖించు నేని
గుణభద్రా తుంగభద్రానదీ ॥ ౧౩౯ ॥ క ॥ ఓప్రను భూపరిధింగల । యాపగల
విదాహ్యతాప మాపంగనీవే । యోప్రదుగా యంతర్గత । తాపత్రయమడంపనో
యుదన్వన్మహిళా ॥ ౧౪౦ ॥ చ ॥ అనికొనియాడి యున్నది మహానియమంబునం దీ
ర్థమాడి బో । రన భవరోగజాడ్యములు ప్రాంగఁదదుజ్జ్వలకర్బురాబ్జగం । ధనిచిత
వారసౌషధము దాఁపి తటస్థితపూజ్యపూజనం । బునడపెఁ గాశికావిరహభూ
రివిషాదను సదము దగన్ ॥ ౧౪౧ ॥ వ ॥ ఇవ్విధంబునఁ ద్రిభువనపవిత్రీకరణ
సమర్థచరిత్రంబగు నయ్యుదధికళత్రంబున ససచ్ఛాత్రుండై యంచిత కృత్యంబు లా
చరించి నీవారముష్టిం బంచవారంబు లుండి తద్వారిపూరంబు వినిర్గమించి మించఁ
బోఁడియునం దానును బంచాక్షరీగుహాహర్మ్యకంబగు విరూపాక్షు నుక్షధ్వజు
దాక్షాయణీవిభు వళిక్షయూఖ రేఖావకటు భ్రుకుటిమాత్రవిద్రావిత పురని
శాటు హేమకూటనివాసు వాసుకివలయు వలయు తెఱంగునం బ్రస్తుతించి సమస్త
కలుషనిరసనలలితమూర్తియై చని చని ముందట నమందమణికందళ దంతురంబయి

---

పాపములను తలఁగింపఁజేయుదానిని ౧౩౯ దేవేరిగాన్ = పట్టపుదేవిగా. రంగత్తుంగతరంగహస్తములన్ = చలించుచున్న యున్నతములైన అలల నెడిచేతులతో. రత్నాకరేంద్రుఁడు = సముద్రరాజు. గుణభద్రా = మంచిగుణములచేత మేలైనదానా ॥౧౪౦॥ భూపరిధిన్ = భూమండలమునందు. ఆపగలు = నదులు, బాహ్యతాపము = బయటికాఁకను. అడఁపఁగన్ = అణఁపను. అంతర్గత = లోపలఁబొందియుండెడి. ఉదన్వన్మహిళా = సముద్రునియిల్లాలా ॥౧౪౧॥ తీర్థమాడి = స్నానముచేసి బోరనన్ = శీఘ్రముగ. భవరోగజాడ్యములు = జన్మములనెడి వ్యాధులవలని జడత్వములు. ప్రాంగన్ = తొలిపోఁగా తదుజ్జ్వలకర్బురాబ్జగంధనిచితము = ఆనదియందలి ప్రకాశించునట్టి బంగారుకమలముల వాసనచేత అతిశయిల్లినది. రసౌషధమున్ = జలరూపమైన మందును. తటస్థిత = గట్టునందుండెడి. కాశికావిరహభూరివిషాదము = కాశీపట్టణమును విడుచుటవలని అత్యంతమైన మనస్తాపము. సాదము = నాశము ॥౧౪౨॥ త్రిభువనపవిత్రీకరణసమర్థచరిత్రంబు = స్వర్గమర్త్యపాతాళములనెడి మూడులోకములను పావనములనుగాఁ జేయఁజాలిన ప్రవర్తనములుగలది. అయ్యుదధికళత్రంబునన్ = ఆసముద్రునిభార్యయంటు - నదియందు ససచ్ఛాత్రుండు = పెండ్లాముతోను శిష్యులతోను గూడినవాఁడు. అంచిత = ఒప్పిదములైన - ముఖ్యములైన. నీవారముష్టిన్ = పిడికెఁడు నివ్వరిధాన్యము నాహారముగాఁ జేసికొనుటచేత. పంచవారంబులు = అయిదువారములు - నలుపదిదినములు. తద్వారిపూరంబు = అందలిజలప్రవాహంబును. వినిర్గమించి = దాఁటి - మించుఁబోఁడియున్ - పెండ్లామును. పంచాక్షరీగుహాహర్మ్యకంబు = పంచాక్షరీమంత్రము అనెడి గుహయందలి సింహము ఉక్షధ్వజున్ = వృషభకేతనము గలవానిని. దాక్షాయణీవిభున్ = దక్షునికూఁతురిమగనిని. వళిక్షయూఖరేఖామకుటున్ = చంద్రరేఖ కిరీటముగాఁ గలవానిని. భ్రుకుటిమాత్రవిద్రావితపురనిశాటున్ = బొమముడిమాత్రము చేత నేపరుగెత్తింపఁబడిన త్రిపురాసురులుగలవానిని - వాసుకివలయున్ = సర్పరాజు చేతికడియముగాఁ గలవానిని. ప్రస్తుతించి = పొగడి సమస్తకలుషనిరసనలలితమూర్తి = ఎల్లపాపములను తొలఁగించుకొనుటచేత మనోహరమైన యాకృతిగలవాఁడు. అమందమణికం

మహీమందగమన కేళీకందుకంబునుం బోలె నుత్తాలంబగు స్వామిశైలంబు నధిరో
హణంబుచేసి యక్కుధరమ్మునందు ॥ ౧౪౨ ॥ క ॥ షణ్ముఖు శిఖిసంతప్తహిర
ణ్మయనిభవర్ణుఁ గేకిరాడ్ధ్వజుఁ గొలిచెన్ ॥ షాణ్మాతురుఁ దపసితురాషాణ్ముఖసుఖ
దప్రభావు సతియుం దానున్ ॥ ౧౪౩ ॥ క ॥ కొలిచినుతించెం గ్రౌంచా చలవిదళ
ననిపుణబాహాసారుఁ గుమారున్ । గలశసుతుండుం బలుకుల మొలకలుపుష్పోపహా
రములు చెలువొసఁగన్ ॥ ౧౪౪ ॥ సీ ॥ కావుకావనుట రక్కసులమూఁక నేకాసిన
నిచెనీయడ సింహనాదవిహృతి । పొత్తులు తొలువేలుపుల గంట్లనేకాసిహత్తెనేమేన
వజ్రాంగిబోడు । వసవల్పుదైత్యులవ్రయ్యగుండె నేకానినినుఁగప్పెవీరచందనపుఁడా
వి । యంగుళీచర్వణం బసురులందు నేకాని గెలుపుచిందము మోవి నిలిచెనీకు । నీవు
తలమావివీడని నిసువువయసు । నాఁడె జేజేలదళవాయి నాయఁకరవుఁ । బట్టమునవిల్చి
తారకుఁ గిట్టిప్రౌఢ । తరరణక్రీడయొనరించు తెరిమహాత్మ ॥ ౧౪౫ ॥ ఆ ॥ అహితగో
త్రహృద్వ్యధారోపకృతినీదు । శక్తికుగ్రబాహు శక్తిఁ గేఁదగు । ఘనవివృద్ధిఁ బేర్చి
గర్వించుటలునీదు । శిఖికిసత్పవిత్రతావ శిఖికినమరు ॥ ౧౪౬ ॥ వ ॥ అనియమ్మునికు
లచక్రవర్తి వెండియుం గార్తికేయుం డాశ్రితార్తిహరుండనియుసుశరవణభవుండు

---

దళదంతురము — తక్కువకానిరత్నపుమొలకలచేతమిట్టపల్లమైనది. మందగమన — స్త్రీయొక్క.
కేళికందుకము — ఆటచెండు. ఉత్తాలంబు — పొడువైనది. అధిరోహణంబుచేసి — ఎక్కి. అక్కుధర
మ్మునందున్ — ఆకొండయందు ॥ ౧౪౩ ॥ శిఖిసంతప్తహిరణ్మయనిభవర్ణున్ — అగ్నియందుపుటము వే
యఁబడిన బంగారువికారమునుబోలినదేహచ్ఛాయగలవానిని, కేకిధ్వజున్ — నెమలిరాజు (గు
రుతు) టెక్కెమునందుఁ గలవానిని. షాణ్మాతురున్ — ఆర్గురుతల్లులుగలవానిని. తపసితురాషాణ్ముఖ
సుఖదప్రభావున్ — మునులు దేవేంద్రుఁడు మొదలగువారికి సుఖమునిచ్చునట్టిమహిమగలవానిని ॥
౧౪౪ ॥ విదళన — భేదించుటయందు. నిపుణ — సమర్థమైన. పలుకులమొలకలు — మృదువులైనతిన్నని
మాటలు పుష్పోపహారములు — పువ్వులకానుకలు. చెలువు — అందము ॥ ౧౪౫ ॥ మూఁక — సేన. నని
చెన్ — అతిశయించెను. విహృతి — విహారము. పొత్తులు — పొత్తిగుడ్డలు - తొలువేలుపుగంట్లనే — రా
క్షసులగాయపుఁదెబ్బలయందే. హత్తెన్ — అంటెను. వజ్రాంగిబోడు — వజ్రమయమైనకవచము.
వసవల్పు — వసకంపు వ్రయ్యు — భేదిల్లు — పగులు. అంగుళీచర్వణంబు — వ్రేళ్లనమలుట. గెలుపుచిం
దము — జయశంఖము. తలమావి — తలలుగప్పినమావి - నిసువువయసు — శిశుప్రాయము. జేజేలదళ
వాయినాయఁకరవుఁబట్టమునన్ — దేవతలసేనానాయకులకునాయకుఁడగునట్టిపట్టమునుగట్టుకొ
నుటయందు కిట్టి — సమీపించి. ప్రౌఢతరరణక్రీడ — మిక్కిలినేర్పుగలయుద్ధమనెడియాట ॥ ౧౪౬ ॥
అహితగోత్రహృద్వ్యధారోపకృతి — శత్రువంశముయొక్కమనోవ్యధను కలుగఁజేయునట్టిపని
(లేక) శత్రురూపమైనకొండయొక్కమనోవ్యధను చేయునట్టిబాణవ్యాపారము. ఘనవివృద్ధిన్ —
మేఘములయొక్కవిశేషవృద్ధిచేత; అధికమైనపెరుగుటచేత. పేర్చి — విజృంభించి. శిఖికిన్ — నెమ
లికిని. సత్పవిత్రతాపశిఖికిన్ — మంచిపవిత్రతాపమనెడిఅగ్నికిని ॥ ౧౪౭ ॥ మునికులచక్రవర్తి — మునులస
మూహమునందుశ్రేష్ఠుఁడు. కార్తికేయుఁడు — కృత్తికలకొడుకు. ఆశ్రితార్తిహరుండు — ఆశ్ర
యించినవారిబాధనుహరించువాఁడు. శరవణభవుండు — రెల్లుగంటయందుఁబుట్టినవాఁడు. ప్ర
వణుండు — ఆసక్తుఁడు. మందారుండు — కల్పవృక్షమైనవాఁడు. శశ్వద్బాలుండు — సదాబాలుఁడు

పరమపురుషార్థప్రదుండనియును మహాసేనుండు దీనజనమందారుఁడనియును శ
శ్వద్భాలుండు కృపావిశాలుఁడనియును షడాననుండు కీడువలన బాపిప్రోచుప్రో
డయనియును నీలదంష్ట్రుండు జయశ్రీలాభంబులకు మూలంబనియును గాంగేయుం
డు పెన్నిధానంబనియును కుక్కుటధ్వజుండు మ్రొక్కుటకుం దగిన వేల్పనియును
బ్రహ్మగర్భుండు నిర్భరబ్రహ్మవిద్యోపదేశదేశికుండనియును విశాఖుఁడు కుశా
గ్రబుద్ధియనియును సుబ్రహ్మణ్యుం డదభ్రగుణరత్నఖనియనియును శిఖివాహ
నుండు సాధుసఖుఁడనియును పార్వతీనందనుండు సచ్చిదానందుఁడనియును బా
హులేయుండు మోహమహీధరవ్యూహమేఘవాహనుఁడనియును తారకారా
తియు కారణసుకృతియనియును శక్తిధరుండు భుక్తిముక్తికరుండనియును స్వామి
యోగక్షేమభూమియనియును స్కందుండు జగత్సందోహావనపరిస్పందుఁడనియును
క్రౌంచదారణుండు పంచవదనావతారుండనియును గుహుండు నిరవగ్రహ
శుభావహుండనియును కుమారుం డమరచమూసముద్ధరణనిర్వికారుఁడనియు
ను షాణ్మాతురుండు తురాషాణ్ముఖసుఖప్రదుండనియును ప్రమదరసనిమగ్నమ
నస్కుండై యగ్నిభవుం బ్రణుతించి యసాదంబగు తదీయప్రసాదంబువడసి కతి
పయదివసంబు లుచితగతిం గడపి తద్విరచితమహస్కాంద గ్రంథసందర్భంబునం
బూర్వభాగంబు విని తదాశయావబోధసుధాధుని నిమజ్జనంబునం గాశీపయోగ

---

అగువాఁడు. కృపావిశాలుఁడు—విశేషకృపగలవాఁడు. జయశ్రీలాభంబులకు—గెలుపుకలుము
లవచ్చుబడికి మూలంబు—కారణమైనవాఁడు. గాంగేయుండు—గంగకొడుకు పెన్నిధానంబు—
పెద్దనిధి. నిర్భర—పూర్ణమైన. దేశికుఁడు—గురువు. అదభ్రగుణరత్నఖని—శ్రేష్ఠములైనగుణములనెడి
రత్నములకు గని. సచ్చిదానందుఁడు—చెడనిజ్ఞానమును సంతోషమును గలవాఁడు- బాహులేయుఁ
డు—అనేకులకు కొడుకు మోహమహీధరవ్యూహమేఘవాహనుడు—అజ్ఞానమనెడి కొండలసమూ
హమునకు ఇంద్రుఁడు. సుకృతి—సత్కార్యములుగలవాఁడు. భుక్తిముక్తికరుఁడు—భోగమో
క్షములను కలుగఁజేయువాఁడు. యోగక్షేమభూమి—అపూర్వవస్తువులను పొందుటకును మేలునకు
నుస్థానమైనవాఁడు. జగత్సందోహావనపరిస్పందుఁడు—లోకసమూహమును రక్షించుటయందు చ
లింపనివాఁడు. క్రౌంచదారణుండు—క్రౌంచపర్వతమును భేదించినవాఁడు. పంచవదన—శివుని
యొక్క. నిరవగ్రహశుభావహుఁడు—కఱవులేక శుభములనిచ్చువాఁడు. అమరచమూసముద్ధర
ణనిర్వికారుఁడు—దేవతలదండును ఉద్ధరించుటయందు వికారము పొందనివాఁడు. తురాషాణ్ముఖ
సుఖప్రదుఁడు—ఇంద్రుఁడు మొదలగువారికి సుఖము నిచ్చువాఁడు. ప్రమదరసనిమగ్నమనస్కుండు
—సంతోషరసమునందు మునిఁగిన మనస్సుగలవాఁడు— మిక్కిలి సంతోషించినవాఁడు. అసాదం
బు—నాశములేనిది- ప్రసాదంబు—అనుగ్రహము, కతిపయదివసంబులు—కొన్నిదినములు- తద్విరచి
త—అతనిచేత చేయఁబడిన. సందర్భంబునఁదుక్—రచనయందు—కూర్పునందు. తదా...జ్జనం
బునక్—దానియర్థము తెలియుటయనెడి అమృతనదియందు మునుఁగుటచేత—అపురాణకథను విను
టయందలి యాసచేత. క్లేశంబు—దుఃఖమును॥ ౨౮౮॥ మిన్నేటిపాటి—ఆకాశగంగయొక్క కొ
లఁది. ఉన్నతి—గౌరవము. వాసి—మేలిమి చేగ—సత్త. భూతి—సంపద. ఉదారత—ఘనత. అగ

జనితక్లేశంబుఁదీసినచ్చి యందలి యుత్తరభాగంబున ॥ ౧౪౭ ॥ సీ ॥ మిన్నేటిపాటియుఁ బెన్నయున్నతియు విపాశవాసియుఁ జంద్రభాగచేగ । యనుశరావతిభాతియును వేత్రవతిచరిత్రము బాహుదయుదారతయును గృష్ణవేణియగణ్యాభివృద్ధియుఁ గావేరి రీవియుఁ గపిశలీలావిభవము । వంజీర మంజువార్వైభవంబును భవనాశనిక్లేశనిర్నాశకృతియుఁ దుంగభద్రపరిసంగముత్తుంగభద్రరాజిరాజిల్లుగౌతమిరోజమహిమయు । వార్తకెక్కిన తీర్థప్రవర్తనములు । సామివినిపించె వింధ్యసంస్తంభయితకు ॥ ౧౪౮ ॥ క ॥ ఆకుంభజుతో షణ్ముఖుఁ । డాకర్ణింపుమని పలికెఁ దాపసికుంజర వినుమిం । కేకథవినియెదు సకలము । నీకెఱిఁగించితిని నొకధునీచరితంబుల్ ॥ ౧౪౯ ॥ క ॥ ఈఁగంగాదిక తీర్థము । లీఁగంగా నీవుదమసమిద్ధాంబువులన్ । దోఁగెడువారలఁగనఁగన । గ్రాఁగెడునంగారసింధుకల్లోలములన్ ॥ ౧౫౦ ॥ క ॥ వివిధక్షేత్రచరిత్రలు । వివిధసుపర్వానుభావ విలసనములుఁదీ । ర్థవిశేషశ్రవణములు తలిరొడవికింజవియొసఁగెనే విశిష్టవిచారా ॥ ౧౫౧ ॥ చ ॥ అనుచుననగస్త్యుఁ డీల్లనియె హైమవతీసుతుతోడఁ దోడిన । మ్మునులలరంగ నోయనఘ మూర్తి సమస్తముఁ గ్రిందు చేసి మిం । చినబలువేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కటిఁ గూడియుండనే । నినిరుపమాదృతిం దెలిపి నీవ్రమముం గనుఁగొందుఁ గాదగున్ ॥ ౧౫౨ ॥ క ॥ అనిపలుకుసకలశభవముఖమునిజనముల ప్రశ్నవాక్యములు విని పురభి । త్తనయుఁడు తద్విధమునో । కనెలం గుమిగూడియునికిఁ గనజాలమిన్ ॥ ౧౫౩ ॥ వ ॥ ముహూర్తమాత్రవిచారంబోలారూఢనిజస్వాంతుండై యరూ యాశ్రమవిశ్రాంతులం గూర్చి యిట్లనియె ॥ ౧౫౪ ॥ క ॥ పత్త్రిత్రితయమునొకచో । భూతలమున మేళవింపిపొగడొందుటమ । చ్చేతోగతి

---

ణ్యాభివృద్ధి = ఎన్నరానిపెంపు. రీవి = బాగు లీలావిభవము = విలాససంపద. వార్వైభవంబు = జలసమృద్ధి. క్లేశనిర్నాశకృతి = క్లేశము పేరులేకుండఁ జేయుట. ప్రసంగము = ప్రస్తావము. ఉత్తుంగభద్రరాజిన్ = అధికమయినశుభములవరుసను ఓజ = విధము. వార్తకున్ = ప్రసిద్ధికి. తీర్థప్రవర్తనలు = తీర్థములచరిత్రములు. సంస్తంభయితకున్ = అణఁచినవానికి॥ ౧౪౯॥ కేకిధ్వజుఁడు = కుమారస్వామి. తాపసికుంజర = మునిశ్రేష్ఠుఁడా. ధునీచరితంబులు = నదులచరిత్రములు॥ ౧౫౦॥ ఈఁగంగా నీవు = మునుఁగ నీయవు. సమిద్ధాంబువులన్ = మిక్కిలిశ్లాఘ్యములైన జలములయందు. తోఁగెడు = మునిఁగెడు. గ్రాఁగెడు = మండెడు. అంగారసింధుకల్లోలములన్ = నిప్పుచేటి పెద్దఅలలయందు॥ ౧౫౧॥ సుపర్వ = దేవతలయొక్క. శ్రవణములు తలిరొడవి = వినునప్పుడు. చవి = రుచి. విశిష్ట = విశేషమయిన॥ ౧౫౨॥ హైమవతి = పార్వతి. అలరంగన్ = సంతోషింపఁగా. క్రిందుచేసి = తక్కువపఱిచి. నిరుపమాదృతిన్ = సాటిలేని ఆదరణము చేత॥ ౧౫౩॥ పురభిత్తనయుఁడు = శివుని కొడుకు. నెలన్ = నెలవునందు — స్థానమునందు॥ ౧౫౪॥ విచారడోలారూఢనిజస్వాంతుడు = ఆలోచన యనెడి యుయ్యాలయందెక్కియున్న తనమనసుగలవాఁడు — ఆలోచనచేత చలించిన మనసుగలవాఁడు. ఆశ్రమవిశ్రాంతులన్ = మునులను॥ ౧౫౫॥ మేళవించి = కూడి. చేతోగతిన్ =

దోఁపఁదనసము । పేతావృతిముకురకుక్షి నిభమునఁ బోలెన్ ॥ ౧౫౫ ॥ తే ॥ చిత్త
మాశ్చర్యరసమునఁ జొత్తిలంగ । జేయుసిద్ధ్యక్షికౌక్షేయుచేత । నిందుధరుచేత
హంగుచేత నెఱుఁగవలయు । రందుపోదము మునులార రజతగిరికి ॥ ౧౫౬ ॥ క ॥ వొడ
మినసందేహంబుల । జడిసిన మందేహులం బ్రసన్నులఁ జేయన్ । మృడునకుఁ బని
గావునమన । మడిగినయర్థంబునతఁడయాదేశించున్ ॥ ౧౫౭ ॥ క ॥ అనికృతనిశ్చయము
తిస । న్మునులంగొని రజతశైలమునకేఁగఁదలం । చినగుహుఁ బోఁగడెమ్మక్రియచో । ర
న్ప్రమోదప్రయాణభేరి ప్రసభారభటిన్ ॥ ౧౫౮ ॥ ఉ ॥ ఆసమయంబునన్ ధృత
నిజాయుధులాధృతభూషణుల్ సుహా । గ్లాసలసన్ముఖుల్ వివిధలాంఛనలక్షితు
లాసురాన్వయ । తాపసకరుల్ విమానగులు దైవతవీరులు తారకారిపై । న్నోసల
ప్రమోలసిల్లిరొక ముప్పదికోటులు మూఁడుకోటులున్ ॥ ౧౫౯ ॥ మ ॥ పనితప్రక్రియ
నద్దెలంగులెసఁగన్ బ్రస్థానసైన్యధ్వజో । ఘనముం బ్రోకొని బ్రహ్మగర్భుఁడు మహాత్మ
ల్యాణకల్యాణమై । ఘనగర్జన్ సకిలించువాఁపురమునెక్కంబోవఁ జూచె బ్వేసం । జనితా
శాకరికర్ణసంజ్వరభరాంచత్కుంచుకేధ్వానముల్ ॥ ౧౬౦ ॥ సీ ॥ ఆటకు మెచ్చిబ
లారియొఁగొనుమరుత్ఫలమిదియన బర్హభారము ఎర । హరుఁగుత్తుకన కాకశిరసునఁ
బోలఁ దాల్చినజటాచ్ఛటపిలశిఖి వెలుంగ । శ్రీశిరోభూషావిశేషనిర్మితికైఁ బాల్పడుమ
డియమ్మలట్లమగుబదగ । ధాతృవాహాముముక్తిదానభ్యసింప బిసముప్రమి గుభంగిద

---

మనోమార్గమునందు — మనస్సునందు. సముపేతావృతిముకురకుక్షిన్ = కూడినకప్పుడుగల అద్ద
ములోపలిభాగమునందు ॥ ౧౫౫ ॥ జొత్తిలంగన్ = రాగిల్లగా — అనురాగమును పొందగా. అక్షి
కౌక్షేయుచేతన్ = శివుని చేత ॥ ౧౫౭ ॥ జడిసిన = చలించిన. మందేహులన్ = (మంద - ఈహులన్)
వికాసము చెడినవారిని. ప్రసన్నులన్ = వికాసమునొందినవారిఁగా. మృడునకున్ = శివునికి. ఆదే
శించున్ — చెప్పును ॥ ౧౫౮ ॥ కృతనిశ్చయమతిన్ = నిశ్చయముచేయఁబడినబుద్ధితో. బోరనన్ = గట్టి
గా. ప్రసభారభటిన్ = అధికధ్వనితో ॥ ౧౫౯ ॥ ధృత = ధరింపఁబడిన. ఉల్లాసులు = వికాసమునొంది
నముఖములుగలవారు లాంఛనలక్షితులు = గురుతులచే లక్షింపఁబడినవారు. ఆసురాన్వయతాపస
రులు — రాక్షసకులమునకు భయమును చేయువారు. విమానగులు = విమానమును పొందినవారు.
నోసలప్రమోలన్ = పెద్దదైనతలవాఁడిటముందర ॥ ౧౬౦ ॥ పనితప్రక్రియన్ = పొగడఁబడినవిధమున.
ప్రస్థానసైన్యధ్వజోద్భవమున్ = ప్రయాణమునకుఁ దగిన సన్నాహములుగల సైన్యమునొక్క జెండా
ధ్వజమును. మహాత్మకల్యాణకల్యాణము = వహించుచున్న మేలైనతోక. గర్జనమున్ = గుఱ్ఱము
ను. పర్వెన్ — వ్యాపించెను. జనితా... ధ్వానములు — పుట్టినదిగ్గజములయొక్క చెవులకు వేండ్రమ
యి అతిశయించిన ఒప్పిదమైన బెత్తాలవారికేకలధ్వనులు ॥ ౧౬౧ ॥ ఈన్ = ఇయ్యఁగా. మరుత్ఫలము
— దేవతలవలనిలాభము. బర్హభారము — మోపునుబోలినకుంచె. కుత్తుకన — మెడచేతనే. శిరసునన్
— తలతోను. పోలన్ — సరిపోలుటకు. జటాచ్ఛట — జడలసమూహము. లీలన్ — విధమున. శిఖ —
జుట్టు. శిరోభూషావిశేషనిర్మితికిన్ — ఒకవిధమైన తలకుజెట్టుకొనెడి సొమ్మును చేయుటకు. పాల్ప
డు — పూనుకొనునట్టి — ఏర్పరుపబడునట్టి. ధాతృవాహముముక్తిన్ — బ్రహ్మవాహనమైనహంసయొ
క్క ఆహారమును. బిసము — తామరతూఁడు. దష్టఫణి — (నోటఁ) గఱచుకున్నపాము. ప్రోలన్ —

ష్టఫణిగాత్రిలఁ। గంతగంభీరనినదంబు ఖచరయువతి। గానవిద్యకు షడ్జసంధానముగఁగ। నెసఁగు దెలికన్నుఁ గోనలమెక్కిరింత। నెక్కి బలుకొండఁ దూఁటువాఁ డేయు వేట॥ ౧౮౧॥ క॥ అదిసజ్జస్యందనమై। మదకరివైరియొ తత్తదుచిత మార్గంబులనే। ర్పొదవ నొకకొంతచనిపా। రదనిభ శుభమూర్తి నశ్వరత్నంబగుచున్॥౧౮౨॥ క॥ శితికంఠసుతుఁడు ఖచర। స్తుతుఁడై యాయచ్ఛరూపు తురికీని సక్కెఁ। దితధౌరితకప్లుతరే। చితవల్గితగతులఁ దరటుచేసిననదియున్॥ ౧౮౩ ॥ క ॥ మురళిగోసయురపణమునన్। బరువడిగోమూత్రికాదిభంజళులఁ గడున్। గెలిచతుర్విధధావిత। పరిపాటీపాటవమునఁ బతిమెప్పించెన్ ॥ ౧౮౪ ॥ సీ ॥ బలుపాఁపతలచుట్టలలవరించినవారు లేఁగచందురులఁ దాలిచినవారు। పునుకతమ్మంటులఁ బోలుచుపేసులవారు నొసలమిక్కిలిచూపులెసఁగువారు। బూదుపారఁగ మేనబూదిఁ బూసినవారు త్రిముఖాస్త్రములు కేల్ద్రిప్పువారు। పులితోలు హొంబట్టుపుట్టముల్ గలవారు కొమ్ముతేజులనెక్కుగునియువారు। ఘోరతరముల హరుదక్కగోన్నవారు। కరటిదైతేయకుంభముక్తాలలామ। హారిభుజమధ్యములవారు నుదయశులు। ప్రమథవీరులు గొలిచిరా బాహలేయు॥ ౧౮౫ ॥ శా ॥ క్షోణీరేణుకృతంబు లంజనరజోగుచ్ఛాసితంబుల్ తమఃశ్రే

---

ప్రకాశింపగా. ఖచరయువతి=గంధర్వస్త్రీలయొక్క. షడ్జసంధానము=షడ్జమనెడిస్వరముయొక్క కూర్పును. ఎసగు=అతిశయించునట్టి. తెలికన్నుగోనలయెక్కిరింతన్=తెల్లనికనుగొనలు కలదైన నెమలివాహనమును=(దీనికి సరియైన సంస్కృతపదము—ధవళాపాంగము) బలుకొండఁదూఁటువాఁ డేయు మేటి=కుమారస్వామి॥౧౮౨॥ సజ్జస్యందనము=అలంకారము(సిద్ధము) చేయబడినరథము. పారద=పాదరసముతోడ. శుభమూర్తిన్=తెల్లనియాకృతితో॥౧౮౩॥ శితికంఠ=శివునియొక్క. ఖచరస్తుతుఁడు=దేవతలచేత పొగడఁబడినవాఁడు అచ్ఛరూపుతురికిన్=స్వచ్ఛమైన(తెల్లని)రూపముగలగుఱ్ఱమును. ఆస్కందిత...గతులన్=ఆస్కందిత=మిక్కిలి వేగమును పొందునట్టి గమనము గానిదియు. ధౌరితక=ఆస్కందితమునకంటెకొంచెము వడిగలదియు. ప్లుత=అతివేగమున దాఁటుచుఁబోవునదియు. రేచిత=వంకరగాతిరుగక వడిగాబోవునదియు. వల్గిత=విూఁదికిశాస్త్రికదలించుచు వడిగాబోవునదియునైన. గతులన్=నడకలచేత తరటుచేసినన్=నడిపింపఁగా ౧౮౪॥మురళి. గవణము. పరువడి. భంజళి—ఇవి గుఱ్ఱము నవుడుపారుటయందలి భేదములు. అందు భంజళిగోమూత్రిక మొదలగు భేదములచే నానావిధము; (వీనివివరణము విచారింపఁదగినది) కెరలి=రేఁగి. చతుర్విధధావితపరిపాటీపాటవమునన్=నాలుగువిధములైన పరుగుపారెడిక్రమమునందలి నేర్పుచేత॥౧౮౫॥ పాఁపతలచుట్టలు=పాములతలపాగాలు. అలవరించిన=వహించిన. పునుకతమ్మంటులన్=తలపుర్రెలచేత చేయఁబడిన చెవిపోఁగులచేత మిక్కిలిచూపులు—మూఁడవకన్నులు. బూదుపారఁగన్=బూఁజుపట్టినట్టుగా. బూది=భస్మము. త్రిముఖాస్త్రములన్=మూఁడు మొదలు గలశూలములను. హొంబట్టుపుట్టములు=బంగారుపట్టువస్త్రములు. కొమ్ముతేజులన్=వృషభవాహనములను. గునియు=కులుకు. కరటిదైతేయ=గజాసురునియొక్క. కుంభ=కుంభస్థలమునందలి. ముక్తాలలామ=ముత్యాలహారములచేత. హారి=అందగించునట్టి. భుజమధ్యములవారు=రొమ్ములుగలవారు. ఉదారయశులు=అధికకీర్తిగలవారు॥౧౮౬॥క్షోణీరేణుకృతంబులు=నేలదుమ్ముచే చేయఁబడినవి. అంజనరజోగుచ్ఛాసితంబులు=కాటుకపొడిముద్దలవలెనల్లనైనవి. తమశ్శ్రేణులు=చీకటి

ణులఁ దూషిత పూషభీషణగతిన్ జృంభించియుండూలెన । క్షీణోత్తుంభితశక్తిభృ ద్భటశిరస్సీమాంకిరీటస్ఫుట। న్మాణిక్యాతప పల్లవ స్తబక సాంద్రగ్రహ్యాతాగ్రంబులై॥ ౧౬౬॥ క॥ స్మరశశితటిదజపవమా। సరివిసుధాసలిలమునిజనత్వాష్ట్రరిష్టా। సురమ్మృత్యుజ్వలనఁ జెలఁగు। సుర కేశ్యలు గొలిచిరపుడు సుబ్రహ్మణ్యున్ ॥ ౧౬౭ ॥ క॥ దైవతభటభుజశిఖర। వ్యావల్గన్నక్రపాణ వల్లికలలరెన్ । దైవపథవారినిధిసలి। లావిష్కృతవిషమషీ మహోర్మ్ములఁ గోలెన్ ॥ ౧౬౮ ॥ క ॥ నయనత్రిభాగ శ్రీవృతహా। సయుతంబుగ సాంధ్యసత్తులు చల్లిన లాజల్ । నయనాయుధతనయాయుధ। చయలతికావళులఁ గుసుమసమత వహించెన్ ॥ ౧౬౯॥ తే ॥ వివిధదివిషద్వధూముక్తదివిజవిటపికుసుమకేసర లసదంస కూటుఁడగుచు। వేల్పుఁబడవాలు కడువాలు విరియఁబడిన । కందమునఁ బొల్చు దుర్గకంఖాణమనఁగ ॥ ౧౭౦ ॥ తే ॥ విబుధమధురాధరాభుజావీజ్యమాన । విమలచామరబహుసహస్రములు వాలిచె । స్వామియురుగడఁ బుష్పవర్షములదలఁకి । సుర విమాన మరాళముల్ చెరలెననఁగ॥౧౭౧॥ తే ॥ స్వామి మలనుండి రాజతాచలము దాఁక। సేతువెత్తినగతి మహాసేనసేన । రోదసీరంధ్రనీరంధ్రరూపమగుచు । నడచె గిరిసింధు వనసృష్టి పుడమినడఁగ॥ ౧౭౨॥ ఉ॥ పుట్టిన మోములై శిఖరముల్ వెలుఁగొంద నితంబమండలిం । గట్టినకృత్తియైనిబిడ

---

ణారులు దూషితపూషభీషణగతిన్ — దూషింపబడిన సూర్యునికి భయంకరమైన విధమున. జృంభించి — జృంభించి. దూలెన్ — లోలగెను. క్షీణో...గ్రంబులై — తగ్గవిరయునిక్కింపబడిన వియన్నైన కుమారస్వామి బంటుల తలలయందలి కిరీటములందు ప్రకాశించుచున్న కెంపుల వెలుఁగుల గుత్తులయొక్క సమగ్రత్వము (పరిపూర్తి) చేత అపహరింపబడిన కొనలు గలవై॥౧౬౭॥ స్మర...జ్వలనన్ — మన్మథుఁడు. చంద్రుఁడు మెఱపుయొక్క ప్రకృతి వాయువు సూర్యుడు అమృతము జలము సప్తమహర్షులు భూమి విష్ణుడు వీరియొక్క ప్రకాశము చేత; చెలఁగు — అతిశయించునట్టి॥౧౬౮॥ భుజశిఖర వ్యావల్గన్నవకృపాణవల్లికలు — మూఁపులందంతటను చలించుచున్న క్రొత్తకత్తుల నెడితీఁగలు. అలరెన్ — ప్రకాశించెను. దైవపథ...ర్ములు — ఆకాశమనెడి సముద్రజలమునందుండి వెడలిన విషముయొక్క నల్లని మంటలు॥౧౬౯॥ నయనత్రిభాగవృత — కంటియొక్క మూఁడు భాగములం దావరించిన. లాజలు — వేలాలు. నయనాయుధ — శివునియొక్క॥౧౭౦॥ వివిధ...కూటుఁడు — బహువిధములైన దేవతాస్త్రీలచేత విడువఁబడిన (చల్లఁబడిడిన) కల్పవృక్ష పుష్పములలోని అకరువుల చేత ఒప్పుచున్న శిఖరములవంటి మూఁపులుగలవాఁడు వేల్పుఁబడవాలు — దేవతలసేనానాయకుఁడు — కుమారస్వామి, విరియఁబడిన కందమునన్ — వికాసమును వహించిన మూపురము చేత. దుర్గకంఖాణము — భద్రకాళియొక్క వాహనము — సింహము. వాలున్ — అతిశయించును॥ ౧౭౧॥ విబుధ...స్రములు — దేవతాస్త్రీల చేతులయందు వీవఁబడుచున్న అనేకములైన వింజామరలు. తలఁకి — భయపడి. సుర విమాన మరాళములు — దేవతల విమానములయందలి హంసలు. చెరలెన్ — వెడలెను॥ ౧౭౨ ॥ సేతువు — కట్ట. ఎత్తినగతిన్ — కట్టినవిధమున. మహాసేనసేన — కుమారుని దండు రోదసి — భూమికి ఆకాశమునకు నడుమ. నీరంధ్ర — సందులేని. సింధు — నది॥ ౧౭౩॥ నితంబమండలిన్ — నడుము ప్రదేశమునందు. కృత్తి — తోలు. నిబిడ — దట్టమైన. రేఖ —

---

దరహాస అని పాఠాంతరము.

కాననరేఖఁ బర్వ లోనసంబ్రా పట్టినవిశ్వమై వెలుఁగు ప్రాణిఫలంబు దలిర్పన్ గిరీశుఁడు | యప్పటికిం గానిపించిన ప్రభఁ గలధౌతనగంబు దోఁచినన్ ॥ ౧౭౩ ॥ క॥ జైవాతృక బింబము నిజ | జీవాతువుఁ గాంచి ప్రాప్తజీవములగుచున్ | జీవంజీవము లలరెడు | భావంబున బాహులేయు బలముం బొదలెన్ ॥ ౧౭౪ ॥ తే॥ పద్మరాగమణీమయ పాదలబ్ధి | స్ఫురితగైరికశిఖరచంచూసమృద్ధి | గంధవతియనునొక్క పంకజము నడుమ | మించు నక్కొండ కోదమ రాయంచఁ బోలె ॥ ౧౭౫ ॥ తే॥ నీలగళవాహరిష్ట ఖురఖని | త్రనిహతి | నింగికెగసిన వెండిరానేలదుమ్ము | ప్రాంతవర్తిష్ణు సప్తర్షి పరివృఢులకు | నొసఁగు నిర్యత్నభసితవిలసితము పటు ॥ ౧౭౬ ॥ వ॥ ఇట్లు నిజబల నిఖిలనిరీక్షణ నిస్తంద్రచంద్రకాధీనంబగు నగ్గట్టురేని వైమానికసేనాని మానధనుండగు నధిపుండు నిజపురుషకారంబునుం బోలె నధిరోహించి ॥ ౧౭౭ ॥ క॥ వాహనము డిగ్గి గగనచర | వాహినిఁ దత్కుధరసవిధ వనవిహరణకాం | క్షాహూతహృదయ నటయట | యోహో హో యనుచు నిలిపి యుల్లం బరలన్ ॥ ౧౭౮ ॥ ఉ॥ ఆరవివాలఖిల్యయుతుఁడై విధుగర్భముఁ దూరెనోయనన్ | దారకవైరి సంయమి కదంబయుతంబుగ నేగుదెంచి ము | క్తారుచిరుద్రమైన వసుధారఘు గేహముఁ జొచ్చి సత్ప్రమా | రారియు నిష్కుటాంతరవిహారము మాన్వితుఁడై యొనర్పఁగన్ ॥ ౧౭౯ ॥ తే॥ మందిరోద్యానఖేల నానందవిభవ | మవధరించెడు తారాపిటార్ధమౌళిఁ | జివురుగుత్తుల విరులఁ బూజించు

---

చాలు. తలిర్పన్ = ప్రకాశింపఁగా. అప్పటికిన్ = ఆనాఁడు కనకు. కలధౌతనగంబు = వెండికొండ. ॥ ౧౭౪ ॥ జైవాతృకబింబమున్ = చంద్రబింబమును. నిజజీవాతువున్ = తాము జీవించుమందును. ప్రాప్తజీవములు = పొందఁబడిన ప్రాణములుగలవి. జీవంజీవములు = చకోరపక్షులు. పొదలెన్ = వర్ధిల్లెను — ఉప్పొంగెను. ॥ ౧౭౫ ॥ పాదలబ్ధిన్ = పాదము నొందుటచేత. (పాదము = కాలు? ప్రత్యంతపర్వతము) గైరిక = కొండయందుఁ గలిగెడి యెఱ్ఱనివన్నెనిచ్చువిశేషము గల. చంచూ = పక్షిముక్కు యొక్క. గంధవతి = భూమి. రాయంచన్ = రాజహంసను ॥ ౧౭౬ ॥ నీల...నిహతిన్ = శివుని వాహనమైన వృషభము యొక్క గిట్టల నెడి గుద్దళ్ళ తాఁకుడుచేత. నింగికిన్ = ఆకాశమునకు. వర్తిష్ణు = ఉండునట్టి స్వభావము గల. పరివృఢులకున్ = రాజులకు — శ్రేష్ఠులకు. నిర్యత్నభసితవిలసితము = యత్నము లేని విభూతియొక్క ప్రకాశము. ॥ ౧౭౭ ॥ నిస్తంద్ర — తగ్గని. గట్టురేనిన్ = పర్వతరాజును. వైమానికసేనాని = దేవతలసేనానాయకుఁడు. పురుషకారము = పురుషప్రయత్నము. అధిరోహించి = ఎక్కి ॥ ౧౭౮ ॥ గగనచరవాహినిన్ = దేవతలదండును. తత్కుధర...హృదయన్ = ఆపర్వతము వెంబడి తోఁపులయందు విహరించుటయందలి యాశచేత పిలువఁబడిన మనసుగలదానిని. అటయట = అక్కడనే అక్కడనే. ఉల్లంబు = మనసు. అరలన్ = వికాసము నొందఁగా ॥ ౧౭౯ ॥ విధు = చంద్రుని యొక్క. కదంబయుతంబుగన్ = సమూహముతోఁ గూడ. రుద్రము = అతిశయించినది. వసుధారఘు = శివుని యొక్క. మారారి = శివుఁడు. నిష్కుటాంతర = ఇంటితోఁ జేరిన శృంగారపుఁదోటలో. ఉమాన్వితుఁడు = పార్వతితోఁ గూడినవాఁడు ॥ ౧౮౦ ॥ మంది...విభవము = ఇంటితోఁ జేరిన శృంగారపుఁదోఁటయందు క్రీడించుటవలని సంతోషవైభవమును. అవధరించెడు = ధరించెడు — పొందెడు. తారాపిటార్ధమౌళి = అర్ధచంద్రుఁడు కిరీటముగాఁ గలవాఁడు — శివుఁడు. విరులన్ = పువ్వుల

వారిని మేనుభానుదీ। ప్తిదవ్వుల హెచ్చుజిగ్గడలుఁ దేజము దాల్చెనె కాని మెప్పుగుం। ద
దునగపుత్రికిఁ బ్రభసితంబునవర్షము చేతనగ్నిపైఁ। గదురుటనద్దముల్ గలయఁగాంచన
కుంభములుల్ బెడంకునే॥ ౧౮౮ ॥ మ॥ బొమలెక్కించిన విల్లు వంచు నునుఁజూపుల్ పంచ
లాచంచల। క్రమరేఖన్నిగిడింప శాతవిశిఖౌఘుంబుల్ మెయిన్ నించునె। య్యమ
నల్ బలుకంగనలర్ మీఁటిచటులజ్యాఘోషముం జేయున। య్యమ ప్రాపొందిరతీశ్వ
రుండు హరు బిట్టోడింపనుట్టాడుచున్॥ ౧౮౯ ॥ చ॥ చిగురులు దేరఁ జేసి విరిచిక్కని
చక్కనిపువ్వుగుత్తులన్। బిగువుచనుంగవం బొదివి వ్రేలెడు చిల్కలఁ జోపి తేనియల్।
బొగపినపలుకులం బొగడి భూతపతిన్ బతిమెచ్చఁ జేసెన। య్యగజ తదుద్యమార్హ విన
యానునయాభినయానుకూలతన్॥ ౧౯౦ ॥ క॥ ఈరీతి ప్రమదవిపినవి। హారంబొనరిచి
హిమనగాత్మజ యుంగం। జారిరవిశిఖినయనుఁడు వ। చారంబులు సమదయువతిజన
మొనరింపన్॥ ౧౯౧ ॥ ఉ॥ నాకవిభూషలోత్కరకనచ్ఛిఖరావృతమైన యొక్కప।
ద్మాకరతీర కేళికనకాద్రి సుఖస్థితి నుండునంతటం। బుంజీకృత తార హారముగ శేషవిభూ
షణునంఘ్రికిన్ నమో। వాకము నర్చియిట్లను శివాకలకంఠి సమంజసోక్తులన్॥ ౧౯౨ ॥
సీ॥ విజ్ఞానమయ మహాప్రాజ్ఞ యో సర్వజ్ఞ ప్రార్థింతు సన్నొక్కయర్థ మేను। నిర్వా
ణఫలదమైనీకు నిక్కపట్టైన క్షేత్రంబు దేవతాసింధుముఖ్య। తీర్థంబులజయించుతీర్థంబున
త్యుత్కటప్రభావంబులదీప్రమైన। దైవతంబును గూడి దర్శనస్నానపూజనముల కలు
షభంజనమొనర్పఁ। జాలునిమ్మాడునొక్కచోట మేళవించి। యుండునొక్కాక వేర్పడి
యుండునొక్కొ। దీనిచందంబు సకలంబుఁ దేటపడఁగ। హృద్యగమ్యంబు చేసిన న్నే

---

దు — తిగ్గదు. నగపుత్రికిన్ — పార్వతికి. భసితంబునన్ — విబూది చేతను. కదురుటన్ — కలుగుట చే
తను — వ్యాపించుటచేతను. బెడంకునే — చలించునా॥ ౧౮౮ ॥ బొమలు — కనుబొమ్మలు ఎక్కించి
నన్ — పైకినిక్కించినను. నునుఁజూపులు — సోఁకీసోకని చూపులు. రేఖన్ — విధమున. నిగిడింపన్
— ప్రసరింపఁజేయఁగా. శాతవిశిఖౌఘుంబుసు — వాఁడిబాణముల సమూహమును. మెయిన్ — దేహ
మునందు. నించును — నిండించును. చటులజ్యాఘోషము — చలించుచున్న అల్లెత్రాటిధ్వనిని. ప్రా
పు — ఆశ్రయము. బిట్టు — శీఘ్రముగ. ఉట్టాడుచున్ — పెంచిపెంచి తిరుగుచు॥ ౧౮౯ ॥ చిక్కని — ద
ట్టమైన. చోపి — తోలి. పొగపిన — పక్వము చేసిన. తదుద్యమార్హ — ఆయన ప్రయత్నమునకుఁదగిన॥
౧౯౦ ॥ ప్రమదవిపిన — స్త్రీలు విహరించెడి శృంగారపుఁదోటయందు. కంజారిరవిశిఖినయనుఁడు
— చంద్రసూర్యాగ్నులు కన్నులుగాఁగల శివుఁడు. సమద — యౌవనమదముతోఁగూడిన
॥ ౧౯౧ ॥ నాక ... వృతము — ఇంద్రనీలమణుల సముదాయముచేత ఆవరింపఁబడి
నది. కేళికనకాద్రిన్. క్రీడార్థముగాఁ జేయఁబడిన బంగారుకొండ యందు. పుంజీకృత
తార హారముగన్ — రాశిగాఁ జేయఁబడిన ముత్యాల పేరులు కలుగునట్టుగా. శేషవి
భూషణునంఘ్రికి — శివునియడుగునకు. నమోవాకము — నమస్కారము. శివాకలకంఠి — పా
ర్వతీదేవి. సమంజసోక్తులన్ — మనోజ్ఞములైనమాటలతో॥ ౧౯౨ ॥ విజ్ఞానమయ — విశేషజ్ఞా
నస్వరూపుఁడా. మహాప్రాజ్ఞ — గొప్పపండితుఁడా. అర్థము — విషయమును. నిర్వాణఫలదము —
మోక్షఫలమునిచ్చునది. దేవతాసింధు — గంగానది. అత్యుత్కట — మిక్కిలియెక్కువైన. దీప్రము
— ప్రకాశించునది. కలుషభంజనము — పాపముయొక్క చెఱుచుటను. ఏర్పడి — వేఱువేఱై. గమ్యం
బు — పొందినది॥ ౧౯౩ ॥ [illegible]

లుమనుడు ॥ ౧౦౩ ॥ మ ॥ లవలీపల్లవపాండురంబులగు గల్లత్రోణులం జంద్రికా । లవ
లీలం దరహాసమింపెసఁగఁ గేలన్ వైశమగ్గోలచే । లవరీతిం గొని తెచ్చి యంకకదళాలం
కారముం జేసి బా । లవిధూత్తంసుఁడు పల్కె మాధవ కథాశ్లాఘా సుఖాసక్తుఁడై ॥
౧౧౪ ॥ క ॥ కించిద్వలగ్నమికిఁ బలి । మంచిది నీప్రశ్నమిది సమర్థముగావి । ప్పించెద
నను వాలోనన । కంచుకులరుదెంచి ఘటిత కరకిసలయులై ॥ ౧౧౫ ॥ క ॥ దేవయగ
స్త్యాదికముని । సేవితుఁడై వచ్చినాఁడు సేనానిభవ । త్సేవార్థి యగుచు నతఁడిట ।
రావచ్చునో యనుడు రాగరసభరితమతిన్ ॥ ౧౧౬ ॥ వ ॥ దేవీసహితుండై యద్దేవ
దేవుం డుతదాగమనం బనుమతించుటయు వల్లెయని సౌవిదల్లనికరంబు నిజకరంబు
లం బుత్తడిబెత్తంబు లంబురుహచుంచిత తరుణతరణి కిరణంబులం బురణింప మరలి
పఱచి శరవణప్రభవునకు భవానీపతి యనుగ్రహించుటం దెలియ విన్నవించుటయు
నతఁడు ॥ ౧౧౭ ॥ సీ ॥ వీడియం బెదలించి విధురత్నకనకాలుకాంచితాంబువు ప్రకిరిం
లించియుమిసి । యుదిరిబంగరువ్రాత హొంబట్టువలెవాటు సడలించి వెసఁగటిస్థలిని
జుట్టి । యనుయాయి పృథుకహస్తాంతరస్యస్తోపదోచితార్థము తానె యుద్వహిం
చి । యంగుళీసంజ్ఞ సంయములఁ బ్రత్యేకంబు మునుమున్న లోనికిఁ జననొసర్చి ।
ద్వారపార్శ్వస్థవేదికా వలులజరఠ । రక్షివర్గంబు టంక్రియారభటి వఱలు । వలయ
మకుటాదికంబుగ నిలిచి మ్రొక్క । నగవుఁజూపులఁ జూచుచు నగరు సొచ్చి ॥ ౧౧౮ ॥
ఉ ॥ వచ్చిపయోజపత్రముల వ్రాలెడు తుమ్మెదదొమ్మి మూఁకలన్ । దచ్చన సేయు
చున్ బిత్తృపదంబుల కూఁకటులం టదర్శనం । బిచ్చుటమున్న గాఁగ నుతియించుచు మ్రొ

ల్లతోణులన్ — చెక్కిలిప్రదేశములందు. చంద్రికాలవలీలన్ — వెన్నెలలేశమువిధమున. వైశమా — శీ
ఘ్రముగ. అగ్గోల — ఆముగ్ధస్త్రీయొక్క. లవరీతిన్ — లేశమువిధమున. అంకకదళాలంకారమున్ —
తొడయనెడి అరఁటిబోదెయొక్క అలంకారమును. బాలవిధూత్తంసుఁడు — లేఁతచంద్రుడు శిఖ
యందుఁగలవాఁడు. మాధవకథా — విష్ణుదేవునికథయొక్క ॥ ౧౧౫ ॥ కించిద్వలగ్న — సన్నని నడు
ముగలదానా. కంచుకులు — అంతఃపురపుకావలివారు — బెత్తాలవారు. ఘటితకరకిసలయులు — చే
ర్చబడిన చిగుళ్లనుబోలిన చేతులుగలవారు ॥ ౧౧౬ ॥ ౧౧౭ ॥ తదాగమనంబు — అతనిరాక. వల్లె — మం
చిది. సౌవిదల్ల — కంచుకులయొక్క. పుత్తడి — బంగారు. చుంబిత — ముద్దుగొనుచున్న — తాకుచున్న.
తరణి — సూర్యునియొక్క. పురణింపన్ — సరిపోలఁగా. శరవణప్రభవునకున్ — కుమారస్వామికి
భవానీపతి — శివుఁడు ॥ ౧౧౮ ॥ వీడియంబు — తమ్మ. ఎడలించి — తొలఁగించి — ఊఁచివేసి. విధుర
త్న...బువు — చంద్రకాంతమణులచేతఁ జేయఁబడిన గిండియందలి యుమ్మించిజలము. ఉదిరిబంగరు —
పుటము దీరిన బంగారు. హొంబట్టు — బంగారుపట్టు. కటిస్థలిని — నడుమునందు. అనుయాయి
...తార్థము — వెంబడి వచ్చునట్టి సిన్నవానిచేతనున్న కానుకకు దగిన వస్తువును. ఉద్వహించి
— వహించి — తీసుకొని. జరఠరక్షివర్గంబు — ముసలికావలివారి సమూహము. వఱలు —
ఒప్పునట్టి ॥ ౧౧౯ ॥ పయోజపత్రములన్ — తామరరేకుల పయిని. దొమ్మిమూఁకలన్
— సందడిగుంపులను. తచ్చన — ఎగతాళి. కూఁకటులు — పిల్లజుట్లు — జులుపాలు. దర్శ
నంబు — కానుక. వలిగుబ్బలిపట్టి — హిమవత్పర్వతము కూఁతురు — పార్వతి. కాఁకదాల్పుడు —

కుహుఁడుఁ గేలు సాఁచిన । గ్రుచ్చి కవుఁగిలించి వలిగుబ్బలిపట్టియు వాఁకఁ దాల్పుడున్॥ ౧౯౯ ॥ తే॥ సమ్మదాశ్రులు కనుఁగవ గ్రమ్ముదేర । నాలుమోముల బాలు నిజాంతరమున । నిలుపన తఁడొప్పె రోహిణీజలజవిమత । మధ్యమున నున్న తారాకుమారుఁ బోలె॥ ౨౦౦ ॥ క ॥ నిటలాక్షుని వలన నప్పుడు । ఘటసంభవ ముఖ్యమునులు గని రెంతయు ము । చ్చటఁ బిలిచి పీఁట యిడియు । తక్కటకృపతో నొసఁగు పరమగౌరవ మంతన్॥ ౨౦౧ ॥ సీ ॥ అలవోకఁ గనకాద్రి నెలయుచో విటిగిన హరివరాహము దంష్ట్రి నవతరించె । నెద్ది మున్న పరంజి యిసుకరా నేలలఁ జరియించు గంధర్వ పరిబృఢునకుఁ । జితాశ్వసకు నెద్ది చేకూరె నెద్ది తచ్ఛుద్ధాంతకామినీ సురతఖేద । మపనయింపఁగ జాలెద వ్వాసరంబుల నంచనైన గరుదంచలానిలము । లెద్ది ప్రాపించె నాఖేచరేంద్రు గెలుపుఁ । గొన్న తారకునకు వాని గుహుఁడు దునిమి । తెచ్చెఁ దా నెద్ది [illegible]మ్ము గ్యాము చ్చెన చల । సుతకు శితికంధరునకు నిచ్చుట యౌనలరి॥ ౨౦౨ ॥ చ ॥ హరుఁడు శిరంబునం జెవిఁ గరాంబురుహంబునఁ దాల్ప జంద్రికాంకురపరభాగమై యురగకుండలమై స్ఫటికాక్షసూత్రమై । గిరిజకచాళిఁ గగ్గమునఁ గేలవహింపఁ బ్రసూనమాలికా । కరిగదపత్రవిభ్రమశుకంబులునై మణియుల్లసిల్లుచున్ ॥ ౨౦౩ ॥ వ ॥ వెండియు నక్కొండరాచూలియు ఖండపరశుండును డెందంబుల నెద్ది యభిలషించి రన్యోన్యరూపంబు లాపరమరత్నంబు ధరియించి తదాదరణచరితార్థంబయ్యె నంత ॥ ౨౦౪ ॥ క ॥ మత్సామీప్యమునకు నీ । సత్సంయమివరులు నీవుఁ జనుదెంచుటకో । వత్సా యెయ్యది కతమని । వాత్సల్యము గదుర పంచవదనుఁడు పలుకన్॥ ౨౦౫ ॥ సీ ॥ తనతండ్రిఁ బలుకుఁ గ్రౌంచ

---

గంగానది ధరించినవాఁడు—శివుండు॥ ౨౦౦॥ సమ్మదాశ్రులు=ఆనందబాష్పములు. క్రమ్ముదేరన్=క్రమ్మఁగా. నిజాంతరమునన్=తమనడుమ. జలజవిమత=చంద్రుని యొక్క॥ ౨౦౧॥ నిటలాక్షువలనన్=శివునివలన. ఘటసంభవ=అగస్త్యుఁడు. కని=పొంది. ముచ్చటన్=ప్రీతితో, ఉత్కట=అధికమైన॥ ౨౦౨॥ అలవోకన్=వేడుకగా, వెలయుచోన్=పొడిచి మొనఁ జిమ్మునప్పుడు దంష్ట్రిన్=కోరకొమ్మునందు చేరెన్=దొరకెనో. తచ్ఛుద్ధాంత...ఖేదము=ఆచిత్రాంశుని యంతఃపుర స్త్రీల యొక్క క్రీడవలని శ్రమమును. అపనయింపఁగన్=పోఁగొట్టను. తద్వాసరములన్=వేసంగిదినములయందు. గరుదంచలానిలములన్=రెక్కలకొనలవలని గాలిచేత. ప్రాపించెన్=పొందెనో. ఆఖేచరేంద్రున్=ఆగంధర్వరాజు. గెలుపుగొన్న=జయించిన. ఎద్ది=దేనిని. శితికంధరునకు=శివునికి. అలరి=సంతోషించి॥ ౨౦౩॥ చంద్రికాంకుర=వెన్నెలమొలకలకు. కచాళిన్=కొప్పునందు. ప్రసూనమాలికా=పూలదండయు కరిగదపత్ర=కంఠపు గమ్మ యు. విభ్రమశుకంబులును=విలాసార్థము చేతనుంచుకున్న చిలుకయు. మణి=ఆముత్తెము. ఉల్లసిల్లుచున్=ప్రకాశించుచు॥ ౨౦౪॥ కొండరాచూలి=పార్వతి. ఖండపరశుఁడు=శివుఁడు. డెందంబులన్=మనసులందు. అభిలషించిరి=కోరిరో. ఆపరమరత్నంబు=సర్వోత్కృష్టమైన యాముత్తెము. తదాదరణచరితార్థంబు=వారి యాదరణకుఁ దగిన నడవడికి విషయమైనది॥ ౨౦౫॥ వత్సా=బిడ్డా. కతము=కారణము. పంచవదనుఁడు=శివుఁడు॥ ౨౦౬॥ తండ్రిన్=తండ్రిని గూర్చి. క్రౌంచనిషూదనుఁడు=కుమారస్వామి. చంద్రపరిషన్నిరుద్ధనీరరుహముకుళభాతిన్=చంద్రుల సమూహము చేత ఆక్రమింపబడిన

పూఁదనుఁడు చంద్రపరిపన్నిరుద్ధనీరరుహముకుళ । భాతి మోడుపుఁ గేలు ఫాలాగ్ర
వీథిక విలసిల్లి యలరనో వృషభగమన । నా పేరసాహసంబునఁ దగునా కపురాణ
షు నీదుకరుణ కలిమిరచించి। యిన్ను నింద్రులకెల్ల నెఱిఁగింపసందు వీరలు సురక్షేత్రతీ
ర్థముల కథలు । చాలవినివిని సర్వాతిశాయినైన। దేవుఁడేనియు నటువంటి తీర్థమేని।
యట్టిసుక్షేత్రమేని భోగాపవర్గ । దాయిగలదేని యెఱిఁగింపు తడయకనిన॥ ౧౯౬ ॥ వ॥
పరోక్షవస్తుదృష్టంబులగు తీర్థక్షేత్రదైవతంబుల మహాప్రభావంబు మదీయభావదర్ప
ణంబునం బ్రతిఫలింపమిం జేసి ॥ ౧౯౭ ॥ క ॥ నీవలననకడమట్టిన । దైవతమహిమ
యును క్షేత్రతత్త్వము తీర్థ । శ్రీవిభవము శ్రుతిమార్గసు । ధావిష్కృతి గాఁగ వినుట
కైనుదమొదవన్ ॥ ౧౯౮ ॥ ఉ ॥ ఈకలశోద్భవప్రముఖులేను నువచ్చితి మీహితార్థ
ల । శ్రీకర దీని మాకు నెఱిఁగింపు మనంబున నున్న సంశయో । ద్రేకము మాసిపింపు
కృపచేలెడుచూపులఁ జూడుమన్నదా । రాకమనాథమౌళి మధురంబుఁ బ్రియంబును
గాఁగనిట్లనన్ ॥ ౧౯౯ ॥ మ ॥ మమునీయర్థము వేఁడుచున్న యది యుష్మన్మాతయో
పుత్రీయీ । యియమకున్నకు నెఱుంగఁ జెప్పెద వినుం డూహించియోశ్చ్వరి । త్రమునస
ర్వాంబుకరోదరస్ఫటికరత్నశ్రీఁ బ్రకాశింపఁగో । ప్యము సేయన్ దగుదీని విన్నపిదపన్
బ్రాణంబుగాఁ జూచుచున్ ॥ ౨౦౦ ॥ తే ॥ శఠమతికినాస్తికునకుఁ బాషండునకును ।
గర్మముగుటించి యాచింపగర్హితునకు । నీపరమగోప్య మోపుత్రయోపురంధ్రి ।
తప్పి దారియు నెఱిఁగింపఁ దగవుగాదు ॥ ౨౦౧ ॥ క ॥ అసనిజతనూభవునకును । ద
సముగువకుఁ దీర్థదైవత క్షేత్రములో । క్కాసెలవునసభువనత్రయి । వినుతిఁగనుట
తెలుపఁగఁదగఁగి విధుమౌళిమదిన్ ॥ ౨౦౨ ॥ సీ ॥ వెడఁదకన్నులవాని వెయినామ
ములవాని ప్రేతలఁ గలపించు వెరవువానిఁ । జిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జేరి

---

తామరమొగ్గవంటిదియున. ఫాలాగ్రవీథికన్ = నొసటిప్రదేశమునందు. విలసిల్లి = ప్రకాశించి. అలరన్ = ఒప్పఁగా. సర్వాతిశాయి = అన్నిటిని మించినది. భోగాపవర్గదాయి = భోగమును మోక్షమును ఇచ్చునది॥౧౯౭॥ మదీయభావదర్పణంబునన్ = నామనస నెడియద్దమునందు. ప్రతిఫలింపమిం జేసి = తోఁచకపోవుటచేత॥౧౯౮॥ శ్రుతిమార్గసుధావిష్కృతి = వేదమార్గములందు అమృతమును విడుచుట. ముదము = సంతోషము॥౧౯౯॥ కలశోద్భవ = అగస్త్యుఁడు. ఈహితార్థశ్రీకర = కోరినవిషయములను కలుగఁజేయువాఁడా. సంశయోద్రేకము = సందేహముయొక్క ఆధిక్యము. తారాకమనాథమౌళి = శివుఁడా॥౨౦౦॥ యుష్మన్మాత = మీతల్లి. కరోదరస్ఫటికరత్నశ్రీన్ = అరచేతియందలి పటికపురాతికలిమిచేత. గోప్యము = రహస్యము. ప్రాణంబుగాన్ = ప్రాణమువంటిదానిఁగా॥౨౦౧॥ శఠమతికిన్ = మూర్ఖబుద్ధిగలవానికిని. నాస్తికునకున్ = దేవుఁడు లేఁడు అనువానికిని. పాషండునకున్ = వేదాచారములను నిందించువానికిని. కర్మము గుటించి = తాను చేయునట్టి యాగాదిక్రియలను ఉద్దేశించి. గర్హితునకున్ = నిందింపఁబడినవానికిని. పరమగోప్యము = మిక్కిలి రహస్యము. ఓపుత్రి = ఓయిల్లాలా॥౨౦౨॥ మగువకున్ = భార్యకును. విధుమౌళి = శివుఁడు॥ ౨౦౩॥ వెడఁద = విశాలమైన. ప్రేతలన్ = గొల్లపడుచులను. వలపించు = మోహింపఁజేయు. వెరవు = నేర్పు. చిప్పకూఁకటి = పిల్లజొట్టు. చిన్ని = మనోహరమైన. పించెము = నెమలియీఁకలకుచ్చు. పులుఁగుతత్తడి =

పింఛముంచిపించియున్నవానిఁ । బులుఁగుతత్తడివానిఁ బొడవులఁదుదవానిఁ బొక్కిటవె
లిదమ్మిపువ్వువాని । మినుకుటూర్పులవాని మిసిమి మేఁటలవాని మెఱుఁగుఁజామనిచా
య మెసఁగువాని । దిస్సమొలవానిఁ బసిఁగాపుఁగ్రిష్ణువాని । మురళిగలవాని మువ్వంకము
రువువాని । విఠ్ఠలాంకుఁ దలఁచి తత్త్వజ్ఞులమహిమ । నాఁడువుఁ బ్రావట్టిక్రీనీడ
విడిదిప్రోడ ॥ ౨౧౩ ॥

శా॥ సారాచారవిచారచారణవధూసంస్తూయమానప్రథా । హారోదార
విసత్సారసుషమాధన్యస్ఫురత్కీర్తిక । ఘనసారాలంకృత దిక్క దిక్కరికరాభోగ
స్ఫురద్బాహుశా । భ్రాజదశేషభూధరణదక్షా దక్షజిద్వైభవా ॥ ౨౧౪ ॥

క॥ నారాయణపదసేవా । పారాయణబంధులోకపాలనదీక్షా । ప్రా
రంభకల్పభూరుహ । భారత రామాయణాది పరమార్థజ్ఞా ॥ ౨౧౫ ॥

మాలిని॥ సకల సుజన వర్యా శాంభవాహార్యధైర్యా । సుకవివినుతకీర్తీ
శుద్ధతత్త్వప్రవర్తీ । ముకురనిభకపోలా ముగ్ధలక్ష్మీవిశాలా । కకుబధిప సమానా
గౌరవశ్రీనిధానా ॥ ౨౧౬ ॥

గద్యము ॥ ఇది శ్రీమదీశ్వరపదనాథ నిరవధిక కృపాపరిపాకపరి
చిత సరసకవితా సనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబయిన
పాండురంగమాహాత్మ్యంబను పరమభాగవత చరిత్రంబునం
దుఁ బ్రథమాశ్వాసము ॥ ౨౧౭ ॥



పక్షివాహనము. పొడవుల = అక్షరులయొక్క - ఎల్లప్రాణులయొక్క (లేక) ఉన్నతముల -- ప్రాంశులైనవానియొక్క. మినుకుటూర్పులు = వేదశ్వాసములు. మిసిమి = మెఱుఁగు = వెన్న. దిస్సమొల = దిగంబరత్వము. పసి = ఆవుఁగుంపు. మురళి = పిల్లనగ్రోవి. మువ్వంక = మూడువంకలచే నైన. మురువు = అందము. ప్రావట్టి క్రీనీడ = ప్రాఁతదైన మఱ్ఱిచెట్టు క్రిందినీడ. విడిదిప్రోడ = విడియుచోటుగాఁగలవాఁడు ॥ ౨౧౩ ॥ చారణవధూ = చారణులనెడి దేవజాతి స్త్రీలు. సంస్తూయమాన = పొగడఁబడుచున్న. ప్రథా = ప్రసిద్ధిగలవాఁడా. ఉదార = ఒప్పియుండు. హార...దిక్క = ముత్యాలసేరులయొక్క మేలయిన ప్రకాశమువంటి ప్రకాశముగల కృతార్థమై ప్రకాశించునట్టి కీర్తియనెడి కర్పూరముచేత అలంకరింపఁబడిన దిక్కులుగలవాఁడా. దిక్కరి...దక్షా = దిగ్గజములయొక్క తొండములవలె నిడుపులయి ప్రకాశించునట్టి కొమ్మలవంటి భుజములయందు వెలుఁగుచున్న యెల్లభూమిని భరించుటయందు సమర్థుఁడా. దక్షజిద్వైభవా = శివుని వైభవమువంటి వైభవముగలవాఁడా ॥ ౨౧౫ ॥ ౨౧౬. శాంభవాహార్య = శివునిదైన వెండికొండవలె చలింపని. శుద్ధతత్త్వప్రవర్తీ = పరిశుద్ధమయిన స్వభావముచేత వర్తించువాఁడా. ముకురనిభకపోలా = అద్దములను బోలిన చెక్కిళ్లుగలవాఁడా. ముగ్ధలక్ష్మీవిశాలా = మనోజ్ఞమయిన సంపదచేత అధికుఁడా. కకుబధిప = దిక్పాలకులతోడ. గౌరవశ్రీనిధానా = గొప్పతనముకలిమికి నిధియైనవాఁడా ॥ ౨౧౭ ॥ నిరవధిక = మేరలేని. పరిపాక = పక్వమయిన. పరిచిత = వాడుకపడిన. సనాథ = కూడిన. ]

త్యలఘువివేకపాకఖనియార్యజనస్తవనీయచర్యుఁడు । జ్జ్వలగుణరత్నరత్ననిధిసత్య
దయార్జవశాంతిదాంతిమాం । సలగతిపుండరీకుఁడను సన్మునిపొల్చునాకఁడు పెంపు
నన్ ॥ ౫ ॥ సీ ॥ చలిచీమనేనియుఁ జాఁద్రొక్క శంకించుఁ బలుకఁడెన్నఁడు మృషాభా
షణములు । కలుషవర్తనులున్న పొలము పొంతఁ జనండు కలిమికుబ్బఁడు లేమి కలఁగఁ
డాత్మఁ । దలమెత్తి చూడఁడెవ్వలనైన బరస్త్రీల ధైర్యంబు విడఁడెట్టి దద్దుటుటల । నో
రులసంపదకునై యుపతపింపఁడు లోననిందింపఁడెంతటినీచునైన । మిన్నకయుచూ
డఁడాఁకలిగన్నకడుపు । సర్వభూతదయాదయోత్సవమొనర్చు । నిగమఘంటాప
థైకాధ్వనీనబుద్ధి । బ్రహ్మవిద్యానవద్యుఁడు బ్రాహ్మణుండు ॥ ౬ ॥ చ ॥ హరిహ
యదేశికాభుఁడగు నమ్మహీదైవతమౌళియందు బం । గరువునకున్మృగీమదసుగంధ
ముసంధిలుభాతి నంబుజో । దరచరణారవిందసతతస్మృతిలోలుపమైనబుద్ధియున్ ।
బరిణతిగాంచె సంపదలపై నరియుంజనియించుసంపదల్ ॥ ౭ ॥ సీ ॥ మొదలఁగామ
క్రోధములబరాబరిచేసి సత్యవాఙ్నియమంబు సంగ్రహించి । సాత్త్వికస్వల్పభోజనల
బ్ధిఁ గ్రొవ్వాగి యంగాష్టకాసక్తి హవణుపరచి । తెరిచి ముప్పదిరెండు తత్త్వంబులూ
హించి మదిసత్త్వసంపద మస్తరించి । తెలిసి ముద్రాసనంబుల మేనిపనిగొని పాపపూరు
షపటాపంచ చేసి । యతఁడు మూలాలవాలగహ్వరకరండ । కుండలీస్థానగోకర్ణకులక
లాప । తత్త్వదగ్నవవర్ణాధిదైవతదళ । నిర్ణయం బెంత చంతయు నిజముగాంచె ॥ ౮ ॥ చ ॥
మను హఠరాజయోగముల మర్మమెఱింగి తదర్థసిద్ధినై । మ్మనసముదల్చి హృజ్జలజ

---

మునకుఁగని. స్తవనీయచర్యుఁడు—పొగడఁదగిన నడవడిగలవాఁడు ఉజ్జ్వలగుణరత్నరత్ననిధి—ప్ర
కాశించుచున్నట్టి మేలైనగుణములనెడి రత్నములకు నిధి. ఆర్జవ—ఋజుభావము. మాంసలగతి—బలిసిన
నడవడిగలవాఁడు॥ ౫॥ చాన్—చావ. మృషా—అబద్ధమయిన. కలుషవర్తనులు—పాపపునడవడి
గలవారు. పొలముపొంతన్—త్రోవవెంబడిని. అలఁగఁడు—చలింపఁడు. దద్దుటులన్—సంక
టములందును. ఉపతపింపఁడు—సంతాపమునొందఁడు. నిగమఘంటాపథైకాధ్వనీనబుద్ధి—వేద
మార్గమనెడి పెద్దబాటయందు ముఖ్యముగ వర్తించునట్టిబుద్ధిగలవాఁడు॥ ౬ ॥ హరిహయదేశికాభుఁ
డు—బృహస్పతిని బోలినవాఁడు. మహీదైవతమౌళియందున్—బ్రాహ్మణశ్రేష్ఠునియందు. బంగరు
వు—బంగారు. మృగీమద—కస్తూరియొక్క. సంధిలు—కూడు. భాతిన్—విధమున. సతతస్మృతిలో
లుప—ఎల్లప్పుడు తలఁచుటయందు ఆసక్తము. పరిణతి—పరిపాకము॥ ౭॥ బరాబరి—హెచ్చరిక వా
ఙ్నియమంబు—మాటలనియమము. సాత్త్విక—క్రొవ్వును కలుగఁజేయని. లబ్ధిన్—కలుగుటచేత. ఆఁగి
—అణఁచి. హవణుపఱిచి—పొందుపఱిచి. తెరచి—చక్కగా విచారణచేసి. మస్తరించి—లోకువ
పఱుచుకొని. మేనిపనిగొని—దేహమును శ్రమపెట్టి. పటాపంచ—అగోచరము—నాశము. మూ
లా...నిర్ణయంబు—మూలాధారచక్రమనెడి గుహారూపముయిన బరణియందలి కుండలీస్థానము
నందుండు సర్పసమూహమునకు అభరణమువంటి శేషుఁడైన తత్త్వమును, అనఁగా విష్ణుతత్త్వ
మును కనఁబఱచునట్టి బీజాక్షరములు అధిదేవతలు దళములు వీనియొక్క నిర్ణయము॥ ౮॥ మను
—మంత్రము. తదర్థసిద్ధిన్—వానివలని ప్రయోజనముయొక్క నెఱవేఱుటచేత. హృజ్జలజమండిత
మానసపట్టణంబున్—హృదయకమలముచేత ప్రకాశించుచున్న మనస్సనెడి సరోవరమునం

మండితమానసషట్పదంబున । ర్జనరథభూషణంబు వెలిఁజూడనినిద్దపునిట్టచూపునన్ । మునుకొనిచూచుచోననిజమూర్ధగళత్సుధ సేదదేర్పఁగన్ ॥ ౯ ॥ మ ॥ శతపత్రాక్షముశిక్యసఖ్యభృతిచంచన్మౌళిసన్నాహము । న్నతనాసాముకుళంబు పూర్ణతరచంద్రస్నిగ్ధముగ్ధాననం । బతసీసూనసవర్ణవర్ణమతిసౌమ్యంబబ్జనాభంబుశ్రీ । శ్రితవక్షంబు మహామహంబు కడుఁబర్వెం దన్మనఃపేటికన్ ॥ ౧౦ ॥ సీ ॥ సనకసనందనాదినిఖిలాంతర్వాణిహృల్లీనభావంబుసల్లపెట్టి । విశ్వంభరాభోగవివిధమూర్త్యంతరస్ఫురితానుభావంబుబుజలువైచి । శింశుమారాకృతిస్వీకృతివైకుంఠపటువిహారంబుజారవిడిచి । క్షీరోదమధ్యస్థలీరత్ననగగుహాగర్భనివాసంబుకచ్చువదలి । పుండరీకేక్షణుండుశిఖండిబర్హ । మండితశిఖండకుఁడునతాఖండలుండు । పుండరీకునిమానసాంభోజపీఠి । మిండతుమ్మెదనైయుండునిందుకొలువు ॥ ౧౧ ॥ ఉ ॥ అన్వహముఁబ్రవృద్ధమగునంబుజనాభపదారవిందభ । క్తిన్వహికెక్కుచున్ వసుమతీసురవంశవతంసమెల్లవా । రున్వినుతింపఁబెంపెసఁగుప్రోదియొనర్చుచుఁదల్లిదండ్రినెం । దున్విధానురూపతనుదోహదభోజనపూజనాదులన్ ॥ ౧౨ ॥ క ॥ హరిభక్తియుగురుభక్తియు । నురురక్తియుఁబుటముగాఁగయోగీంద్రశిఖా । భరణముముక్తామయతా । స్ఫురణముభువనప్రశస్త

---

దలితుస్మాసను. వెలిన్ = బయట. నిద్దపునిట్టచూపునన్ = స్నేహముతోడి చలింపనిచూపుచేత. మునుకొని = ముందుమించి. నిజమూర్ధగళత్సుధ = తనతలనుండి జాఱుచున్న యమృతము. సేద = శ్రమను. ౯ ॥ శతపత్రాక్షము = కమలములవంటి కన్నులుగలది. శిక్య... సన్నాహము = ఉట్టియొక్క మైత్రిని భరించునట్టి మనోజ్ఞమైన శిఖాకవచము ( కిరీటము ) గలది. నాసాముకుళంబు = మొగ్గవంటిముక్కు. పూర్ణతరచంద్రస్నిగ్ధముగ్ధాననంబు = నిండుచంద్రునివలె కళలు దేఱుచున్న అందమయిన మొగము. అతసీసూనసవర్ణవర్ణము = నల్లగిసెపువ్వుయొక్క వర్ణమువంటి వర్ణముగలది. అతిసౌమ్యము = మిక్కిలి యొప్పిదమయినది. అబ్జనాభంబు = తామరబొడ్డుగలది. శ్రీశ్రితవక్షంబు = లక్ష్మీదేవిచేత ఆశ్రయింపఁబడిన ఱొమ్ముగలదియు నైన. మహామహంబు = గొప్పదియగు తేజస్సు. తన్మనఃపేటికన్ = అతనిమనస్సు అనెడిపెట్టెయందు. పర్వెన్ = వ్యాపించెను ॥ ౧౦ ॥ అంతర్వాణిహృల్లీనభావంబు = తత్త్వశాస్త్రము నెఱిఁగినవారిమనస్సులందలయించియుండుటను. సల్లపెట్టి = సళ్లించి — వదలి. విశ్వంభరా... అనుభావంబు = సర్వమును భరించునట్టి గొప్పదియు నానావిధములు నైన రామకృష్ణాది మూర్తులచేత ప్రకాశించునట్టి మహిమను. బుజలువైచి = సున్నలుపెట్టి — మాని. శింశుమారాకృతిస్వీకృతిన్ = మొసలిరూపము నొందుటచేత — మత్స్యావతారమెత్తుటచేతననితోఁచెడి. క్షీరోద = పాలసముద్రముయొక్క. గుహాగర్భనివాసంబు = గుహాలోపలి యునికి యందలి. కచ్చు = అపేక్ష. శిఖండిబర్హమండితశిఖండకుఁడు = నెమలికుంచెచేత అలంకరింపఁబడిన పిల్లజుట్టుగలవాఁడు. నతాఖండలుండు = మ్రొక్కిన యింద్రుఁడుగలవాఁడు. మానసాంభోజపీఠిన్ = మనఃకమలమనెడి సింహాసనమునందు. మిండ = మగడైన ॥ ౧౧ ॥ అన్వహమున్ = ప్రతిదినమును. ప్రవృద్ధము = పెరిగినది. వహికిన్ = ప్రసిద్ధికి. వతంసము = శ్రేష్ఠుఁడు. పెంపెసఁగు = మిక్కిలి యతిశయించునట్టి. ప్రోది = రక్షణము. అనురూపతనుదోహద = తగినవలఁగుపెట్టి స్నానము చేయించుట ॥ ౧౨ ॥ ఉరురక్తి = అధికమయిన యనురాగము. పుటముగాఁగన్ = హెచ్చఁగా. ముక్తామయతాస్ఫురణము = ముత్తెపువికారము

ముగ జిగిమీఱెడున్ ॥ ౧౩ ॥ సీ ॥ మును మీనగుఱఁబట్టి మునులు వైచిన బత్తి వలఁబోలెఁ జి
క్కనూదలఁదలిర్ప । వెలితిగాఁ జవిగొన్న వెన్నముద్దయుఁబోలె శంఖంబు వామహ
స్తమునఁదనర । జగదండవహకాలచక్రభ్రమణహేతుదండమ్మై నిజధేనుదండమమర ।
సంచిఁబట్టిన పద్మజాతాండములలీల వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల । కలయఁబూచిన
కల్పవృక్షంబు చాయ । సరసవనపుష్పమాలికాభరసమగ్ర విగ్రహముతోడ విలసిల్లు వి
ప్రునెదుట । మందవల్లీయాండ్రకూరిమిమ్రానిపండు ॥ ౧౪ ॥ క ॥ నియమాంతంబున
సత్యా । ప్రియరూపముతోడఁ గూడఁ బెనఁచినయంత । ర్న్యయనము సడలిచి విష్ణుపా ।
దయుగాన్యాధీనబుద్ధిఁ దహతహ వెలుఁగన్ ॥ ౧౫ ॥ ఉ ॥ పావనదృగ్విలాసములు
బాహ్యగతిం బచరించి చంద్రికా । శ్రీవిభవంబులం బలుచ సేయుమనుఃప్రభ లుల్లసిల్లఁ
గా । మైపదలించి పూర్వమగు మట్టును గాడ్పను సాగనిచ్చి పైఁ గావలియుద్ధశక్తులన గో
రవదృష్టిఁ బరిగ్రహించుచున్ ॥ ౧౬ ॥ సీ ॥ తనువుతోఁ జరియించు ధర్మదేవతఁబోలె మెలఁ
పునవనవాటిఁ గలయఁదిరిగి । గణనమీరిన శార్ఙ్గిగుణములు హృదయసంపుటనించు క్రియ
విరుల్ బుట్టిఁ బెట్టి । తనకుఁ బవిత్రవర్ధనమెకృత్యంబను కరణి నూతనకుశోత్కరము
గూర్చి । యపవర్గఫలసిద్ధిహేతువై నఁజేపట్టుకైవడి బహుఫలోత్కరము లొడిచి । యో
గయాగంబున ల్పుచోనూర్మ్మిపశువి । శసన మొనరించుటకు యూపసమితిఁదెచ్చి । భా
తిసమిధలుగొని మహాప్రాజ్ఞుఁడతఁడు । వచ్చె లేఁబగటికి నిజావాసమునకు ॥ ౧౭ ॥ క ॥ వి
హితమతిఁబరిచారక । సహస్రమయి పితృయుగంబు సంభావించున్ । గృహమేధి
వతంసము నిజమహిళామణియ ప్రతీపమతిఁదోడ్పడఁగన్ ॥ ౧౮ ॥ సీ ॥ ఆపాదమస్తంబు

---

గలప్రకాశము. భువనప్రశస్తముగన్ = లోకమునందు శ్లాఘ్యముగ. జిగి = నిగనిగనికాంతి ॥ ౧౩ ॥
బత్తి = భక్తి. చవిగొన్న = రుచిచూచిన — భుజించిన. జగదండ...దణ్డమై = బ్రహ్మాండమును పట్టించిన
కాలచక్రము తిరుగుటకు కారణమైన కఱ్ఱయై. ధేనుదండము = పసులను దోలెడి కఱ్ఱ. లీలన్ = విధము
న. వలకేలన్ = కుడిచేతియందు. చాయన్ = విధమున. మంద...పండు = గొల్లయిల్లాండ్రయొక్క
స్నేహమనెడి వృక్షమునందు పండిన పండు — బాలకృష్ణుఁడు ॥ ౧౪ ॥ సత్యాప్రియ = కృష్ణునియొక్క.
అంతర్నయనము = లోచూపు — యోగదృష్టి. తహతహ = తమకము ॥ ౧౫ ॥ బాహ్యగతిన్ = బయటి
సంచారమునందు. పచరించి = ప్రసరింపఁజేసి. పలుచ = అలక్ష్యము. మైపదలించి = దేహమును సడల
విడిచి. శక్తులన్ = ఇచ్ఛాదిశక్తులను ॥ ౧౬ ॥ మెలఁపున్ = మెలఁకువతో. హృదయసంపుటిన్ =
మనస్సనెడి పెట్టెయందు. కుశోత్కరము = దర్భలసమూహమును. అపవర్గ = మోక్షముయొక్క. ప
దను = సమయము. ఊర్మ్మిపశువిశసనము = శ్వాసమనెడి పశువును చంపుటను. యూపసమితిన్ =
యాగపశువులను కట్టెడి కంబముల సమూహమును. భాతిన్ = విధమున. లేఁబగటికిన్ = తెల్లవాఱిన ఘ
డియల ప్రొద్దెక్కినప్పటికి. నిజావాసమునకున్ = తన యింటికి ॥ ౧౭ ॥ పరిచారకసహస్రమయి =
పరిచారకులయొక్క సహస్రము కలవాఁడై — అనేక పరిచారకులమాఱు తానేఅయి. పితృయుగం
బున్ = తల్లిదండ్రులను ఇద్దఱను. గృహమేధివతంసము = గృహస్థులలో శ్రేష్ఠుఁడు. మహిళామణి =
స్త్రీరత్నము. అప్రతీపమతిన్ = అనుకూలబుద్ధితో ॥ ౧౮ ॥ ఆపాదమస్తంబు = తలమొదలు కాళ్లదాఁ

నంటుమూసియుఁగాంచి నయముగా నుద్వర్తనంబొనర్చు । జలకమార్చు నఖంపచస్వ
చ్ఛజలములఁ దడియొత్తుఁగడు మెదుగుడులఁ బొదవి । లఘుధౌతవసనపల్లవములుగట్టిం
చు శిరస్సార్ద్రమృదులీల సురఁటివిసరి । చేయూఁత యొసఁగి వెంచేయించు లోనికి ద్వా
రావతిగలంతిఁ బానె యొసఁగు । తెలుపు సంధ్యాసమధివిధిప్రయుక్తి । నగ్నివేల్పించు
విష్ణుసహస్రనామపారమొనరించు తఱిఁ దోడుపడు గురునకు । కవలువోకుండఁ బు
త్రుఁ డోకలువక ౧౯॥ తే॥ చూపు చాలమి వివిధరూపోపకరణ । వితతిఁ దడవా
డు జనమనాన [illegible] సిద్ధంపు బుద్ధిఁ దద్దారకుండు । చక్రహస్తార్చనమునకుప
క్రమించు॥ ౨౦॥ సీ॥ అభిషేకమొసరించు నాకాశవాహినీజననకారణపాదజలరుహు
నకు । వైజయంతీమాలిక నై జయంతీకాంతి వలయితవక్షఃకవాటునకును । కౌశేయ
మర్పించుఁ గాంచనమయపటపల్లవారుణకటిబంధురునకుఁ । జందనంబలఁదు నీలేందిరా
కుచకుంభసంగికుంకుమపంకిలాంగునకును । రత్నహారంబు సాత నిర్యత్నసిద్ధ । కౌ
స్తుభోదర్చిగభీరామకంఠగునకు । ధూపకల్పనమున్ గా దీపమిచ్చుఁ । దెరవయాతఁ
డు తైత్రిలోక్యదీపకునకు ॥ ౨౧ ॥ క ॥ నిడుదవిగరనఁటియాకున నిడి వివిధాన్నము
లు భూసురేశ్వరుడొసఁగన్ । బడిఘంటమొరయఁ జేయుచు । జడనిధితల్పునకుఁ బూ
ర్ణసంకల్పునకున్ ॥ ౨౨॥ క॥ భూమిసురసూపసాల । గాగిన శిలావారి కంబుగర్భస్థ
ము దివ్యామోద శ్రీశుచి । కోమలదళసురభితంబు గురునకు నొసఁగున్ ॥ ౨౩॥ మ॥ తిరు
వారాధనమిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డా । హరికర్పించుటఁ బావనంబులగు
శాల్యన్నంబులున్ నేతులున్ । పరుగుల్ చేరులు పప్పులప్పడములున్ దాలింపు
లుం బూపముల్ । పరమాన్నంబులుఁ బెట్టి నెట్టన భుజింపన్ దల్లికిం దండ్రికిన్ ॥ ౨౪॥
వ ॥ ఇట్లు కడువృద్ధులు నిధింబుద్ధులునగు జననీజనయితలం గనిమని నడచుచు నపు

---

క. ఉద్వర్తనంబు = నలుగు. జలకమార్చున్ = స్నానము చేయించును. నఖంపచ = గోరువెచ్చనైన. మెదుగుడులన్ = మెత్తని గుడ్డలతో. లఘుధౌతవసనపల్లవములు = తేలికయై పరిశుద్ధములైన చిగుళ్లవంటి వస్త్రములు. సురఁటి = విసనకఱ్ఱ. ద్వారావతిన్ = ద్వారముతోడి ముక్కు గల గళంతిన్ = గిండి చెంబును. కవలువోకుండన్ = ముందు పఱచిన దినములపాఠమునందు గలయకుండ॥ ౧౯. తడవాడు = తడవుకొను. అనతి = ఆజ్ఞ. నిద్దపు = ప్రేమతోడి. తద్దారకుండు = ఆ చిన్నవాఁడు. చక్రహస్తార్చనమునకున్ = విష్ణుదేవుని ఆరాధనమునకు॥ ౨౦॥ ఆకాశవాహినీ = మిన్నేటియొక్క. తోమాలియ = వనమాల. వైజయంతి = వైజయంతియను పేరి పూలమాలిక చేత. కౌశేయము = పట్టుపచ్చడము. కటి = నడుము చేత. బంధురునకున్ = ఒప్పిదమగు వానికి. సంగి = అంటిన. పంకిల = అదుసైన. చాతున్ = ధరింపఁజేయును. నిర్యత్న...ధరునకున్ = యత్నము లేకయే సిద్ధించిన కౌస్తుభమణియొక్క మిక్కుటపు ప్రకాశము చేత మనోజ్ఞమయిన మెడగలవానికి॥ ౨౧॥ అనఁటి = అరఁటి. బడిన్ = వెంబడిని. మొరయఁజేయుచున్ = వాయించుచు. జడనిధి = సముద్రము॥ ౨౨॥ కంబుగర్భస్థమున్ = శంఖములోనిదానిని. దివ్యామోదశ్రీ = మంచివాసనయొక్క కలిమి గల. సురభితము = పరిమళముకలుగఁజేయఁబడినది ॥ ౨౩॥ తిరువారాధనము = దేవతార్చనము. పూపములు = పిండివంటలు. నెట్టనన్ = సమృద్ధిగా॥ ౨౪॥ శిథిల = పటుత్వము లేని. జననీజనయితలన్ = తల్లిదండ్రులను. మచ్చికన్ =

గులకుమడుఁగు లొడ్డుచునమ్మగునెసఁ బులిజున్నెనియుం దెచ్చియిచ్చుచుఁ గోత్రయ
గు మచ్చికంగచ్చువదలక గోముమెఱసి యోమునగాయలంగా నోముచుఁ గాలోచి
తంబుగా నోములు నోమించుచు నద్ధరామరనందనుండు జగదభినందితుండై యుం
డివెండియు ॥ ౨౫ ॥ క॥ పరలోకావాససుఖా । దరపరతఁ జనినతల్లిదండ్రులకొసఁ
గెన్ । గురుభక్తి విగుడుకొడుకతి । కరుణామతిగంగనస్థికయఁబిండంబుల్ ॥ ౨౬ ॥ క॥
ప్రేయసివలనఁ బ్రబోధవి । ధేయమతులసుతులఁ గాంచి తీర్చెంబితౄణం । బాయయ్యె
తదీయంబగు । పాయపుఁబ్రొద్దంతఁ గొంతపడమర దిరుగన్ ॥ ౨౭ ॥ క॥ భాషా
విభునిభుఁడమ్ముని । యీషణదూషణమొనర్చి యిలువరచినదిన్ । శేషఫణిశయనుఁ
గనుసభి । లాషోన్నతిఁ జేయఁదప మిలాధరతనయా ॥ ౨౮ ॥ సీ॥ మినిమింతుఁడు
నుగాకవసియించుఁ గుత్తుకబంటినీరనుబుండువంటిచెవిని । మోముదమ్మికిఁ జేటిమొత్త
మైపొగపర్వ వ్రేలుఁ గ్రిందలగాఁగ వృక్షశాఖ । వేరువెళ్లఁగేకాఁకగూరపండనికోరకుద
రాగ్నిగాడ్పుచే నుజ్జగించు । నేవియీచెవిగాడ్పు నాచెవిఁ బోవంగనుబ్బిలింగముటొతె
నుండునెండ । నంతరాయాంధకారంబులలమికొనిన । నడఁచు నిజధైర్యసూర్యోదయం
బుచేత । దానవారిని గుఱిచేసి తనకుఁబోదు । నాకుఁబోవని నమ్మి సుశ్లోకుఁ డతఁడు ॥ ౨౯ ॥
ఉ॥ ఓగజరాజగామిని మహోగ్రవ్రు నోములు నోఁచుచున్నయా । యోగివరే
ణ్యునేమమున నుల్లము వెన్నవలెం గరంగ హృ । ద్రాగసమగ్రగోపవనితాజనతాప
రంభసంభ్రమో । ద్యోగకళాప్రవర్తిఁ జతుర్ముఖవంచినధూర్తకీర్తికిన్ ॥ ౩౦ ॥ సీ॥
యతివనోగృహదీపికాంకూరమగు లీలగోవర్ధనాచలగుహ మెఱుఁగుచు । గిరికూటతట
రట తేకికిరాజమురీతి రాధవనస్థమీఁద వ్రాలినగువ్వ । జిత్రాభ్రములనేలుసుత్రా
మునైవడిఁ బలువన్నెయాలమందల మెలఁప్రుచుఁ । గమలకాననమధ్యకలహంసవిభుభా
తిఁగూర్మినెచ్చెలిపిండుగొసి చెలఁగుచుఁ । జంద్రబింబంబునకు మృదుస్వనము గఱపు । రచ
నసంజ్ఞార్థశంఖమూఁదుచు నొనర్చు । నాటలక్ష్మియుఁ జాలించి గిరిగొఁదసి । పర్ణశా
లకుదేవకీసర్గకంబు ॥ ౩౧ ॥ వ॥ లలితశిరీషపుష్పమృదులంబులు నీచరణంబులక్రటా ।

---

మరులుచేత. కచ్చు—క్రీత. గోము—శ్రమ మెఱుఁగమి. ఓమునగాయలంగాన్—చేతులఁబూఁద నేత్రి పుటగా. ఓముచున్—పోషించుచు. జగదభినందితుఁడు—లోకులచేతఁ బొగడఁబడినవాఁడు ॥ ౨౫ ॥ ౨౬ ॥ ప్రేయసి—ప్రియురాలు—పెండ్లాము. ప్రబోధవిధేయమతులన్—విశేషజ్ఞానమునవినయ మునీనితోడిబుద్ధిగలవారిని. పితౄణము—పితృదేవతలఋణమును ॥ ౨౭ ॥ భాషావిభు—బ్రహ్మతోడ. ఈషణ—పెండ్లాము బిడ్డలు ధనము వీనియందలియాశను ॥ ౨౮ ॥ మినిమింతుఁడు—అలసినవాఁడు. క్రిందల—తలక్రిందు. ఉజ్జగించున్—పోఁగొట్టును—అణఁచును. గాడ్పు—గాలి. అంతరాయాంధ కారంబులు—విఘ్నముల నెడిచీఁకట్లు ॥ ౨౯ ॥ నేమమునన్—నియమముచేత. ధూర్త—మోసపు ॥ ౩౦ ॥ దీపికాంకూరము—చిగురుమొగ్గవలెఁదోఁచెడిదీపము. రటత్—కేకలువేయుచున్న. వ్రాలి—ఒఱగి చిత్రాభ్రములన్—నానావర్ణములుగల మేఘములను. సుత్రాము నైవడిన్—ఇంద్రునివలె. మెలఁపు చున్—త్రిప్పుచు—కాచుచు. పిండు—సమూహము. చెలఁగుచున్—సంతోషించుచు. రచనన్—వి ధమున. దేవకీసర్గకంబు—దేవకీదేవిబిడ్డ—కృష్ణుఁడు ॥ ౩౧ ॥ శిరీష—దిరిసెనపు, మృదులంబులు—

యిలయి ఘరాక్రమిట్టు లలయించుట గాదని పార్థివా వృధా । క్రతులు సేయఁగం
గవెఁ బొందివి తొల్పదువుల్ తగు విన్నపంబులం । బలుమఱుఁ జేయుచుండమునఁ బంగరు
ట యొయ్యలు గ్గడింపఁగన్ ॥ ౩౨ ॥ క ॥ మెత్తఁగ నూలిన చట్టుం । గ త్తిన్ మధుకైటభోరుకం
ఠములలనా । డొత్తినహత్తిన చెన్నుం । దిత్తులక్రియఁ దొడల యడ్డ తిత్తులు
వ్రేలన్ ॥ ౩౩ ॥ క ॥ మాయావృతుఁడగు నాత్మని । సోయగమునఁ దెగడు తీఁగ
సోగలు ముష్కులై యునికి సంగరహితం । బయ్యెన్ గాకున్న జఘనమభిరామమగున్ ॥
౩౪ ॥ క ॥ ఇటనభమిట ఘూవలయం । బిటబలిసద్మంబునుండు నిరవ్వులవియనన్ ॥
బటువులగు వళులచెలువునఁ । బుటపుటనై యున్న బిన్నబొజ్జగదలఁగన్ ॥ ౩౫ ॥ చ ॥
తులసీకఁ బచ్చరాకుదురుతో యదవాహనరత్నవేదియ । కలిమి మెఱుంగుఁ బోడికిని
గొస్తుగ ఘర్మగభస్తికిన్ నభ । స్థలమున నంగబొల్చి నిరగంబు కృపావిభవంబు నింటి
బో । ర్తలుపుఁ దలంపు సేయుచు నురంబు పరిస్ఫురింపఁగన్ ॥ ౩౬ ॥ క ॥ కలు
షఖగవధవిధానా । కలితఘుటికలనగ్రచ్చ కాయలు వలచే । నెలకొను నల జిలిబిలివ ।
న్నెలవన్నెల సంచినిండియున్ పలరారన్ ॥ ౩౭ ॥ క ॥ లలితసుజవామకరతల । కలి
తకనత్కంబు కాంతిగలకలనవ్వన్ । కలువల చెలి గిలిగింతల । నలువగు జాలన్ బిసాళి
నలువగు జాలన్ ॥ ౩౮ ॥ క ॥ నిజధైర్యౌదార్యములను । గజములకుం గొడమునిదుదక
రములుం బోలెన్ । భుజములు పోషితభక్త । వ్రజములు కరవిజితపుష్కరజములు పొద
లున్ ॥ ౩౯ ॥ క ॥ వదనైక స్తంభ కనక । సదనము సిరికొలుకొనర్చు బ్రష్టనిలువున ।
మ్మొదలింకెశ ఖశంకువా । యిదియనఁ గాఁగం బుకంఠ మింపు వహింపన్ ॥ ౪౦ ॥ క ॥ బింక
పు వ్రాఁతలవాతెఱ । మంకెనపూఁ దేనె తేటమానక పైపై । సింకఁగ నింకఁగఁ బల్మఱుఁ ।

---

మిక్కిలి మెత్తని. గుంఠము=కఠినము. కాను=తగను. వెన్ పొదివి=వెంబడించి. తొల్పదుకులు=
వేదనాలు. ఉగ్గడింపఁగన్=స్తోత్రముగా ॥ ౩౨ ॥ నూలిన=పదును పెట్టిన. హత్తిన=అంటిన. చె
న్నుం దిత్తుల క్రియన్=అందమైన సంచుల విధమున ॥ ౩౩ ॥ మాయావృతుఁడు=మాయచేత ఆవరింపఁ
బడినవాఁడు. సోయగమునన్=అందముచేత. తెగడు=తిరస్కరించు ॥ ౩౪ ॥ నభము=ఆకాశము. బ
లిసద్మంబు=పాతాళము. ఇరవులు=చోట్లు. బటువులు=గుండ్రనివి. వళులచెలువునన్=ముడుఁత
లయందముచేత. పుటపుటనై=క్రమముగా పెరుగుచున్నది ॥ ౩౫ ॥ తోయదవాహనరత్నవేది=ఇంద్ర
నీలమణులయరుఁగు. ఘర్మగభస్తికిన్=సూర్యునికి. నభస్థలము=ఆకాశప్రదేశము. బోర్తలుపన్
=పెద్దతలుపును. పరిస్ఫురింపఁగన్=చక్కగా ప్రకాశింపఁగా ॥ ౩౬ ॥ ఆకలితఘుటికలు=గ్రహింపఁ
బడిన గుండ్లు. జిలిబిలి=చిన్న. వన్నెలసంచి=అందమైన తిత్తి ॥ ౩౭ ॥ లలిత=మనోజ్ఞమైన. కలిత
=కూడిన. కనత్కంబు=ప్రకాశించునట్టి శంఖము యొక్క. కలువల చెలిగిలిగింతలన్=చంద్రుని
చక్కిలిగింతలచేత—సోఁకుటలచేత. నలువు=ఒప్పిదము. జాలన్=చంద్రకాంతమణులను. బిసా
ళినలువగు జాలన్=ప్రకాశించునట్టి హంసలను ॥ ౩౮ ॥ కరవిజితపుష్కరజములు=అరచేతులచేత
జయింపఁబడిన తామరలుగలవి. పొదలున్=అతిశయించును ॥ ౩౯ ॥ సదనము=ఇల్లు. బ్రష్ట=బ్రహ్మ
శంకువు=మేకు ॥ ౪౦ ॥ బింకపు=నిక్కుగల. వంకించుట=పూయుట. బచ్చెన=వర్ణము ॥ ౪౧ ॥

క్కఁగమురఁజేయు జగత్పతిఁ। దగిలి కనుంగొనుచు మునిమదావళమెలమిన్॥౪౯॥ తే॥
కనులవీక్షణశక్తిచే వెండికుండ। లింద్రశిలిమాంగరుచిసుధ యొత్తిగోల। సంతత
వ్రతకల్పరాజాయమాన। దుస్తరక్లేశసంశయుఁ దోలఁగఁద్రోచి॥౫౦॥ ఉ॥ ఆవ్వ
సదల్చుపచ్చవెదు రంఘ్రియుగాంతరవీథి నూఁది యు। గ్రావనిఁ జేజరిల్లుగటి హస్తస
మన్వితుఁ గౌస్తుభాంకునిం। దీవిభు నింద్రనీలనిభదేహుఁ గనుంగొని హర్షవర్షధా।
రావిలమానసుండగుచు నమ్ముని కృత్యవిమూఢబుద్ధియై॥౫౧॥ చ॥ విలిఖిత
మోశిలాకృతియొ విస్మృతిరూపు వహించెనో యనన్। జలనవిమానుఁడయ్యెఁ దొలు
సావిపయోధరధారఁ దోఁగున। య్యెం దళుకొత్తుకొ్రత్తపులు నేపున వేపులకల్ తనూ
లతన్। మొలవఁగనున్న నవ్విధము మున్యుఁడు తాపసముఖ్యుఁ డిట్లనన్॥౫౨॥ ఉ॥
నిచ్చలు నిచ్చలోఁ బొదలు నీపితృభక్తికి జ్ఞానశక్తికిన్। మెచ్చితి నిచ్చితిం గరము నీయెడ నీ
యెడయేల వేఁడుకో। మ్రెచ్చదఁ జెచ్చెరన్ వలయు నీప్సితముల్ శతవేసిదీన నే పొచ్చె
ము నొచ్చెముం జొరదు ఘోరదుర్భరాసుర కేసరి నమ్ము వాసుదున్॥౫౩॥ శా॥ భస్మోద్ధూళిత
పాండురాంగము రమాప్రాణేశు పాదద్వయిన్। విస్మేరాంబుజగామి హంసమిది
నా నేవ్రాల్చుచున్ లేచి దే। వాస్మాకం శరణం త్వమేవ గతిరన్యో నాస్తి దుర్వాసనా।
పస్మారం హర యంచుఁ బల్కె మఱియున్ భక్తుండు భక్తిస్పృహన్॥౫౪॥ సీ॥ పొ
దలు నీపొక్కిటి పువ్వుకాన్పునఁ గదా పెనుమానుపిల్లలఁ బెట్టు చెల్లఁ। బోడము నీమొ
దలియూర్పుల నేర్పులనకదా చదువుసంధ్యలుగల్గి జగము మనుట। కెరలు నీయడుగుఁ
దామరల తేనియఁగదా పాపంపుఁ బెనుగొంపి పలుచనగుట। పొసఁగు నీతెలిచూపు
పసగదా యిది రాత్రి యిది పగలనుమేర తెలియఁగబడుట భవనఘటనకు మొదలికంబ
మును బోలె। భువనమున కెల్ల నీవాదిభూతుఁడగుట। నిట్టనిలుచని క్కేఁగాదె నెట్టు

---

గఁగా. మదావళము—ఏనుఁగు. —శ్రేష్ఠుఁడు॥౪౯॥ కుంభలింద్ర...సుధ—శేషశయ్యయొక్క ప్రకాశము నెడి యమృతమును॥౫౦॥ అగ్రావనిన్—ఎదుట. ఇందిరాధవున్—లక్ష్మీభర్తను. ఆవిల—కలఁకఁ బారిన. కృత్య—తాను చేయఁదగిన కార్యములయందు॥౫౧॥ విలిఖితశిలా—వ్రాయఁబడిన రాచిత్తరువో. విస్మృతి—స్మృతిలేమి. తొలుసావిపయోధరధారన్—తొలుకరిమబ్బువలని నీటిధారల చేత. తోఁగు—తడియు. తళుకొత్తు—ప్రకాశించు. పులు నేపునన్—గడ్డియొక్క యాధిక్యము చేత. పులకలు—గగుర్పాటులు॥౫౨॥ నిచ్చలు—నిత్యమును. ఇచ్చలోన్—మనసునందు. ఇచ్చితింగరము—అభయహస్తము నిచ్చితిని. ఎడ—అవకాశము. ఈప్సితములు—కోరికలను. పొచ్చెము—తక్కువ. ఒచ్చెము—అనుమానము॥౫౩॥ ఉద్ధూళిత—దుమ్మెగయఁజిమ్ముటచేత. విస్మేరాంబుజగామి—వికసించిన దామరను పొందునది. అస్మాకం శరణంత్వమేవ—నాకు రక్షకుఁడవు నీవే. గతిః—దిక్కు. అన్యః—ఇతరము. నాస్తి—లేదు. దుర్వాసనాపస్మారం హర—చెడ్డవిషయాపేక్షయనెడి పిచ్చిని పోఁగొట్టుము. స్పృహన్—ఇచ్ఛచేత॥౫౪॥ పొదలు—వర్ధిల్లు. కాన్పునన్—ప్రసవము చేత. ఊర్పులు—శ్వాసములు. కెరలు—అతిశయించు. తెలి—తేటయైన. భవనఘటనకున్—ఇల్లుకట్టుటకు. నిట్టనిలుచుట—నిలువున నిలిచియుండుట. నెట్టుకొనియెన్—అతిశయించెను—తేటపడియెను. గెటు—కదలిక. కుం

కొనిరె । గెంటుఁగుంటును లేకలక్ష్మీకళత్ర॥ ౫౫॥ చ॥ మదమున సోమకాసురుఁడు
ద్రుచ్చిలి యచ్చలమారఁ గొన్న ప్రాఁ । జదువులు తెచ్చి తజ్జరరసాంద్రతరాంత్ర
ములంటనంటుబల్ । గదురు దొలంగఁగీర్తి యను గంగఁ దొలంచి విధాతృవిస్ఫుర ।
ద్వదనసరోజగంధలలితంబులు చేసితి గాజగన్నిధీ ॥ ౫౬ ॥ ఉ ॥ కోపనశాపనవ్యశి
ఖిగోర్మసంగంగ సుగంధిమ్రుండిత । త్రాపను నాఁపలేక తిమిధామజలభ్రమిఁగూలి
తూలుజం । భాపహరాజ్యలక్ష్మి వెరవారఁగఁ దేల్ప వెయింత కాయరూ । పై పృథు
కర్పరంబమర నాశ్రితరక్షణదక్షిణేక్షణా ॥ ౫౭॥ ఉ ॥ ఆపెను వెల్లిఁద్రెళ్లుమకరాకరమే
ఖలనీవు దేర్చియ । ష్టాపదటంకవిభ్రమవిడంబినియా నిజదంష్ట్రగూర్చిత । దూప
మదీపితంబగు సరోరుహలోచన సప్తజిహ్వజి । హ్వాపరిభాగధూమవలయోపమ
మైవిలయోపలబ్ధులన్ ॥ ౫౮ ॥ చ॥ అలఘుజగద్ద్విషద్ద్విపఘటాంకుశశాతనఖాంకురాగ్ర
లాం । గలములమున్ను నీవసురఘస్మరవైరిభుజాంతరాళజాం । గలమహిఁజాలువట్టిప
యిఁగ్రమ్మెడు నెత్తురునీరు వెట్టియుం । దలుకవె కీర్తి పూర్తి కలమాంకురమింద్రరమాఫ
లార్థివై ॥ ౫౯॥ క॥ దండితబలివై జగములు । నిండ బెరుగుచున్న వేళ నీవడుగునభా । మం
డలమతిసూక్ష్మాకృతిఁ । గొండికవచ్చియును బోలెఁ గొమరొందహరీ ॥ ౬౦॥ ఉ॥ మాతృ
కఠోరకంఠబిలమార్గగళద్రుధిరారుణాననం । బై తళుకొత్తు దోఃపరశుహంసికి మేఁత
యొసంగ వేరిపు । క్ష్మాతలనాథమేచకకచాకుచహారకమృణాళనాళసం । ఘాతము నూ
తనైణమదకర్దమవర్ధనసంప్రభూతమున్ ॥ ౬౧ ॥ ఉ ॥ దారుణబాణపాతమదధా

---

టు — తగ్గు ॥ ౫౫ ॥ అచ్చలము — ఉత్సాహము. ప్రాఁజదువులు — వేదములను. అంత్రములు — ప్రేఁగు
లు. బల్గదురు — అధికమైనసీఁచుగబ్బు. తొలంచి — కడిగి. విస్ఫురత్ — వికసించుచున్న ॥ ౫౬ ॥ కోపనశా
పనవ్యశిఖి — కోపస్వభావముగల మునీశ్వరుని శాపమనెడి క్రొత్తనిప్పు. గోర్మసంగమ్ — మిక్కిలి రేఁ
గఁగా. సుగంధి — మిక్కిలిశపించి మ్రుంది — సోలి. తిమిధామజలభ్రమిన్ — సముద్రజలముయొక్క
తిరుగుడునందు. తూలు — చలించు. జంభాపహ — ఇంద్రునిదైన. ఈఁతకాయ — ఈఁదుటకు అనువు
గా నుంచుకొనెడు ఎండుసొరకాయ. కర్పరము — వీఁపుచిప్ప. దక్షిణేక్షణా — దాక్షిణ్యముతోడి
చూపుగలవాఁడా ॥ ౫౭ ॥ మకరాకరమేఖలన్ — భూమిని. అష్టాపదటంకవిభ్రమవిడంబిని — బంగారు
నుచెక్కునట్టియులియొక్క విలాసమును పోలినది. సప్తజిహ్వ — అగ్నియొక్క. జిహ్వాపరి — నాలు
కలైనమంటలకొనలందు. విలయోపలబ్ధులన్ — ప్రళయములు కలుగునప్పుడు ॥ ౫౮ ॥ అలఘు...లాంగ
లములన్ — అధికులైనలోకశత్రువులనెడి యేనుఁగులగుంపునకు అంకుశములైన వాఁడులైన గోళ్లకొన
లనెడి నాఁగేళ్ల చేత. అసురఘస్మర — అసురులను నశింపఁజేయువాఁడా. వైరి...మహిన్ — పగవాని
రొమ్మనెడి అడవి నేలను. చాలువట్టి — చాళ్ళేర్పడునట్లు కలమాంకురము — వరిమొలక ॥ ౫౯ ॥ గొం
డిక — చిన్న ॥ ౬౦ ॥ కఠోర — కఠినమైన. గళద్రుధిరారుణాననంబు — కారుచున్న నెత్తుటిచేత ఎఱ్ఱనైన
మొగముగలది. దోఃపరశుహంసికిన్ — చేతులయందలి గండ్రగొడ్డలియనెడి ఆఁడుహంసకు. మేచకక
చా — స్త్రీలయొక్క. ఏణమద — కస్తూరియనెడి. కర్దమవర్ధనసంప్రభూతమున్ — బురదయందు వర్ధి
లునది మఱియు పుట్టినదియును ॥ ౬౧ ॥ దారుణబాణపాతమదధారలు గాఁగన్ — క్రూరములైన

రలు గాఁగఁ బ్రాలు దోర్ధను । ర్వారణరాజుఁ గొల్చె దశవక్త్రముఖాంబుజవాటిఁ
గూల్చె బృం। దారకహృత్సరోజములు వాననచేసి వికాసము సరా। కారత నొందఁ జేసి
న ప్రగల్భతనీకతగున్ దగన్ హరీ॥ ౬౨॥ మ॥ వికటోత్తంభితసీరభోగపటలీవిస్ఫూ
ర్తిస్ఫూర్తికం। చుకనిర్మోకభయానకంబు వికృతాశుక్ష్వేళమగ్నిచ్ఛటా । వికిరత్క్రూ
రనిరీక్షణంబు నగు నీ కేసంబు శేషానుకా । రి కళన్ బ్రాలదె క్రాలదే సమదవైరి
ప్రాణ వాతూలముల్ ॥ ౬౩ ॥ చ ॥ ప్రతిదినకేశలుంఛనపు రాయిడి నెట్టనబట్టఁగ
ట్టపైఁ । బుసపుతమంచునున్న కుఱుబోడతలన్ ధరియింపనోడి యుక్తిన్ । సతముగ సో
మ్ముగా ననిడఁ జాలవుగా శిఖిపింఛవల్లి సౌ । గతమతధుర్యుఁ డాఁగటిగట్టుము పట్టము
మిస్సకేటికిన్ ॥ ౬౪ ॥ చ॥ కలిహిమవేళ శోభనపుఁ గమ్మవిరుల్ సకలంబు దుల్చి భూ।
వలయవనంబుఁ గప్పికొని వర్తిలు జాడ్యపుటీఁద పర్వఁగా । నలరులకారులీల భవదా
గమనంబిటఁ గల్గ రోషపా । టలమగు నీకనుంగడలడాలు నగున్ జిగురాకు నాకృతిన్॥
౬౫ ॥ సీ॥ నీటిలోఁ జివుకక నిలిచి క్రమ్మఱుపూనిటఁ గఠినకర్పరపుఁ జుకాటను బిగువు।
దంష్ట్రినెత్తిన మహీతలపు గాడుపుఁ జీర యురుదారుకలనయందు దయమగుట । పరు
లకుఁ దనకట్లబలిమి చూపు విధంబు పులిమిన నెత్రుఁగ్గిలవునూనె । ద్వీపాంతరమునకుఁ

---

బాణములు పడుట యను నెడి యుదజలధారలు కాఁబుచుండఁగా. బ్రాలు—ప్రకాశించునట్టి. దోర్ధనుర్వా
రణరాజున్—భుజములయందలి విల్లు నెడియేనుఁగులరాజును. కొల్చె—పురికొలిపి. దశవక్త్రముఖాంబు
జవాటిన్—రావణుని పైనముఖములనెడి కమలములవరుసను. బృందారకహృత్సరోజములు—దేవత
లమనస్సులనెడి కమలములు. వికాససరాకారతన్—వికాసముచేత అతిశయించిన యాకృతికలిగి
నతనము. ప్రగల్భత—నేర్పరితనము॥౬౨॥ వికట—వంకరై. ఉత్తంభిత—మీఁదికెత్తఁబడిన. సీరభో
గపటలీ—నాగేలనెడి పడగలయొక్క సమూహముచేత. విస్ఫూర్తిమత్—ప్రకాశించుచున్న మూర్తి—
ఆకృతి. కంచుకనిర్మోకభయానకంబు—కుబుసము విడుచుటచేత భయంకరమైనది. వికృతాశుక్ష్వే
ళము—వికృత—వికారమైన. ఆశు—వడితోడి. క్ష్వేళము—విషముగలది; సింహనాదముగలది అని అ
ర్థాంతరము. అగ్నిచ్ఛటావికిరత్క్రూరనిరీక్షణంబు — నిప్పులసమూహమును వెదచల్లునట్టి క్రూరమైన
చూపుగలది. శేషానుకారి—శేషునిబోలుచున్న. కళన్—ప్రకాశముచేత. బ్రాలదె—ప్రకాశింప
దా. క్రాలదే—త్రాగదా. సమదవైరిప్రాణవాతూలములు—మదముతోఁగూడిన శత్రువుల ప్రాణవా
యువులను॥౬౩॥లుంఛనపు రాయిడిన్—ఊడిపోవునట్టి యుపద్రవముచేత. నెట్టనన్—మిక్కిలి.
పుతపుతమంచున్—అనురుము. కుఱుబోడతలన్—కుఱుచనైన బోడితలయందు. సతముగన్—శాశ్వ
తముగ. శిఖిపింఛవల్లిన్—తీఁగవంటి నెమలి పురిని. సౌగతమతధుర్యు—బుద్ధుఁడా. పట్టము—వస్త్ర
ము॥౬౪॥కలిహిమవేళన్—కలియుగమనెడి మంచుకాలమునందు. శోభనపుఁగమ్మవిరులు—మేలుల
నెడి వాసనతోడి పువ్వులను. దుల్చి—రాల్చి. భూవలయవనంబున్—భూమండలము అనెడి అడవిని. వ
ర్తిలు—ఉండునట్టి. జాడ్యపుటీఁద—మూఢత్వమనెడి చలిగాలి. పర్వఁగాన్—వ్యాపింపఁగా. అలరు
లకారులీలన్—వసంతఋతువువిధమున. అటన్—అంతట. రోషపాటలము—కోపముచేత ఎఱ్ఱనై
నది. కనుంగడలడాలు—కడకన్నులకాంతి॥౬౫॥ కర్పరపు—వీఁపుఁజిప్పయనెడి. గాడుపుఁజీర—
గాలికి ఎత్తెడు చాఁపగుడ్డ. దారుకలనయందున్—ప్రమానిపొందునందు. చేమట్టు—ఆయుధమైన. శి
నతగులు—లంగరుతగిలించుట. సాగరాగ్రమమాలిమిశాస్త్రిసరణి—బౌద్ధుఁడాగమమనెడి ఓడనడ

డెగనైజను మెంపుచేయుట్టు రాఁగంటి జీవుగులు । సౌగతాగమ మహాలిమి శాస్త్ర
సరణి । వల్గువల్గనచిత్రధావనములు ల్గు । నిన్నుఁ దరిఁజేసి భవవార్థిని స్తరించి । దరిఁ
దఱియకున్నఁగల డెమోదముమురారి ॥ ౬౬ ॥ చ ॥ లలిత కళావళీమృదుపలాశప
రీతసుధామరందవి । చ్ఛిలసుమనఃప్రబోధగుణ జృంభితపూర్ణసుధాంశుబింబవు ।
ఘటలసిత పుష్కరాతనతన షట్చరణేంద్రనవేంద్రనీలక । జ్జలజలజాప్తజాజలనిజ
ద్యుతివంచకకాంతికంచుకా ॥ ౬౭ ॥ క ॥ ఉత్పత్తిస్థితివిలయా । ర్థోత్పాదకవిట్ఠలా
హ్వాయోన్నత సత్రా । జిత్పుత్రికాసతృష్ణదృ । గుప్తిబసుఖదాప ఘనపయోధర
శాలీ ॥ ౬౮ ॥ స్రగ్విణి ॥ అండజాధీశ వాహా జగద్గేహదో । ర్దండచండానిద్దారి
తారీనతా । ఖండలాగండరింఖన్మణీకుండలా । పుండరీకేక్షణాప్రోన్నతన్ సుక్ష
ణా ॥ ౬౯ ॥ చ ॥ అలికులభాగకుంతలములందపుముద్దుమొగంబుఁ జేరలం । గొలువఁగవ
చ్చుకన్నులుఁ జిగుర్నగుమోవి మెఱుంగుఁజెక్కులున్ । వలమురియాలు లేమొసలివాగ
డపోఁగులు లోఁతుపొక్కిటన్ । మొలచిన తెల్లదమ్మిబలుమూఁపులు నీలవినీల దేహమున్
౭౦ ॥ చ ॥ కలిగినవాని ప్రాఁబలుకుఁ గమ్మనియూర్పులవాని యొందునే । వెలుఁగునుగాని
పెన్వెలుఁగు వెంబడిఁ గొంజనువాని నంతటన్ । వెలసినవాని నిన్ గనని వెంబరపుట్టువు తాఁతి
పుట్టువుం । బలెఁగతిగానలేము యతిమానసహంసక కంసహింసకా ॥ ౭౧ ॥ ఉ ॥ ఛత్రిత

---

పుశాస్త్రరీతి. వల్గువల్గనచిత్రధావనము—చక్కనైన వల్గితము నెడి విచిత్రమయిన గుఱ్ఱము నడపుడు పా
టు. తరిన్—ఓడను గా. నిస్తరించి—దాఁటి దరిఁదఱియకున్నన్—గట్టు చేరకుండిన. మోదము—
సంతోషము—ఈ పద్యమునం దుఃష్టు నిదశావతారములను ఓడ పరికరములుఁగా వర్ణింపఁబడియున్న
ది అందులకు అనుగుణముగా అర్థాంతరమూహించుకొనవలెను ॥ ౬౬ ॥ లలిత...ఆయుతన—ఒప్పిద
ములైన కళలసమూహము నెడి మెత్తని యాకులచేత చుట్టఁబడిన యమృతము నెడి పూఁదేనెమీఁగడయొ
క్క మేలైన కాంతివిశేషమును తోఁపించెడి గుణముచేత రేఁగిన నిండు చంద్రుని బింబము యొక్క కాఁ
తలేని తెల్లనైన జలప్రదేశము (పాలసముద్రము) యిల్లుగాఁ గలవాఁడా. షట్చరణేంద్ర...కంచుకా—
శ్రేష్ఠమైనతుమ్మెద నూతనమయిన యింద్రనీలమణి కాటుక యమునానదియం దలి జలము వీనిని తన
కాంతిచేత తక్కువపఱుచునట్టి దేహకాంతియనెడు కవచము గలవాఁడా ॥ ౬౭ ॥ ఉత్పాదక—కలి
గించునదియైన. ఉన్నత—అధికుఁడా సత్రాజి...శాలీ—సత్యభామయొక్క ఆశతోడి చూపులకు
నిక్కెపానము చేయుటవలన సుఖమునిచ్చునట్టి దేహము నెడి మేఘము చేత ఒప్పినవాఁడా ॥ ౬౮ ॥ జగద్గే
హ—లోకమే యిల్లుగాఁ గలవాఁడా దోర్దండ...తారి—కఱ్ఱలవంటి చేతులయందలి వాఁడియైన చ
క్రముచేత తెగనఱకఁబడిన శత్రువులుగలవాఁడా. నతాఖండలా—మ్రొక్కిన యింద్రుఁడు గలవాఁ
డా. గండరింఖన్మణికుండలా—చెక్కిళ్లయందు నటించుచున్న రత్నముల చెవిపోఁగులు గలవాఁడా.
సుక్షణా—మంచియుత్సవము గలవాఁడా ॥ ౬౯ ॥ అలికుం భాగకుంతలములు—తుమ్మెదలను బోలిన ముం
గురులు. చిగుర్నగుమోవి—చిగురును పరిహసించునట్టి పెదవి. వలమురియ(లు)—శంఖము వంటి మెడ.
లే మొసలి వాగడపోఁగులు—క్రొత్తవైన మకరకుండలములు. తమ్మి—తామర ॥ ౭౦ ॥ వెంబర—పుట్టుని
యొక్క. యతిమానసహంసక—యతులయొక్క మనస్సులనెడి మానససరస్సునకు హంసయైనవాఁ
డా ॥ ౭౧ ॥ ఛత్రితశేష—గొడుగుగాఁ జేయఁబడిన శేషుఁడు గలవాఁడా. అయ్యెదవేన్—అయ్యెడు ప

శేష నామమెడఁ బ్రసన్నుఁడ నయ్యెద వేఁగృతోగ్రశ । త్రుతాపమైనయీలలితరూప
ముతోనిచటన్ వసింపుమీ । క్షేత్రము నెట్టితీర్థమును జెందనియున్నతిఁ బొందుగాక
యీ । క్షేత్రముతీర్థమున్ గడుఁబ్రసిద్ధి మదాహ్వయలబ్ధిఁ బొందుతన్ ॥ ౭౨ ॥
తే ॥ క్షేత్రకులరాజమైనయీక్షేత్రమునకుఁ । దీర్థకులరాజమైనయీతీర్థమునకు ।
నిఖిలసురసాధకర్తృత్వనియతిఁ బొదలి । యీశిటఁ సించుటయ వరంబిచ్చుటనుడు ॥
౭౩ ॥ సీ ॥ అనుకంపపెను మోపుగనఁ బొంపునకు వింత చెలువంబు మొలపింపఁ జిగురు
మోవి । పవడంపుఁగొన దంతపఙ్క్తిప్రభలు పుష్పితముగాఁగ హరిపలుకు ధరణిది
విజ । నివహావరేణ్యు నోఖిలధర్మధురీణు మగునట్లు భవదాహ్వయము వహించు ।
ని తీర్థమున వసియించెద నమవక్తి— నీకుఁ జేతఃప్రీతి నెలకొనంగ । భీమఘుర్మాంబుసం
భూతభైమినీరు । క్షేత్రమునుదీర్థమునునిజోత్కృష్టసలిల । వేణిసంప్లావితమ్ముగా
వింపఁగలదు । నాకు నెంతయు నిష్టమొనర్పఁగడఁగి ॥ ౭౪ ॥ వ ॥ ప్రకటసుప్తాకారంబునం
బశ్చిమాభిముఖుండనై సర్వోత్తమత్వంబు నిర్వహింప నేనిచ్చటయుచ్చటందవిలి వర్తిం
చెద. సకలక్షేత్రతీర్థోత్తమంబులగుని క్షేత్రతీర్థంబులుం బౌండరీకంబులై పాండు
రంగాహ్వయుండనగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీపసుధాసాగరంబులకంటెఁ
బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంతవిభవంబుల నభిరామంబులయ్యెడు. నీకో
రినయట్లయిచ్చితినని యచ్యుతుర్భుజుండు పుండరీకునిఁ జేకొనియె ॥ ౭౫ ॥ శా ॥ శీతా
హార్యకుమారి పిన్నిటుల లక్ష్మీజాని వాచంయమి । వ్రాతశ్రేష్ఠునకున్ వరంబొసఁ
గిసాంద్రప్రీతి నచ్చోనను । ద్వ్యతీర్థంబునను న్నవాఁడిప్పుడుభుక్తిన్ ముక్తి నీఁజాలు వి ।
ఖ్యాతిం దాల్చెఁ జిత్రరత్నచయరమ్యస్వర్ణహర్మ్యంబులన్ ॥ ౭౬ ॥ చ ॥ నలువమొ
గంబులెల్లు సృజనప్రథనాహమునందటిర్చున । న్నలువున సిద్ధసాధ్యనరనాగమరు
ద్వరయోగిమండలీ । కలకలగు భితంబులయి కాంచనచారువులైన నాల్గువా । కిళుల
వెలుంగుచున్న యానికేతనరాజమునం బ్రసన్నుఁడై ॥ ౭౭ ॥ తే ॥ పుండరీకుండు క్షేత్ర
పాలుండుగాఁ గొలిచి । యుండనవ్యక్తముఖ్యసంయుక్తుఁడగుచుఁ । బాండురంగండు
భక్తకల్పద్రుమలీల । నిష్టఫలసిద్ధిఁ దోరహత్తించు నింతి ॥ ౭౮ ॥ క ॥ ఆకంబులలితకరు

---

తుమున. కృతోగ్రశత్రుతాపము — చేయఁబడిన హరిశత్రువులభయము కలది — క్రూరులైన శత్రువులకు భయము కలుగఁజేయునది. మదాహ్వయలబ్ధిన్ — నా పేరు కలుగుటను ॥ ౭౨ ॥ ౭౩ ॥ అనుకంప — దయ. వింతచెలువంబు — క్రొత్తయందము. చక్కిన్ — చోటను. చేతఃప్రీతి — మనస్సంతోషము. భీమఘుర్మాంబుసంభూత — శివుని చెమటనీటివలనఁ బుట్టినది. నిజో... సంప్లావితమ్ము — తనదైనమంచినీటి పాయచేత చక్కఁగాఁ గడుగఁబడినదానిఁగా ॥ ౭౪ ॥ సుప్త — నిద్రపోయినవాని. తవిలి — ఆసక్తుఁడనై ॥ ౭౫ ॥ శీతాహార్యకుమారి — హిమవంతుని కూఁతురు. లక్ష్మీజాని — విష్ణుదేవుఁడు. వాచంయమివ్రాత — మునులసమూహమునందు. భుక్తిన్ — ఇహలోకసుఖమును ॥ ౭౬ ॥ అన్నలువునన్ — ఆవిధమున. మరుత్ — దేవతలు. మండలి — సమూహముయొక్క. కుంభితంబులు — కూడినవి. కాంచనచారువులు — బంగారుచేత మనోహరములు. నికేతనరాజమునన్ — శ్రేష్ఠమైనయింటియందు ॥ ౭౭ ॥ ౭౮ ॥ కం

బుధ । కోకంబులపాలిహేళిఁ గొలుతు రబలము । ల్లోకంబులవారలుఁ బరి । పాకం
బులనాత్మసుకృతపరికరము ప్పన్ ॥ ౬౯ ॥ వ ॥ అర్ధయోజనవిస్తారంబును దదర్ధా
యామసంయుతంబును నై కంబుకంధరునకు నాకుం ప్రియజనకంబై సనకసనందనాది
సజ్జనచింతితార్థప్రదంబై యమ్మహాక్షేత్రరాజంబు పుష్కరంబునకంటెఁ ద్రిగు
ణంబును కేదారంబునకంటె షడ్గుణంబును వారణాసికంటె దశగుణంబును శ్రీ
శైలంబునకంటె ననంతంబును నై పుండరీకుని పేరం బౌండరీకంబును మహీమండల
మణికుండలంబగుచు నుండు నప్పరమధామంబు నే నధిష్ఠించి ॥ ౭౦ ॥ ఉ ॥
ఆయదుభర్త నాహలధరానుజు నానవనీతచోరు నే । నాయనిభక్తితోఁ గొలు
తుఁ బ్రత్యహముఁ గృహదైవతంబుగా । నోయరవిందకోరక సహోదరచారుప
యోధరాధ్యని । శ్రేయసకాంక్షఁ దక్కొరులు చేరి భజింతు రనంగ నేటికిన్ ॥ ౭౧ ॥ క ॥
ఇతరక్షేత్రస్థితదై । వతపూజలఁ గలుగుఫల మవశ్యముఁ గలుగున్ । శతదశకగుణిత
మైయూ । ర్జితమతిఁ దత్క్షేత్రపూజ సేయు నరునకున్ ॥ ౭౨ ॥ క ॥ నరుఁడరుఁదివేలేఁడు వి
తరదైవతదర్శనమునఁ దాఁగను ఫలమున్ । బొరయు నలవోకవలె శాం । కరి యాక్షే
త్రోత్తమంబుఁ గనుఁగొన్నంతన్ ॥ ౭౩ ॥ క ॥ సకలక్షేత్రావాసము । నకంటె నందు
నికి యొప్పు నరునకు మృగడిం । భకనయన యేకదినవా । సకృతికి వేదోరకుఁ గాన
సాయుజ్యంబున్ ॥ ౭౪ ॥ సీ ॥ దొరకు జన్మమునకుఁ బరమ భైషజ్యమౌ మాతృశుశ్రూషాస
మాధి యొకటి । చిలువాయనపు వేల్పుఁ గొలముఁ గొల్వక వాసుదేవు నారాధించు తెలి
వి యొకటి । దుర్వాసనల బెట్టు దోసఁగులు విడదన్ని యధ్యాత్మవాసన నలరుటొక
టి । యన్నిజీవుల కెల్ల నదయించి యుదయించి తుది మర్త్యుఁడైపుట్టుపదవి యొకటి ।
కాలమున వచ్చునర్థులకాంక్ష యెఱిఁగి । తృప్తినొందింపఁగలుగంగ దిరుగుటొకటి । దు
ర్లభంబెట్టులట్లతిదుర్లభంబు । మగువ తత్క్షేత్రవాసంబు మానవులకు ॥ ౭౫ ॥

---

బులలితకరున్ — శంఖము చేత బట్టుచున్న చేయి గలవానిని. బుధకోకంబుల — విద్వాంసులనెడి చక్రవాకపక్షుల. హేళిన్ — సూర్యుని. పరికరము — ఉపకరణము ॥ ౬౯ ॥ ఆయామము — పెడలుపుతోడ. చింతితార్థప్రదంబు — కోరిన దానినిచ్చునది. త్రిగుణంబు — మూడంతలు. షడ్గుణంబు — ఆఱంతలు. అనంతంబు — తుదలేనిది. ధామంబు — ఆలయము. అధిష్ఠించి — ఉనికి చేసికొని ॥ ౭౦ ॥ అరవింద...రాధ్య — తామరమొగ్గలను బోలిన యొప్పిదములగు స్తనములు గలదానా. నిశ్శ్రేయసకాంక్షన్ — శుభము నందలియపేక్ష చేత. తక్కొరులు — తక్కిన యితరులు. భజింతురు — సేవింతురు ॥ ౭౧ ॥ శతదశగుణితము — వేయింతలుగా పెరుగునది. ఊర్జితమతిన్ — స్థిరబుద్ధితో ॥ ౭౨ ॥ పొరయున్ — పొందును. అలవోకవలెన్ — అనాయాసముగ. శాంకరి — ఓపార్వతీ ॥ ౭౩ ॥ మృగడింభకనయన — జింకపిల్లకన్నులవంటి కన్నులు గలదానా. ఏకదినవాసకృతికిన్ — ఒకదినము వాసము చేసినవానికి. సాయుజ్యంబు — మోక్షము ॥ ౭౪ ॥ దొరకు — కలుగు. భైషజ్యము — మందు. చిలువాయనపు వేల్పుఁగొలము — చిల్లరదేవతల సమూహమును. దుర్వాసనల బెట్టు దోసఁగులు — దుష్టములయిన విషయాపేక్షలనెడి గొప్పయాపదలను. అధ్యాత్మవాసనన్ — తత్వవిచారాపేక్ష చేత. అలరుట — ఆనందించుట. పదవి — భాగ్యము ॥ ౭౫ ॥

చ॥ వినవె యజస్రముం గుతపవేళ క్షుధార్తులకోటిఁ గూర్చి నే। తనెసరు వెట్టి వండు కల
ధౌతపుఁ గూడు పసిండికప్పు భో । జనమిడి యొండుచోఁ బడయఁ జాలెడు పుణ్యము గ
ణ్యమై ఘటి । ల్లు నెలఁగ పౌండరీకమహిలో మెదుకొక్కటి పెట్టువానికిన్॥ ౮౬॥ మ॥
నిఁడుతింబాతిక యెత్తు కాంచనము గానీ వెండి గానీ జగ । త్త్రితయపూజ్యం బగు పాండు
రంగవసతిన్ దానంబు గావించు పు । ణ్యాయితుం డుండు నఖండలీల కలధౌతాహార్యవ
ర్యాత్మక । ప్రియగేహంబులలో భవాంతరమునన్ బృథ్వీధరేంద్రాత్మజా ॥ ౮౭ ॥
శా ॥ ప్రావారాజినరాజిఁ గంబళతతిన్ బట్టాంబరాళిన్ దయా । ప్లావస్నిగ్ధమతిన్
జలిన్ గృపణవిప్రశ్రేణిపైఁ గప్పుఁ బో । యే వాఁడేని యుఁ బౌండరీకమహిఁ వాఁ డిందు
ప్రభాకందళ। శ్రీవిభ్రాజియశంబులం బొదలు ధాత్రీదిఙ్నభస్సీమలన్॥ ౮౮॥ ఉ॥ వృత్రవి
రోధిముఖ్యులగు వేల్పులుఁ బుట్టఁ దలంతురోలతా । గాత్రి త్రివిష్టపస్థితిసుఖంబులు గా
వనికర్మభూమిపై । బత్రరథాధినాథరథుబాంధవవత్సలుఁ బౌండరీకసుక్షేత్రపతిన్
భజించి తమ చెన్నఁటి పుట్టువు నీఁగు కోరికన్॥ ౮౯॥ సీ॥ పితరులుబ్బుదురు హృద్గతుల
నాత్మనుగులోద్భవుఁ డెవ్వఁడైనను బౌండరీక । మునకు నేగ కయున్నె యనియందు నా
సఁగు హవ్యముఁ గవ్యమున మేయమై ఫలించు। సవదరించఁగ లేరు సాత్వికంబగు భావమే
నొకరుఁ జునుద కక్రసిపులనపుల । భక్తులెవ్వరు రజఃప్రకృతిఁ దాల్తురె కాని పౌండరీకే
శు శాంబరి కతమునఁ। దలఁప మానసముఁ గల్గు కలుషమడఁగు । పొగడు మాటలనగు

---

అజస్రముల్ = ఎల్లప్పుడును కుతపవేళన్ = అపరాహ్ణసమయమునందు. క్షుధార్తులకోటిన్ = ఆఁ
కలిబాధగలవారి సమూహమును. నేతన్ = నేతితో. కలధౌతపుఁగూడు = వెండియన్నము. పసిండి =
బంగారు. ఒండుచోన్ = ఇతరస్థలమునందు. అగణ్యమై = ఎంచరానిదై. ఘటిల్లున్ = కలుగును.
పౌండరీకమహిలోన్ = పుండరీకక్షేత్రమునందు॥ ౮౬॥ కాంచనము = బంగారు. వసతిన్ = ఉనికిప
ట్టునందు. కలధౌతాహార్యవర్యాత్మకప్రియగేహంబులలోన్ = శ్రేష్ఠమైన వెండికొండగల (అనఁ
గా) వెండికొండను బోలిన ఇష్టములైన యిండ్లయందు. భవాంతరమునన్ = ఇంకొకజన్మమునందు. పృ
థ్వీధరేంద్రాత్మజా = పార్వతీ॥ ౮౭॥ ప్రావారాజినరాజిన్ = తోలుఉత్తరీయపు సమూహమును. ప
ట్టాంబరాళిన్ = పట్టువస్త్రముల సమూహమును. దయాప్లావస్నిగ్ధమతిన్ = మిక్కిలి దయగల స్నే
హబుద్ధితో. చలిన్ = చలికాలమునందు. కృపణ = దరిద్రులైన. ఇందుప్రభాకందళశ్రీవిభ్రాజియశం
బులన్ = వెన్నెలమొలకలకలిమిచేత వెలుఁగునట్టి కీర్తిచేత. పొదలున్ = వర్ధిల్లును. ధాత్రీదిఙ్నభ
స్సీమలన్ = భూమియొక్కయు దిక్కులయొక్కయు ఆకాశముయొక్కయు మేరలయందు॥ ౮౮॥ వృ
త్రవిరోధి = ఇంద్రుఁడు. త్రివిష్టపస్థితిన్ = స్వర్గమునందలి యునికిచేత. కావు = కలుగవు. పత్రరథా
ధినాథరథున్ = గరుడవాహనుని. చెన్నఁటి = వ్యర్థమైన. నీఁగు = తొలఁగు॥ ౮౯॥ ఉబ్బుదురు = సం
తోషింతురు. హృద్గతులన్ = మనసులందు. ఆత్మకులోద్భవుఁడు = తమకులమునందుఁ బుట్టినవాఁడు.
ఉన్నె = ఉండునా. హవ్యమున్ = దేవతలకియ్యఁదగిన యన్నమును. కవ్యమున్ = పితృదేవతలకియ్య
దగినయన్నమును. అమేయము = ఇంతమాత్రమని యూహించి చెప్పరానిది. సవదరించఁగ లేరు = వ
హింపఁజాలరు. సాత్వికంబు = సత్వగుణంబువల్లనైనది. రజఃప్రకృతిన్ = రజోగుణభావమును. శా
ంబరి = మాయ. కతమునన్ = కారణముచేత. కలుషము = కల్మషము. అఘంబులు = పాపములు. ఉ

దోషములు దొలంగు । కనుఁగొనఁగఁ జేతఁ బెట్టు నఘంబు లుడుగు । నమ్మహాక్షేత్రమున కునె న్యూనసమంబు ॥ ౬౦ ॥ సీ॥ కుఱుచలై గుమురులై గొనబులై లేఁబాఁపకొమ్మఁ జుట్టిన జడల్ గుమురుకొనఁగ । మెఱుఁగులై మిట్టలై మిక్కిలి బటువులై క్రాలు కన్నుల చెన్ను గబ్బుదేరఁ । జిక్కనై చెలువమై బిన్నదిన్నై యొప్పు మోము దంష్ట్రాటంకములఁ దలిర్ప । నీలమై నిబిడమై స్నిగ్ధమై నింగి క్రిందుగ నున్న బలుమేని పొగరు మెఱయఁ । బత్త్రిపతికేతనుని పురఃక్షేత్రమూఁది । యున్న శ్రీక్షేత్రపాలకు యోగిలోక । రమణు ముప్పదిరెండక్షరముల మంత్ర । రాజము జపించి కొల్వ దొరకు శుభములు ॥ ౬౧ ॥ ఉ॥ చేరి చతుశ్శ్రుతుల్ చిలుకచేఁ జదివించుచు నక్షమాలికా । ధారిణియై తనుప్రభలు దట్టపు వెన్నెలపం డువండఁగాఁ । మూఁపున వాకిటన్ వెలయు తోయజగర్భుల రాణి వాణి నీ । హారమయూఖజిహ్మఖ దశాక్షర మంత్రము నుంగనందగున్ ॥ ౬౨ ॥ ఉ॥ శ్రీరమణీమనోరమణుచేఁ బ్రతిష్ఠితుఁడై యటు దక్షిణ । ద్వారమునందు లింగతనువైభవ మొప్పఁగడకరీ పిఘుల్ । గోరి భజించువారలకుఁ గొంగుధనం బయి సేయుముద్రతో । నారదుఁ డున్నవాఁ డురదనచ్ఛదభర్త్సితవిద్రుమద్రుమా ॥ ౬౩ ॥ ఉ॥ శౌరిభజించుచున్ భుజగసద్మమునన్ విహరించు వాఙ్మనో । హారిణులై దుగోటులు మహామహిమాన్వితులర్థి దక్షిణ । ద్వారమసోఁకి పెక్కురతివర్తిలియున్ విభుఁ జేరి యెన్నఁడో । యారతులిచ్చినారఁట తదాయతధూమము నేఁడుఁ బర్వెడున్ ॥ ౬౪ ॥ క॥ చేడియ యాద్వారమెదుట । చూడామణి క్రీడలాడుచో టమ్మహితా । క్రీడనభూస్థలి హరిఁ గూ । డాడుఁ జుమీ యమునగల్ల భావళి నేడున్ ॥ ౬౫ ॥ ఉ॥ సేచనముఖ్యకర్మముల సేఁతకు నూతనమైనయచ్చటన్ । శ్రీచరణంబులున్నయవి సింగము వెన్నున నంటివానికిన్ । వేచని మ్రొక్కి పూజనము నేమముతో రచియించెనేని శ్రీ । తాచలపుత్త్రి పూరుషుఁ డిహంబుఁ బరంబుఁ

---

నుగుక్ — మానను ౬౦ ॥ గుమురులు — గుబురులు. గొనబులు — అందములు. బటువులు — గుండ్రనైనవి. క్రాలు — ప్రకాశించు. చెన్ను — అందము. గబ్బుదేరన్ — గర్వమును తోఁచింపఁగా. చిక్కన — సళ్లులేమి. చెలువమై — అందమై. మోము — ముఖము. దంష్ట్రాటంకముల్ — కాసెయులులవంటి కోఱలచేత. తలిర్పన్ — ప్రకాశింపఁగా. నిబిడము — దట్టమయ్యు, స్నిగ్ధము — నిగనిగలాడునది. నింగి — ఆకాశము. బలుమేనిపొగరు — గొప్పదేహముయొక్క నిక్కు. పత్త్రిపతికేతనుని — గరుడధ్వజముగల పాండురంగవిట్ఠలుని. పురఃక్షేత్రము — ఎదుటిప్రదేశమును. ఊఁది — అవలంబించి ॥ ౬౧ ॥ ధారిణి — ధరించినది. తోయజగర్భుని రాణి — బ్రహ్మయొక్క పట్టపుదేవి. నీహారమయూఖజిహ్మఖ — చంద్రుని జయించు చవట్టి ముఖముగలది ॥ ౬౨ ॥ లింగతనువైభవము — లింగదేహముయొక్క కలిమి. రదనచ్ఛదభర్త్సితవిద్రుమద్రుమా — పెదవిచేత తిరస్కరింపఁబడిన పగడపుఁజెట్టుగలదానా ॥ ౬౩ ॥ భుజగసద్మమునన్ — నాగలోకమునందు. వాఙ్మనోహారిణులు — మాటలచేత మనోజ్ఞులగువారు. రతిన్ — ఆసక్తిచేత. వర్తిలి — ఉండి. తదాయతధూమము — దానిదైన విశేషపుపొగ. పర్వెడున్ — వ్యాపించుచున్నది ॥ ౬౪ ॥ యమునచూడామణి — కృష్ణుఁడు. అమ్మహితాక్రీడనభూస్థలిన్ — లెస్సగా క్రీడించుటకుఁ దగిన ఆ పూజ్యమయిన ప్రదేశమునందు ॥ ౬౫ ॥ సేచన — స్నానము. సేఁతకున్ — చేయుటకు ॥ ౬౬ ॥ మకరఁ

వుఁడున్॥ ౧౦౩॥ సీ॥ ధాత్రీధరాత్మజ శ్రీ తాత్రీతయనఁగ దీర్ఘాత్మయనఁగను మూ
ర్త్యాత్మయనఁగ। ద్రివిధమూర్తులు దాల్చి దీపించునతఁడు మూన్నెలవుల యెడఁ బూ
జసేయుఁడగుటఁ। గంబళ కౌశేయ కలధౌత కాంచన గంధసింధుర తురంగమ శతాంగ।
కర్ణికా గ్రైవేయ కటక కన్యాగంధ కాశ్మీర కస్తూరికా గవాజ్య। ధాన్య దానాది బహు
పదార్థంబుల చటఁ। బెద్దలకు వేదవిదులకుఁ బ్రీతి నొసఁగ। క్షేత్రమయమూర్తియగు దే
వకీసుతునకుఁ। బాండురంగాధిపతికిని బ్రమదమొదవు॥ ౧౦౪॥ ఉ॥ చేసియ తీర్థమూర్తి
కడఁ జేయఁదగున్ మనుజుండు సేవనా। క్రీడనముల్ మహీదవిజ కేసరులన్ బరమాన్న
శర్కరా। పాడబగోఘృతేక్షురస శాకములన్ ఫలపానకాదులన్। వీడెములన్ బ్ర
మోదపదవీమదలిప్సఁ జెలంగఁజేయుచున్॥ ౧౦౫॥ క॥ ప్రణుతమతిన స్థాపూజార్ప
ణమునఁ దత్తీర్థమూర్తి భజియించు సుధీ। మణులకు నభిముఖమతి బర్హిణబర్హాకల్పుఁ
డొసఁగు నిహము పరమున్॥ ౧౦౬॥ వ॥ అనిమూర్త్యర్చనావిధానకథనోన్ముఖుండై
పంచముఖుండు శిఖరినందనతో నిట్లనియె॥ ౧౦౭॥ సీ॥ మంత్రపూతముగాఁగ మజ్జనం
బొనరించి ప్రస్నని శుభాంబరములు గట్టి। ఘనసారమిశ్రిత గంధసారమలంది పరి
మళంబుడివోని విరులు ముడిచి। సిగరలతోడ గోక్షీరపూరముతోడ బహువిధంబగు ఫల
ప్రతతితోడ। పిండివంటలతోడ ఖండశర్కరతోడ నేతులతోడ దేనియలతోడ। దధు
లతోఁ గూడఁదగు నివేదనలతోడ। వసధివసధాము పీతాంబరు నిరమాకు। చరజనివి
లిప్త శిఖిబర్హధరు మఖాంశ। భోక్తఁ బూజింపఁ దగుఁ జైత్రమున శుభాంగి॥ ౧౦౮॥ సీ॥
గంగఁ గాటుకకొండ గప్పనొప్పిదము దళ్కొత్తనావుల పాలనోలలార్చి। బలితఁపును

---

చేత. క్షుల్లకాధిక్యమున్ = అయల్పసిద్ధై. హెచ్చును. మృదుసంరంభముతోన్ — కొంచెపు త్వర
తో. నవ్వుచున్ = ఎగతాళి చేయుచు. తున్మెన్ = చంపెను ॥ ౧౦౩ ॥ ధాత్రీధరాత్మజ = ఓ పార్వ
తీ. దీపించున్ = ప్రకాశించును. మూన్నెలవులయెడన్ = మూడుస్థానములయందు. కౌశేయ = ప
ట్టు. కలధౌత = వెండి. గంధసింధుర = మదపుటేనుఁగు. శతాంగ = రథము. కర్ణిక = చెవికమ్మ.
గ్రైవేయ = మెడలో ధరించెడి యాభరణము. కటక = కడియము. గవాజ్య = ఆవునెయ్యి. దాన =
ఇచ్చుట. ప్రమదము = సంతోషము. ఒదవున్ = కలుగును ॥ ౧౦౪ ॥ సేవనాక్రీడనములు =
జలకమాడుటలు. కేసరులన్ = శ్రేష్ఠులను. షాడబ = ఆరురసములతోఁ గూడిన పదార్థములు. ఇక్షు =
చెఱుకు. శాకములన్ = కూరలచేతను. ప్రమోదపదవీమదలిప్స = సంతోషమార్గము చేత మత్తుకొనన
ట్టియిచ్ఛ. చెలంగన్ = అతిశయింప॥ ౧౦౫॥ బర్హిణబర్హాకల్పుఁడు = నెమలికుంచెయలంకారము
గాఁగలవాఁడు = కృష్ణుఁడు॥ ౧౦౬॥ ౧౦౭ ప్రస్నని = మనోజ్ఞమైన. గంధసారము = మంచిగంధము
ఉడివోని = తగ్గని. సిగర = తాలింపుచేసిన మజ్జిగ. పూరము = ప్రవాహము. వసధివసధామున్ = స
ముద్రజలము ఉనికిపట్టగువానిని. రమాకుచరజనివిలిప్తునిన్ = లక్ష్మీదేవి బొమ్మలయందలి పసపు
చేత పూయఁబడినవానిని. శిఖిబర్హధరున్ = నెమలికుంచెను ధరించినవానిని. మఖాంశభో
క్తన్ = యజ్ఞభాగమును భుజించువానిని ॥ ౧౦౮ ॥ ఓలలార్చి = అభిషేకముచేసి. ధార్తరాష్ట్ర
మున్ = నల్లనిముక్కు కాళ్లుగల హంసను. మున్నీటిన్ = సముద్రమును. కమిచి = కప్పి. శాద్వల...

రుచ్యజోంపము ధార్తరాష్ట్రంబుఁ జుట్టినక్రియ తెల్లపట్టు గట్టి। ముదురు వెన్నెల యొప్పు మున్నీటిఁ గమిచి పట్టినలీలఁ గ్రాలఁ జందనముఁ బూసి। వడగండ్లు పోవ పుశాద్వలమహిఁ బొల్చు పొల్పుగ మల్లెపువ్వులఁ బూజసేసి। మందు వేసవివాసవిమనుపు కాపు। విబుధతతి పాళివీడరవెల్లమ్రాఁకు। భక్తసులభుని దెలిచి పూర్వోక్తభూరి। భక్ష్యభోజ్యాదుల ర్పింపభద్రమొదవు ॥ ౧౦౯ ॥ సీ ॥ వృష్టిగా శుద్ధాంబువేణి మజ్జనమార్చి శిఖరిమేఘము గ మంజిటి ఘటించి। కరకపాతంబుగా విరిగొజ్జెఁగలఁ బూన్చి క్షమ పంకిలతఁ గఁగుంకుమముఁ బూసి। మఘువగోపములుగా మణిహారమర్పించి పలుమెఱుంగులు గలదీపమ్ముల నెత్తి। గర్జితంబులు గ శంఖక్వాణములు చూపి పచ్చిక గాధూపపటలిఁ బెనిచి। యుర్విబంటులభుక్తిగా నుష్ణతైల। పక్వగుడమిశ్రపిష్టసూపపరమాన్న। రాసులొసఁగంగఁదగుఁ గారు రాకహరికి। నట్టిఋతుధర్మములు చూపుచందమొంద ॥ ౧౧౦ ॥
సీ ॥ మహినాలపాఁడి ముమ్మరముగాఁ బ్రభవింపనవనవోజ్జ్వలదధిస్నానవిధియు। శుభ్రాభ్రపట్టంబులభ్రంబుపైఁ బర్వఁగఁ ధౌతవిపులచేలములకప్పు। సితకుశేశయకాశ శశధరద్యుతి హెచ్చ దొరకినయుచితంపువిరులపూజ। శాలిపాకస్ఫూర్తిఁ గ్రాలగోరోచనాసంమిశ్రచర్చిక్యసంఘటనము। వ్రజభుజభుజుల భోజనావళులవంటకములుగా వింప గోధూమఖండఖండ। శర్కరాఢ్య సుపక్వ భోజ్యములు నెఱపి। విష్ణుఁ బూజింపఁదగు శరద్వేళయందు ॥ ౧౧౧ ॥ సీ ॥ పాథోధి విహృతి సంభవ తనూజాడ్యంబు సంతప్త గోఘృత స్నపన రచనఁ। దులసి దండయు కాని కలుగనితఱుఁగవ మరువక కుంద కట్మల సమృద్ధిఁ। గఠినకచ్చరపీత కౌశేయ

---

—పచ్చికనేల. వీడరవెల్లమ్రాఁకు—ముంగిటనుండెడి కల్పవృక్షము. తెలచి—మ్రొక్కి. భూరి—అధికమైన. భద్రము—మేలు ॥ ౧౦౯ ॥ శుద్ధాంబువేణిక—తేటనీటిధారచేత. మజ్జనమార్చి—స్నానము చేయించి. మంజిటి—పీతాంబరము. కరకపాతంబుగాక—వడగండ్లుపడుటగా. విరిగొజ్జెఁగలక—విరిసిన గొజ్జంగిపూవులను. క్షమపంకిలతగక—నేలబురదగా. మఘువగోపములు—పట్టుపురుగులు. క్వాణములు—ధ్వనులు. ఉష్ణతైలపక్వగుడమిశ్రసూప—కాఁగిననూనెలో వండఁబడిన బెల్లముకలిపిన పిండివంటలు పప్పు. కారు—వర్షాకాలము ॥ ౧౧౦ ॥ ముమ్మరముగాక—అధికముగా. నవనవోజ్జ్వల—మిక్కిలి క్రొత్తదై ప్రకాశించునట్టి. శుభ్రాభ్రపట్టంబులు—తెల్లని మేఘములనెడి పట్టువస్త్రములు. లఘు—తేలికైన. ధౌత—మడుఁగైన. సితకుశేశయ...ద్యుతి—తెల్లదామరలయు రెల్లుపువ్వులయు చందమామయు కాంతి. శాలిపాకస్ఫూర్తి—వరివంటయొక్క ప్రకాశము. చర్చిక్య—పచ్చగంధపుపూఁత. వ్రజభుజభుజుల—గొల్లవారి భోజనమును భుజించువారియొక్క. వంటకములు—అన్నములు. గోధూమఖండ—గోధుమనూక. ఆఢ్య—కలిగిన. పక్వభోజ్యములు—వండఁబడిన భుజించువస్తువులు. శరద్వేళ—శరత్కాలము ॥ ౧౧౧ ॥ పాథోధివిహృతి—సముద్రమునందలి విహారము. జాడ్యంబు—జడత్వము. సంతప్త—కాఁగిన. స్నపనరచనక—స్నానము చేయించుటచేతను. కుందకట్మల—మొల్లమొగ్గలయొక్క. కచ్చర—ముఱికియైన. పీతకౌశేయనిర్బంధము—పచ్చపట్టుకట్టు. చిత్ర—నానావర్ణమైన. ముదురువెన్నెలక—పూర్ణచంద్రునికిరణములచేత—అమృతముచేత. నవ్య—క్రొత్తదై. దివ్య—మనోజ్ఞమైన. ఉజ్జగింపించి—విడిపించి. డెందానకుక—మనస్సునకు. ఉబ్బు—సంతోష

నిర్బంధమభిరామచిత్రాంబరార్పణమున । మునురుపెన్నెలఁజేయు నుదరపోషణ
వృత్తినవ్యాదివ్యాన్నపానప్రశస్తి । సుజ్జగింపించి డెందానఁకుబ్బొప్పర్చి । నిశలఁగుం
కుమమగలుమైసెండసలంది। గేహముసధూపధూమమెక్కించికుధర । ధరునిసేవం
తమునఁగొల్వదొరకుముక్తి॥ ౧౧౨॥ క॥ శశిరాగమవాసరముల । యశోదగారా
బుపట్టినర్చింపఁదగుక్। శశిమఖితతాళ్లేలోచిత। కుశకుసుమపటాంగరాగకర్పూరార్పా
సాదిక్॥ ౧౧౩ ॥ క ॥ బుధితుష్ఫలనాళ్టకిక్రియఁ। బ్రతిదినముభజింపఁబరమపద
నాథుఁడువాం । భిత్రశతములొసఁగిభక్త। ప్రతతులవస్నించుభక్తపరతంత్రుండై॥
౧౧౪॥ తే॥ మురవిభజనుఁ శ్రీక్షేత్రమూర్తిఁదీర్ఘ । మూర్తిమూర్తులకడనేమమున న
నొసర్చు । సర్వభాగవిశేషంబులానుపూర్వి । వినుము వినుపింతుఁబరమాణువిభవ
మధ్య ॥ ౧౧౫ ॥ తే॥ పరమపదనాథుఁడిరిగిరానిరువసేను । సేతులప్రమాణముసఁ
గల్గుసూతలంబు । ముక్తికన్తైన శ్రీక్షేత్రమూర్తియందు । సర్వభాగంబుసమ్ము
చంద్రార్ధనిటల॥౧౧౬॥క॥ సకలోత్కృష్టోన్నతిఁబా । యొకయెయ్యాదికీర్తివడము
నత్తీర్థముపా। ల్లుకయర్చాభాగఁబై।యకుటిలగతిఁదీర్ఘమూర్తియందువెలుఁగుక్॥
౧౧౭॥క॥పసేఁమూర్తి ఘడ।ర్చాబియమవిభాగమునఁబ్రశస్తంబగువా।స్థానము
నర్చింపకయె । వ్వాఁకిఁదాఁజేయుపూజసమ్మగుఁజమ్మీ॥౧౧౮॥ వ ॥ కావున క్షేత్ర
మూర్తితీర్థమూర్తిమూర్తిమూర్తులయందలియర్చాభాగంబులెఱిఁగి యర్చించుచు
ననుచితాచరణవిముఖుండగు పుణ్యాత్ముఁడిసుముఖుండై పాండురంగం డఖండానందం
బాపాదించుననియాపరమేశ్వరుండు పార్వతితో వెండియునిట్లనియె॥ ౧౧౯॥ మ ॥
హరిపశ్చద్దిశనూఱువిండులప్రమాణాసక్తికల్మిక్ శుభో। త్కరపద్మంబగుపద్మతీ
ర్థమనుతీర్థంబొప్పునచ్చోనసు । స్థిరతక్ శంఖము పద్మమక్ నిధులువర్తింపుం దటిం
దీపితుల్ । నరనారాయణులున్నవారచటబాలాపిప్పలాకారులై॥ ౧౨౦॥ సీ॥ సమ
ధికజ్ఞానవిభ్రమముతోఁగూడంగ హరిమేననవతారమైనవారు । వదమువోవఁగనిం
ద్రమనసుతోఁగూడంగ బ్రహ్మచర్యముచిక్కఁబట్టువారు । పరషరుపార్థసంపదతో
డఁగూడంగధనురాదిశస్త్రముల్దాల్చువారు । దుష్టనిగ్రహవిధాధురతోడఁగూడంగఁ
బూర్ణాక్షరోన్నతిఁబూనువారు। వహితగాంభీర్యధైర్యసాహగ్రితోడఁ। గూడసౌ

మ. నిశలక్—రాత్రులందు. అగలు—అగరుగంధము. ఎక్కించి — అతిశయింపఁజేసి కుధర
ధరుఁడ్—విష్ణుమూర్తి ॥ ౧౧౨ ॥ పటాంగరాగకర్పూరార్పాసాదిక్—వస్త్రములుగంధపుపూఁతలు
కమ్మసములు (అరచాకళ్లు) మొదలగువానిచేత॥౧౧౩॥౧౧౪॥ ఆనుపూర్వికి—మొదటనుండి
క్రమముగా॥౧౧౫॥కరి—సాక్షి. అర్చభాగంబు—పూజించుభాగము. నిటల—నొసలుగలదానా॥
౧౧౬ ॥ నేల—చోటు.వమ్ము—వ్యర్థము ॥ ౧౧౭ ॥ ౧౧౮ ॥ ఆపాదించుక్—కలిగించును॥
౧౧౯ ॥ శుభోత్కరపద్మంబు—శుభసమూహములనైడిపద్మములుగలది. పిప్పలాకారులు—రావి
చెట్టురూపము నొందినవారు ॥ ౧౨౦ ॥ విభ్రమముతోక్—విలాసముతో. చిక్కఁబట్టు—పరి
గ్రహించు. దుష్టనిగ్రహవిధాధురతోడక్—దుష్టులనుశిక్షించుటయనుభారముతో.సౌజన్యరమక్

జన్యరవగూడియాడువారు । ఘనప్రతిబింబనిభులుసహస్రకవచ । కవచనిర్భేదను
లువారు ధవళనగమున॥ ౧౨౧॥ క ॥ ఏపట్టునఁ జూపట్టుదు । రాపట్టునమూడుకో
టులమరాంగనల । ష్టాపదపాత్రనిహితమణి । దీపకళికలగుచు శ్రీపతిఁ బూజింతు
రు॥ ౧౨౨॥ ఉ॥ దోశ్శమితారికారితనతాభ్రనకుండలముల్ నిజకుమారం । తచ్ఛిలలో
నదాంతఁ బ్రమదాంయొకతీర్థముకుండలాఖ్యమై । దుశ్శకునాదిసంజనిత దోషశతంబు
హతంబుసేయనం । భశ్శుచితఁ బ్రసిద్ధమగుబన్నగశాయికినీశుదిక్కునన్ ॥ ౧౨౩॥
క ॥ నరసింహమన్యయచ్చో । నరసింహుఁడు కుంజరాశనతఁ దాల్చుటన । చ్చె
రువ దేవుఁడు నిజముం । త్రరాజపూజైకతానతాయుతుఁ బ్రోచున్ ॥ ౧౨౪॥ క॥ ఓరా
జవదనయుచటన । నీరాజనబద్ధభుజకినీసున్నా । రారాశము హరివల్లభ । లారా
మలఁగొల్వఁ దలఁతురనయకాములకున్ ॥ ౧౨౫॥ శా ॥ అంశేందూద్వహదేవిహ్రీం
కృతిఁ ధ్రువంబై యున్నయచ్చోటికిన్ । త్రింశచ్చాపమితోర్వి నుత్తమనందీపించుతీర్థం
బునన్ । భ్రాంశంబొందక వెనక్కుఁ దవ్సలిలధారంగూడెఁ బుష్పావలీ । సంశుద్ధాంబు
ఫలాదెమెడ దగుజపస్నానార్ఘ్య దానక్రియన్ ॥ ౧౨౬॥ సీ ॥ భరమానుతజేఁదోడు
పడవచ్చుగతిఁ జేవిలేగరమూలజద్యుతులసాఁగ । నెలకులంబులచేల్వ నేర్చునవా
ర్కాంశులనఁగ వోలములపై పాంశులంటఁ గొండిఁబుట్టు కాళిమాంకురపు మేఘములకు
మెఱుఁగులై చూత్రుఁ గ్రొమ్మించులర । స్నేహంబుపాత్రనిక్షిప్తమాటకును బ్బపగిది
పాలిండ్లునిబ్బరమునికిరా । హరికిఁబలువంకలనుదగనగ్రవీధి । నిలిచిశతకోటిసంఖ్య
లనియమపరత । నారతులొసంగుదివ్యకన్యకలు ధన్య॥ మతుల గ్రిడింతురయ్యుత్తమ

---

— మంచితెనపుకలిమిని. ఘనప్రతిబింబనిభులు — సూర్యబింబమునుబోలినవారు. నిర్భేదనులు — చక్కగాభేదించువారు॥ ౧౨౧ ॥ పట్టు — స్థానము. చూపట్టుదురు — కనఁబడుదురో. అష్టాపద
పాత్రనిహిత — బంగారుపళ్లెరములయందుంచఁబడిన॥ ౧౨౨ ॥ దోశ్శమితారి — భుజములచేతఅణఁపఁ
బడినశత్రువులుగలవాఁడు. నిజకుమారం తచ్ఛిలలోన్ — తనభూమిలోనిరాతియందు. అంభశ్శుచి
తన్ — నీటిపరిశుద్ధతచేత. ఈశుదిక్కునన్ — ఈశాన్యపుదిక్కునందు ॥ ౧౨౩ ॥ కుంజరాశన
తన్ — అశ్వత్థత్వముచేత. ఏకతానతా — ఇతరవిషయములందు బుద్ధిఁ బోరనియ్యకుండుట — ఏకా
గ్రత॥ ౧౨౪ ॥ నీరాజనలు — ఆరతులు. ఏరాశము — లెక్కలేనివారు. అయకాములకున్ — మేలు
కలిమినికోరువారికి॥ ౧౨౫ ॥ అంశేందూద్వహ — కళామాత్రమయినచంద్రునివహించిన. హ్రీం
కృతిన్ — హ్రీంకారముచేత. ధ్రువంబై — శాశ్వతమై. త్రింశచ్చాపమితోర్విన్ — ముప్పదివిండ్లు
పట్టుకొలఁదినేలను. పుష్పావలీ సంశుద్ధాంబువులు — పువ్వులసమూహముచేత పరిశుద్ధమయిన జల
ములు ॥ ౧౨౬ ॥ భరము — బరువు. తోన్ — వెంబడిని. కరమూలజద్యుతులన్ — చంకలనిగనిగనివె
లుఁగులతో. సాఁగన్ — నడపిరాఁగా. నెలకులంబుల — చంద్రసమూహములయొక్క. చేల్వ — చల్లఁ
దనమును. నవార్కాంశులు — క్రొత్త (ఉదయకాలమునందలి) సూర్యకిరణములు. కపోలములన్ —
చెక్కిళ్ళయందు. కొండిన్ — దీపపుశిఖయందు. కాళిమాంకురపు — నల్లఁదనపుమొలకలనైది. మెఱుఁ
గులై — మెఱపులై. క్రొమ్మించులు — క్రొత్తమెఱపులు. అలరన్ — ప్రకాశింపఁగా. స్నేహంబు —
మైత్రి; నూనె. పాత్రసు — యోగ్యము. గిన్నె మొదలగునది. నిక్షిప్తము — ఉంచఁబడినది ఉబ్బు

స్థలమున ॥ ౧౨౭ ॥ ఉ ॥ గోపికతొల్లి యోర్తు హరిఁగూర్చి తపంబొనరింప దానిని। ష్టాపరతన్ మదింగరఁగి శార్ఙ్గి యుదోఁచినఁజూచి వేడ్కతో । నాపసిగాపుఫూపవయసా కేంద్రిలోకవిమోహనక్రియా । రోపనిరూపణంబగు సరోరుహలోచను రూపుఁజూచుచున్ ॥ ౧౨౮ ॥ తే ॥ వైషమేషవవిషమేషుశోషణమున । వేషమొకరీతిగానిర్నిమేషనయన । యగుచు నెరగొంటఁగదలనిపొగరుమీను । దోయిఁజూపట్టు సప్తసింధువునుబోలె ॥ ౧౨౯ ॥ తే ॥ క్లేశపాశంబుతోఁగూడఁ గేశపాశ । మురులబర్హావతంసుండు కరుణనిచ్చు । నీవి యెఱుఁగక యొకకాంత నీవి జాఱ । దచ్చరణములు మదినంటమచ్చెకంటి ॥ ౧౩౦ ॥ సీ ॥ ఊరకుండినఁజూచి యొకకాంత నగి కృష్ణుఁడిది యేమినీవన్న నిందువదన । కుంచితావయవభంగురవృత్తిఁదత్పాదబిసరుహంబులు కేలబిగియఁబట్టి । మచ్చిత్తహారములు మధువైరినీపాదవనరుహంబులు వీనివదలఁజాల । వీనిలావణ్యమీ వేషభూషణము గనాకస్మికార్థితంబగుటనడుగఁ । గవయిది సలాంఛనంబగుఁగాతయనుడు । నట్లయగుఁగాక సర్వంబునతివ నీవ । నంబరవు ముక్తకేశివి నిఖిలభూష । ణాంచితాంగివి నైయుండుమని యొశౌరి ॥ ౧౩౧ ॥ ఆ ॥ అదియు నట్లయగుచు నభిరామమూర్తియై । తనపసిండిజడలు దలఁగఁద్రోచి । యానతార్ధమూర్తియై క్షేత్రమునకునీ। శాన్యమున వసించు చంద్రవదన ॥ ౧౩౨ ॥ క ॥ ఆమహనీయ క్షేత్రశిఖామణిపైఁ బిదపఁ బర్వెఁగామిని నానా। భూములనునిగిడి వదగజ। భైమి బహుళలహరిగహనభయదాకృతియై ॥ ౧౩౩ ॥ సీ ॥ జలధిచల్లిన గంధవాడి నేత్రములఁబడ్డ గళిఁదామరపరాగంబుఁగ్రమ్మ। తదితర క్షేత్రములఁ దమయందు నిలుమన్న నొడ్డించుటలువోలె నూర్మ్ములెసఁగఁ । బంకదంభమునఁ బాపములఁ ద్రిమింగి నీటి పెద్దనవ్వులలీల ఫేనములరఁ। పెర

---

—సంతోషించు—ఉబుకు. పాలిండ్లు—స్తనములు. నిబ్బరము—మిక్కిలి. అగ్రవీథిన్—ఎదుటను ॥ ౧౨౭ ॥ ఓర్తు—ఒకతె. తోఁచినన్—ప్రత్యక్షముకాఁగా. అపసిగాపుఫూపవయసా కె—ఆగొల్లపడుచు ॥ ౧౨౮ ॥ వైష..మునన్—వైషమేషవ—మన్మథునియొక్క. విషమేషు—బేసిబాణములవలని. శోషణమునన్—చిక్కుటచేత. నిర్నిమేషనయన—తెప్పపాటులేని కన్నులుగలది. ఎరగొంటన్—ఆహారమును దీసికొనుటచేత. పొగరుమీనుదోయిన్—మత్తుగొన్న చేపలజంటతో. సప్తసింధువున్—ఏడవ సముద్రమును—శుద్ధోదకసముద్రమును ॥ ౧౨౯ ॥ క్లేశపాశంబుతోన్—తపస్సువలని శ్రమను నైకట్రాటితో. కేశపాశము—వెండ్రుకలముడి. ఉరులన్—జాఱఁగా. బర్హావతంసుండు—కృష్ణుఁడు. ఈవి—దానమును—కోరికను. నీవి—కోఁకముడి. తచ్చరణములు—ఆకృష్ణుని పాదములు ॥ ౧౩౦ ॥ కుంచితావయవభంగురవృత్తిన్—వంపఁబడిన అవయవములయొక్క వంకరతోడి వ్యాపారముతో. బిసరుహంబులు—కమలములను. ఆకస్మికార్థితంబు—ఉన్నట్టుండి కోరఁబడినది. ఆయుగుఁగవయిది—ఈ పాదములజంట. సలాంఛనంబు—గుఱుతుతోఁగూడినది. అనంబరవు—వస్త్రములేనిదానవు. ముక్తకేశివి—ముడివీడిన వెండ్రుకలుకలదానవు. అంచిత—ఒప్పిదమైన ॥ ౧౩౧ ॥ ౧౩౨ ॥ జలధి—సముద్రము. పరాగంబు—పుప్పొడి ఒడ్డించుటలు—చాఁచుటలు. ఊర్మ్ములు—అలలు. దంభమునన్—నెపముచేత. లీలన్—విధమున. పెరవాహినులబారిఁగన్—ఇతరనదులమీఁదియుత్సర—ఊర్ధ్వియొక్క. గావిహావిక్రుతులు—ప్రాబింపఁజేయు కుత్స్యముల వికారములు

వాహినులమీఁదఁ బెరిగిన మత్సరావేశంబుల నగ్రాహవిక్రుతుల నడర। భానుభూమైకజని
భూమి భైమి నడచి। నిమ్మహక్షేత్రమట డాసి యధిక భీతిఁ। జోరకగిరిరుద్ధగతినైన కర
ణిఘూర్ణనంబు నొందదు శ్రీజగన్నాథుఁ డెటిఁగి॥౧౩౪॥ ఉ॥ పటిగుటించి పలుకు విను
మేటికి నీభవ మోశుభాంగి యె। స్ఫాటభపత్సమానమగు పాటి సరిన్నికరంబు లేదు
వా॥ పాటవ మొప్పమత్పదము పైఁ బ్రవహింపుము దాఁక నన్నన। చ్ఛోటస పాట మైకదలి
జోటియుఁ గొల్పెఁ జలప్రవాహముల్॥౧౩౫॥ తే॥ క్షేత్రముస భైమినిల్చి పొల్చు నప్రదేశ।
మునజనాభీష్టదము నాద్యముఁ నజతుర్ము। ఖాది సేవ్యంబునగు నృసింహాఖ్యతీర్థ। మమరు
త్రింశద్ధనుఃప్రమాణము నమెఱసి॥౧౩౬॥సీ॥ ఉక్కుఁగంబము వ్రచ్చి యుదయించె నేదే
వుఁ డరణి నుద్భవ మొందు నగ్నికరణి। వాలారుగోరు నీల్ గాలాము చేసె నే జేజే హిర
ణ్యాసుశిశుకమునకు। భక్తి వృద్ధుఁడు గాఁగ బ్రోటించె నే వేల్పు ప్రహ్లాదుఁ డను బాల
పండ్లవాడ। నిజసింహతనుఁ దగ సుజనహృద్గుహలందుఁ గ్రీడించె నే త్రిలోకీనియంత।
యానృహర్యక్షవర్యుఁ డుయఃపతిష్ఠి। ఖచర గంధర్వకిన్నర గ్రామణీశ। రోమణీ ఘృష్టిచ
రణసరోజుఁ డందు। నుండు ముప్పది రెండు బాహువులను గలిగి॥౧౩౭॥ శా॥ ఆకుంభప్రభ
వుండాకాలనాకశవంబత్యుగ్రశం జేసి ము। న్నాకుంభ స్తనియా జలాంతరమునందుప్పొం
గ నేదివ్యలిం। గాకారంబున నిల్చునట్టి దెయుగ స్త్ర్యాఖ్యాకతీర్థంబతి। ద్వ్యాకోచాకృతి
సప్తసప్తికరాయామావృతిన్ జెన్నగున్॥౧౩౮॥ మ॥ నవనీతప్రియుఁ గొల్చి విష్ణుప
తినన్మంత్రాంగతం దాల్చి యే। యవధిం బోనిగణాధిపత్యపదవిం బ్రాపించి యద్దాని
చెం। తవసింపంగఁ దదాహ్వయంబున గాణాపత్యమానట్టితీ। ర్థవతంసంబు నగస్త్య
తీర్థమునకాద్యంబం డ్రుచి ద్యాధికుల్॥౧౩౯॥ సీ॥ నగపుత్రియట్టి గాణాపత్యతీర్థంబున
కుంబూర్వమైన జ్ఞసంబొనర్చు। వారికిఁ బరివారి వారికిం పవర్గ వర్గంబునీఁజాలు వారికలి

---

అడరన్ — అతిశయింపఁగా. భానుభూమైకజనిభూమి — సూర్యుని యొక్క (లేక) ప్రకాశములయొక్క
అధిక్యమునకు ముఖ్యమైన జన్మస్థానము. భైమి — భైమీనది. డాసి — సమీపించి. గిరిరుద్ధగతి — కొండచేత
అడ్డగింపఁబడిన గమనముగలది. ఘూర్ణనంబున్ — తిరుగుడుఁబాటును. ఒందదుగా — పొందదుగా॥
౧౩౪॥ పస్ఫాటన్ — పిడుగు చేతను. సరిన్నికరంబు — నదీ సమూహము. వా॥ పాటవము — బలసమృ
ద్ధి. సపాటము — పట్టము. కదలిజోటి — ఏఱు. కొల్పెన్ — వ్యాపింపఁజేసెను ॥ ౧౩౫ ॥ పొల్చిన —
ఉన్న. జనాభీష్టదము — జనులకోరికల నిచ్చునది. త్రింశద్ధనుఃప్రమాణమున — ముప్పదివిండ్లపట్టు
కొలఁదిని ॥౧౩౬॥ వ్రచ్చి — పగులఁగొట్టి. అరణిన్ — నిప్పుతచ్చెడు సాధనమునందు. వాలారుగో
రు — వాఁడియైన చేతిగోరు. చినగోటిని. జేజే — దేవుఁడు. హిరణ్యాసుశిశుకమునకు — హిరణ్యకశి
పుని ప్రాణమునెడి యుసురు చెఱుపునకు. త్రిలోకీనియంత — మూఁడులోకములను సతముదాయమునుని య
మించువాఁడు. నృహర్యక్షవర్యుండు — నృసింహోత్తముఁడు. గ్రామణీ — శ్రేష్ఠులయొక్క. ఘృష్టి
— వెలుఁగులుగల॥౧౩౭॥ కుంభప్రభవుఁడు — అగస్త్యుఁడు. తద్వ్యాకోచాకృతి — దానివికాసము
తోడియాకారము. సప్తసప్తికరాయామావృతిన్ — డెబ్బదియేడు చేతుల పరివిగల యావరణము
చేత. చెన్నగున్ — అందగించును ॥ ౧౩౮ ॥ నవనీతప్రియున్ — కృష్ణమూర్తిని. అవధిన్ — మేర
ను. ప్రాపించి — పొంది ॥ ౧౩౯ ॥ పూర్వము — తూర్పు. అపవర్గంబు — మోక్షము. త్రివిష్టపమైన —

గీ॥ యచటసంకర్షణాహ్వయతీర్థరాజంబు వెలయు నచ్చోట మున్ను హాలధరుండు । తీర్థ
యాత్ర యొనర్చు త్రిమ్మట నైనచ్చోట నవగాహవేళఁ బ్రత్యక్షమైన । పాండురంగాధిపతి
కృపవడసి తద్వరాప్తి నిజనామమునఁ దీర్థ మధిగమింపఁ । జేసి కార్తార్థ్యమునఁ బొందె శ్రీస
ఖుండు । నందయంతర్హితుం డయ్యె నద్భుతముగ ॥౧౪౦॥ శా॥ ఆ సంకర్షణతీర్థరాజమున
కాద్యంబైనమద్వేదని । శ్వాసంబై తనదైర్ఘ్యమంతయు నుపంచాశద్ధనుర్మేయమై ।
భాసిల్లన్ నిజవారి మజ్జదఖిలప్రాణీప్సితత్యాగదీ । క్షాసన్నద్ధమనం బ్రసిద్ధి వడయున్
జాబాలితీర్థంబిలన్ ॥౧౪౧॥ క॥ అత్తీర్థము నంతరమున । వృత్తస్తనిబ్రహ్మతీర్థవిభుఁ డభిను
తిసఁ । పత్తిల్లసిల్లు శతదోర్వృత్తాకృతి కాంత దానివృత్తంబెల్లన్ ॥౧౪౨॥ క॥ అందువ
సియింపఁ గదె కుల । నందనసేవావిధాననందన్మతియై । కుందవిశదరదన శతా । నం
దుఁడు వాణీవధూసనాథుండగుచున్ ॥౧౪౩॥ తే॥ బ్రహ్మతీర్థంబునకు దండపాణియా
శ । కులశిఖరిపుత్రి దీపించుఁ గలశతీర్థ । మేను బారలనిడుపున ద్దీనుమిగిలి । యది యయ
మృతామహాదేవికాస్పదంబు ॥౧౪౪॥ తే॥ బ్రహ్మతీర్థంబు కలశతీర్థంబుఁ బొగడ ।
నేర రెవ్వరు చంద్రికాగౌరమయ్యెఁ । దత్పయోధరము క్తిసిధానమునకు । నంజనచ్ఛా
యమైతోఁచు తద్భూతంబు ॥౧౪౫॥ ఉ॥ తావర సాక్షియందునకు దక్షిణదిక్కున
సప్తదోర్మితా । యామ యాతయామగుణమై యెసఁగున్ బితృతీర్థ మచ్చటన్ । దా
మొనరించు దానములుఁ దానములున్ గయఁ జేయు సత్క్రియా । స్తోమములై పితృప్రి
యముఁ జొన్పు సుఖింప్రదు రెల్ల నారలున్ ॥౧౪౬॥ ఉ॥ దానికి దక్షిణాశ వసుధాధరనంద
నయొప్పు బ్రహ్మపి । ద్యానిధి సేవితంబు నవహస్తమితంబగు చక్రతీర్థము । చ్చోనలవోక
యుంబలె విశుద్ధజలంబులఁ గ్రుంకి మాధవ । ధ్యానము సేయు మానులకు నబ్రము లేయప
వర్గదుర్గముల్ ॥౧౪౭॥ క॥ చక్రస్తనితజ్జలములఁ । జక్రాలంకృతశిలానిచయము దయిం
చున్ । శక్రముఖాఖిలమఖభు । క్చక్రము గొనియాడుఁ దత్ప్రశస్తగుణంబుల్ ॥౧౪౮॥ శా॥

---

త్రిప్పటలో. అవగాహ—స్నానము చేసెడి. తద్వరాప్తిక—ఆయన వలని వరమును పొందుటచేత. అధిగమింపక—పొంద. కార్తార్థ్యమునఁ బొందెక—కృతార్థత్వమును పొందెను. అంతర్హితుండు—అంతర్ధానము నొందినవాఁడు ॥౧౪౦॥ దైర్ఘ్యము—నిడివి. పంచాశద్ధనుర్మేయము—ఏఁబది విండ్లపట్టుకొలఁదిగలది. మజ్జత్—స్నానము చేయుచున్న. ఈప్సిత—కోరికలను. దీక్షాసన్నద్ధము—నియమము చేత సిద్ధపడినది ॥౧౪౧॥ అంతరమునక—నడుమ. శతదోర్వృత్తాకృతి—నూఱు చేతుల చుట్టుగుండ్రనియాకారము. వృత్తము—ఉనికి ॥౧౪౨॥ నందన్మతి—సంతోషించుచున్న బుద్ధిగలవాఁడు. కుందవిశదరదన—మొల్ల మొగ్గలవలె స్వచ్ఛమైన పలు (వరుస) గలదానా. శతానందుఁడు—బ్రహ్మ. సనాథుండు—కూడినవాఁడు ॥౧౪౩॥ దండపాణియాశ—దక్షిణదిక్కు. కులశిఖరిపుత్రి—కులపర్వతము కూఁతురా. దీపించుక—ప్రకాశించును. దీను—మనోజ్ఞత ॥౧౪౪॥ చంద్రికాగౌరము—వెన్నెలవంటి తెలుపుగలది. అంజనచ్ఛాయ—కాటుక వన్నె ॥౧౪౫॥ సప్తదోర్మితాయామము—ఏడు చేతుల కొలఁది నిడివిగలది. అయాతయామ—విడువఁబడని. తానములు—స్నానములు ॥౧౪౬॥ ఆశక—దిక్కునందు. అలవోకయుంబలె—స్వేచ్ఛగా. అబ్రము—వింత. అపవర్గదుర్గములు—మోక్షమనెడి పొందరాని కోటలు ॥౧౪౭॥ మఖభుక్చక్రము—దేవతాసమూహ

ఆతీర్థంబునకుం గృతాంతదిశ నాద్యంబార్తి వైద్యంబుల । క్ష్మీతీర్థంబననొకట తీర్థము
ప్రకాశించుఁ గరమా దేవివీ । తాతంకస్థితినచ్చటం దపము సేయన్ నేర్చి కాత్రొల్లియా ।
వైతేయారిభుజాంతరాళమణిసాధం బెక్కెఁ బెన్నకుఁ బవన్ ॥౧౪౯॥ సీ ॥ ధూతాఘ
మైనలక్ష్మీతీర్థమునకు దక్షిణమునఁగా మోదకిచ్చున బద్మ । మును శంఖమును జక్రమును
నిజనామచిహ్నములుగా వెలయు తీర్థములు వెలుచు । మొలఁతయీ వాల్గులక్ష్మీతీర్థము
నఁగూడి శక్తిపంచకనామసంప్రయుక్తిఁ । దళుకొత్తు వీనివిస్తారంబు షష్టిహస్తప్రమా
ణంబనఁ జాలియుండుఁ । బరమపావనంబు పాపకర్మాల । నైకకర్మఠంబు లోకనుత
ము । తత్ప్రభావమసురదమనునకీ యేను । ప్రాణధనముల గుడుఁ బ్రణుతి వడయు ॥౧౫౦॥
ఉ॥ ఆనఘు వైరిదివ్యతను వై సకలోన్నతమూర్తి యైదశ । వ్యామవిశాలమై షరమమై ఘ
నత్రితయాభిగమ్యమై । యీమును విన్నతీర్థముల కెక్కుడ చూపుచుఁ బౌండరీకమున్ ।
క్షౌమగుణాభిరామమనఁగా విసఁగాగనఁగాదగుం దగన్ ॥ ౧౫౧ ॥ సీ ॥ నిడువాలు
గనుచూపు నిగిడినచో నెల్ల బిత్తెండ రేయెండఁ బెడ్లియాడ । నిశ్శ్వాసపవనంబు నెలకొ
న్నచో నెల్ల ప్రామినుక నెత్తావులాముకవియఁ । బొక్కిటితమ్మిపుప్పొడి యొలుకుచో
నెల్ల బ్రహ్మాంకురంబులు పొదుకొనఁగ । నడుగులేఁజిగురాకులంటినచో నెల్ల వివిధతీర్థ
శ్రేణి వెల్లివాఱుచు । బగ్గా మణిబంధమా వేల్పుపచ్చవెదురు । గ్రచ్చకాయలతిత్తియుఁ
గంబుశక్తి । గలిగి విహరించుఁ బౌండరీకంబునందు । నందులేఁబట్టి పాలేయనగముప
ట్టి ॥ ౧౫౨ ॥ వ ॥ అఖిలతీర్థరాజంబగు నమ్మహాతీర్థంబునకు జముదిక్కున ధిక్కృ
తావిముక్తంబగు ముక్తకేశి తీర్థంబఖిలార్థప్రదంబై యుండు. మున్నట్లు వెన్నునివల
న దీర్ఘాపత్యంబును ముక్తిదాయిత్వంబునుం గాంచిన యమ్ముక్తకేశియు నచ్చోట
నచ్చవెన్నెలఁ దోఁచ్చెంబు చేసి యొసఁగు నిసుకదిన్నెలపైనున్నయది యట్లగుటఁ జేసి ॥
౧౫౩ ॥ క ॥ పులినోపరితలగతనా । తలఁదరిఁ శిథిలవసనధమ్మిల్లమహా । జ్జ్వల

---

ము ॥ ౧౪౮ ॥ కృతాంతదిశన్ — దక్షిణపుదిక్కునందు. వీతాతంకస్థితిన్ — పోయినభయముగల
యునికితో. భుజాంతరాళమణిసాధఁబు — బొమ్మనైడి రత్నాలకుడ ॥ ౧౪౯ ॥ ధూతాఘము
— తొలఁగింపఁబడిన పాపములుగలది. పొలుచున్ — కలవు; సంప్రయుక్తిన్ — కూడికతో. షష్టి —
అఱువది. కర్మఠంబు — కార్యమును నెఱవేర్చునది. ఏను — అయిదు. ప్రణుతి — పొగడ్త ॥ ౧౫౦ ॥
దశవ్యామవిశాలము — పదిబారలవిరివిగలది. అభిగమ్యము — పొందఁదగినది. క్షౌమ — నిర్మలమైన ॥
౧౫౧ ॥ వాలు — వాఁడియైన. బిత్తెండ — తీక్ష్ణమైనయెండ. రేయెండ — వెన్నెల. నెలకొన్న — నిలి
చిన — ఉన్న. ప్రామినుకనెత్తావులు — వేదవాసనలు. ఆముకవియన్ — ఆవరించుకొనఁగా. పొ
క్కిటితమ్మి — బొడ్డుతామర. ఒలుకు — చిందు. బ్రహ్మాంకురంబులు — బ్రహ్మలయొక్క మొలకలు.
వెల్లివాఱువన్ — ప్రవహింపఁగా ॥ ౧౫౨ ॥ జముదిక్కునన్ — దక్షిణదిక్కునందు. ధిక్కృతావి
ముక్తంబు — తిరస్కరింపఁబడిన కాశిగలది. ముక్తిదాయిత్వఁబు — మోక్షమునిచ్చుతనము తోఁచ్చెం
బు — తుచ్ఛముగా ॥ ౧౫౩ ॥ పులినోపరితలగతన్ — ఇసుకదిన్నెమీఁదనున్నదానిని. శిథిలవసన
ధమ్మిల్లన్ — వీడినవస్త్రమును కొప్పునుగలదానిని. నిశ్చలపదవిప్రదన్ — చలింపనిమార్గమునిచ్చుదా

కినో । దేవిచతుర్ముఖముఖులకుఁ దెలియఁగరాదీ । దైవతతీర్థక్షేత్రము । హావిర్భా
వము లుచింతితార్థప్రదముల్ ॥ ౧౬౧ ॥ ఉ ॥ ఈచరితంబువిన్నఁ బఠియించినవ్రాసినఁ
బుత్రపౌత్రలక్ష్మీచతురాంగనాదకవిశేషములిమ్మెయిఁ గాంచి నీఁదటన్ । జూచినయం
డ్రపా మునులు చూడనిచక్కనియిక్కనిక్క మో। మేచక మేఘసంసదుపమేయశిరో
జసరోజదృక్కృపన్ ॥ ౧౬౨ ॥ క ॥ అని శివుఁడు కుధరకన్యకు । వినిపించినయట్టిసరణి నీ ని
పించెమహా। మునులకు ననుపమితతపో। ధనులకుఁ గథ కుండుతత్త్రితయమేళనమున్ ॥
౧౬౩ ॥ క ॥ వినిపించినవిని శౌనక । మునిప్రముఖనిఖిలమునుల మోఘానందం। బున
మనములఁ దాల్చిరి నెల । కొను నిజతనుఫలకపులకకులకలనమునన్ ॥ ౧౬౪ ॥ క ॥ ఆశౌ
నకుండు పఠిమ బిలేశయతలిమోపధానలీలాలోల । స్వాశయుఁడు పరమపదబ।
ద్ధాశుఁడు నై రోమహర్షణాత్మజుఁ బలుకన్ ॥ ౧౬౫ ॥ చ ॥ దమనిధిః స్థలేశ్వరుఁడు దై
వతరత్నము భైమితీర్థర । త్నము నల పౌండరీకవసుధాతలమన్నది క్షేత్రరత్నమీ । త్రి
మణులు సూక్తిసూత్రవితతిం గుదిగ్రుచ్చితిమచ్ఛ్రవోవిధే । యమగుచు నసిక్కనక్షవల
యాకృతి నీకృతి యొప్పు నెప్పుడున్ ॥ ౧౬౬ ॥ క ॥ చతురభవదుక్తిముకుర । ప్రతి
ఫలదఖిలేశగుణపరంపర కలుషో । జ్ఝితమగునంతర్దృష్టిన్ । సతతము నీక్షింపఁ దనివి
సనదు మహాత్మా ॥ ౧౬౭ ॥ మ ॥ హరియాద్యండఖిలాండనాయకుఁడు నందాపత్య
మేలమ్యోఁద। చ్చరితం బెట్టిది రాధ యెవ్వతె తదిచ్ఛాకృత్తిమేరీతి శం । కరుదేహం
బున భైమి యెట్లొదవె శ్రీకాంతాంగజాతాత్మరో । త్కరమేమంత్రరహస్యమింత
యునువక్కాణింపుమాకింపుగన్ ॥ ౧౬౮ ॥ ఉ ॥ నావుడు సూతుఁ డిట్లని యె నారదమౌ
నికిఁ నున్న మేచక । గ్రీవుఁడు పుండరీకునిచరిత్రము జెప్పెఁ దదర్థవైభవం । బేవినిపింతు
వీరు వినుఁడిందలుసందియు మెల్లఁడిందల । క్ష్మీవిభుదివ్యలీల లఱచేతఁ గనందగు దీన

---

వాఁడు. చలపశ—అశ్వత్థముయొక్క ॥ ౧౬౦ ॥ ముఖులకున్—మొదలగువారికి. చింతితార్థప్ర
దములు—కోరినకోరికలనిచ్చునవి ॥ ౧౬౧ ॥ ఇమ్మెయిన్—ఈదేహమునందు—ఈజన్మమునందు.
చక్కనియిక్కన్—మంచిచోటును. మేచకమేఘసంసదుపమేయశిరోజ—నల్లమబ్బు. కూటువఉప
మేయముగాఁగలతలవెంట్రుకలుగలదానా. సరోజదృక్—విష్ణుదేవునియొక్క ॥ ౧౬౨ ॥ కుధర
కన్యకన్—పార్వతికి. సరణిన్—విధమును ॥ ౧౬౩ ॥ నిజతనుఫలకపులకకులకలనమునన్—
తమదేహములనెడిపలకలయందుగగుర్పాటుకూటమితోడికూడికతో ॥ ౧౬౪ ॥ బిలేశయతలిమోప
ధానలీలాలోలస్వాశయుఁడు—పాముపానుపుగనుదిండునుగాఁగల విష్ణుదేవునిలీలలయందు ఆసక్త
మయినతన మనసుగలవాఁడు ॥ ౧౬౫ ॥ దమనిధి—ఇంద్రియనిగ్రహమునకు ఉనికిపట్టయిన
వాఁడా. సూక్తిసూత్రవితతిన్—మంచిమాటలనెడి దారములచేత. గుదిగ్రుచ్చితి—గుత్తిగాకూ
ర్చితిని. మచ్ఛ్రవోవిధేయము— మాచెవులయందుపొందినది ॥ ౧౬౬ ॥ భవదుక్తి...కర. పర—నీ
మాటలనెడియద్దమునందులోఁచుచున్న సర్వేశ్వరునిగుణములవరుసలు. కలుషోజ్ఝితమున్—పాప
ముచేతతొలఁగింపఁబడినది. అంతర్దృష్టిన్—లోచూపుచేత. తనివిసనదు—తృప్తికాదు ॥ ౧౬౭ ॥
నందాపత్యము—నందునిబిడ్డ. వక్కాణింపుము—చెప్పుము ॥ ౧౬౮ ॥ మేచకగ్రీవుఁడు. శివుఁడు. డింపక

దీనుఁగన్ ॥౧౬౯॥ క॥ అనిసూతుఁడు వెండియు న। ర్జునసూతువిహారములు నిరూఢోక్తుల వి। న్ననువొప్పఁ జెప్పఁదొణఁగెన్। మునువేదవ్యాసువచనమున వినియానికిన్ ॥౧౭౦॥
చ॥ ధనపతిమిత్త్రుఁడట్లు ప్రమదాప్రమదార్థముగా నుపన్యసిం। చినవచనామృతంబు శ్రుతిసీమలఁ గాదిగి బోధభూజసే। చనమొనరించుటన్ సఫలసంభ్రములై సమయూరరాజవా। హనముగ మానుషాబ్ధిజలమానుఘనంబులలీల నేగఁగన్ ॥౧౭౧॥ సీ॥ జాలపాదమునంఘ్రి గిలితంబగు సితాబ్జముభాతిఁ గుంచెహస్తమునఁ గ్రాల। బిరుదంబుఁ బోఁగ మశ్రీశ్వరుశంఖమనఁ జాఁకితన్నామ ముఖరకంధరదనర్ప। రజతాద్రికూటగర్జత్కాళికాకృతి బృహదంసమున నిడ్డ మహతి పలుక। సిగిడిసుషుమ్నయూనినపిల్ల వెలుగులవడువున నెరసంజజడలు నిక్కఁ। దెగినచుక్క ధరణికి నేతెంచుకరణిఁ। దరణిజిత్ప్రభతో మేఘసరణిడిగ్గి। నందనీటళ తానందనందనుండు। మజ్జనంబాడి బాలేందుమౌళిఁ బాడి ॥౧౭౨॥ చ॥ తటపుటబిల్వభూరుహవితానలతానవపుష్పనిస్సృత। జ్జటిలమధూళిధూళిభవసౌరభమారభ్రమింపఁ జొచ్చెని। చ్చటవనదేవతోద్ధతకుచద్వితయశ్రితయక్షకర్దమ। చ్ఛటలఁ దటాలునన్ వెడలుసారవుఁదావులు ద్రోవలాఁగుచున్ ॥౧౭౩॥ తే॥ ఉచితనేపథ్యయుతలయ్యునురగసతులు। నిఘ్ననిజమౌళిమణిఘృణివిఘ్నలబ్ధి। నభికసంకేతములకు రేలరిగియరిగి। తిరుగుమొగమైన చిక్కుల తెరువులివిరి ॥౧౭౪॥ ఉ॥ వ్యాళకరాళకుంభములు ప్రచ్ఛటఁ గ్రుచ్చుటఁ బోలెఁ బద్భిము। త్యాలునఖాగ్రధారలకు నాభరణాచరణంబొనర్పనీ। శైలగుహాగృహస్థలులఁ జల్పెదు నిద్దురఁ గౌరగట్టురా। చూలివయాళివాహ్యరము సూడుకుఁబట్టు మహోగ్రసింహముల్ ॥౧౭౫॥ సీ॥ కాఁబో

---

—తీఁగా. దీనన్ — ఈచరిత్రమున వినుటచేత ॥౧౬౯॥ విన్ననువు — నేర్పు ॥౧౭౦॥ ప్రమదాప్రమదార్థముగాన్ — భార్యయొక్క సంతోషముకొఱకు. ఉపన్యసించిన — చెప్పిన. శ్రుతిసీమలఁగాన్ — చెవిమార్గములగుండ. బోధభూజసేచనము — జ్ఞానవృక్షముయొక్క తడుపుటను. సమయూరరాజవాహనముగన్ — కుమారస్వామితోఁగూడ. అను — త్రాగునట్టి ॥౧౭౧॥ జాలపాదము — హంస. కీలితము — కూర్పఁబడినది. ముఖర — మొరయుచున్న. కంధర — మెడ. కూట — శిఖరమునందు. గర్జత్కాళికాకృతిన్ — ఉఱుముచున్న నల్లమబ్బుల సమూహమువిధమున. బృహదంసము — పెద్దమూఁపు. ఎఱ్ఱసంజజెడలు — ఎఱ్ఱని సంధ్యారాగకాంతిగలజడలు. తరణిజిత్ప్రభతోన్ — సూర్యుని జయించునట్టి వెలుఁగుతో ॥౧౭౨॥ నిస్సృతత్ — పడుచున్న. జటిల — ధారారూపమైన. మధూళి — పూఁదేనెయొక్క. ధూళి — తుంపరలవలన. భవ — పుట్టిన. సౌరభము — పరిమళము. ఉద్ధత — నిక్కిన. యక్షకర్దమచ్ఛటలన్ — కర్పూరాదులతోఁ జేయఁబడిన కలపము తెగలచేత. ఆఁగుచున్ — అడ్డగించుచు ॥౧౭౩॥ నేపథ్యయుతలు — వస్త్రములు మొదలగు నలంకారములతోఁ గూడినవారు. నిఘ్న — స్వాధీనమైయుండెడి. నిజమౌళి — తమతలలయందలి. మణిఘృణివిఘ్నలబ్ధిన్ — రత్నకాంతులవలని విఘ్నము కలుగుటచేత. అభిక — కాముకులయొక్క. తెరువులు — మార్గములు ॥౧౭౪॥ వ్యాళకరాళకుంభములు — దుష్టగజములయొక్క విశాలములయిన కుంభస్థలములను. ప్రచ్ఛట — భేదించుట. నఖాగ్రధారలకున్ — గోటికొనలమొనలకు. గట్టురా... మహోగ్రసింహములు — పార్వతీదేవియొక్క విహారమునకుఁ దగిన వాహనమగు సింహములో పరో

లునివిగణగ్రామణికల్పితానల్పవిహారగేహాంగణములు। కాఁబోలునివిచరత్ఖచరచా
రుస్త్రీసమ్మర్దగళితభూషాస్రజములు। కాఁబోలునివిదతుకన్యాంఘ్రివిన్యాసధన్యాస
కృతకేళిమాన్యగుహలు। కాఁబోలునివిమోదకప్రియప్రబలదంతప్రాసనిర్భిన్నధాతు
ఖనులు। తెలియఁగాఁబోలునివివహ్నితిలకచలక। పర్దనిర్ఘోషసురసరిద్బహుళలహరి।
గహనకుసుమాయమానశీకరనిపాత। శీతలక్ష్మాతలోత్థద్రుమపోతకములు॥౧౭౬॥ తే॥
రాజతాహార్యగోరాజరాజమునకుఁ। జంద్రశేఖరవరకకుచ్చారుపురము। నీమహాసిం
ధువుపకంఠసీమనిగిడి। డాలుదీపించెనిదెగంగడోలుఁబోలె॥౧౭౭॥ ఉ॥ ఈపృథివీధ
రంబుననిభేంద్రకటోదితదానధారలై। ద్వీపవతీతరంగతటవిస్ఫుటశైవలకందళంబు
లై। తాపసబాలికాశ్రవణదత్తయవాంకురభూషణంబులై। రేపుదమంబు సేయు
శబరీకబరీనిబిరీసనీలిమల్॥౧౭౮॥ క॥ ఇటులనుచుఁద్రోచిచనిముం। దటమునిఁగ
నుఁగొని యెవేల్పుదళములుఁ గొలువన్। ఘటవటుకప్రముఖమహా। జటిలులతో వచ్చు
నా భుజగభుగ్వాహున్॥౧౭౯॥ మ॥ కనియేకారణమేగుదెంచిరొకొ యీకామా
ధరుఁడీమునుల్। కనఁజిత్రంబగుఁగంటికంటిస్వకృతసాంద్రోక్తియం దావహిల్లి
నసందేహముఁ దంత్రిచేఁ దెలియుహాళిన్వీరిఁ దోకొంచుఁ గ్రాం। చనగోద్బోధియువ
చ్చెనిట్లగుటకున్ శంకింపనింకేటికిన్॥౧౮౦॥ క॥ శరవణభవయుతులగునీ। పరమ
మునులు శ్రోతలఁట యపారప్రజ్ఞా। కరుఁడు నిశాకరశిశుశే। ఖరుఁడు హరుఁడు వక్త
యఁట యగమ్యమ్ము గలదే॥౧౮౧॥ తే॥ అతిరహస్యంబు శుద్ధంబు నాజవంజ। వా
ర్తిహారణంబునగు నెద్దియడిగెనొకొ। కొడుకు సర్వజ్ఞువిజ్ఞానకుశలుధర్మ। వర్మనిర్ణ

---

థింపఁదగిన భయంకరములయిన సింహములు ॥౧౭౫॥ గణగ్రామణి — గణాధిపతి. అంగణములు —
ముంగిళ్లు. చర... స్రజములు — సంచరించుచున్న గంధర్వస్త్రీలరాయిడివలన రాలిన అలంకారము
లైన హారములు. నతుకన్యా...గుహలు — పార్వతిదేవి అడుగులు పెట్టుటచేత కృతార్థములగు ఒకానొ
కప్పుడు క్రీడించెడి శ్లాఘ్యములయిన గుహలు. మోదక ... ఖనులు — వినాయకునియొక్క మిక్కిలి
బలముగల దంతములనెడి యీఁటెలచేత భేదింపఁబడిన మణిశిల మొదలగువానిగనులు. వహ్నితిలక...
కములు — శివునియొక్క కదలుచున్న జడముడియందలి దోషములేనిదైన గంగయొక్క మిక్కుట
మైన ప్రవాహమునందలి అడవిలోనిపువ్వులవలెఁ దోఁచుచున్న తుంపరలు పడుటచేత చల్లనైన నేల
యందుఁ బుట్టినచిఱుచెట్లు ॥౧౭౬॥ కకుత్ — ఎద్దుమూఁపురము. సింధువు — ఏఱు. ఉపకంఠసీ
మన్ — సమీపప్రదేశమునందు. గంగడోలు — ఎద్దుమెడక్రింద వ్రేలాడెడుతోలు ॥౧౭౭॥
ఇభేంద్రకటోదితదానధారలు — శ్రేష్ఠములైన యేనుఁగులయొక్క చెక్కిళ్లయందుఁ బుట్టినమదపునీ
టి ధారలు. ద్వీపవతి — ఏఱు. విస్ఫుట — ప్రకాశించునట్టి. శైవలకందళంబులు — పాచిమొలకలు. శ్ర
వణదత్త — చెవులయందుఁ బెట్టఁబడిన. రేపు — రేపటివేళ. శబరీకబరీనిబిరీసనీలిమలు — బోయపడు
చులకొప్పులవలని మిక్కుటమైన నల్లఁదనములు ॥౧౭౮॥ త్రోచి — మించి. ఘటవటుక —
అగస్త్యుఁడు. జటిలులతోన్ — జడలుదాల్చినమునులతో ॥౧౭౯॥ కామాధరుఁడు — కుమార
స్వామి. హాళిన్ — ఆసక్తిచేత ॥౧౮౦॥ శ్రోతలు — వినువారు. వక్త — చెప్పువాఁడు. అగమ్య
ము — తెలియరానిది ॥౧౮౧॥ ఆజవంజవార్తిహారణంబు — సంసారదుఃఖమును మాన్పునది. వాజ్ఞ

యవాఙ్మయమహితుఁ దంఘ్రి ॥౧౮౨॥ మ॥ మనువుల్ బ్రకృతిం దమంబు నురజం
బుల్ సత్వముల్ సాఁగనం। గనిరి పాదులు దామసాత్మకులు మర్త్యుల్ రాజసుల్ సా
త్త్వికుల్ । దనుజద్వేషణులందుఁ బూజ్యులని తాంత ఖ్యాతి నాజానుజుల్ । ఘనుఁ డం
దింద్రుఁ డుపేంద్రుఁ డీశుఁ డమరుల్ గా రెవ్వరుం దత్సముల్ ॥౧౮౩॥ ఉ॥ దక్షిణ
విష్ణుభక్తియు దృఢంపువిరక్తియుఁ గల్గునమ్మరు । ద్భుక్కటకున్ భజించుమతి పుట్టక
కంపలబడ్డకాకినై । యకటా మోసపోయితిఁ గదా పెనుద్రిమ్మట నెంతవారికిన్ । జి
క్కునె ముఖ్యసౌఖ్యము విశిష్టజనంబుల సఖ్యమందమిన్ ॥౧౮౪॥ స్రగ్ధర॥ వినంగా
నిమ్మునిస్మీ యతిగురుఁడు విడం డాప్తభృత్యుండు గాస । న్నా(స)నాధీనుఁడు గా వైష్ణవసు
ఖుఁడు గా మత్కృపాపాత్రభూతుం। డౌన చుఁ బ్రోచి గోప్యంబగునది తెలుపన్
బ్రార్థితుండై మురారి। ధ్యానానూనాశయుల్ తుల్యదృశులు దమశిష్యాలి భావింతు
రెందున్ ॥౧౮౫॥ క॥ కావున శరణము వేఁడెద । నా వైష్ణవసార్వభౌము నడిగె
దనారున్ । గావలసినయర్థము లా । దేవుఁడు నుడువు తేటతెల్లము గాఁగన్ ॥
౧౮౬॥ క॥ అనినిశ్చలతరనిశ్చయ । మున నారదుఁ డరిగె సురసమూహావాసం । బు
నకు గైలాసమునకు । ననుబింబిత శాంభవాట్టహాసంబునకున్ ॥౧౮౭॥ సీ॥ నగధన్వి
వాహనంబగు గోవృషములకై లసఁ బొల్చుసుంటా మహోక్షణములు। హరశిరశ్శశిరే
ఖ యుపరావతారంబు లనఁ బొల్చు నేవాగతాబ్జముఖులు । కాద్రవేయాకల్ప కంఠ
మూలచ్ఛాయలనఁ బొల్చు నగరుధూపాయతంబు । లీశానభూషణాహిస్ఫటావణి
కాంతు లనఁ బొల్చు రత్నదీపాంకురములు । ఖండపరశుతనుప్రభాఖండదుగ్ధ । జలధి
జలశీకరములనఁ బొలుచు వేల్పు । టేకికలు చల్లుపూవు దోయిళ్లుగలుగు। నగము ముని
ముఖ్యునకుఁ దృగానందమొసఁగె ॥౧౮౮॥ సీ॥ ఆకొండనెత్తాన హైమసాలావళీ వేల్లి
తంబగు బలువీడు గాంచె । నావీటి నడుచక్కినభిరామశుభవిభాధగధగాయిత మొ
కనగరు గాంచె । నామహాప్రాసాదమల్లనల్లన డాసి వాకిట నొకకేశవదనుఁ గాంచె।

---

యమహితుక్—మాటలయొక్క మహిమగలవాఁనిని ॥ ౧౮౨ ॥ ౧౮౩ ॥ మరుద్భుక్కటకున్—
సర్పభరణములుగలశివుని. భజించుమతి—కొలుచునట్టిబుద్ధి. ద్రిమ్మటన్—త్రిప్పటచేత ॥ ౧౮౪॥
యతిగురుఁడు—యతులకు ఆచార్యుఁడు. సన్నానాధీనుండు—సన్మానించుటకుఁ దగినవాఁడు. పాత్ర
భూతుఁడు—పాత్రమైనవాఁడు. గోప్యంబు—రహస్యము. మురారిధ్యానానూనాశయులు—విష్ణు
ధ్యానమునందు తక్కువపడని మనసులుగలవారు. తుల్యదృశులు—సమదృష్టిగలవారు ॥ ౧౮౫॥
తేటతెల్లము—మిక్కిలిస్పష్టము ॥ ౧౮౬ ॥ నిశ్చలతర—మిక్కిలి చలనములేని. అనుబింబిత—మా
రు మొరయుచున్న. శాంభవ—శివునిదైన ॥౧౮౭। నగధన్వి—కొండధనుస్సుగాఁగలవాఁడైన శివు
నియొక్క. మహోక్షణములు—గొప్పఋషభములు. కాద్రవేయాకల్ప — సర్పభూషణములుగల శివుని
యొక్క. స్ఫటామణి—పడగలయందలి మణులయొక్క. దుగ్ధజలధి — పాలసముద్రమునందలి. వేల్పు
టేకికలు—దేవతాప్రభువులు. దృక్—చూపులకు ॥ ౧౮౮ ॥ నెత్తానన్—విశాలమైన సమప్రదేశ
మునందు హైమసాలావళీవేల్లితంబు—బంగారుప్రాకారములపజ్క్తులచేత ప్రకాశించునది. బలువీ
డు—పెద్దపట్టణము. చక్కిన్—స్థానమునందు. ఆమహాప్రాసాదము—ఆగొప్పనగరు. కేశవదనున్

ాకపిలపనుచేననుమతుండై చొచ్చి చనియొక్కరుఁడు త్యాలదవికఁ గాంచె । సందుఃవిధు
కాంత వేదికాభ్యంతరమున । ద్వీపిచర్మోపరిస్థలదీపితాకృతి । కోటిఃభమైనయొకని
రాఘూటనిరఘు । నిరుపమప్రభఁ గాంచెనిర్నిమిషదృష్టి ॥ ౧౪౯ ॥ ఉ ॥ కాంచి విరిం
చినందనుఁడు కన్నులుబిమ్మిటినొందడిందియొ । కిరుంచుకకొంకుకేతికనియొందదుద
గ్రమహాప్రదీప్తిలోఁ । బంచముఖున్ శిఖిక్షణవిభాసిలలాటుసురుజ్ఝరీధరున్ ।సం
చితసత్కృపారసవశంవదునాదికపిన్ వృషాకపిన్ ॥ ౧౫౦ ॥ చ ॥ విడువసివైర
వృత్తిఁదటివేచిరతీశుఁడుచేఃకత్తినె। కుఱుమరభసంబునన్ శిరసుగ్రద్దిన నయ్యాలుఁగొ
డ్గబోయిలో । నడఁగబహిస్థతత్సరుపథార్పితసూకరదంష్ట్రికైకడిన్ । జడముడిఁ
జంద్రరేఖవెదచల్లఁగఁజల్లనిచిన్నివెన్నెలల్ ॥ ౧౫౧ ॥ ఉ ॥ కుంకుమ పంకశోణయ
సకొండలమండలనాధుపట్టివా । యోంకముదాకొనన్ ఘణఘణారవ ఘూర్ణికపాల
మాలికా । లంకృతులోంకృతల్ నొడువులాగడరన్ దటవిద్రుమద్రుమ । క్రేంకృతి
కారిసారసపరీతసుధానిధిరీతిఁగ్రాలుచున్ ॥ ౧౫౨ ॥ చ ॥ ఉమ పసుపాడి మోముత
ుయొత్తిఁహత్తిన తన్నిశాంకదృ । క్కులదశాంజనాంకకులకంబుగనిమ్మగుచేలఁ
గేళివి । భ్రమరతిఁగప్పినాఁడనఁగఁబచ్చనినల్లనిచాలలన్ వనో । రమమగుద్వీపిరా
ాజినరత్నముయన్నమమీఁదాల్చుచున్ ॥ ౧౫౩ ॥ ఉ ॥ దండనమస్క్రియాభిరతి
ఖండముల్లై బలభిన్ముఖామరుల్ । తండ్రు సువర్ణదండముఖ తాడనభిన్నకిరీటులయ్యు

---

—కోఁతిమొగముగలవానిని. కపిలపనుచేన్—కోఁతిమొగమువానిచేత. అనుమతుఁడు—అంగీకరిం
పఁబడినవాఁడు. విధుకాంతవేదికాభ్యంతరమునన్—చంద్రకాంతపురాళ్ళ అరుఁగునడుమ.
ద్వీపి—పెద్దపులి. నిరాఘూటనిరఘునిరుపమప్రభన్—మేరలేనిదియుదోషములేనిదియు ఈడులేనిది
యునైనప్రకాశమును. నిర్నిమిషదృష్టిన్—రెప్పపాటులేనిచూపుతో ॥ ౧౪౯ ॥ బిమ్మిటి—సంకో
చము. డింది—పరవశత్వమునొందినవాఁడై. కొంకు—సంకోచము. శిఖీక్షణవిభాసిలలాటున్—నిప్పు
ంటిచేతప్రకాశించెడినొసలుగలవానిని. సురుజ్ఝరీధరున్—దేవనదినిధరించినవానిని. ఆదికపిన్
—ప్రధానదైవమైనవానిని. వృషాకపిన్—శివుని ॥ ౧౫౦ ॥ తటివేచి—సమయముకనిపెట్టి.
రభసంబునన్—వేగిరపాటుతో. బహిస్థతత్సరుపథార్పితసూకరదంష్ట్రి—బయటనుండెడిదానిపిడి
కొలియందుంచబడినపందికోఱ. వెదచల్లఁగన్—వ్యాపింపఁజేయఁగా. (దీనికికర్మపదము వెన్నెల
ను)॥౧౫౧॥ కుంకుమపంకశోణ—కుంకుమపువ్వుకలపముచే ఎఱ్ఱనైనది. కొండలమండలనాధు
పట్టి—పార్వతి. డాకొనన్—చేరఁగా. ఓంకృతులు—ఓంకారములు. నొడువులాగు—చెప్పునట్టివి
ధము. అడరన్—అతిశయింపఁగా. క్రేంకృతికారి—క్రేంకారముచేయునది—క్రేంఅనిధ్వనించు
నది. సారసపరీత—తామరలచేతచుట్టఁబడిన. సుధానిధిరీతిన్—చంద్రునివిధమున ॥ ౧౫౨ ॥
ఉమ—పార్వతి. పసుపాడి—పసుపుపూసికొనిస్నానముచేసి. హత్తిన—అంటిన. తన్నిశాంకదృక్కు
లదశాంజనాంకకులకంబుగన్—ఆపసుపుగుఱుతులో డితామరలవంటికన్నులయందలి కాటుకగు
ఱుతులకుమేలిమిగా. చేలన్—వస్త్రమును. విభ్రమరతిన్—విలాసేచ్ఛచేత. ద్వీపిరాడజినరత్నము—
శ్రేష్ఠమైనపెద్దపులితోలు॥౧౫౩ ॥ దండనమస్క్రియాభిరతిన్—కఱ్ఱవలెసాగిలఁబడిమ్రొక్కుట
యందలియాసక్తిచేత. దండములై—గుంపులై. బలభిన్ముఖామరులు—ఇంద్రుఁడుమొదలగు దేవత

శాక్ । పండినసస్యంబునన్ మిగుల సందడిసేయుచుఁ జొచ్చి రాగృహం । బుండినసింహపుంజూ
పుఁడయి బర్వఁగ వారలఁ గారవించుచున్ ॥ ౧౯౪ ॥ తే ॥ చరణపీఠోపకంఠనిషణ్ణ
వృషభ । రాజకకుదర్పితాంఘ్రిసరోజుఁడగుచు । నిందుకొలువున్న దేవతామండ
లేశు । శివుఁ డగ్గలిక మ్రొక్కె యోగీశ్వరుండు ॥ ౧౯౫ ॥ క ॥ కసదధరకాంతిపల్లవ । ముసుద
శనద్యుతిలతాంతమును గా వాక్సూ । జనమొనరించెఁ బురారికి । దనివిసనకమానికల
వశంసుఁడు వేడ్కన్ ॥ ౧౯౬ ॥ తే ॥ కాళరాత్రి నుండగు నీకుఁ గడిఁది తమము । పుండ
రీకాక్షుఁడగు నీకు ఘోరరజము । సత్త్వపాంథోధి యగు నీకు సత్త్వభృతియు । ననుగు
ణంబులు మూర్తిత్రయైకనిలయ ॥ ౧౯౭ ॥ ఉ ॥ వేదవివాదగోష్ఠిబడి వృద్ధుల బుద్ధులఁ
గొల్పవచ్చు శ్రీ । గాదిలి నైన మెలంగఁగల కాలము గ్రాలఁగవచ్చు నిచ్చలుం । బ్రోదిడుమన
వ్యభవ్యసుఖముల్ మఖమాల్యములొందవచ్చుఁగా । కేదారకేటికిం దొరకునే వృషివా
గ్నులనానఁ బెట్టుటన్ ॥ ౧౯౮ ॥ క ॥ అని పలుకు సిద్ధసంయమిఁ । గనుఁగొని కృప
మీఱ నీలకంఠుఁడు రారా । మ్మని కూర్చుండు మటంచుఁ దగ । ననుజ్ఞ గావించె సాంద్రా
ధరుఁడై ॥ ౧౯౯ ॥ క ॥ కలహాశనముని చెన్నగు । నలికేక్షణు సవిధవసుధ నాసీనుండై ।
వలిమల పురోధరిత్రిన్ । మొలచిన ప్రత్యంతకుధరమునకుఁ దరంబై ॥ ౨౦౦ ॥ చ ॥ హ
మ్మపని ట్లుగన్గొని తదాననదత్తసరీక్షణాబ్జుఁడై । సురముని పలుకున్ పురశిషూదన నీ
యనుజీవినేను మీఁ । దగ యకే మోసపోయితి గుహాశ్రితులైన మునుల్ద్ధి వేదసు । స్థిరమని
మీరు తత్త్వము సెప్పెదు చోనిట నుండఁగల్గమిన్ ॥ ౨౦౧ ॥ తే ॥ సాధుజనులతోడి సం
సర్గమురిపిన । హానిభయము క్లేశమావహిల్లు । నెంతవారికైన నిది సిక్కమను మాట ।
నన్ను మోచివచ్చె నాగపతిర ॥ ౨౦౨ ॥ తే ॥ దండితానంగ నీదండ నుండియుండి ।
యిప్పుడనేఁ జన్న నింతలో ఋషులు వచ్చి । వెద్ది ప్రార్థించిరో మీర లేవిధమున । నుత్త
రం బిచ్చితిరో వారియుక్తులకును ॥ ౨౦౩ ॥ క ॥ కాలిఁ చవడఁ జరింపుదు । నీలోకము

---

బు. పండిన = ఫలించిన. పర్వఁగన్ = వ్యాపింపఁగా ॥ ౧౯౪ ॥ చరణ...సరోజుఁడు = పాదపీఠము
నకు సమీపమందుండెడి నందియొక్క మూఁపురమున నుంపఁబడిన పాదకమలములుగలవాఁడు ॥
౧౯౫ ॥ కసత్ = ప్రకాశించుచున్న. దశనద్యుతిలతాంతము = పండ్లకాంతియనెడి పువ్వులుగలది.
వాక్పూజనము = మాటలచేతఁ బూజించుట ॥ ౧౯౬ ॥ కడిఁది = అసాధ్యమయిన. తమము = చీఁక
టి; తమోగుణము. రజము = పుప్పొడి; రజోగుణము. సత్త్వభృతి = బలమును దాల్చుట; సత్త్వగుణ
మును దాల్చుట. అనుగుణంబులు = యుక్తములు ॥ ౧౯౭ ॥ గాదిలి = ప్రియము. నిచ్చలున్ =
నిత్యమును. ప్రోదిడు = వృద్ధిపొందించునట్టి. మఖమాల్యములు = యజ్ఞము వెలఁగాఁగలని ॥ ౧౯౮ ॥
సిద్ధసంయమిన్ = నారదముని ॥ ౧౯౯ ॥ అలికేక్షణు = శివునియొక్క. సవిధ = సమీపమునందలి.
వలిమలపురోధరిత్రిన్ = మంచుకొండయొక్క ముందరిప్రదేశమునందు. ప్రత్యంతకుధరమునకున్ =
దగ్గఱనుండు చిన్నకొండతోడ. తరంబై = పోల్పఁదగినదై ॥ ౨౦౦ ॥ తదాననదత్తసరీక్షణాబ్జుఁడు
= ఆతనిముఖమునందుంచఁబడిన చూపులనెడి కమలములుగలవాఁడు. అనుజీవిన్ = అనుసరించి బ్ర
తుకువాఁడను ॥ ౨౦౧ ॥ సంసర్గము = కూడిక. ఉరివినన్ = విడిచినను. మోచి = వహించుకొని ॥
౨౦౨ ॥ దండన్ = సమీపమునందు ॥ ౨౦౩ ॥ ఈఁచవడన్ = నిస్సత్త్వమును పొందఁగా. పొలుపు

నందునెల్లనీహితబోధ । శ్రీలాభబుద్ధి నెవ్వరుఁ । బోలరు తత్త్వంబుఁ దెలుపఁ బోలుదు
ననిన్నున్ ॥ ౨౦౪ ॥ ఉ॥ కావునఁ గ్రౌంచభేదియు నగస్త్యుఁడు దక్క మునుల్ శ్రీలా
కర । భావశబుద్ధి విన్నడిగి కాంచినయర్థములాన తిచ్చినన్ । బ్రోవఁగఁ బాడి యట్లగు
టఁ బోష్యులు శిష్యులునైనవారలన్ । దేవరవంటివారలఁ దదీర్చి కృపారసవృష్టిఁ దేల్ప
రే ॥౧౦౫॥ క॥ అనిపలికి యూరకుండిన । మునిముఖ్యుని వినయవాక్యములకలరి వసం
బున గృష్ణుని లిపిపురము । ర్దనుఁ డిట్లనుఁ జతక్ర-థాకథనలాలసుఁడై ॥౨౦౬॥ చ॥ వినుముని
నాథ నన్ ఋషులు వేఁడిన యర్థము బోధతీర్థము । త్యనఘము సంతపుణ్యఫలదానని దాన
మానిశ్వరంబు వి । శ్వనుతము దీని పెంపు గనఁ జాలరు తక్కినవారలెవ్వరుం । దను
జనిఘప్రసాదజనితప్రతిభానిధి నేనుదక్కఁగన్ ॥ ౨౦౭॥ సీ॥ తరిద్రాడుసీద్రంపు
బారలంటి గాలిచే జడియు చందముననంచలు భ్రమింప । సురలు బంతులుసాగి సుధమిథ
స్స్పృహఁ ద్రాగు తీంద్రఁ దేటులుపూవు దేనెలాన । నామహావిషమాను నాపూర్తు
లనజంబుఫలము లందెల్లచిలుకలు భుజింప । నాశ్రితాభ్రములభ్రమతిని గూఁకలు వెట్టు
క్రీగమయూరంబులు కెరలి పలుక । నబ్ధిమథియింప నొక్కట నవతరిల్లు । నాటిసిరివా
ల్పుబాద్పు ననపవర్తు । లక్ష్మిఁ దిలకింప మదికెనుల్లసనమొసఁగు । మందరంబునము
న్నేను మయుఁ గూడి ॥ ౨౦౮ ॥ ఉ ॥ లాలితలీలనైందవశిలాస్థలి నాస్థలి గుర్వగ్రా
లుచో । నాలలితాంగిఁ జూచి వినుమద్రిజ నామదిఁ గూలముద్రుజం । బైలలి నిత్వే సేదగు
విసారము తోరముగాఁగ వేడుమి । వ్వేళవరంబులిత్తుని దవేళ మనా విని దేవియిట్లనున్ ॥
౨౦౯ ॥ ఉ ॥ సేవక కల్పభూరుహము శిష్టసుధాంబుధిభక్తరోహిణ । గ్రావముజీ
వముఖ్యుఁడనఁగాఁ దగు వేలుపనల్పరక్తిని । సేవకురాలికిట్లు దయచేసినయావరమిప్ప
డొల్లనేఁ । గావలెనన్ను నాడనఁగఁ గాఁదగు నాదగు విన్నపంబునన్ ॥౨౧౦॥ క ॥ అని
పలికి కొంతకాలము । చననేఁడు పవనవిహారసమయమునందున్ । మునునాకడ సన్న
పరము । కొని వేఁడెఁ గుమారజనని గురుతత్త్వనిధీ ॥ ౨౧౧ ॥ సీ ॥ కాశి గుహాటవి గ
యకురుక్షేత్రంబు సైంధవంబును నైమిశంబుపుష్క । రంబును దండకారణ్యంబు చంప
కారణ్యంబు గాంచనారణ్యకంబు । కేదారము ను మహాక్షేత్రంబు గంగయమున సరస్వతి

---

నన్ = విధముచేత ॥ ౨౦౪ ॥ అలఁతి = శ్రమము ॥ ౨౦౫ ॥ లాలసుఁడు = మిక్కిలియాసక్తిగలవాఁడు ॥ ౨౦౬ ॥ అనశ్వరంబు = చెడనిది ॥ ౨౦౭ ॥ తరిద్రాడు = తరుచునట్టత్రాడైన. సీద్రంపుఁబారలు = పాముయొక్క కుబుసములు. జడియు = చలించు. అంచలు = హంసలు. మిథస్స్పృహన్ = అన్యోన్యము ఆసక్తిచేత. తీంద్రన్ = చొరవతో. కూఁకలు = కూఁతలు. కెరలి = విజృంభించి. మథియింపన్ = తరుచఁగా. ఒక్కటన్ = ఒక్కసారిగా. తిలకింపన్ = ప్రకాశింపఁగా. ఉల్లసనము = ఉల్లాసము ॥ ౨౦౮ ॥ ఐందవశిలాస్థలిన్ = చంద్రకాంతపురాళ్ళనేలయందు. అస్థలు = కోరికలు. కూలముద్రుజంబు = గట్టునొరయునది — మిక్కుటమయినది. లలిన్ = ఒప్పిదముగా. తోరము = అధికము. వైళము = శీఘ్రముగానే ॥ ౨౦౯ ॥ రోహిణగ్రావము = రత్నపర్వతము. అనల్పరక్తిన్ = పెం-
చైచ్ఛరయనురాగముతో ॥ ౨౧౦ ॥ చనన్ = కడచఁగా ॥ ౨౧౧ ॥ వేసవేలు = అనేకములు. వై-

గూడి మునసి మెలఁగు । నెలవును మొదలు గాఁగల క్షేత్రములు వేన వేలుర్విఁ బొగడొం
దుపీనిలోనఁ । గాఫురము సేయఁ గొన్నిటఁ గలుగు మేలు । మహిమ గొన్నిటఁ జేకురు
నైదొఱంగ । నిట్టి క్షేత్రంబులకు నెక్కుడెద్ది యెద్ది । గనఁబరం బిచ్చునే క్షేత్రమునికినీ
కు॥ ౨౧౨॥ సీ॥ సిరజగర్భుండు నీవు నింద్రుండు భాస్కరుండు చంద్రుఁడు బృహస్పతియు ద
త్తు । ముఖ్యప్రజేశ సమూహంబు మన్వాది చక్రవర్తులు మునుల్ సాధ్యసిద్ధ । మనుజ
ము ఖోరగ దనుజ సరీసృప పశు కీట మృగ పక్షి పరికరంబు । స్థావర జంగమాత్మకమ
గు భౌతికంబెవ్వని చేఁ బుట్టు నెవ్వని కృప । నిలుచు నెవ్వనికి నుక చేవి లయ మొందు । నమ్మ
హాశక్తి సంపన్నుఁ డమ్మహాత్ముఁ । డమ్మహానందుఁడెచ్చోట నధివసించు । నెట్టివాఁడ
మ్మహాపుష్పదంతుఁడిందుమకుట ॥ ౨౧౩ ॥ క ॥ గంగాదితీర్థమహిమను । హింగాదనుతీ
ర్థమెద్దియు సుస్వాదు సదా । సంగతి నెచ్చో నుండున । నంగాహిత దీని నెఱిఁగి యానతియీ
వే॥ ౨౧౪ ॥ మ ॥ అని దాక్షాయణి వేఁడ నుత్తరము నెయ్యంబొప్ప నీ నున్నయం । తనగ
స్వాములు గోల్వ వచ్చి శిఖి పుత్రుండంబొల్చి సేనానియే । ననుపక్ష స్కాంద పురాణమమ్ము
నాలన్ వ్యాఖ్యానమున్ జేయమున్ । చని వారల్ శ్రుత తీర్థులై యదియు కాంక్షన్ వేఁ
డఁ దాఁగానమిన్॥ ౨౧౫ ॥ తే ॥ వచ్చి శ్రీక్షేత్ర తీర్థదైవత చరిత్ర । మస్మ ఖంబున
మౌని సమన్వితముగ । నెఱిఁగి వారలు దానిప్పుడిట్లు నారిగ । నంతసీ నేగుదెంచితి వజత
నూజ ॥ ౨౧౬ ॥ ఉ ॥ నా విని శంకరుం బలుకు నారదుఁడో మదనారి భార్గికా । ర్యావ
హ బుద్ధిఁ బో లె భువనాళిని హాళిఁ జరింతు భ్రాంతియన్ । కావిరి వావిరిం దగిలి కాళుల ధా
వతియ య్యె క్షేత్రమున్ । దేవుఁడు దీర్ఘ మొక్కఁడ దీవ్రతర ప్రభ సిల్లు చేఁగనన్॥ ౨౧౭॥
తే ॥ క్షేత్ర దైవత తీర్థ చారిత్ర మెవ్వఁడు । గరళకంధరయొక్క చోటఁ గలసి యునికి । యా
నతి మొసంగి నన్నుఁ గృతార్థు జేయు । మనఁ దనఁ గలహాశుఁ బలుకు నమ్మనసిజారి॥ ౨౧౮॥
చ ॥ తనమది వల్చు భామినికి దక్కను నిక్కపు మోహిఁ బోలెనే । మనుజుండు బుద్ధి నిల్పు
మురమర్దను దివ్యకథాను బుద్ధినై । యనిశము మక్కియుండ తఁడ యిట్లగుటన్ వినిపిం
తు నీకు నేఁ । గనివిని యున్న గోప్యము నగమ్యమునై నయధః ప్రపంచమున్॥ ౨౧౯ ॥ ఉ॥
ఈ సముదగ్రతత్వపదమే నొక రుండ నెఱుంగుదున్ నరో । జాసనుఁ డొక్కరుండెఱుఁ
గు నద్రిజనూజ యొక్కర్తె యుంగున । వ్యాసవుఁడొక్కరుండెఱుఁగు వాఙ్మను భోగిపతా

---

హము. తొఱంగన్ = విడువఁగా. పరంబు = మోక్షము ॥ ౨౧౨॥ భౌతికంబు = భూతసమూహము.
కినుక చేన్ = కోపము చేత. అధివసించున్ = ఉండును ॥ ౨౧౩ ॥ సంగతిన్ = చేరికతో. అనంగాహి
త = మన్మథునికి శత్రువైన శివుఁడా ॥ ౨౧౪॥ నెయ్యంబు = స్నేహము. శిఖి = నెమలి ॥ ౨౧౫ ॥ ౨౧౬॥
భువనాళిన్ = లోకపఙ్క్తియందు — అన్ని లోకములందును హాళిన్ = ఆసక్తితో. కావిరి = నలుపు
— దిక్కటి వావిరిన్ = క్రమముతో. ధావతి = త్రిప్పట ॥ ౨౧౭ ॥ కలహాశన్ = నారదుని. మనసి
జారి = శివుఁడు ॥ ౨౧౮॥ వల్చు = కోరు మోహి = మచ్చిక గలవాఁడు. అనుబంధి = సంబంధము గల
వాఁడు. అనిశము = ఎల్లప్పుడు. అగమ్యము = దుర్గ్రాహము. అధఃప్రపంచమున్ = కడచిన సమాచార
ము ॥ ౨౧౯॥ అబ్ధిజను = లక్ష్మీదేవి. వాఙ్మను భోగిపతాత్మజ్ఞులు = సరస్వతి మనువు ఆదిశేషుఁడు గ

ష్ట్యలాత్మఁ బ్రా। గ్వాసనమైనెఱుంగుదురుగాని తదన్యులెఱుంగనేర్వరుఁ ॥ ౨౨౦ ॥
తే ॥ డాఁపఁదగువానిమిక్కిలిఁ డాఁపఁగలిగి। క్షేత్రములకెల్లఁ బరమమైకీర్తి వడయు।
నిమ్మహాక్షేత్రరాజంబు నెఱుఁగఁజాలు। ప్రాజ్ఞుఁడగువాఁడు మనుఁగఁడు పాపజల
ధి ॥ ౨౨౧ ॥ క ॥ పుడమికి వితస్తిమాత్రపుఁ। బొడవున నా క్షేత్రరాజము విరాజి
ల్లుఁ। నడుమన జ్యోతిర్యానము। వడువునఁ దేజోమయాభివర్ణితమూర్తిఁ ॥ ౨౨౨ ॥
క ॥ ఆ క్షేత్రమునకు సురస। ద్మక్షితిపాతాళముల సమంబై బుధలో। కక్షేమంకరమ
గునది। యే క్షేత్రముఁ గాక యుండు నిద్ధవిభూతిఁ ॥ ౨౨౩ ॥ క ॥ ఏవంవిధబహుమ
హిమై। కావాసంబైన యమ్మహాక్షేత్రమునం। దేవసియింపుదు వినువసు। దేవసుతా
ర్చ్యావిధేయధీయోగములఁ ॥ ౨౨౪ ॥ సీ ॥ సహ్యపాదోద్భూతసరిదన్వయమునకు
నేను ధాతయును లక్ష్మీశ్వరుండు। నభిమానులము గాన నందుఁ గృష్ణుఁడు కృష్ణ బ్రహ్మగౌ
తమి నేను భైమిగాఁ డి। యధివసింతుము దండకాటవి మొదలు పంపతుద గాఁగల క్షేత్ర
పటలమెల్ల। నజునకు హరికి నా కాయత్తమై హత్తు భైమివిష్ణుక్షేత్రభూమిఁ బఱచి। వైష్ణ
వయనంగఁదగు నందువలన నాదు। క్షేత్రమున నిచ్చ శైవి నా ధాత్రి వెలయుఁ। దామర
సంభవక్షేత్రతలమునందు। బ్రాహ్మియైయొప్పు నిప్పాట బ్రహ్మపుత్ర ॥ ౨౨౫ ॥ తే ॥
పుణ్యగుణగణ్య పాతకారణ్యహేతి। బహుళపుణ్యద్విజవ్రజపిహితకూల। దీపితాకృతి
బుధబోధదీపకళిక। యఖిలలోకవిపచ్ఛాంతి యాస్రవంతి ॥ ౨౨౬ ॥ తే ॥ నడ
భగవంతు క్షేత్రంబు నడుమఁ జొచ్చి। విరజయన సింధువెచ్చోట విడిసియుండు।
న్వహరిప్రత్యక్షమై యుండు నట్టిచోట। నట్టిచోటను వైష్ణవియనఁగ బరఁగు ॥ ౨౨౭ ॥
తే ॥ కృష్ణవేణిప్రకాశించు నెంతమేర। నంతమేర మదీయమై యతిశయిల్లు। భైమి
యాటమున్న జలజసంభవుని యదియ। కానమూర్తిత్రితయమయాకారయయ్యె ॥ ౨౨౮ ॥
సీ ॥ చలిదిదిచికిలిపుజిల్గుసాలుమలాహలుసుపైనొయ్యారము గపింఛమొయ్యఁ జెరివి।

---

రుత్మంతుఁడు. ప్రాగ్వాసనమైన — పూర్వవాసన చేత ॥ ౨౨౦ ॥ పరమమై — శ్రేష్ఠమై ॥ ౨౨౧ ॥ వితస్తిమాత్రపు బొడువునన్ — జేనెడు కొలఁది పొడుగున. విరాజిల్లున్ — ప్రకాశించును. జ్యోతిర్యానము — వెలుఁగయిన వాహనము. వడువునన్ — విధమున ॥ ౨౨౨ ॥ సురసద్మ — స్వర్గము. బుధలోకక్షేమంకరము — పండితసమూహమునకు మేలు చేయునది. ఇద్ధ — ప్రసిద్ధమైన ॥ ౨౨౩ ॥ ఏవం...వాసంబు — ఈవిధమయిన అనేకమహిమలకు ఉనికిపట్టు. ధీయోగమునన్ — బుద్ధితోడి కూడికతో ॥ ౨౨౪ ॥ సహ్య...దన్వయమునకున్ — సహ్యపర్వతము వెంబడి చిన్నకొండలయందుఁ బుట్టిన నదుల సముదాయమునకు. ధాత — బ్రహ్మ. క్షేత్రపటలము — క్షేత్రముల సమూహము. ఆయత్తమై — ఆధీనమై. హత్తున్ — చేరును. పఱచి — ప్రవహించి ॥ ౨౨౫ ॥ పుణ్యగుణగణ్య — మంచిగుణముల చేత ఎన్నఁదగినది. పాతకారణ్యహేతి — పాపములనెడి అడవికి కొఱవి. పిహితకూల — కప్పఁబడిన తీరముల చేత. బుధబోధదీపకళిక — పండితుల తెలివికి దీపజ్వాల. అఖిలలోకవిపచ్ఛాంతి — ఎల్లజనుల యాపదలను అణఁచివేయునది. స్రవంతి — ఏఱు ॥ ౨౨౬ ॥ విడిసి — ప్రవహించి ॥ ౨౨౭ ॥ కృష్ణవేణి — నల్లని నీటిపాయ ॥ ౨౨౮ ॥ మలాహసు — అల్లిక. ఒయ్యన్ — తిన్నఁగా. చెరివి — చెక్కి. అంశులు — కిరణములు. వ్రేలు — వ్రేలా

భాస్కరాంశులు దూఱి పాఱు ప్రేల్విసుల వెలలేని మకరకుండలములు నిచి । మోహనాతిసం
పుగా ముడిచి పట్టిన కేలవరదాభయంబులావటము చేసి । పొరలేని యురంతులు సిరసించు
మృదులలోరుయుగళి వధ్యమున గోయష్టి గీలిపి । నిగమనూపురములు మ్రోయ నిరుకళము
గ । నిగ్గువాసినకటి ప్రకాశింపను రము । కెంపు లేయెండ గ్రక్కంగ జెక్కుల్లసగవు । మొ
లవన తీర్థమున నిల్చి పొల్చుఁ జక్రి ॥ ౨౨౯ ॥ తే ॥ తీర్థసారంబునకు వాసుదేవమూర్తి । నీల
తరళాకృతిస్ఫూర్తి నెలవుకొనఁగ । నత్తొడవునకు సంగమాఖ్యాకతీర్థ । తలము దళుకొ
త్తుహత్తినకొలికిఁ బోలె ॥ ౨౩౦ ॥ చ ॥ ఖరనఖరాగ్రనిర్దళితకర్బురరాజభుజాంత
రుండు శ్రీ । నరహరి యుండు సంగమమునం జలమాడి నృసింహుసంఘ్రిపం । కరుహ
యుగంబుఁ గాంచి తనకల్గిన మాత్రము దానమిచ్చు నే । నరుఁడు లోకపూంటవాఁడు నగని
గలఁడా విమవిష్ణుధిష్ణ్యముల్ ॥ ౨౩౧ ॥ క ॥ కలుషవనప్లోషదవా । నలకీలావలయ
మైనన గహరిక్షేత్ర । స్థలపుణ్యమహిమ లెన్నిన । గలుగుఁ జుమీ క్షేత్రముఖ్యగమనఫ
లంబుల్ ॥ ౨౩౨ ॥ తే ॥ అపునరావృత్తి శాశ్వతవిపులసౌఖ్య । సిద్ధి ప్రహ్లాదునకు దద
య చేసినట్టి । యానృహర్యక్షవిభు క్షేత్ర మధిగమించు । జనుఁడు పాపంబులనమో
చనము గాంచు ॥ ౨౩౩ ॥ శా ॥ ఆ క్షేత్రస్థ క్రోశపంచకమితంబై యుండు దత్రత్యు
లన్ । వీక్షించున్ దివినుండి వేల్పుగమి దిగ్వేదండతుండాకృతా । రతస్ఫురదేతరదోశ్చ
తుష్టయులఁ గా రాజీవరాజీవస । చ్చక్షూరమ్యులఁ గా హిరణ్మయపటీసక్తోరులం గా
మహిన్ ॥ ౨౩౪ ॥ ఉ ॥ వంచనయింతలేక బహువారము లెంతయు నుగ్రమార్గచిత్తుఁడై ।
పంచజనుండు పంచవిధపాతకముల్ మును చేసె నేనియున్ । బంచతఁ జొచ్చి నృసింహుకు
డిభాగమునం గనుఁబ్బుమొకండున్ । గాంచిన జాలు విష్ణుపదగామి యగున్ గుల

---

డు. వరదాభయంబులు = వరమిచ్చుటవలనిభయము లేములు. ఆపటము చేసి = పొందుపఱిచి. నిర
సించు = తిరస్కరించు. మృదుల = మిక్కిలి మెత్తనైన. ఊరుయుగళి = తొడలజంటయొక్క. గోయ
ష్టి = ఆవులను తోలెడికఱ్ఱ. నిరుకళముగన్ = అడ్డములేక. లేయెండ = ప్రాతఃకాలమునందలియెం
డ. పొల్చున్ = ఉండును ॥ ౨౨౯ ॥ తరళ = నాయకమణియొక్క. స్ఫూర్తి = ప్రకాశము.
అత్తొడవునకున్ = ఆయాభరణమునకు. తళుకొత్తున్ = ప్రకాశించును ॥ ౨౩౦ ॥ ఖరనఖరాగ్ర
నిర్దళితకర్బురరాజభుజాంతరుండు = గోళ్లయొక్క తీక్ష్ణములైన కొనలచేత భేదింపఁబడిన రాక్షసరా
జైన హిరణ్యకశిపుని దైన ఱొమ్ము గలవాఁడు. జలమాడి = స్నానము చేసి. ధిష్ణ్యమున్ = స్థానమును ॥
౨౩౧ ॥ కలుషవనప్లోషదవానలకీలావలయము = పాపములనెడి అడవిని కాల్చునట్టి కార్చిచ్చుమం
టలఆవరణముగలది ॥ ౨౩౨ ॥ అధిగమించు = పొందునట్టి. మోచనము = విడుపు ॥ ౨౩౩ ॥
క్రోశపంచక = ఐదుకోసుల. తత్రత్యులన్ = అచ్చటివారిని. దిగ్వేదండతుండాకృతారతస్ఫురదేతర
దోశ్చతుష్టయులఁ గాన్ = దిగ్గజముల తొండములుగాఁ జేయఁబడిన వడిగలవిశాలములయిన నాలుగు
చేతులు గలవారిని గాను. రాజీవరాజీవసచ్చక్షూరమ్యులఁ గాన్ = తామరలపంక్తికి ఉనికిపట్టులగుక
న్నులచేత అందగించువారిని గాను. హిరణ్మయపటీరమ్యోరులన్ = బంగారుపట్టువస్త్రము చేత మనో
హరములైన తొడలుగలవారిని గాను ॥ ౨౩౪ ॥ బహువారములు = పలుతడవలు. పంచజనుండు = మ
నుష్యుఁడు. పంచతన్ = చావును. ఒకఁడున్ = ఒక్కఁడే ॥ ౨౩౫ ॥ ఊడ్చినన్ = విడిచినను. స్వా...

కోటితోడఁ దెత్తెన్ ॥ ౨౩౫ ॥ ఉ ॥ దేవుని వామభాగమున దేహము నూడ్చిన సార్వభౌ
ముఁడా । దేవుని వెన్క మేల్కనిన త్రేనుప్రగ్గికొని నాకవాసియా । దేవుని మ్రోల
దక్షిణపుదిక్కున నీల్గిన యేని ముక్తుఁడౌ । గావున నూనవుం డెపుడు గాపురమా వెడఁ
జేయఁగాఁ దగున్ ॥ ౨౩౬ ॥ క ॥ యతిపతి యేతత్క్షేత్రోర్జితచరితం బ్రకటనంబు చే
యఁగఁ దగున । యితిహాస మొకటి గలదది । శ్రుతిపేయము చేయుమనుచు రు
ద్రుఁడు పలుకన్ ॥ ౨౩౭ ॥

శా ॥ అంభోరాశిగభీర భీరహితచిత్తా భోగభోగావళీ । సంభారామర
రాజ రాజకృతపూజాయోగ్య యోగ్యర్థిమి । త్రాంభోజాహిమధామ ధామహితని
త్యావాసలక్ష్మీసము । జ్జృంభాలంకృత వక్త్ర వక్త్రభీముఖరవా శ్రీమద్గుణ
ప్రాభవా ॥ ౨౩౮ ॥

క ॥ శతమఖనవంశవర్ధన । కఠినకుఠారాగ్రదళిత గర్వితవిద్వి । డ్జతర
మునితుల్యవితరణ । పఠనకళాభ్యాసవిభవపారీణమతీ ॥ ౨౩౯ ॥

---

ముఁడు — చక్రవర్తి. మేల్కనిన త్రేనపు — మేలుపొందుటవలని త్రేఁపు — చావు నీల్గినయేనిన్ — చచ్చి
నపక్షమున. ముక్తుఁడు — మోక్షమును పొందినవాఁడు ॥ ౨౩౬ ॥ యతిపతి — ఓ నారదుఁడా. ఏతత్క్షే
త్రోర్జితచరితన్ — ఈ క్షేత్రము యొక్క శ్లాఘ్యమైన చరిత్రమును. ప్రకటనంబు — ప్రసిద్ధము. ఇతి
హాసము — పూర్వకథ. శ్రుతిపేయము చేయుము — వినుము ॥ ౨౩౭ ॥

అంభోరాశిగభీర — సముద్రము యొక్క గాంభీర్యమువంటి గాంభీర్యముగలవాఁడా. భీరహి
తచిత్తా — భయములేని మనసుగలవాఁడా. ఆభోగ... రాజ — విశేషములైన భోగములను అనుభవిం
చుటయందు ఇంద్రుఁడా. రాజకృతపూజాయోగ్య — రాజులచేతఁ జేయఁబడు పూజలకుఁ దగినవాఁ
డా. యోగ్యర్థిమిత్రాంభోజాహిమధామ — యోగులు యాచకులు స్నేహితులు అనెడి తామరలకు సూ
ర్యుఁడా. ధామహితనిత్యావాసలక్ష్మీసముజ్జృంభాలంకృతవక్త్ర — ఇంటికి మేలై యెల్లప్పుడు వసిం
చునట్టి లక్ష్మి యొక్క విజృంభణము చేత అలంకరింపఁబడిన ముఖముగలవాఁడా. వక్త్రభీముఖరవా —
ముఖమునందు భయము మొదలగు వానిని గలిగించెడి ధ్వనిగలవాఁడా. — అర్పటగలవారికి భయము పు
ట్టించుట మొదలగు లక్షణములుగల మాటలుగలవాఁడా అనుట. శ్రీమద్గుణప్రాభవా — సంపద్గుణ
ములతోడి ప్రభుత్వముగలవాఁడా ॥ ౨౩౮ ॥

శతమఖనవంశవర్ధన — శతమఖన గోత్రమును వృద్ధిపొందించువాఁడా. కఠినకుఠారాగ్రద
ళితగర్వితవిద్విడ్జతరమునితుల్యవితరణ — కఠోరమయిన గండ్రగొడ్డలి మొన చేత ఛేదింపఁబడిన గ
ర్వించిన శత్రువుల కదుపులుగల మునియైన పరశురామునితోఁ బోల్పఁదగిన దాతృత్వముగలవాఁ
డా. పఠనకళాభ్యాసవిభవపారీణమతీ — చదువుటవలని శాస్త్రాభ్యాససంపత్తిచేత పారమును పొంది
న బుద్ధిగలవాఁడా ॥ ౨౪౦ ॥

మాలినీ ॥ కవిశుకసహకారా కల్పవృక్షావతారా । సవినయనిజమూర్తీ సర్వదిగ్గ్రాహికీర్తీ । భువనహితచరిత్రా పుణ్యదాక్షిణ్యమిత్రా । నవరసికవతంసా నవ్యసూక్తిప్రశంసా ॥ ౨౮౦ ॥

గద్యము ॥ ఇది శ్రీపరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరి
చిత సరసకవితాసనాథరామకృష్ణ కవినాథప్రణీతంబైన
పాండురంగమాహాత్మ్యంబను పరమభాగవత
చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

---

కవిశుకసహకారా—కవులనెడి చిలుకలకుతియ్యమామిడియైనవాఁడా. సర్వదిగ్గ్రాహికీర్తీ—ఎల్లదిక్కులనుగ్రహించునట్టికీర్తిగలవాఁడా—ఎల్లదిక్కులందువ్యాపించినకీర్తిగలవాఁడా. భువనహితచరిత్రా—లోకమునకు మేలైననడవడిగలవాఁడా. పుణ్యదాక్షిణ్యమిత్రా—ధర్మము మొగమోటమున నెడిమిత్రులుగలవాఁడా. నవరసికవతంసా—తొమ్మిదిరసములు తెలిసినవారిలో శ్రేష్ఠుఁడా - లేక - నవీనులైనరసికులలో శ్రేష్ఠుఁడా. నవ్యసూక్తిప్రశంసా—శ్లాఘ్యములైన మంచిమాటలపొగడ్తగలవాఁడా.



# పాండురంగమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

క ॥ శ్రీరమ్యచరణతలలా । క్షారసరాగాభిరమ్యశంకావహదృ । గ్ధారసమారాధితరఘు । వీరా రామానుజార్యవేదాద్రీశా ॥ ౧ ॥ వ ॥ ఆకర్ణింపు మాయర్ణవతూణీరుండు వీణామునిం గనుంగొని యిట్లనియె ॥ ౨ ॥ ఉ ॥ ప్రాసంగువిత్తువంటి నెఱపాఱు కొలంబునఁ బుట్టి వేదముల్ । వ్రాసినగాదె శాస్త్రములు పుట్టినయిల్లు కళాకలాపముల్ । డాసినరచ్చ యంచు నఖిలంబు దనుం గొనియాడ నొప్పు ను । ద్భాసితభాసితద్యుతి సభాపతి నా నొకఁ డాహితాగ్నియై ॥ ౩ ॥ ॥ వ ॥ అతండు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకలమహీసుపర్వశ్రేష్ఠుండై వెలయునంత ॥ ౪ ॥ తే ॥ ఆమహీసురు లేమకు నతులనిష్ఠ । నింగివేల్పుల నేలకు నేలవేల్పు । కొలము నింగికిఁ దెచ్చుచుఁ గొలువఁ బుత్త్రుఁ । డొకఁ డుదయించెఁ దత్తపోభ్యుదయమహిమ ॥ ౫ ॥ మ ॥ వనితామానససూనసాయకుఁడు జీవత్త్రాతపాఱుండు భూ । జనసన్మాన్యవిశుద్ధవర్తనుఁడు దంచత్త్యాగశీలుండు చం । ద్రుని పెన్నిద్దిసమగ్రకాంతిమహిమన్ నూనూఁగుమీసాలలే । గొనబుం బ్రాయపుఁ దేజుకూన యతఁ డుత్కోచుండు వాచాలతన్ ॥ ౬ ॥ వ ॥ అజ్జగతీసుపర్వసంభవునకుఁ బిత్రుదత్తంబగు నిగమశర్మాభిధానంబు ప్రసిద్ధంబై యుండు వెండియు ॥ ౭ ॥ తే ॥ అతఁ డనూచానసంతతి నవతరిలియు ।

---

లాక్షారస—లత్తుకవలని. రాగ—ఎఱ్ఱఁదనముచేత. దృగ్ధార—కంటిగీఁటులుగలవాఁడా ॥ ౧ ॥ అర్ణవతూణీరుఁడు—సముద్రములు అమ్ములపొదులుగాఁగలవాఁడు. వీణామునిన్—నారదుని ॥ ౨ ॥ ప్రాసంగువిత్తు—రాజనపువరివిత్తనము. నెఱపాఱుకొలంబునన్—ఉత్తమబ్రాహ్మణవంశమునందు. కలాపములు—సమూహములు. డాసిన—సమీపించిన. రచ్చ—సభ. ఉద్భాసిత—మీఁదికి వెలిఁగింపఁబడిన. భా—వెలుఁగుచేత. సితద్యుతి—చంద్రుఁడు. ఆహితాగ్ని—ఎల్లప్పుడు అగ్నిహోత్రములు చేయువాఁడు ॥ ౩ ॥ పీఠికాపురంబున్—పిఠాపురమును. అధిష్ఠించి—ఉనికిచేసికొని. మహీసుపర్వ—బ్రాహ్మణులలో ॥ ౪ ॥ లేమకున్—భార్యకు. నింగివేల్పులన్—ఆకాశమునందలి దేవతలను. నేలవేల్పుకొలమున్—బ్రాహ్మణసమూహమును ॥ ౫ ॥ సూనసాయకుఁడు—మన్మథుఁడు. జీవత్త్రాత—బ్రతికియున్న తండ్రిగలవాఁడు. పాఱుండు—బ్రాహ్మణుఁడు. విశుద్ధవర్తనుఁడు—పరిశుద్ధమయిన నడవడిగలవాఁడు. లేఁగొనబుం బ్రాయపుఁ దేజుకూన—లేఁతదియు మనోజ్ఞమునైన యౌవనపుఁ దేజస్సుగల బిడ్డ. ఉత్కోచుండు—అధికుఁడు. వాచాలతన్—మాటకారితనముచేత ॥ ౬ ॥ ౭ ॥

సకలనిగమశిఖారహస్యములుగనియు । మనసుఁ దార్తీయపురుషార్థమునకేఁ దార్చె।
దైవఘటనావశంబున నోవశీంద్రా॥ ౮ ॥ చ॥ తలఁగడుగంగ మర్దనము ధౌతపటావర
ణంబు సంస్కృతో । జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం, బు
లుకపురంపువీడ్యము విభూషణపఙ్క్తులు కల్గి నిచ్చలున్ । బులుకడుగంగఁ బట్టననుమత్య
ముఁ బోలుచు వాలుచుంబుచెన్ ॥ ౯ ॥ సీ॥ కలదు లేదను వాదములకోర్చె మీఁదమీస
మువంటిమొంటిజుదెము మెఱవఁగ। బహుసంకుమదపంకపాణంధమంబైన తాళిగో
ణపుఁజుంగు నేలఁ జీరఁ। గడలేని వీడ్యంపుఁగప్పు చందురుకావి మోవిఁ బల్లొత్తుల మసుఁగు
దన్న । సానతేఁకులుగల్గు సూనాస్త్రశంఖంబు గతి నఖరేఖాంకగళము దనర । సఖు
లు పరిహాసకులు వెంటఁ జనఁగ యువతిభుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడగుచు । నగర
ఘంటాపథంబున నగుపడఁ దిరుగు । నారపుగలరివిజాతిమాత్రోపజీవి ॥ ౧౦ ॥ తే॥ భా
ర్యపాలిండ్లు రిక్తకుంభములు రోయి । వెలఁది చనుదోయి నిండుకుండలు కులంబు। తరు
ణి పాలెంబు పవితిచందురుఁడు వేశ్య । నుదురు నాసికి ప్రతిపదిందుండు నయ్యె ॥ ౧౧ ॥ సీ॥
ఉష్ణాన ఘోరామాగ్నియోఁదనొల్లఁడుగాని విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు।
సంధ్యకుఁ బ్రాభ్యనాంజలి ఘటింపఁడుగాని మొరఁగు నీర్ష్యాకషాయితలకర్థి। నాగమవా
దంబులొగ్గాదనఁడుగాని విటవాదములుదీర్చు వేగి లేచి। కంబుభృత్పాదోదకంబు గ్రోలఁ
డుగాని యావతాధరసీధువాని చొక్కుఁ । బున్యాహవహ్నంబు లపఘనంబున ఘటింప।

---

అనూచాన = అంగములతోడ వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణుని యొక్క. అవతరిలి = పుట్టి. నిగమశిఖారహస్యములు = వేదాంతరహస్యములను. తార్తీయపురుషార్థమునకై = మూడవపురుషార్థమైన కామమునకై. తార్చెన్ = చేర్చెను॥౮॥ తలఁగడుగు = తలకు నూనెయంటిస్నానము చేయుట. ధౌతపటావరణంబు = మడుఁగువస్త్రము కట్టుకొనుట. సంస్కృతోజ్జ్వలకలమాన్న = పక్వము చేయుటచే ప్రకాశించునట్టి వరియన్నము. ప్రసూనదామకంబులు = పూవుదండలు. నిచ్చలున్ = ఎల్లప్పుడును. పులు = (ముత్యముల) మొలకె. వాలుచున్ = మీఱుచు — అతిశయించుచు॥౯॥ సంకుమద = జవ్వాజిచేనైన. పాణంధమంబు = కొలిమితిత్తియైనది — వ్యాపింపఁజేయునది. తాళిగోణము = మూలగోఁచి. చందురుకావిమోవి = సిందూరవర్ణము గలిగిన పెదవి. పల్లొత్తులన్ = దంతక్షతములచే. మసుఁగుదన్నన్ = మసుఁగుపడఁగా. నఖరేఖాంకగళము = గోటినొక్కులగుఱుతులుగల మెడ. యువతిభుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁడు = యావనస్త్రీలు అనుభవించి విడిచిన కట్టువస్త్రముతోఁ గూడినవాఁడు. ఘంటాపథంబునన్ = పెద్దబాటయందు. ఒఱపు = చక్కఁదనము = అందము. ఠీవిన్ = వైభవముతో॥ ౧౦॥ పాలిండ్లు = స్తనములు. రోయి వెలఁది = భోగముది. కులంబుతరుణి = పెండ్లాము. ప్రతిపదిందుండు = పాడ్యమినాటిచంద్రుఁడు॥౧౧॥ ఆర్తుఁడు = పీడింపఁబడినవాఁడు. ఘటింపఁడు = చేర్పఁడు. ఎరఁగున్ = నమస్కరించును. ఈర్ష్యాకషాయితలకున్ = ఇతరసాంగత్యమును ఓర్వలేక కన్నులెఱ్ఱచేసికొన్న స్త్రీలకు. అర్థిన్ = ప్రీతితో. అగమవాదంబులు = వేదవాదములు. వేగి = తెల్లవాఱి. కంబుభృత్ = శంఖమును బూనిన విష్ణుదేవుని. గ్రోలఁడు = త్రాగఁడు. యావతాధరసీధువు = యావనస్త్రీసమూహము యొక్క మోవితేనెను. అని = త్రాగి. అపఘనంబునన్ = దేహమునందు. కరనఖాంకములు = చేతిగోటివాఁడిమొనలు గ్రుచ్చుటవలనఁ గలిగిన క్రొత్తగాయపుగుఱుతులను. ఆరజము = ఇంపు. దుర్విసారిరసాలి = చెడ్డనడతలుగలవారిలో అందగించువాఁడు॥ ౧౨॥ అయథార్థగాథన్ = అబద్ధపుక

స్వగ్రహదుఁగాని ఖరనఖశిఖరలిఖిత । జాతసూత్రక్షతాంకముల్ సమ్మతించు । నారజ ముఖరి యాదుర్వ్యవహారహారి॥౧౨॥ తే॥ నిగమశాస్త్రాభిధానంబు నేతిబీర । కాయ యనుబోలె నర్థాగాధఁ బాల్ప । వైదికాచారదూరప్రవర్తనములఁ । బీట పిహరించుచుండు నస్వీటిప్రోగు ॥ ౧౩ ॥ క ॥ వెడవెడ దుర్వ్యవహారపు । నడవడి గడిఁ జేటి గురుజనము శిక్షింపన్ । గడుసువడి విప్రతనయుఁడు । సడికోరి చివంకపరకచాటున్ మానెన్॥ ౧౪ ॥ తే ॥ తాతముత్తాత తండ్రులు తరతరంబు । చేయవలెఁ గూడఁబెట్టి యూర్జితము సేయు । విత్తముడివోయె దత్కరాయత్తమగుచు । నురగదష్టుని మేని నెత్తురును బోలె॥ ౧౫ ॥ సీ ॥ దినవెచ్చమునకునై తనమేనఁ గలసొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువ వైచు । నిందుగీసినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి । తండ్రికి సిద్ధపత్రములు పొంగిలి పోయి పోయినంతకు నిచ్చి పారయు విత్త । * ఇడ్డవడ్డికి నొగ్గి మృత్యురూపములైన సాహుల చేత ఋణగ్రాహి యగుచు । గుడ్డవృత్తులు వృత్తులుఁ గొలుచు గుత్త । చేలు గ్రామాంశములు నాదిసేల తెల్లఁ । జనవరులకమ్మఁ జూపుచు నిత్యాపహార । వర్తి వాఁ డేమిగా నున్నవాఁ డొ మీఁద॥ ౧౬ ॥ క ॥ అతఁడు కళింగోద్భవుఁడగు । కతమున నొప్రేలఁ జూపఁ గసుగందక యో । గ్యతమస్వీకారమునకు । నితరుండై యుండె మునికులేశ్వర వింటే ॥ ౧౭ ॥ తే॥ పొందుఁబట్టుల నప్పులు పొడిచి పొడిచి । దొరతనంబునఁ జుట్టాల దిరిసి తిరిసి । నలఁగి శిశ్నోదరపరాయణత్వమునకుఁ । బారమెఱుఁగక తిరుగు నా బ్రాహ్మణుండు॥ ౧౮॥ చ ॥ తనచెలులిండ్లయందు దపలాప్రుడు త్రావుచు నింటి కెన్నఁడున్ ।

---

ధను. పీటిప్రోగు = కొల్లలరాశి — దుర్వ్యయము మిక్కిలి చేయువాఁడు॥ ౧౩॥ వెడవెడ = కొంచెము కొంచెము. గురుజనము = తండ్రి మొదలగు పెద్దవారు. గడుసువడి = అసాధ్యుఁడై. సడికిన్ = నిందకు. వంకపరక = వంకరపుల్ల ॥ ౧౪ ॥ ఊర్జితము = దృఢము — నానాటస్థిరపడినది. ఉడివోయెన్ = ఉడిగిపోయెను — నశించెను. తత్కరాయత్తము = వానిచేతఁ జిక్కినది. దష్టుని = కఱవఁబడినవానిని॥౧౫॥ కొదుకక = సంకోచపడక. ఇందుగీసినరీతిన్ = చిల్లగింజరాచిన విధమున. గిలుబాడున్ = అపహరించును. పోయినంతకున్ = ఎంతధనమునకు వ్రచ్చుకొందురో అంతధనమునకు; పారయున్ = పొందును. ఇడ్డవడ్డికిన్ = ఎంతయెచ్చువడ్డీ యేర్పఱచినను అంతవడ్డికిని. సాహులచేతన్ = సాహుకారులచేత. ఋణగ్రాహి = అప్పుతీసికొన్నవాఁడు. గుడ్డవృత్తులు = చేనిసేద్యపుఁ బనులు. వృత్తులు = మాన్యపుఁ జేలు. కొలుచు = ధాన్యము. గుత్తచేలు = ఒకరివద్ద ధాన్యపు గుత్తకు తీసికొన్నచేలు. గ్రామాంశములు = ఊరిలోని భాగములు. జనవరులకున్ = అధికారులకు ॥ ౧౬ ॥ కళింగోద్భవుఁడు = కళింగదేశమునందుఁ బుట్టినవాఁడు. వ్రేలఁ జూపఁగ = చూచిన వారెల్లను వీఁడెట్టివాఁడని వ్రేలితో నితరులకుఁ జూపుచుండఁగా. కసుగందక = కొంచెమయినను జంకక. యోగ్యతమస్వీకారమునకున్ = మిక్కుటమయిన యోగ్యులయొక్క అంగీకారమునకు. ఇతరుఁడు = అన్యుఁడు — సరిపడనివాఁడు॥ ౧౭। పొందుఁబట్టులన్ = సరిపడిన తావులందు. పొడిచి = తీసి. తిరిసి = యాచించి — అడిగి. పారము = దరి॥ ౧౮ ॥ చెలులిండ్లయందున్ = స్నేహితులయిండ్లయందు. ఆదవదాప్రుడు = స్థిరములేనిత్రాగుట. దురోదరార్జితము = జూదమున

---

* మిండవడ్డికి నని పాఠాంతరము. మిండ = అధికము.

జనకము రోదరార్జితము చౌర్యహృతంబన్యతోపపన్నముఁ । జెనఁటి పిసాళి వెచ్చముఁ
జేర్చుచుఁ దొల్లిటి వైభవంబులె । ల్లనడఁగ నవ్వెడంగు కడు లాఘవవృత్తికిఁ జొచ్చెని
చ్చలుఁ ॥ ౧౯ ॥ క ॥ మితిగడచిన ఋణదాతలు । వెతవెట్టఁగ నూరు చొరక వెలివె
లిఁ దిరుగుఁ । దతిఁగూడు లేక యాఁకటఁ । గుతిలపడున తండు గువ్వగుత్తుకతోడన్ ॥ ౨౦ ॥
క ॥ వలువకుఁగూటికి నైనీ । చులవేడం బోడచౌరవఁ జొచ్చున తఁడు పూ । వులు
ముడిచినయంగళ్లనె । కలకలవీడెల్ల నవ్వఁగట్టెలు మోసెన్ ॥ ౨౧ ॥ తే ॥ పదను దివిసిన క
స్తూరి ప్రాఁచి యలరు । పాయఁబాఱిన కూము నీర్వట్టు మడుఁగు । గళితమణియగు సొమ్ము
నై కానఁబడియె । దుర్విదగ్ధుండు గౌరవదూరుఁడగుచు ॥ ౨౨ ॥ క ॥ ఆలోనొకనాఁడాదు ।
ర్శీలరతుని యక్క-యోర్తు శిక్షించెదనీ । బాలిశు ననితనమగనిన్ । బాలురఁగొనివచ్చె మా
తృభవనంబునకున్ ॥ ౨౩ ॥ వ ॥ ఇట్లు పంచయోజనమాత్రదూరంబగు తనయూర
నుండి వచ్చి పితృభవనంబు చొచ్చి యచ్చటం గొన్ని ప్రొద్దులు గడపి కొడుకు చెడు నడవడికి
నడలు కడలింబడి సుడివడియెడు తెల్లిదండ్రులఁ దీండ్రగల వచనరచనాచమత్కారంబు
ల నుదారము దారోపణకరణోపచారంబులఁ గొంతకొంత వంతకుం దొలంగించుచు
మందిరముకుందారాధనాతిథిసంతర్పణంబులు నేర్పునం బచరింపించుచు జనయిత్రీద
ర్శితంబగు మూలవిత్తంబు నష్టావశిష్టంబగు నది గుప్తంబు సేయుచుఁ బశు శిశు దాసదా
సీజనంబులఁ దనవారింగా మెలంగించి నలంకువలకుం దొలంగించుచుఁ బుస్తకభాండా
గారంబు నిజభర్తృహస్తాంతరంబున నాశుశుక్షణిశిథిలబంధన యాచకప్రముఖోప
ద్రవంబులవలనం బాఁచి ప్రోచుచు విగళితసన్నాహంబగు గేహంబు యథాపూర్వనిర్వ
హణమనోహరంబుగా ననుసంధింపించి చదువుసంత సాగించి నడపించుచు నిజానుజు

---

సంపాదింపఁబడినది. చౌర్యహృతము — దొంగతనము చేత అపహరింపఁబడినది. అన్యతోపప
న్నము — బొంకుచేత లభించినది. చెనఁటి — వ్యర్థము. పిసాళి — దొంగయెత్తుగలది. వెడంగు —
అవివేకి. లాఘవవృత్తికిన్ — తక్కువ వ్యాపారమునకు ॥ ౧౯ ॥ మితి — గడువు. వెత — వ్య
థ — శ్రమము. తఱిన్ — సమయమునందు. కుతిలపడున్ — బాధపడును. గువ్వకుత్తుకతో
డన్ — హీనస్వరముతో ॥ ౨౦ ॥ బోడచౌరవన్ — సన్యాసి చొచ్చునట్టి చౌరవతో ॥ ౨౧ ॥ ప
దను — తడి. దివిసిన — తీసిన — పోయిన. ప్రాఁచి — ప్రాఁతదైన. నీర్వట్టు — నీరు ఇంకిన
ట్టి. గళిత — జాఱిన. దుర్వ్యగ్ధుఁడు — దుర్వ్యవహారమందు చౌరవగలవాఁడు ॥ ౨౨ ॥ బా
లిశున్ — మూర్ఖుని. మాతృభవనంబునకున్ — తల్లియింటికి ॥ ౨౩ ॥ ప్రొద్దులు — దినములు. అడ
లు కడలిన్ — దుఃఖసముద్రమునందు. సుడివడియెడు — కలఁతపడునట్టి. తీండ్రి — చౌరవ. ఉ
దారము దారోపణ కరణోపచారంబులన్ — మిక్కిలి సంతోషమును హెచ్చించునట్లు చేసెడియు
పచారముల చేతను. వంతకున్ — దుఃఖమునకు. ముకుందారాధన — విష్ణుపూజ. పచరింపించు
చున్ — చేయించుచు. జనయిత్రీదర్శితంబు — తల్లిచేత చూపఁబడినది. విత్తంబు — ధనము. న
ష్టావశిష్టంబు — నశించినది పోఁగా మిగిలినది. గుప్తంబు — దాఁచఁబడినది. నలంకువలకున్ — కష్ట
ములకు. భాండాగారంబు — బొక్కసము. ఆశుశుక్షణి — నిప్పు. పాఁచి — తొలఁగించి. విగళి
తసన్నాహంబు — తొలఁగిన ప్రయత్నముగలది — పక్కఁబఱచఁబడినది. అనుసంధింపించి — జతపఱ

దుర్వ్యసనంబులవలన గాసింబొందని రాజానుగ్రహలబ్ధంబులగు నేకభోగగ్రామంబు
లాత్మాధీనంబులుగా నొనరించుచుఁ దప్పి దారినమడిమ్రచేనుచెట్లున్నపట్లరసితనప
ట్టులం గాపువెట్టుచు గుట్టికనలంగియు నత్తమామలచిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తు
లుమెఱసి పాటులంబడుమరందలి సౌందర్యంబు ననివార్యజృంభణంబగు యావనా
రంభంబును వనచంద్రికావైభవంబును వనకేళీఫలాశదోహదంబునగుటకువగచివ
గచి తెగచి కడుపుచుమ్ములుచుట్టి కన్నీరుట్టిపడం బొట్టుపొరలగుచుండు నంతంజుక్క
తెగిపడినవడువున నెక్కడనుండియో యాకస్మికంబుగ నింటికిం జలిదివంటకంబుఁగుడు
వంజను దెంచి తన్నుంగాంచి డెందంబునం గొంచియుం బోరాక చేరినమస్కరించిత
లవంచికొనియున్న తమ్ముసింగసి కడసి కొదమనెలవంకలవంకలొత్తుచు నెత్తురులు
చిలుకుచుం గుకవిపదబంధంబునుంబోలెనసకలప్రవృత్తంబులై పదోన్మత్తమత్తకా
శినీదత్తంబులగు నఖాంకంబులకతన గర్కశంబగునతనిశరీరంబు గౌఁగిలింపనంగలించి
శంకించి యాసీమంతిని యొక్కింత ఋజుస్వాంతయై యాదుర్విదగ్ధవిదగ్ధాలాపంబు
లొలయ సీమంతపుం బెండ్లికొడుకవుగమ్మని హేతుగర్భితంబుగా నాశీర్వదించి యా
తండుతమకంబుగమకంబునం బోవనుంకించిన వానిసోఁకోర్వమి యెఱింగి తరంగితవి
నయసౌహార్దమార్దవ మధురంబులగు మాటల తేటలం బందిరివెట్టి యిందుబిం
బంబునుంబోని నిజనందనుం జిఱుతవాని మేనల్లుని నిందవని చంకకిచ్చి యెచ్చటి
కేగెదవు మీబావబంతి నారగింతువు గాక శాకపాకంబులు నిమిషంబులోనం
గావింతుననినిలిపి వెనుకదెస నెడగలసియున్న తత్కళత్రంబునకు నేత్రసంజ్ఞయొ

---

చూఁట్టుచేసి. దుర్వ్యసనంబువలనన్ — దుష్టవిషయమునందలియిచ్ఛవలన. ఆత్మాధీనంబులు — తనకు అధీనమైనది తప్పిదారిన — పొరపాటుచే తప్పిపోయిన. మ్రడి — మళ్ళలోచీలికగా నేర్పడిన పాది. పట్టులన్ — బిడ్డలను. కాపు — కావలి. గుట్టిక — రహస్యముబయలుపఱుపక. నలంగియున్ — శ్రమనొందియు. అనివార్యజృంభణంబు — అడ్డగింపరాని విజృంభణముకలది. యావనారంభంబు — క్రొత్తప్రాయము. వనచంద్రికావైభవంబు — అడవిగాసిన వెన్నెలకలిమి. దోహదంబు — అకాలమునందుచిగిర్చి పూచుటకై చెట్లకుచేయుక్రియ. తెగచి — తెగించి. చుమ్ములుచుట్టి — వేదనపడి. ఉట్టిపడన్ — జాఱఁగా. పొట్టుపొరలగుచుండునంతన్ — సంకటపడుచుండఁగా. వడువునన్ — విధమున. ఆకస్మికంబుగన్ — తటాలున. వంటకంబు — అన్నము. కుడువన్ — భుజింపను. కొంచి — జంకి. కొదమనెలవంకలన్ — బాలచంద్రరేఖలను. పదబంధంబు — పదములయొక్క కూర్పు. మత్తకాశినీ — శ్రేష్ఠలైనస్త్రీలచేత. నఖాంకంబుల — గోటినొక్కుల. కర్కశంబు — బిఱుసైనది. ఆంగలించి — పూని. సీమంతిని — ముత్తైదువ. ఋజుస్వాంత — సరియైనమనసుగలది. విదగ్ధాలాపంబులు — నేర్పుమాటలు. హేతుగర్భితంబు — లోపలనణఁగిన హేతువుగలది. తమకంబుగమకంబునన్ — మోహముయొక్క ప్రయత్నముచేత — మోహసంబంధమైన ప్రేరేపణచేత. ఉంకించి — యత్నించి. సోఁకోర్వమి — తానుచెప్పిన మాటనువినసహింపమి. తరంగిత — హెచ్చింపఁబడిన. సౌహార్ద — స్నేహముతోడి. మార్దవ — సులభోచ్చారణముగల. ఇందుబింబంబుంబోని — చంద్రబింబమువంటి. శాకపాకంబులు — కూరవంటలు. ఎడగల

సంగుటయును ॥ ౨౪ ॥ క ॥ ఆపైదలి ప్రాణేశ్వరు । శ్రీపాదద్వయముఁ గడిగె శీతలవారిన్ । వ్యాపృతనిజనిశ్వాసజ । తాపంబునఁ గొంతకొంత తప్తముగాఁగన్ ॥ ౨౫ ॥ క ॥ వినువేల్పునకును మెచ్చొలయనిబలువిందునకుఁ బోలె నఖిలాన్నంబుల్ । కనుగీటినంతలోననె । యనుజునకుం దదగ్రజాత యమరించెఁ గడున్ ॥ ౨౬ ॥ చ ॥ తలఁగడిగించి ధౌతపరిధానముఁ గట్టఁగ నిచ్చి తెస్సగా । నలకలయందుఁ గల్గు తడియార్చి విక్రొవ్విరు లొప్పటించి మైఁ । బలయజచర్చ సేసి గృహమాధవదత్తమనోజ్ఞభోజనం । బులొసఁగెం దల్లి తండ్రి నిజపుత్రులు భర్తయుఁ దోఁ భుజింపఁగన్ ॥ ౨౭ ॥ ఉ ॥ ఇష్టములైన వంటకము లిట్లు భుజించి యతండు వార్చి సం । తుష్టమనస్కుఁడై తనదు తొయ్యలి వీడ్యము చుట్టి యీ మహా । శిష్టుఁడు పోలె దిన్నెపయి విర్ణగఁ బొప్పఁగఁ గూరుచున్నచో । బుష్టిసమస్తముం గడపి పుచ్చి తదగ్రజపూర్ణచిత్తయై ॥ ౨౮ ॥ క ॥ ఇంతలు నంతలు నగుతన । సంతానము వెంటవెంట సందడిసేయన్ । బ్రాంతమున నిలిచి తన్ముని । కుంతలబంధంబు విడిచి కుశలాశయయై ॥ ౨౯ ॥ తే ॥ ఎలయు నీతాఁకురములఁ బోడనిల్లు గ్రుక్కి । యంటు లంటులు పరికించి యట్లు బోడిచె । గోరుముక్కలఁ దిగదువ్వి తూగుపెత్తి । నెఱులఁ గలిగిన పేలనన్నింటిఁ దిగిచె ॥ ౩౦ ॥ క ॥ మెఱమున్నునలఁచి యలకలు । ముడిగొని నిజపాణిపద్మములు గరగరగాఁ । గడుగుకొని తనకుమరదలు । విడెమొసఁగుచుఁ బసిమి పసిఁడిపీఁటను వీఁకన్ ॥ ౩౧ ॥ తే ॥ చేటికానీతపీఠికాసీనయగుచుఁ । బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ । గుడిపలనంత యోరగాఁ గొమరు మెఱసి । బిడ్డ నుదాత్తనిట్లను బిసరుహాక్షి ॥ ౩౨ ॥ శా ॥ ప్రారంభించిన వేదపాఠమునకున్ ప్రత్యూహమౌ నంచునో । మేరా తమ్ముఁడ నన్నుఁ జూడఁజనవే వెన్నాళ్లనో యుండి చ । తూరా

---

సి — ఎవరైనా. తత్కళత్రంబునకున్ — వానిభార్యకు ॥ ౨౪ ॥ పైదలి — ఇల్లాలు. వ్యాపృత... బునన్ — వ్యాపింపఁజేయఁబడిన తననిట్టూర్పులవలని తాపముచేత. తప్తము — వెచ్చచేయఁబడినది ॥ ౨౫ ॥ మెచ్చొలయని — మెచ్చులేని. బలువిందునకున్ — గొప్ప చుట్టమునకు. కనుగీటినంతన్ — కన్నుతిప్పి నంతలోపల. అగ్రజాత — అక్క ॥ ౨౬ ॥ ధౌతపరిధానము — ఉదుఁగుదోవతి. అలకలయందున్ — తలవెండ్రుకలయందు. క్రొవ్విరులు — అప్పుడు పూఁచినపువ్వులు. అవటించి — పెట్టి. గృహమాధవదత్త — ఇలువేలుపైన విష్ణుదేవునకు నివేదన చేయఁబడిన ॥ ౨౭ ॥ వార్చి — ఆచమనము చేసి. తొయ్యలి — ఆఁడుది — పెండ్లాము. పుష్టిన్ — నిండుకొన్న తనముచేత ॥ ౨౮ ॥ ప్రాంతమునన్ — వెంబడిని. కుంతలబంధంబు — తలవెండ్రుకలముడి. కుశలాశయ — మంచిమనసుగలది ॥ ౨౯ ॥ అట్లన్ — అంటుపేలను. నెఱులన్ — చుట్టవెండ్రుకలందు ॥ ౩౦ ॥ గరగరగాన్ — నిర్మలముగా ॥ ౩౧ ॥ ఆనీత — తేఁబడిన. పీఠికా — పీటయందు. పద్మకర్ణికన్ — తామరదుద్దునందు. పద్మ — లక్ష్మీదేవి ॥ ౩౨ ॥ ప్రత్యూహము — విఘ్నము. చతూరాజీవయుగంబు — కనుఁదామరలజంట — రెండుకన్నులును. నీరాకరంబున్ — సముద్రమును ॥ ౩౩ ॥ ఉత్సేకంబు — ఎత్తు — అధిక్యము. ఉద్వేలస్ఫూర్తిన్ — అధికప్రకాశముచేత. తలిర్చు — అతిశయించునట్టి. పోలున్ — తగును. భవాదృశుండు — నీవంటివాఁడు. ఇతరుఁడు — అన్యుఁడు — అక్రమప్రవర్తకుఁడు ఖనిన్ — గనియందు ॥ ౩౪ ॥ ఏనమ్మఁడున్ — ఏనమ్మకమును. తత్సూనులు — వారికొడుకులు —

జీవయుగంబు వాచెనిసుఁగన్గొనకిఱిమీబావయుఁ । నీరాకల్ మదిఁగోరుచంద్రుఁడుపొ
డుపుఁగన్నీరాకరంబుంబలెన్ ॥ ౩౩ ॥ శా॥ శ్రీలాలిత్యము నిత్యశుద్ధియుఁ గణోత్సే
కంబునుం గల్గియు । దేవ్వలస్ఫూర్తిఁ దలిర్చు తంత్రియను నబ్ధిం జంద్రుఁ గ్రైత్ తోఁచినన్। బో
లుంగాక భవాదృశుండిలఁ దిరుగ్రైప్ట ఫణ్యంబులం బాసినన్ । సాలగ్రామ ఖనిం జనించునె
కదా జాత్యల్ప పాషాణముల్ ॥ ౩౪ ॥ క ॥ ఏనమ్ముడుఁ గడవఁ గఁద । తూన్నానులుకను
గందులఁ గ్రాజుండవు నీవి । తైనతఱి నెంత దుఃఖము । యూనీప్రోపాసపడెదు సిరుగురు
వులకున్ ॥ ౩౫ ॥ సీ॥ పరమేష్ఠినుండి నీతరము దాఁక విశుద్ధతరమైన వంశంబు దలఁచవైతి ।
దరిద్రాకిఱియున్న యూంకల్లిదండ్రులఁ జాల పటువవై సంతోషపఱచవైతి । వహ్నిసాక్షి
గఁ బెండ్లియాడిన యిల్లాలి నిల్లాలి తాకారనొల్లవైతి । ధర్మశాస్త్రార్థవిత్తములవిత్తము
ల చేనలరించి విఖ్యాతినందవైతి । శీలమఖిలంబు నిఁకఁ బిల్లి శీలమనుచుఁ । జదువులివియెల్లఁ
జిఱిఱిచదువులనుచుఁ । దోడివారలు నవ్వ నాతోడ యేల । బేలవై తివియోగుణంబేల
నీకు॥ ౩౬ ॥ వ ॥ అని తనీయదురాచరణస్మరణసంతప్తస్వాంతయై యుత్కంఠీరవ
మధ్య యమర్షోత్కంఠ కలకంఠకులకంఠ కాకలీపాకలీలాపహంబగు నెలుంగు చెలం
గం గలంగి కుంఠితప్రబోధుండగు నాశుంఠుని నిం గెరలి పలికి యొక నలుక మగిడించియు
దంచితప్రయోజన ఘటనాపారవశ్యంబున సామరస్యంబు మీఱఁ నిట్లనియె ॥ ౩౭ ॥ చ॥
పడఁబడఁ బాఱు చున్ వడఁకు ట్టినతల్లి నిఁ దండ్రి నేలలో । వెడలని తమ్ముఁగుఱ్ఱలన వీనకు
లాంగసనోరు లేనియు । తోడుకులబంటుఁ బ్రైదవిడఁద్రోవకప్రోవఁగ నెందునీకపాల్ప
డినదికర్ణునాదలనె భారతసంహితనిల్చు చాడ్పునన్ ॥ ౩౮ ॥ ఉ ॥ నాదుసహా
దరుండు సుజనస్తవనీయ నయప్రసక్తిఁబ్ర । హ్లాదులమెచ్చఁడేన తని యజ్ఞమునం గడుఁ

---

తక్కిన కొడుకులు. కనుఁగందులు — మిక్కిలి పసిబిడ్డలు. ప్రోపు = పోషణమును. ఇరుగురువులకున్ —
తల్లిదండ్రులిద్దఱకును॥ ౩౫॥ విశుద్ధతరము — మిక్కిలి పావనము. తతిఁద్రొక్కి — (చావు) సమయమును
సమీపించి. పటువవు — అల్పుఁడవు. ఇల్లాలితాకారన్ — ఈమనోజ్ఞమైన యాకృతిగలదానిని. ధర్మశా
స్త్రార్థవిత్తములన్ — ధర్మశాస్త్రములయర్థములు తెలిసినవారిలో నధికులగువారిని. విత్తములచేన్ — ధ
నములచేత. నాతోడ — నాసపెంఁదరుఁడా. బేలవు — మూఢుఁడవు॥ ౩౬ ॥ దురాచరణస్మరణసంతప్త
స్వాంత — చెడుపనులు చేయుటను తలఁచుటచేత సంతాపమునొందినమనసుగలది. కంఠీరవమధ్య —
సింహమునకు మువంటినడుముగలది. అమర్ష — కోపమువలని. ఉత్కంఠ — గొంతెత్తి పలుకుటచేత. క
లకంఠకుల — కోవెలలసమూహముయొక్క. కంఠ — గొంతునుబోలి. కాకలీ — సూక్ష్మమైన యవ్య
క్తమధురధ్వనియొక్క. పాక — పరిపాకముయొక్క. లీలా — విలాసమును. అపహము — తొలఁ
గించునది. చెలంగన్ — మ్రోఁగఁగా. కుంఠితప్రబోధుండు — మొక్కపోయిన తెలివిగలవాఁడు.
శుంఠునిన్ — మూఢుని. కెరలి — కోపించి. అలుక — కోపము. ఉదంచితప్రయోజన ఘటనాపార
వశ్యంబునన్ — మేలైన ప్రయోజనముయొక్క సమకూర్పుటయందలి పరవశత్వముచేత. సామరస్యం
బు — సమరసత్వము॥ ౩౭ ॥ తోడుకులన్ — ఆవులను. బంటుఁ బ్రైదన్ — కొలువుఁడు కాండ్రను బిడ్డలను॥
౩౮ ॥ నయప్రసక్తి — నీతియొక్క కూడిక ॥ ౩౯ ॥ కేదారంబులు — వరిమళ్లు. నిర్ధారుండవే — పెం

పూజ్యురాలనై । వేదియలంకరింతునని వేవురిలోఁ బలనాడుకొందునీ । వేదియు లేక
సర్వగుణహీనుఁడవౌట మెఱుంగఁ దమ్ముఁడా ॥ ౩౯ ॥ శా ॥ పీరావేశము దాల్చి స
ర్వధనము న్వెచ్చింతుగాకేమిము । కాఱుంబందున ఖాడసేతువ్రతముల్ కాశ్మీ
రఖండంపుఁగే । దారంబుల్ తెగనమ్ముఁగాజనునె నిర్దారుండవే వెనఱనె । వ్వా
రుఁ లేరే సహోదరాదులు కులధ్వంసంబు నీకర్హమే ॥ ౪౦ ॥ ఉ ॥ కామవికా
రమాత్మనవగాఢతఁ దాల్చిన యేనిసిర్భర । శ్రీ మెఱయంగ రూపగుణశీలకులోన్నతిగల్గు
విప్రక । న్యామణులన్ సహస్రమయినన్ వరియించి రమించరాదె మే । నీమును తై
గృహస్థులు రమించుట మెగ్గె కులాంగనాతతిన్ ॥ ౪౧ ॥ శా ॥ లోలత్వంబున మత్తకా
శినులకిల్లుంబొల్లుచుం జెల్లఁగా । నేలా వెచ్చము సేయ నెవ్వల నమన్నీలాఢ్యులుం జాల
రే । కోలంబోజనియించు వేఁడినను వీఁడోఁఱలాభమో తంద్రిదు । శ్శీలాగారము వార
యావతము నిస్సీ మేటి వాటించునే ॥ ౪౨ ॥ సీ ॥ నర్మగర్భోక్తులు నకటకటలు విం
త నయగారములు బహునాటకములు । పిలుపిచ్చవిద్యలు పీఁకవన్నియలును బెలుచఁద
నంబులు ప్రేలడములు । వక్రభావంబులు వలకారిబాగులు వలసియొల్లములును వట్టిప
సలు । కేరడంబులు సాళగింపులు కిల్బిషాక్రీడనంబులు నడకించు వగలు । బాసపోసనము
లు విశంబములు బ్రమలు । లేని మచ్చికలివియాదిగానైన వివిధ । దుర్గుణంబుల ప్రోవులు
ద్రోహమతులు । వారకాంతల దడవిన వచ్చుగీడు ॥ ౪౩ ॥ చ ॥ విడుమిఁక నైన
నిట్టితువివేకము మామకబుద్ధిపద్ధతిన్ । నడువుము నీకుఁ గావలసెనా హరికౌస్తుభమై
నఁ దెచ్చెదన్ । గడుసరియచ్చకూళపలు గాఁకులవీడుము చేయి మీఁదుగా । నడచిన పూ
ర్ణకాముఁడవు నాయనుజన్ముఁడ విట్లు సేయుచే ॥ ౪౪ ॥ తే ॥ అకట యీరీతి నయ
ము ప్రియంబుగలుగ । నానతిచ్చిన సద్బుద్ధి నాదరించెఁ । జాలదినముల నుండి యు
మైలపడిన । బడుగుగావున వాఁడన్నపానకాంక్ష ॥ ౪౫ ॥ సీ ॥ రాజాలయమున
కు రాకపోకలు సేయు మాసిన చదువులు మరలఁ జదువు । నిశ్శాళ్ల నెచ్చెలు లెదురైన
తలవంచు కులవధూరత్నంబుఁ గుస్తరించు । నాచార్యజనము ప్రత్యహము సంభా

---

ర్లాము లేనివాఁడవా ॥ ౪౦ ॥ అవగాఢతన్ — అతిశయమును. నిర్భరశ్రీ — నిండినసంపద ॥ ౪౧ ॥ మన్నీలు — రాజులు. కోలంబు — ఆట. దుశ్శీలాగారము — చెడ్డనడతకు ఉనికిపట్టు. వారయావతము — భోగముపడుచుల గుంపు. ఇస్సీ — ఛీ ॥ ౪౨ ॥ నయగారములు — మోసపుమెత్తదనములు. పిలుపిచ్చ — మిక్కిలి సివము. పీకవన్నియలు — పైపైమెఱుఁగులు. పెలుచఁదనము — కఠినత్వము. ప్రేలడము — పలవరించుట. వలకారిబాగులు — వలపించునట్టి యలంకారములు. కేరడంబులు — పరిహాసములు. సాళగింపులు — కలగలుప్పనములు. కిల్బిషాక్రీడనములు — తప్పుడు ఆటలు. అడకించు — వంచించు. బాసపోసనములు — పొసఁగని ప్రమాటలు. తడవినన్ — తలఁచినను ॥ ౪౩ ॥ గడుసరి — కఠినులైన. అచ్చకూళపలు గాకులన్ — అచ్చపుక్రూరత్వముగల ముష్టులను ॥ ౪౪ ॥ బడుగు — దిక్కులేనివాఁడు ॥ ౪౫ ॥ మాసిన — మఱచిన. కుస్తరించున్ — దూఱఁడించు. సంభావించున్ — గౌరవించును. ఉపహారము — కానుక. కుతపవేళ — పగలు రెండున్నర జాములనకు పిమ్మటి కాలము. పసిన్ —

వించునర్థావళికి నుపసారమిచ్చి । యర్చించు కుతపవేళాగతాతిథికోటి కొసఁగని నేమదర్శిం
చుఁ బ్రైరుపప్పఁ । దంఘ్రియుగ్మ నీరుంబు తానె యిచ్చుకు । నత్తికాభర్తృతోఁ నవ్వ
న్నప్రసరణి । గ్రామకార్యంబు దీర్చ నంగడికి వచ్చి । తేనె పూసిన కత్తి నాఁ దిరుగుచుండు ॥
౪౬ ॥ వ ॥ అతఁడొక్కనాఁడు ॥ ౪౭ ॥ సీ ॥ గోమేధికోపలాంకురమానితంబులు పుష్య
రాగచ్ఛటాపుంఖితములు । వైడూర్యసంధానవర్ణనీయంబులు హరినీలకీలనాభ్యంచి
తములు । కురువిందసందర్భగురుతరంబులు చతుర్విధవజ్రదళ సమావేల్లితములు ।
మహానీయతరహరిన్మణిపరీతంబులు నకలుషస్థూలమౌక్తికయుతములు । పద్మరాగ
పరీరంభభాస్వరములు । దంతవిద్రుమకృతసముద్గకభృతములు । మాతృభూషలున
త్తికామండనములు । నిజయువతిదాల్చుసొమ్ములన్నియు హరించి ॥ ౪౮ ॥ క ॥ ఒ
కనాఁటిరాత్రిపడుపడు । కనుఁజెప్పక యిల్లువెడలి గాఢతరతమోనికరమె తనదగుతో
డుగ । నొకరుఁడుఁ బేరడవిత్రోవ నూడఁబాడెన్ ॥ ౪౯ ॥ సీ ॥ శోకించు వృద్ధభూ
సురుఁడాత్మపితృదత్తదర్భముద్రికకుఁ జిత్తంబు గలఁగ । నత్తగారిచ్చినహరిసుదర్శనపుఁ
బేరునకు మత్తెయువ వనటఁబొందుఁ । గ్రొత్తగాఁ జేయించుకొన్న ముక్కఱకునై యడలు
చుద్వారస్థయై యూఁదుబిడ్డ । జామాత వెతఁబొందు వ్యామోహియైన వ్యగ్రహాకర్ణవేష్ట
నభ్రంశమునకు । నెంత దుర్బుద్ధి యెంత దుర్భ్రాంతి యహహ । సర్వధనములుఁ గద్దు
రాచారశీలుఁ । డూఁచముట్టుగ నిలుదోఁచియుఁ జికిచనట । యెఱుఁగరో గాక యెవ్వ రె
ఱుకకు గలదె ॥ ౫౦ ॥ ఉ ॥ మోఁచదరంబుగాని ధనముల్ బెను మోపుగ వాఁడమర్చి
యే । తేర్చి వయుఁగాని పేరడవిఁ దూఱి హుటాహుటి నొక్కరుండు లోఁ । జాఁ గొనకంగ
వించి పెలుచంజనుచుండఁగ నొక్కనాఁటి సం । ధ్యావసరంబునం దొకపురాంతికఘోర
వనాంతరస్థలిన్ ॥ ౫౧ ॥ వ ॥ కరుణాదూరులు చోరులంధతమసాకారుల్ పరార్థాపహృ

---

పసులమందను. ఏసుక్ — కాపాడును. ఉద్గమనీయము — దోవతి. అత్తికాభర్తృతోన్ — తోడఁబుట్టినదాని పెనిమిటితో. అంగడికిన్ — రచ్చకు ॥ ౪౬ ॥ ఉపల — ఱాయి. అంకురము — మొలక — పాడి. మానితంబు — గౌరవింపఁబడినది. ఛటా — సమూహము. పుంఖితము — పొదుఁగఁబడినవి. సంధాన — కూర్పుచేత. కీలన — చెక్కడము. అభ్యంచితములు — మిక్కిలి యొప్పిదములు. కురువిందము — ఒకవిధమైన కెంపు. సందర్భము — కూర్పు. సమావేల్లితములు — చక్కఁగా నెఱయునవి. హరిన్మణిపరీతంబులు — పచ్చలచేతఁ బొదుగఁబడినవి. అకలుష — దోషములేని. పరీరంభ — పొదుఁగుడుచేత. భాస్వరములు — ప్రకాశించునవి. సముద్గకభృతములు — బరణులందుంచఁబడినవి. అత్తికామండనములు — అక్కసొమ్ములు ॥ ౪౮ ॥ గాఢతరతమోనికరము — మిక్కిలి దట్టమయిన చీఁకటియొక్క సమూహమే. ఊడఁబాడెన్ — పాఱిపోయెను ॥ ౪౯ ॥ పేరునకున్ — హారమునకు. వనట — దుఃఖము. జామాత — అల్లుఁడు. వెత — వ్యథ — దుఃఖము. కర్ణవేష్టనము — చెవిపోఁగు. ఊఁచముట్టుగన్ — కొంచెమయిన మిగులు లేకుండ ॥ ౫౦ ॥ హుటాహుటిన్ — మిక్కిలి వేగమున. అంగవించి — సాహసించి ॥ ౫౧ ॥ అంధతమసాకారులు — కటికచీఁకటివంటి యాకారముగలవారు. పరార్థాపహృతిత్వరితాంతఃకరణులు — ఒకరిసొత్తును అపహరించుటయందు వడిగల మనస్సుగలవారు. మరాసములు —

తిత్వాగితాంతఃకరణుల్ దురాసదులు విశ్వద్రోహులు ద్వాప్రహులై । తెరువాకటొక్కుమ్మ డిఁ గ్రమ్మి యగ్గలగలసందీప్తాశుగశ్రేణిచే । సిరిధాత్రీసురసూనుఁ గార్ముకరవాశ్లిష్టాశులై యాసునన్ ॥౫౨॥ క ॥ కాయంబునఁ బెదపెదపలు । గాయంబులు చేసెఁ గాని కడువాఁడిమిమై । నాయమ్ము లమర్మహీనుల । నాయమ్ములు దాఁకవయ్యె నాయుర్మర్మహిమన్ ॥ ౫౩ ॥ క ॥ ఒకనెత్తురు బొట్టునకూ । రకయసురులు వేఁపురొడియుక్రమమున దొంగల్ । బకనిభులా పతితుని దోఁ । చికొని రయంబడరఁ జనిరి చెట్టుకొకరుండై ॥ ౫౪ ॥ క ॥ కాఁపుకొడుకొక్కరుండా । కాపురుషుం దెచ్చి యింటికడ కనుకంపా । టోపోద్దీపితబుద్ధిం ద । దాపద్వినివారణక్రియాభిముఖుండై ॥ ౫౫ ॥ సీ ॥ పితృపరిత్యాగవర్ధితకిల్బిషము వోవ నెత్తురు క్రైవడి వ్రేళ్ల నెత్తురొత్తి । కూరుకుపాళ్ళముల మేలొక్కలుపు చాఁపునఁ గంట్ల శాకినీకాండంబు సణిపి చూఁచి । సమయంబుగాద నిశమను దూఁతలఁ ద్రోయు జాడమైనాటు శస్త్రములు నెఱికి । పతయాళువగు బొందిఁ బడకుండుటకుఁ గంద్రపురులిచ్చు గతిఁ జాలఁ బొత్తులునిచి । వట్టికూడును పేనీళ్లు పెట్టి యొట్టి । గలుగు పిద్యంబు లిప్పించి వలఁతియైన । వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని । కంటవత్తిడుకొని సైరికప్రభుండు ॥ ౫౬ ॥ క ॥ నిరనిలసంచారస్థల । మరయికను స్నేహపూరమాయుస్థ్సితియా । యిరు దెఱఁగు బలిసి దుర్దశఁ । బొరయక దీపమ్ము పగిది భూసురుఁ డెసఁగెన్ ॥ ౫౭ ॥ ఉ ॥ తానప్రసంగముల్ దిగిచి తత్స్మరణిన్ దన పెంపు పెద్దగాఁ । బూనివచించు నక్కపట పూరుషుఁ డక్కమనమ్మె నెమ్మదిన్ । జానపదాగ్రగామి తన జాతియు నాతియుఁ గూడి దేవునిం । గా నిజదేశికోత్తముని గాఁ బరమాప్తునిఁ గాఁ దలంచుచున్ ॥౫౮॥ క ॥ తలలోపల నాలుకపూ । సలలో దారంబు పాలఁ జల్లిన నీరుం । బలె వెలి

---

అసాధ్యులు. ఒక్కుమ్మడిన్ — ఒక్కసారిగా. అగలన్ — పగులఁగా. సందీప్తాశుగశ్రేణిన్ — మిక్కిలి వెలిఁగెడి బాణముల పఙ్క్తులను. కార్ముకరవాశ్లిష్టాశులు — ధనుస్సుయొక్క ధ్వనితోఁ గూడిన దిక్కులు గలవారు. దిక్కులందు ప్రతిధ్వని పుట్టునట్టుగా వింటిని ధ్వనింపఁ జేసినవారు. ఆసునన్ — కోపముతో ॥౫౨॥ కాయము — దేహము. ఆయమ్ములు — ఆ బాణములు. మర్మస్థానములు ॥౫౩॥ ఒడియుక్రమమునన్ — పొంచికమ్ముకొని పడినసమయమున ॥౫౪॥ కాపురుషున్ — నీచుని. అనుకంపాటోపోద్దీపితబుద్ధిన్ — దయాతిశయముచేత వెలుఁగుచుండెడి బుద్ధితో. ఆపద్వినివారణక్రియ — ఆపదను తొలఁగించునట్టి వ్యాపారము ॥౫౫॥ వర్ధితకిల్బిషము — వృద్ధినొందింపఁబడిన పాపము. కూరుకు — నిద్రించు. గంట్లన్ — గాయములందు. శాకినీకాండంబున్ — వత్తులసమూహమును, సణిపి — చొప్పించి. పతయాళువు — పడునట్టి స్వభావము గలది. బొంది — దేహము. గంద్రపురులు — ఊఁతకోలలు. పొత్తులు — పొత్తిగుడ్డలు. ఒట్టి — శారము. వెజ్జున్ — వైద్యుని. ఎచరించి — ఎచ్చరించి — ఎచ్చరికచేసి. కంటవత్తిడుకొని — ఏమఱక. సైరికప్రభుండు — కాఁపుదొర ॥౫౬॥ నిరనిల — గాలిలేని. అరయిక — విచారణ. స్నేహపూరము — (మొదటియందలి) మంచిచమురుయొక్క సమృద్ధి. దుర్దశన్ — చావును. పొరయక — పొందక. ఎసఁగెన్ — అతిశయించెను ॥ ౫౭ ॥ పెంపు — పెంచుట. జానపదాగ్రగామి — పల్లెపట్టులయందుండువారిలో ముఖ్యుఁడు — కాఁపువాఁడు. జాతి — కులమువారు — చుట్టములు. నాతి — పెం

మెఱుఁగకమనసులు । కలసియుభేదమునఁ గాఁబ్రకటనతోఁడుండెన్ ॥ ౫౯ ॥ క॥ కలధౌ
తాద్రివసతిశశికలదానఁ జాలునొకవికారపుఁ గోడన్ । చలదాలోలకటాక్షాం । చ
లదామనిబద్ధతరుణజనఖంజనమై ॥ ౬౦ ॥ ఉ॥ ఇంటికినడ్డమూఁకయొకయంతయులేకచ
రించువానిచే । నంటినఁ గందుగెందళుకు లంగమునం గలవానిమిక్కిలిం । గంటికి
నించువానిఁ దెలికన్నులవానిఁ బిసాళిబాఁపనిం । బంటదిగోరుచారుకుచపంజరకీరము
గారవింపఁగన్ ॥ ౬౧ ॥ సీ॥ పలుపికారంబులఁ గలగల్పుఁ జూపులరాకపోకలబయల్
పాఱఁ జేయు । దనకంబుగమకంబుదత్తఱంబునుహత్తిమనసుసాఁగినపజ్జఁ జొనుపఁ
గోరు । కుదురుపాలిండ్లపైఁ గొంగుజాఱఁగఁ గొప్పువీడనూరకనవ్వువెట్టినవ్వు । నే
రాలిపట్టిబిట్టెత్తిచెక్కిలినొక్కఁగఁ బనిచేడ్చినఁ గౌఁగలించు । దండసకిమెడఁ బుం
జాలదండఁ బెట్టుఁ । బిట్టుమెట్టెలుబిగువంచుఁ దెగికళాదు । వనితచిన్నారిపొన్నారి
వయసువాని । విప్రనందనుఁ గన్నంతవెకలియగుచు ॥ ౬౨ ॥ క॥ దుర్లలితాతనువి
లసన । నిర్లజ్జాస్వాంతకాంత నేరుపుమెఱయన్ । జెల్లాటమాడుమోహము । లే
ర్లయివర్తిల్లనమ్మహీసురుతోడన్ ॥ ౬౩ ॥ తే॥ దృష్టిపాతంబునోడివివ్వైదెరలఁబ
ట్టు । ఫాలపట్టికకనుకట్టుబాలచేల । నిఱియఁదలఁగట్టియొకమూలనొఱగునేల । గ్రు
డ్లుపిరుట్టబఱచినకొంగుపెంద ॥ ౬౪ ॥ ఉ॥ తేరెడుకన్నుదోయిపడదేఱెడుముద్దుమొ
గంబుసారెకున్ । వ్రాలెడుగొప్పకొప్పువసివాఁడెడునన్నువకౌనుకాఁకలం । దూలె
డుతేఁతమేనునయితోట్రిలుసమ్మగనాలిరాచిబా । గాలఘువర్తనుండవసియంగజబా
ధితఁ గాఁదలంచుచున్ ॥ ౬౫ ॥ క॥ ఎవ్వనికివలచెనొకొయీ । జవ్వనియుసిరవ్వమీ
ఱుసరసోక్తులులే । నవ్వులుముడిచినపువ్వుల । రువ్వులఁ దనయందె సమధిరూఢము

---

డ్లాము. దేశికోత్తమునిఁ గాన్ = గురుశ్రేష్ఠునిఁగా ॥ ౫౮ ॥ ౫౯ ॥ వసతిన్ = ఇంటియందు. శశికల = చంద్రకళ. చలదా...ఖంజన = చలించుచున్న వియఱంచు తిరుగుడుపడునవియునైన కడ కంటి చూపులనెడి యురులచేతకట్టఁబడిన యౌవన పురుషులనెడి కాటుకపిట్టలుగలది ॥ ౬౦ ॥ అడ్డ = నిర్బంధము. కందు = వర్ణహీనముగు తళుకులు = తళతళకాంతులు. ఇంచు = ఇంపగు. పిసాళి = వంచకుఁడైన. కీరమున్ = చిలుకను ॥ ౬౧ ॥ కలగల్పు = ఐకమత్యము. తమకంబు గమకంబు = మోహముయొక్క అధిక్యము. హత్తి = పొంది. పజ్జన్ = ప్రక్కను. పాలిండ్లు = స్తనములు. పిరాలిపట్టన్ = తోడికోడలిబిడ్డను. బిట్టు = మిక్కిలి. దండసకిమెడన్ = దగ్గఱనుండెడిచెలికత్తె యొక్క మెడను. పుంజాలదండ = మెడనుధరించెడి యొక విధమయిన యాభరణము. తెగి = తెగఁబడి. కళాదుల్ = అగసాలెవానివి. చిన్నారిపొన్నారి = మనోజ్ఞము. వెకలి = అసక్తురాలు ॥ ౬౨ ॥ దుర్లలితాతనువిలసననిర్లజ్జాస్వాంత = దుష్టమయిన యొయ్యారముతోడి యున్మథోద్రేకముచేతలజ్జలేనిమనసుగలది. చెల్లాటము = పరిహాసము ॥ ౬౩ ॥ గ్రుడ్లన్ = కనుగ్రుడ్లయందు. ఉట్టన్ = తాఱఁగా ॥ ౬౪ ॥ వడ = తాపము (లేక) బడలిక. వసివాఁడు = మిక్కిలివాఁడు. అన్నువకౌను = సూక్ష్మమయిన నడుము. కాఁక = తాపము. నాలి = కుత్సితము. లఘువర్తనుఁడు = నీచప్రవర్తనముగలవాఁడు ॥ ౬౫ ॥ రవ్వ = అల్లరి. రువ్వు = విసరివాటు. సమధిరూఢములు = చక్కగా ఎక్కి

లఁగుటల్ ‖ ౬౬ ‖ మ ‖ బళిరా తేరకుఁ జేరదక్కెఁ గుటిలీబంగారుకుండంబుఁ జం। కలు
దాటించుచుఁ గెంపుమోవి దొండకెంగా గుబ్బపాలిండ్లుబి। ట్టలమంగా ముఖగంధపా
రణము సేయంగాఁ గటీసీమను। త్పలపత్రాళి ఘటింపఁగాఁ దివురు మిత్రద్రోహి హా
మోహాంధతన్ ‖ ౬౭ ‖ సీ ‖ తలవుండ్లు గడిగించి తనుబ్రతికించెఁగా యడవిఁ జోరా
హతుండైనఁ దెచ్చి। కన్నబిడ్డలకన్న గారవంబునఁ జనవిచ్చెఁగా నిచ్చలు నింటిలోన।
గ్రాసవాసక్లేశకష్టలత్వంబు డించి యనురక్తిఁ బెనిచెఁగా ననుదినంబు। గురువుగా
నేల్పుగాఁ గూర్చుచుట్టంబుగా భావించికొల్చెఁగా భక్తియుక్తి। నెవ్వఁడా రెడ్డియిం
టికి నెగ్గుఁ బాలఁ। జేయు గుడిచుండి గుడి కొట్లుదీయు కరణిఁ। గపటనట నాటకుఁడు ద్రో
టఁగట్టుబోఁడు। కాయజామేయసాయకాఘాతభీతి ‖ ౬౮ ‖ చ ‖ కరఁగిన డెంద
ముల్ వికృవుగా ననికోమ్కలు పారవశ్యముల్। బొరసిననిట్టచూపులు గుములు గొను
ముత్తుపలకాంకురావళుల్। ఒరిగిన సిగ్గు నంగలిచి చీఁకటి వేఁకటి రేలఁ జాలవా। లిరిఁ
దలిరాకుఁ బోఁడియును ళీకవిశిష్టుఁడు దుష్టచేష్టలన్ ‖ ౬౯ ‖ క ‖ మతిబాపమనక ప్రా
ణవ్యతికరమగు తెగువకతఁడు చొరఁబడె నరకే। సతికోఁ దోషో మరణే। సతికిం భయ
మన్న చనువు చదువంబోలున్ ‖ ౭౦ ‖ ఉ ‖ అర్ధమరేయి దాఁక పొలమారసి మారశిలీ
ముఖాహతిన్। నిద్దురఁ గాచియున్న మగనిన్ జగసీలిపిసాళిజంతయు। ముద్దియ సేవ సేయు
దొకముచ్చటయాడదు మూఁగబోలె నే। సుద్దియు లేక కన్మొగిచి చూచు నొగతిఁ దోఁ
చు చెల్వసిన్ ‖ ౭౧ ‖ సీ ‖ పొన్నాకు పైతేనె సన్నచంద్రిక మోవిమాధుర్య మనక వే
మాఱుఁ బొగడి। యామని బుగబుగలంగ చంపకదామగంధంబనక పెకుగతులనె
న్ని। పడనున్న సద్లసంపద పెంపు పాలిండ్ల బీరంబనక సారెసారెఁ దలఁచి। తెలియనభ్రి
చ్ఛాయ వలమానకచభరప్రకటనంబనక మాటికిని మెచ్చి। దినదినంబును గసికాటు చెన

నః ‖ ౬౬ ‖ తొడుకొంగాన్ — గ్రహింప. అలమంగాన్ — ఆక్రమింపను — పట్టను. తివురున్ —
ప్రయత్నించును ‖ ౬౭ ‖ చనవు — స్వాతంత్ర్యము. గ్రాసవాసక్లేశకష్టలత్వము — అన్నవస్త్రముల కై
కష్టపడుటయనెడి క్లేశమును. కూర్చు — ప్రియమైన. కాయజామేయసాయకాఘాతభీతిన్ — మ
న్మథునివైన మేరలేని బాణముల దెబ్బలవలని భయముచేత ‖ ౬౮ ‖ డెందములు — మనసులు.
పారవశ్యము — చొక్కు. నిట్టచూపులు — చలింపని చూపులు. ముత్తుపలకాంకురావళులు — సంతో
షమువలని గగ్గురుపొటు కలపుబ్బులు. ఒరిగిన — చిరిగిన — పోయిన. చీఁకటి వేఁకటి రేలన్ — చీఁక
టి గల రాత్రులందు. వాలిరిన్ — వాలాయముగ. అళీకవిశిష్టుఁడు — కపటమైన యోగ్యతకలవాఁడు ‖
౬౯ ‖ ప్రాణవ్యతికరము — ప్రాణము పోవునట్లు చేయునది. నరకేసతి — నరకమగుచుండఁగా. కోదో
షః — ఏమిదోషము. మరణేసతి — చావు అగుచుండఁగా. కింభయమ్ — ఏమిభయము ‖ ౭౦ ‖ అర్ధమరే
యి — అర్ధరాత్రము. జగసీలిపిసాళిజంత — మిక్కిలి మాయచేష్టలను వ్యాపింపఁజేసెడి ధూర్తురాలు. చె
ల్వసిన్ — విటుని ‖ ౭౧ ‖ చంద్రిక మోవి — ఎఱ్ఱఁదనముగల యధరము. ఆమని — వసంతఋతువు. బీ
రంబు — బిగువు. అభ్రిచ్ఛాయ — మబ్బునీడ. వలమానకచభరప్రకటనంబు — వ్రేలువగాఁ జుట్టఁబడు
చున్న కొప్పుయొక్క ప్రసిద్ధి. కసికాటు — తాలిమిగులకకఱచుట — కొంచెపుఅనుభవము. చెనకు — తా

కువలన । దప్పిదీఁ బసితమకంబు దెప్పరంబుగ । బాపసమకట్టి జాఁచుఁ డప్పాఁపుఁ డసతి । నె
త్తుకొనఁబోవ నిందందు నెడరు వేచె ॥ ౭౨ ॥ క ॥ ఆతతజేఁ దన్నగరీపతి । జాతరసాటిం
చెఁబతు విసరమనితరసా । ధ్యాతతవాతామయని । ర్ఘాతాహతిఁ దూలగాలిగంగలకె
ల్లన్ ॥ ౭౩ ॥ సీ ॥ గోర్వచము రంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళిత
వారి । కట్టిరి చిఱుతచౌకముల క్రొంబుట్టముల్ కాటుకదీర్చిరి కన్నుఁగవల । దిద్దిరి సిం
దూరతిలకంబు బటువుగా నక్కుఁగొప్పుల విరుల్ గ్రుక్కిరిద్ధి । నింబప్రవాళమాల్యం
బులువైచిరి చిట్టిపొట్టి ధరించిరిట్టునట్టు । తరుణధావనధగధగద్దశనమణుల । హత్తు
కొలిపిరి లేఁతవీడ్యముల డాలు । పర్వదినములఁ బామరప్రమదలుదిత । నియమసంభా
వనారంభసంభృతబుద్ధి ॥ ౭౪ ॥ క ॥ ఎడ్డైతనపుఁ గయిసేఁతల । రడ్డుఱుఁ దవిరి పుర
స్సరద్భార్యముగా । గుడ్డంబు చక్కిఁ గట్టం । బడ్డ మహాశక్తి దివ్యభవనంబునకున్ ॥ ౭౫ ॥
వ ॥ అమ్మహాశ్వనంబజప్రధానంబగుట విబుధసభయుంబోలియు మహాసు
రోదారంబును, తమోవికృతివిధేయంబగుట విధుబింబంబునుంబోలియుఁ దారాభి
యోగముదితంబును, బహుళధ్వనిపరీతంబగుట సత్కవిత్వంబునుబోలియు నసా
ధువర్ణసంబాధబంధురంబయ్యె నయ్యెడ ॥ ౭౬ ॥ సీ ॥ అంభోధరముక్రిందనసియా
డునైరావతియుఁబోలె సిడిమ్రానఁ దెఱవయొర్తు । చెందమ్మికొలన రంజిల్లునంచయుఁ

---

కుట. తమకంబు దెప్పరంబు — మోహాతిశయమును. అసతిన్ — అంకులాఁడియగునా కాఁపుదానిని. ఎడరు — సందు. వేచెన్ — కనుపెట్టెను ॥ ౭౨ ॥ అనితర..హతిన్ — అనితరసాధ్య — ఇతరముచేత సాధింపరాని. ఆతత — విశేషమయిన. వాతామయ — గాలికంటు తెవులనైది. నిర్ఘాతాహతిన్ — పిడుగుదెబ్బచేత. గాలిగంగలకున్ — పిశాచరూపిణులైన క్షుద్రస్త్రీదేవతలకు ॥ ౭౩ ॥ నిశామిళిత — పసుపుకలసిన. బటువుగాన్ — వట్రువగా. నింబప్రవాళమాల్యంబులు — వేఁపచిగురుదండలను. చిట్టిపొట్టి — చిన్నచిన్నసొమ్ములను. తరుణధావనధగధగద్దశనమణులన్ — సమయమునందుఁ దోముకొఁబడిన కక డగ ప్రకాశించెడి రత్నములవంటి పండ్లయందు. హత్తుకొలిపిరి — కూర్చిరి. డాలు — కాంతి. పామరప్రమదలు — గ్రామ్యస్త్రీలు. నిభృత — దిద్దఁబడిన ॥ ౭౪ ॥ ఎడ్డైతనపుఁగయిసేఁతన్ — మోటుతనపు అలంకారములతో. పురస్సరద్భార్యముగాన్ — ముందు నడుచుచున్న భార్యలు కలుగునట్టుగా. గుడ్డంబుచక్కిన్ — చేనివెంబడి ॥ ౭౫ ॥ అజప్రధానంబు — మేఁకపోతులు ముఖ్యముగాఁగలది; బ్రహ్మముఖ్యముగాఁగలది. విబుధసభ — దేవసభ. మహాసురోదారంబు — అధికమైన కల్లుచేత హెచ్చినది; గొప్పయసురులచేత దొడ్డది. తమోవికృతిః ధేయంబు — తమోగుణవికారమునకు వశపట్టయినది; చీఁకటివికారముచేత లోఁగినదైనది. విధుబింబము — చంద్రబింబము. తారాభియోగముదితంబు — కంటిగ్రుడ్ల మెడఁబాటుచేత సంతోషించినది — అనఁగా కన్నులు తేలవేయుటచేత సంతోషించినది; తారలయొడఁబాటుచేత సంతోషించినది. బహుళధ్వనిపరీతంబు — అధికధ్వనిచేత ఆవరింపఁబడినది. సత్కవిత్వము — మంచికవిత్వము. అసాధువర్ణసంబాధబంధురంబు — నీచజాతులగు జనులయొరపిడిచేత బన్ధమైనది; తప్పు అక్షరముల నింపుచేత ఒప్పిదమయినది ॥ ౭౬ ॥ అంభోధరము — మబ్బు. ఐరావతి — మెఱపు. సిడిన్ — సిడిమ్రానియందు. చెందమ్మి — ఎఱ్ఱతామర. నిప్పటేటన్ — నిప్పులయేటియందు. తొలు

చోలెఁ నిప్పుటేటఁ జరించె నెలఁత యోర్తు । తొలుసంజ యండపత్తిని సంధ్య యనుచు బోలె
నీఁగె బందిరిగుండ మింతి యోర్తు । జలనీలిపై నెక్కు కలువమొగ్గయుఁ బోలె ననటాకున
గ్రించె నతివ యోర్తు । కాంత యొకర్తు మూఁపునఁ గడలిచ్చె । మారుగాలిచ్చె నాక
సుధామధురవాణి । లలన యొకర్తు నోరి తాళంబులిచ్చె । శక్తిజాతర సద్భక్తి శ
క్తులెసఁగ ॥ ౭౭ ॥ క॥ బత్తులును సువాకత్తుల । మొత్తిరి పశుసమజ ముండనములు చండము
లౌ । నెత్తురుధారలు ఘోరవి । పత్తి మిరన వారుణ ప్రభలు ప్రబలంగన్ ॥ ౭౮ ॥ తే॥
పెలుచఁ గలు చొక్కు చెలువల తలకు నెక్కు । తోన దిక్కుల తలకెక్కుఁ దోడఁ గొఁదపు
ము । దేవిగుడిలోన నొక్కొక్క దివియ దోఁపఁ । దోన నొక్కొక్క చుక్కయుఁ దోఁ
చె మింట ॥ ౭౯ ॥ క॥ ఎడరగుట దెలిసి పాఱుం । బొడుపఁడు గొని చని యెమారు భూమి కి
నటసం । దడి బొమ్మఁడు పెండ్లాడెను । వడువునఁ గసుగాఁపుఁ బూపవయసు మిటా
రిన్ ॥ ౮౦ ॥ తే॥ కాఁపుఁ గోడలు కంచంత కాఁపురంబుఁ । బాలవంటికలంబుఁ గా
ద్పుటిచి యుటికె । మగని నటు వెట్టి రెండవ మగని వెంట । నుపిదంక బుద్ధి పెడతలనుం
డుఁ గాదె ॥ ౮౧ ॥ ఉ॥ ఆకుమఱుంగు పిందె యయి యుంతి పురంబున బోలె నన్నరా ।
కాకుముదప్రియాస్యభయగాఢతరత్వర నేగుఁ గానిలో । నాఁకలిదప్పి యుంటరవికరా
త్రియు నెన్నఁడు మన్మథాస్త్రకీ । లాకులతప్తచిత్తులకు లక్ష్యము సేసిన నొప్పు తెప్పె
యున్ ॥ ౮౨ ॥ సీ॥ కఠినకంఠీరవాకృతనఖక్షతజరత్కరిశిరశ్శుక్తి శార్కరిలతలము ।
లాశాంతజంతుకంఠాసృగుగ్రవ్యాఘ్రముఖగుహాభాంకారముఖరితంబు । ఉత్ప్వి...

---

సంజ = ప్రాతఃకాలము. ఈఁగెన్ = చొచ్చెను. పందిరిగుండము = పందిటిలోని నిప్పులగుండము
ను. జలనీలి = పాఁచి. అనఁటాకున గ్రించెన్ = అరఁటియాకు వేసి యన్న నైవేద్యము చేసెను ॥ ౭౭ ॥
బత్తులు = భక్తులు. సువాకత్తులన్ = సుసన్నైన వాఁడిగల కత్తులచేత. పశుసమజ ముండనములు = పసుల
గుంపుతలలు. చండములు = భయంకరములు. ఘోరవిపత్తి మిరన వారుణ ప్రభలు = భయంకర
మయిన యాపత్కాలమునందలి క్రొత్తవియగు ఎఱ్ఱని కాంతులు. ప్రబలంగన్ = అతిశయించఁగా ॥
౭౮ ॥ పెలుచన్ = అధికముగా. తమము = చీఁకటి ॥ ౭౯ ॥ పాఱుంబాఁపనఁడు = దుష్ట
బ్రాహ్మణుఁడు. కొని = తీసికొని. బొమ్మఁడు = బ్రాహ్మణుఁడు. కసుగాఁపుఁబూపవయసు మిటారిన్
= పసిదియు పూవువలెను మోజ్ఞమయిన వయసుగలదియు నైన కాఁపుపడుచును ॥ ౮౦ ॥ కాద్పు
టిచి = చెటిచి. ఉటికెన్ = పాటిగాయును. పెడతలన్ = వెనుకటితలయందు ॥ ౮౧ ॥ రాకాకు
ముదప్రియాస్య = నిండుపున్నమనాటిచంద్రుని వంటి ముఖముగలది. భయగాఢతరత్వరన్ = భయ
ముచేత మిక్కిలి హెచ్చయిన త్వరచేత. రవికరాత్రి = ఎండవలని బాధ. మన్మథాస్త్రకీలాకుల తప్త చిత్త
లకున్ = మన్మథుని బాణములవలని మంటలచేత కలఁతపడి తపించు చిత్తములు గలవారికి ॥ ౮౨ ॥ కఠి
న...తలములు — కఠిన = కఠోరములైన. కంఠీరవ = సింహములయొక్క. ఆకృత = మొక్కపోని.
నఖ = గోళ్లచేనైన. క్షత = గాయములుగల. జరత్కరి = ముసలియేనుఁగులయొక్క. శిరః = తలల
యందలి. శుక్తి = ముత్తెపుఁజిప్పలచేత. శార్కరిల = గులకగలవియైన. తలములు = ప్రదేశములును.
ఆశాంత...ముఖరితంబులు — ఆశాంత = దిక్కులకొనలయందలి. జంతు = జంతువులయొక్క. కం
ఠ = మెడలవలని. అసృక్ = నెత్తుటిచేత. ఉగ్ర = భయంకరములయిన. వ్యాఘ్ర = పెద్దపులులయొక్క.

ద్విపాణాగ్రనిగ్రహావహత్ప్రస్తరప్రసవసౌరభమయంబు । లజ్ఞాతరవికరవ్యాపార
భూరుహచ్ఛాయానపాయాతిశైత్యఖనులు । గహనఘంటాపథంబులు గడచినడఁ ।
యొకపక్కణముఁ గాంచియుఁ దల్లి । యపరవర్ణస్నుషయు బ్రాహ్మణాధముండు ।
బోయకులమునఁ గలసిరి పొలుపు దక్కి ॥ ౮౩ ॥ తే ॥ ఎన్నిజన్మంబులేనియుఁ జన్న
పిదపఁ । గాని ప్రాపింపరాని ధరానిలింప । జాతిగడలోన నపపజాతితోడఁగి ।
కల్లుపెల్లాని వేఁటాడు గరుసు నారసె ॥ ౮౪ ॥ క ॥ స్వఘ్రాణానిలసౌరభ । మాఘ్రా
ణింపఁగ మదాకులాఖేటరతిన్ । వ్యాఘ్రాదికభయదాటవి । శీఘ్రగతిన్ మెలఁగునస
తిచెలువుఁడుఁ దానున్ ॥ ౮౫ ॥ మ ॥ గతిమధ్యస్తనకుంతలస్తబకవీక్షాగర్వదుర్వార
యా । సతిచేమానమెయానమద్యనికనిస్సారంబు పాత్రంబు దాల్చుతగుల్ గా
దని రోసియా వృషలీవాలుందూపుఁ గ్రొమ్ముంటకా । హతియాబర్హినృగేంద్రకుంభిచ
మరీయూథంబు నేణంబులున్ ॥ ౮౬ ॥ సీ ॥ జలుకలు వారఁగాస్సగదంచి వెదురుబియ్య
మునఁ బువ్వులవలె నంచిలోవి । వాఁడిడించిన క్రొత్తవంటకంబతిమాత్రధౌతశరావ
పాత్రమునఁ జాల । వడ్డించి పలువన్యవన్యామిషంబులు చుట్టువాఁ గనుంచి చొక్కట
మునఁ । గాఁచినగురునెయ్యి చేచాఁచఁ జాచినంతయుఁ గుమ్మరించి తత్క్రపూర । మొ
కయలాబుశలాటుఖండోదరమునఁ । బూన్చియటు డించి తానును బొత్తుగలసి । సామి

---

ముఖగుహా — నోళ్లవలన వెడలెడి. భాంకార — భాం అనెడి ధ్వనులచేత. ముఖరితంబులు — మ్రోఁగునవి — ప్రతిధ్వనులిచ్చునవి. అశ్వద్విప...మయంబులు — అశ్వద్విపత్ — కారెనుబోతులయొక్క. విషాణ — కొమ్ములయొక్క. అగ్ర — మొనలచేత. నిగ్రహ — భేదింపఁబడుటచేత. వహత్ — వహించుచున్న. ప్రస్తరప్రసవ — ఱాతిపువ్వులయొక్క. సౌరభమయంబులు — పరిమళవికారములుగలవి. అజ్ఞాత...ఖనులు — అజ్ఞాత — తెలియఁబడని. రవికర — సూర్యకిరణములయొక్క. వ్యాపార — వ్యాపారముగల. భూరుహ — వృక్షములయొక్క. ఛాయా — నీడలచేత. అనపాయ — అపాయములేని. అతిశైత్య — మిక్కిలిచల్లఁదనమునకు. ఖనులు — గనులు — స్థానములు. గహనఘంటాపథంబులు — అడవులపెద్దబాటలు. కడచి — దాఁటి. పక్కణము — బోయపల్లె. అపరవర్ణస్నుష — శూద్రుని కోడలు. పొలుపు — ఒప్పిదము ॥ ౮౩ ॥ ప్రాపింపన్ — పొందను. ధరానిలింపజాతిన్ — బ్రాహ్మణకులమును. పాపజాతి — దుర్జనుఁడు. తొలఁగి — విడిచి. గరుసు — మేర ॥ ౮౪ ॥ మదాకులాఖేటరతిన్ — మత్తుచేత కలఁతనొందినవారిదైన వేఁటాడుటయందలి యాసక్తిచేత ॥ ౮౫ ॥ గతి...దుర్వార — గతి — నడక. మధ్య — నడుము. స్తన — చనులు. కుంతలస్తబక — కొప్పు. వీక్షా — చూపు. గర్వ — వీనివలని గర్వముచేత. దుర్వార — నిలుపరానిది. తాల్చుతగులు — ధరించుటయందలి యాసక్తి. కాదు — తగదు. వృషలీ — శూద్రస్త్రీ. వాలుందూపుఁ గ్రొమ్ముంటకున్ — అతిశయించిన బాణముచేత నిక్రొత్తుటకు. బర్హి — నెమలి. కుంభి — ఏనుఁగు. ఏణంబులు — జింకలు ॥ ౮౬ ॥ జలుకలు — పొట్టు. అంచిలోవిన్ — చిన్నవంటకుండయందు. అతిమాత్రధౌతశరావపాత్రమునన్ — మిక్కిలి చక్కఁగాఁ గడుగఁబడిన మూకుటియందు. వన్యామిషంబులు — అడవిమృగములమాంసములు. చొక్కటమునన్ — స్వచ్ఛముగ. గురునెయ్యి — గవయమృగముయొక్క నెయ్యి. అలాబుశలాటుఖండోదరమునన్ — వెల్లసొరకాయచిప్పలో. సామిదష్టాన్నకబళములు — సగముకఱచిన అన్నపుముద్దలు.

దష్టాన్నకబళములఁ సామికొసఁగు । నగుచుఁ జవురెత్తరించుచు నిగురుఁబోఁడి ॥ ౮౭ ॥
శా ॥ కాఁపుం గొంజికు రాకుఁ బోఁడి పరలోకంబుం దత్ప్రాపింపుడున్ । వ్యాపాదంబున
నాతఁడొందు గడ రూపాజీవ రాజాననం । దాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవి మదాంధన్ బం
ధురశ్రోణి దెపి । ణాపాణింధమపాణి నొక్కప్లవకన్యం గూడి క్రీడింపఁగన్ ॥ ౮౮ ॥ వ ॥
అపవిత్రంబగు పుత్త్రలాభంబు దత్కళత్త్రంబునందు సంభవించె నిట్లానష్టపూర్వాద్వి
జన్మంబందు కష్టమార్గంబున నెలసి నెలఁతయుం దానును బ్రాలుమాలి మృణాళనాళ
పేశలంబగు ఫణాధరపరివృఢ ఫణాఫలక తలిమతలంబున నంటసిలంబడ నెన నెడం బె
క్కుపాతకంబులు పార్జించుచు వర్తించి వర్తించి యొక్కనాఁ డొక్కరుండు సంగుళుక్క
రకుమారయుగళంబుఁ గుపితశరభశాభంబగు దాసిగళగళాయమాన గళనిగళనియమి
తంబుగఁ గేలఁగీలించి యొంటిపాటున వేఁటపైఁగల తివుట నూటాడుచు సమీపాట
వీమధ్యంబుఁ జొచ్చి యాస్ఫోటించి పిక్కచెదరక దిక్కులు పరిభ్రమించి యదభ్రమ
దవిభ్రమ భూయిష్ఠంబులగు మృగంబులం దెగఁబూచి యేచి కన్నిచ్చకు వచ్చు పెక్కు
నంజుడులు చేవడించక కావడించి ప్రొద్దస్తమించునంతకు నిజనిశాంతంబునకుఁ బ
అతెంచునప్పుడు ॥ ౮౯ ॥ మాలిని ॥ కుపితశమనచక్షుః క్రూరదుర్వారకీలా । స్థపుటి
తమగు వహ్నిన్ దద్దివాకీర్తియిల్ల్ ప్రుమ్ । గ్గిపడి మెసఁ మధుపానక్షీబజాయాతనూజాత
పరిజనయుతంబై దైవదుర్భావదృష్టిన్ ॥ ౯౦ ॥ వ ॥ తనగృహమిట్లు పత్న్యాదుదారధనా
దులతోడ భ్రమ్మగ్నంగాఁ గని వెఱఁగంది కడికన్నుఁ గ్రంతలమొంతలఁ బోసినట్లు బోరనఁగ
డుబాష్పపూరములు గ్రమ్మఁగ నేడ్చుచు మూర్ఛవోయియు । ల్లసఁ దెప్పనెన్ విసిందిత

---

సామికిన్ — ప్రియునికి ॥ ౮౭ ॥ వ్యాపాదంబునన్ — ద్రోహచింతచేత — వంచనచేత. రూపాజీ
వరాజాననన్ — బోగముదానిని. తాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవిన్ — చీఁకటిమ్రాని యాకుగుత్తులయొ
క్కమంచి కాంతివంటి దేహకాంతిగలదానిని — కటికెంలుపైఁ దేహకాంతి గలదానిని. బంధురశ్రో
ణిన్ — ఒప్పిదమయిన పిఱుఁదులు గలదానిని. వీణాపాణింధమపాణిన్ — వీణావాద్యము చేతఁగలదా
నిని. ప్లవకన్యన్ — మాలపడుచును ॥ ౮౮ ॥ ఎలసి — కూడి. పేశలంబు — ఒప్పిదమైనది ఫణాధర...
తలంబునన్ — ఫణాధరపరివృఢ — శ్రేష్ఠమైన గొప్ప పాముయొక్క. ఫణాఫలక — పలకవంటి పడగ
యనెడి. తలిమతలంబునన్ — పానుపుయొక్క ప్రదేశమునందు. అంటసిలంబడన్ — అంటునట్లుపడు
టకు. ఉపార్జించుచున్ — సంపాదించుచు. కుపిత — కోపించిన. గళనిగళ — మెడగొలుసులచేత.
తివుటన్ — పూనికచేత. ఆస్ఫోటించి — చప్పట్లు చఱచి. పిక్కచెదరక — ఏబాధయును లేక. అదభ్రవి
భ్రమభూయిష్ఠంబులు — మిక్కుటమయిన త్రిప్పటచే నిండుకొన్నవి — మిక్కిలి త్రిప్పటచేత అలసె
నవి. తెగఁబూచి — చంపి. ఏచి — అతిశయించి. చేవ — బలము. కావడించి — కావడిగట్టి. నిశాం
తంబునకున్ — ఇంటికి ॥ ౮౯ ॥ కుపిత...స్థపుటితము — కుపిత — కోపించిన. శమన — యముఁడైన.
చక్షుః — కన్నులవలని. క్రూర — క్రూరమయిన. దుర్వార — నివారింపఁగూడని. కీలా — మంటలచేత.
స్థపుటితము — ఆక్రమింపఁబడినది. తద్దివాకీర్తియిల్లు — ఆచండాలునియిల్లు. త్రుగ్గి — కాలి. మధు
పాన...పరిజనయుతంబు — కల్లుత్రాగుటచేత మత్తుగొన్న పెండ్లాము బిడ్డలు పనివాండ్రు వీరితోఁ
గూడినది. దైవదుర్భావదృష్టిన్ — దైవముయొక్క చెడ్డతనపు చూపుచేతను ॥ ౯౦ ॥ కంద —

కుల్యవహర్త మనోబలంబునన్ ॥ ౯౧ ॥ క ॥ ఇలఁ జదికిలఁబడి పులుమఱు । వలదో ర్చుచు వికృతవాగ్వదనమున లాలా । జలములు తీఁగెలు సాఁగఁగఁ । బలుకును తండాలి గుఱిచి పరిచితరక్తిన్ ॥ ౯౨ ॥ ఉ ॥ ఎల్లరు నెల్లచో ధనము లిచ్చి మృగాక్షులఁ గొంద్రు గాసియొ । పల్లవపాణి యేఁ బరమపావనవంశము నిచ్చి కొంటి నీ । నల్లనిరూపు నిక్క మని నమ్మి ధృతిం బడి గాక నేఁడు వి । ద్యుల్లతికాధికాభినయధూర్వహమౌట యెఱుం గనింతయున్ ॥ ౯౩ ॥ ఉ ॥ సన్నపుసిబ్బెముల్ గలుగు చన్నులఁ బయ్యెద కొంగు వాలఁగాఁ । గిన్నెరవీణె మోపి శ్రుతిగీల్కొన సారెలు చక్కనొత్తియు । ద్యన్నఖరప్రఘూర్ణములఁ దంత్రులు మీటుచు నాలపించు నీ । తిన్నని యెల్గు నా చెవులఁ జేసియు లోలుక చవుల్ దలంచెదన్ ॥ ౯౪ ॥ ఉ ॥ ఈ కడజాతి నాతికి హిహీ మహిదేవుఁడు చిక్కె నంచు నన్ । రాకఁ బోకఁ గన్ జనపరంపర కెంపగు చూడ్కిఁ జూచియుం । బూకృత మాచరించుటకు బుద్ధి దలంక కలంకముక్తచం । ద్రాకృతిఁ బొల్చు నీ ముఖమునం దమృతస్థితి గాంచి మించుటన్ ॥ ౯౫ ॥ ఉ ॥ పుత్రులు లేరె యెవ్వరికి భూమిసురాన్వయవర్ధనుల్ భవ । త్పుత్త్రి కలం డటంచు నెవరు మును పుట్టరు గాక తదాస్యకాంతి త । ద్గాత్రవివృద్ధి తద్భుజయుగస్ఫురణంబు తదుక్తిలక్ష్మి త । న్నేత్రసరోజపత్త్రరమణీయత చూపఱఁ జొక్కఁ జేయువే ॥ ౯౬ ॥ క ॥ అనితనయా నిసిదనయా । నిని గని మఱి కానికుడువవలెఁ గూడుజలంబు నుద్రావవలె ననుచు నన । శనమున నతఁ డేఁగఁ జొచ్చె జనరహితమహిన్ ॥ ౯౭ ॥ క ॥ కాఁగల పుణ్యుఁ డుదుఃఖవు । వ్రేఁగు వహించుట నెపో లెవిష మాటవిలోఁ । దూఁగుచుఁ దూలుచు నీరము । లీఁగుచుఁ దల వాంచి యురక యేగుచు నుండెన్ ॥ ౯౮ ॥ తే ॥ నీచవగు మేను పాటంగవైచు కరణిఁ । బద్మసరోరుహనేత్రుఁ నపారకరుణ । సధనులోకంబు విడిచి యయ్యమరపథముఁ । జూచుటకుఁ బోలె దనుతానె లేచు నతఁడు ॥ ౯౯ ॥ వ ॥ ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజనంబులు నిర్భోజనుండు నిరంబుభజనుండు నై యా కుజనుండు పెక్కుదినంబు లాక్రాంత మహాగహనవిహారణుండై యచ్చోట నిశాటపతి

---

గాపించి. వినిందితకుల్యవహర్త — మిక్కిలి నిందింపఁబడిన కులవ్యవహారము గలవాఁడు ॥ ౯౧ ॥ తలదోర్చుచున్ — తలవేలవేయుచు. లాలాజలములు — జొల్లునీళ్లు ॥ ౯౨ ॥ ధ్రువంబు — శాశ్వతము. విద్యుల్లతికాధికాభినయధూర్వహము — మెఱుపుతీఁగకంటె మించైన అభినయభారమును వహించినది — మెఱుపుతీఁగకన్నను ఎక్కువగా నటించినది. ఇంతయున్ — కొంచెమైనను ॥ ౯౩ ॥ సిబ్బెములు — పాడలు. కీల్కొనన్ — కూడఁగా. సారెలు — వీణమెట్లు. ఉద్యన్నఖరప్రఘూర్ణములన్ — ఎత్తఁబడినగోటికొనలచేత. ఆలపించుచు — ఆలాపన చేయు ॥ ౯౪ ॥ అంబూకృతము — ఉమియుట. అమృతస్థితిన్ — అమృతము యొక్క ఉనికిని ॥ ౯౫ ॥ సరోజపత్రరమణీయత — తామరరేకుల మనోజ్ఞత. చూపఱన్ — చూచువారిని ॥ ౯౬ ॥ అనశనమునన్ — అన్నము లేమి చేత ॥ ౯౭ ॥ వ్రేఁగు — భారము. ఊరము లీఁగుచున్ — పాదములు ఈడ్చుచు. ఉరక — ఊరక ॥ ౯౮ ॥ ౯౯ ॥ అనుద్దిష్టప్రయోజనుండు — ఉద్దేశింపని ప్రయోజనముకలవాఁడు. నిర్భోజనుఁడు — భోజనము లేనివాఁడు. నిరంబుభజనుఁడు — నీళ్లు త్రాగనివాఁడు. నిశాటపతి — రాక్షసరాజు. విఘటన — ఖండించుటయందు.

వక్షఃకవాటపుటీఘటనపటుచటులఘటనఖరముఖరత్నాభరణాయమానత్రిభువనా
భరణుండగు నృసింహుండుపసంహృత వైకుంఠనగరనివాసుండై విజయంచేసియుం
డనప్పుణ్యప్రదేశంబుం బ్రవేశించి ॥ ౧౦౦ ॥ ఉ ॥ చేరుచుఁ జేరువై కడుఁ బచేళిమమైతె
నుఁడాయుపూర్వసం । స్కారతపఃఫలంబునభజద్వృజినావలినాశకృన్నృకం। ఠదే
వదేవనిత్యసదనీకృతసంగమతీర్థరాజవా । ర్ధారలనాడితత్పరముధామపతిక్ బలి
మాఱుఁజూచుచున్ ॥ ౧౦౧॥ సీ॥ ఒకయింతయెప్ప వేయక చూచుఁ జెలువారితలఁగొట్టుకొ
నిదుఃఖజలధిమునుఁగు । బిలముతెలుపుమంచుఁబృథివిఁ లోఁజొరఁబాఱుసమధికస్తంభో
ద్భవముగమించు । తిరియువాఁడనుబోలెదెసలకుఁజెయిచాఁచుఁదొరఁగునస్రాంబ
ధిఁదొప్పదోఁగు । హాపపోయితే మునిగుఱుచుభార్యగుటించిబహువిధాసక్తివిభ్రాం
తిఁబొందుఁ । జేరఁగారానిదర్శనస్థితివహించు । బాడబస్ఫూర్తిలోఁగొన్నపగిది
నుండు । దానవారాతికాంబూనితదవతార । దశకమునుమున్నెతాల్చెనాధరణి
సురుఁడు ॥ ౧౦౨ ॥ క ॥ ఉమగనిపస్తులఁజెవులను । గడియలువడమేనువడఁకఁగా
లముగడపం । బడమిఁబుడమివేలుపువడి । చెడిపుడమింబడిమెవిగతజీవుఁడు
నయ్యెన్ ॥ ౧౦౩॥ ఉ॥ ఈవిధమయినయట్టియధముహీనపుమేనపుడెకారఁగాకఘూ ।
కావలివావకీలలగువాలకలుముంగలమొలకలెత్తదం । తావళిజాలనీలముగుదండధ
రాసచరాగ్రణీబలం । బావలఁద్రోలిలాఁచివెసయాతనపుందనువాఁగిరేగఁగన్ ॥
౧౦౪॥ సీ॥ లలనాధరోష్ఠలాలాజలాన్వితముగఁగ్రోలెవద్యముపేరికులమునెల్ల । వావి
వర్తనలతావావంతదలఁపకకన్నిచ్చవడరేఁచెఁగామవికృతి। జనులపుత్రివ్వఁగఁదిట్టునడి
కోర్చియార్జించెఁబశ్యతోహరవృత్తిఁబసిఁడిపెక్కు । కన్నపెట్టియుఁద్రోవగాచికొ
ట్టియుఁజంపెలెక్కకుమిగులుభూలేఖవరుల । మఱియునీరీతిక్రూరులమైత్రిపడసె ।
నితరపాతకములుచేసెనెన్నియేని । వీనిఁబొందువుఁడుకట్టుచుఁద్రోవేయుఁడనుచు । జము

---

పటు = సమర్థమైన. భరణుండు = భరించువాఁడు. సంహృత = నిలుపఁబడిన. విజయంచేసి = వేంచే
సి ॥ ౧౦౦ ॥ పచేళిమము = పక్వము. భజద్వృజినావలి = చేసిన పాపపఙ్క్తి. నాశకృత్ = నాశము చే
యుచున్న. నృకంఠిరవదేవ = నృసింహదేవునికి. నిత్యసదనీకృత = శాశ్వతమయినయిల్లుగాఁ జేయఁబ
డిన. వార్ధారలన్ = నీటిదారలయందు. ఆడి = స్నానముచేసి. తత్పరముధామపతిక్ = ఆపరమపద
నాయకునికి. గమించుచున్ = గమనించుచును - తలఁచును. తిరియు = తిరిపెమెత్తు. తొరఁగు = కాఱు. అస్ర
ము = కన్నీరు, నెత్తురు. తొప్పఁదోఁగుక్ = మిక్కిలిమునుఁగుచు. విభ్రాంతి = భ్రమ. మత్తు. దర్శనస్థితి
= చూపుయొక్కయునికి; మతముయొక్కయునికి. బాడబస్ఫూర్తిక్ = బడబాగ్నియొక్కతోఁచికను;
గుఱ్ఱముయొక్కతోఁచికను ॥ ౧౦౨ ॥ గడియలువడన్ = ఆడుచుకొనఁగా ॥ ౧౦౩ ॥ వావకీలలు =
కార్చిచ్చుమంటలు. ముంగలన్ = ముందుగా. అఁచి = అఁగించి. యాతనపుందనువు = యాతనాదే
హము ॥ ౧౦౪ ॥ లాలాజలాన్వితముగన్ = జొల్లుసిటితోఁగూడ. కన్నిచ్చ = కంటియిచ్ఛ. పుత్రివ్వఁగన్
= పుచ్చునట్లు. నడికెక్ = నిందకు. పశ్యతోహర = చూచుచుండఁగా దొంగిలించువానిదైన. పసి
డి = బంగారు. కన్నపెట్టి = కన్నమువేసి. భూలేఖవరులన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను. జడిసి = భయప

నిమాతలుబాధింపజడిసి యుతేఁడు॥౧౦౫॥క॥ఆక్రోశంబొనరించెది। శాక్రామన్నాదము
గవిశంకటగతినూ । త్న్యక్రమమగునామొఱవిని । సక్రోధాక్రమణనిపుణసంభ్రమ
మడరన్॥౧౦౬॥ మ॥ అమరద్రోహివిరోధిమున్నచటరక్షార్థంబుగానిడ్డచ । క్రమువి
క్రాంతివహించిభాస్కరసహస్రక్రూరమైవచ్చెను । య్యామదూతావళిసావళించెర
లనిపార్థీనబంధప్రతా । నముఖండించెనఖండితారశిఖసన్నాహంబుదిగ్గ్రాహిగన్॥
౧౦౭ ॥ క ॥ శీకులును గాందిశీకులు । నై కాలానుగులుగుసుకనప్రుడరుదెంచెన్ । శ్రీ
కాముకపారిషదా । నీకములుసువర్ణనాదినీరజములతోన్ ॥ ౧౦౮ ॥ క ॥ అరుదెం
చిజముపురికిఁజను । తెరువునవరలించితెల్లదీవితెరువునన్। హరిభృత్యులునడపించిరి।
గరుడాంచితయాననమునసిగమశర్మాఖ్యున్ ॥ ౧౦౯ ॥ సీ ॥ ఉత్తాలఫణిభుగ్గరుత్తాల
వృంతానిలాశాంతఘర్మాంబువయ్యేచేను । ప్రత్యగ్రముక్తాతపత్రీభవచ్ఛేషవారితా
తపమయ్యెఁజారుమూర్తి । సూత్రవతీశదోర్వేత్రదత్తావకాశామరంబయ్యెఁగటాక్షవి
హృతి । భృగుభరద్వాజప్రభృతికృతస్వస్తివాగ్భరముఖరములయ్యెఁబార్శ్వతలము।
అరుణకిరణసహస్రాభమభ్రకంబు । నగువిమానంబుపైనెక్కెనిగమశర్మ । తీండ్రఁ
బుపేంద్రునకుఁగోదండుతంద్రిఁబోలి। పరమధామంబునకుఁబోవుపథమునందు॥౧౧౦॥సీ॥
ఆజానుదీర్ఘంబులైహరిన్మణిమయ స్తంభంబులకుఁగులస్వాములగుచు । దివ్యగంధ
ములనుద్రేకించిపిద్యుదంకురరేఖలకుఁజోడుకోడెలగుచు । దలచుట్టుఁదిరిగిరాఁగలిగి
పాండురపద్మసహస్రంబులకుఁబాణిబంధులగుచు। సకలంబువెలిఁగింపఁజాలిబాలార్క-

---

డి ॥ ౧౦౫ ॥ ఆక్రోశము — మొఱ. దిశాక్రామన్నాదముగన్ — దిక్కులనాక్రమించుచున్న ధ్వని కలుగునట్లుగా. విశంకట — మిక్కుటమయిన. అడరన్ — అతిశయింపఁగా ॥౧౦౬॥ ఇడ్డన్ — ఉం చిన. విక్రాంతి — విక్రమము. క్రూరము — భయంకరము. సావళి — ఉపద్రవము. తెరలన్ — తొలఁ గునట్లు. ప్రతానము — సమూహమును. అఖండితారశిఖన్ — ఖండితముగాని అంచుమొనచేత దిగ్గ్రాహిన్ — దిక్కులనుబట్టినది ॥ ౧౦౭ ॥ శీకులును — హింసకులవారును. గాందిశీకులును — భయ పడి దిక్కులనుజూచి పరుగెత్తినవారును. కాలానుగులు — యమునననుసరించినవారు — యమునికిం కరులు. గుసుకన్ — మెల్లమెల్లన పాఱిపోఁగా. శ్రీకాముకపారిషదానీకములు — శ్రీకృష్ణుదేవుని పా ర్శ్వవర్తులయినదూతలసమూహములు. సువర్ణనాదినీరజములతోన్ — సుదర్శన చక్రములతోను శంఖములతోను ॥ ౧౦౮ ॥ తెరువునన్ — మార్గమునుండి ॥ ౧౦౯ ॥ ఉత్తాల...బువు — ఉత్తాల — ఉన్నతమయిన. ఫణిభుక్ — గరుత్మంతునిదైన. గరుత్ — ఱెక్కలనెడి. తాలవృంత — విసనకఱ్ఱలని అనిల — గాలిచేత. అశాంత — అంతటనుశమించిన. ఘర్మాంబువు — చెమటనీరుగలది. ప్రత్యగ్ర... ఆతపము — ప్రత్యగ్ర — క్రొత్తదైన. ముక్తాతపత్రీభవత్ — ముత్యాలగొడుగుగానగుచున్న. శేష — ఆదిశేషునివలన. వారిత — నివారింపఁబడిన. ఆతపము — ఎండగలది. సూత్ర...అమరంబు — సూత్ర వతీశ — విష్వక్సేనునియొక్క. దోః — చేతులయందలి. వేత్ర — ప్రేముచేత. దత్త — ఇయ్యఁబడిన. అవ కాశ — ఎడములోని. అమరంబు — దేవతలుగలది. కటాక్షవిహృతి — కడకంటిచూపుయొక్క విహార ము. స్వస్తివాగ్భరముఖరములు — మేలు అనుమాటలయతిశయముచేత మ్రోఁగునవి. తలములు — ప్ర దేశములు. అభ్రకము — ఆకాశమునందుఁబోవునది. తీండ్రన్ — తేజస్సుచేత. పురంద్రేష్టుకోదండుపు తంద్రి — విష్ణువు ॥౧౧౦॥ హరిన్మణి — పచ్చ. ఉద్రేకించి — అతిశయించి. జోడుకోడెలు — సమానము

బింబములకు ననుబింబపఙ్క్తులగుచు । నాల్గుచేతులు గాంచననవమాలి । కలువెడఁ
దకెన్న లాస్యప్రభలు చెలంగ । గుముదుఁడను పేరంబరమేశుఁ గొలిచి నిలిచి । యున్న
వాఁడాతఁడిప్పుడు నోమునీంద్ర ॥ ౧౧౧ ॥ తే ॥ పుండరీకుండు శంఖకర్ణుండు వామ ।
నుండు కుముదాక్షుఁడును విజయుండు జయుఁడు । సర్వనేత్రుండు ననుపార్శ్వచరుల
లోన । హరికిఁ గుముదుండు మానసానందవహుఁడు ॥ ౧౧౨ ॥ క ॥ అమృతమయమూర్తిబు
ధహిత । విమలవిభోద్భాసి మసృణవిలసనశుభల । క్ష్మమహితవక్షుఁడు విధుఁడట ।
కుముదానందప్రదానకుశలుఁడు గాఁడే ॥ ౧౧౩ ॥ శా ॥ ఏవంభూత మహాప్రభావ
నిధి యోకేశుం జితక్లేశు మం । దావిర్భవ హాసైకమాత్రదళితోద్యద్దైత్యగర్వాంధకా ।
రావేశున్ నరకేసరిన్ గొలిచి నిత్యప్రీతిను న్నారు వా । గ్దేవీవల్లభ ముఖ్యనిర్జరులు తత్క్షే
త్రాధిరాజంబునన్ ॥ ౧౧౪ ॥ క ॥ ఆనెలవున నర్ధనిశల । వీనులకుం దోఁచు సేవివిధి
నందనవై । మానికనాయకకృతఘం । టానాదము నృహరిబిగువునగప్పంబోలెన్ ॥
౧౧౫ ॥ క ॥ ఆక్షేత్రంబున నృహరికి । దక్షిణదిశ సేవసింతు తత్పరమతిన్ । యక్షు
లతో సిద్ధప్రమథా । ధ్యక్షులతో సినగేశ్వరాత్మజతోడన్ ॥ ౧౧౬ ॥ క ॥ మాతృవధ
ము పితృవధమును । భ్రాతృవధము గురువధంబు ప్రకటించియు నా । ధాతృసుత యిట్టి
సురపుర । నేతృవఁదెలిపాంచు నెత్తిన్ సేయుఁడు నచటన్ ॥ ౧౧౭ ॥ క ॥ కావున నరులకుఁ దత్క్షే ।
త్రావాసమొనర్ప నైహికాముష్మికముల్ । చేవలఁతులగు దలకొను । నావృదునా
మృడుఁ గుతించి నారదుఁడనియెన్ ॥ ౧౧౮ ॥ క ॥ దేవ భవత్కృప నరమృగ । దేవమహాక్షే
త్రమహిమ దెలిసితి నస్మ । ద్భావము ప్రమోదమేదుర । భావము గైకొనియె జననియె
భ్రమునన్ దమమున్ ॥ ౧౧౯ ॥ క ॥ దైవము తీర్థము క్షేత్రము । నావాచంయములు
గుహుఁడు నడిగిన మీరల్ । భావించి తెలుపు తత్త్వము । నా వీనులఁ జొనుపుమనుచు ననఁ

---

లు. పాండుర — తెల్లని. అనుబింబపఙ్క్తులు — అనుసరించిన బింబముల వరుసలు ॥ ౧౧౧ ॥ ౧౧౨ ॥
బుధహిత ... వక్షుఁడు — బుధ — పెద్దలకు; దేవతలకు. హిత — మేలైన. విమల — నిర్మలమయిన. విభా
— విశేష కాంతిచేత. ఉద్భాసి — ప్రకాశించునట్టి. మసృణ — మెఱుఁగులు దేరునట్టి. విలసన — ప్ర
కాశము గల. లక్ష్మ — చిహ్నము చేత. మహిత — పూజ్యమయిన. వక్షుఁడు — ఱొమ్ము గలవాఁడు. విధుఁ
డు — చంద్రుఁడు; విష్ణువు. కుముదానందప్రదానకుశలుఁడు — కలువలకు సంతోషము నిచ్చుటయం
దు నేర్పరి; కుముదునికి సంతోషము నిచ్చుటయందు నేర్పరి ॥ ౧౧౩ ॥ ఏవంభూత — ఇటువంటిదైన.
జితక్లేశున్ — జయింపఁబడిన దుఃఖములు గలవానిని. మందా ... వేశున్ — మంద — కొంచెముగా.
ఆవిర్భవ — పుట్టుచున్న. హాస — నవ్వు ఏకమాత్ర — ఒకటిచేతనే. దళిత — భేదింపఁబడిన.
ఉద్యత్ — నిక్కుచున్న. దైత్య — రాక్షసులయొక్క. గర్వ — అహంకారమనెడి. అంధకార — చీఁకటి
యొక్క. ఆవేశున్ — ఒళ్లెఱుఁగమి గలవానిని. నరకేసరిన్ — నరసింహుని ॥ ౧౧౪ ॥ అర్ధనిశలన్
— సగము రాత్రులందు. ఏచి — అతిశయించి. విధినందన — నారదుఁడా. వైమానికనాయక — ఇంద్రు
నిదైన ॥ ౧౧౫ ॥ తత్పరమతిన్ — ఆసక్తమయిన బుద్ధితో ॥ ౧౧౬ ॥ నేతృవన్ — ప్రభుత్వముచేత ॥
౧౧౭ ॥ చేవలఁతులు — హస్తగతములు. తలకొనున్ — కలుగును — లభించును. మృడున్ — శివుని ॥
౧౧౮ ॥ నరమృగదేవ — నృసింహదేవుని. మేదుర — అతిశయించిన ॥ ౧౧౯ ॥ వాచంయములు —

బురవైరీ ॥ ౧౨౦ ॥ తే ॥ అనఘ నహుష రాజమకుటుండిట్లు నృసింహ । తీర్థమునకు
భిదేళిమవికరూనంద । సిద్ధసూనవవినుత ప్రసిద్ధివెలయు । నాద్యమైషుర్మనీరామహా
ప్రవంతి ॥ ౧౨౧ తే ॥ తీర్థసార్థావతంసము తీర్థవభీమ । తార్థదశ్రీలఁజంద్రభాగా
ఖ్యవందు । నంద్యుఁదపమాచరించిమునీంద్రుఁడొందె । నమరతతిలోనరుంధ్రభోగా
తిశయము ॥ ౧౨౨ ॥ ఉ ॥ తైర్థికులర్థిఁగొల్వఁదగు దానికియోజనమాత్రభూస్థలిన్ ।
దీర్ఘపదాస్పదంబఖిల దివ్యనుతివ్యవహారయోగ్యమి । ష్టార్థసమర్థనక్షమమునైతమ
మున్ విడియుంచుఁబాతకా । నర్థముపౌండరీకమనసర్థము దూషితరోషభూషణా ॥
౧౨౩ ॥ శా ॥ నక్షత్రంబులకున్ క్షపాధిపతికిన్ నాకున్ త్రియామాచరా । ధ్యక్ష
ద్వేషికి భానుపుత్రికి మరుత్కల్లోలినీవేణికిన్ । పక్షిశ్రేణికిఁ బక్షివల్లభునకున్ భాసి
ల్లునానన్ సమ । స్తక్షేత్రంబులలోననూనవగు నేతత్క్షేత్రమీక్షింపఁగన్ ॥ ౧౨౪ ॥ క ॥
ఇదమిత్థమ్మనియేనను । వదిమితిసేయంగ నేరమానిశ్వరత । ద్విదశప్రభావమో
పిన । విధమునవిపింతనీకు విసదృశబుద్ధిన్ ॥ ౧౨౫ ॥ తే ॥ జనునిచెలియలునిర్ఝరశై
వలినియు । చెరసిమెఱసిన నడువకిరుఁ బేరుగ్రుచ్చి । ఋషులు తెచ్చినతీర్థములెల్లఁ
బొంద । రీని షోడశకళఁబోలలేక జడియు ॥ ౧౨౬ ॥ సీ ॥ పాతకవ్రాతభూజాతజాతా
నలంబు ప్రార్థితాభీష్టపాకావసరము । విబుధిరాట్పర్యంకవిహరణస్థానంబు నిఖిలపు
ణ్యక్షేత్రముకురము । నమదస్త్రదాదినానామరున్నాథంబు పర్ణితాఖిలపుణ్య
వైజననము । దైత్యభిన్నగరయాత్రావరస్థానంబు వాఙ్మానసామేయవైభవంబు ।
సంకువాను దేవవాల్మీకివరశంతు । గర్గగాధిపుత్ర గౌతమాత్రి । జహ్నుజామదగ్ని
జాబాలిజైమిని । ప్రియకరంబుపౌండరీకమనఘ ॥ ౧౨౭ ॥ మహాస్రగ్ధర ॥ కననీగో
దావులిబిడ్డన్ గగనకుసుమమున్ గల్గనిరాయిమాటల్ । వినినీవుస్తుండువెండిన్ విపు
లఁబొడమనీవింటివా పాండురంగా । వనిఁబౌనఃపున్యజన్మవ్యవహృతిఁగన నేవంకదు

---

మునులు. మనుప — రక్షింపుము ॥ ౧౨౦ ॥ ఉడురాజమకుటుండు — శివుఁడు. భిదేళిమ — ఇతరము
యన — ఎనుటిదైన. ప్రవంతి — ఏఱు ॥ ౧౨౧ ॥ తీర్థసార్థావతంసము — తీర్థసమూహములలో శ్రేష్ఠ
ము. అభిమతార్థదశ్రీలన్ — కోరికలనిచ్చుటయందలికలుములచేత. అందున్ — పొందును. రుంధ్ర —
విశేషమయిన ॥ ౧౨౨ ॥ తైర్థికులు — తీర్థయాత్రచేయువారు. సమర్థనక్షమము — తగురీతిని నెఱ
వేర్పఁజాలినది. అనర్థము — కీడు. దూషితరోషభూషణా — దూషింపఁబడిన కోపముగలవారికి అలంకా
రమైనవాఁడా, కోపమునణఁచినవారిలో నేలువాఁడా ॥ ౧౨౩ ॥ క్షప — రాత్రి. త్రియామాచరాధ్యక్షద్వేషి
కిన్ — విష్ణువునకు. భానుపుత్రికిన్ — యమునానదికి. మరుత్కల్లోలినీవేణికిన్ — గంగాప్రవాహమున
కును. అనూనము — తక్కువ కానిది — ఎచ్చు ॥ ౧౨౪ ॥ ఇదమిత్థమ్ — ఇది యిట్లు ॥ ౧౨౫ ॥ శైవలిని
— ఏఱు. చెరసి — కూడి. పేరుగ్రుచ్చి — పేరుచెప్పి. జడియున్ — తొలఁగును ॥ ౧౨౬ ॥ భూజాతజా
తానలంబు — కారుచిచ్చు. పాకావసరము — పంటకాలము. విబుధిరాట్పర్యంక — సముద్రరాజు పడ
క గాఁగల విష్ణునికి. ముకురము — అద్దము. అస్త్రదాది — సేను మొదలుగాఁగల. మరున్నాథంబు — దే
వతాప్రభువులుగలది. వైజననము — ప్రసవించుకాలము. దైత్యభిత్ — విష్ణునిదైన. వాఙ్మానసామే
య వైభవంబు — వాక్కుచేతను మనసుచేతను మితియేర్పఱుపరానివిభవముగలది ॥ ౧౨౭ ॥ వెండిన్
— మరల. విపులన్ — భూమియందు. పొడమనీ — పుట్టనిమ్ము. పౌనఃపున్యజన్మవ్యవహృతిన్ — మరల

ష్పంకశంకల్ । వనరాశిఁ జొచ్చునే గ్లై వడివడి యడఁగుక్ వారిజభూప్రసూతీ ॥ ౧౨౮ ॥ తే ॥ క్షితిఁ గురుక్షేత్రముఖమహాక్షేత్రతలము । లందుఁ జేయు ననశ్వరంబగుచు నిగుడు । దురితతతిఁ గిట్టి నిజశక్తిఁ దునుము గాన । మేటి యీ క్షేత్ర మొకపరిపాటి గాదు ॥ ౧౨౯ ॥ క ॥ దాన స్నాన నిధనవాః । పానాదులఁ జేయు నెట్టి ఫలములు వెలుఁగో । నా నవి సకలముఁ జేకుఱు । మానవులకు నందు నిమిషమాత్రమునందుక్ ॥ ౧౩౦ ॥ శా ॥ భర్మస్తేయము బ్రహ్మహత్యయు సురాపానం బగమ్యారహః । కర్మంబుక్ గృహదాహ ధేనువధ వాక్పారుష్యముల్ మున్నుగా । దుర్మార్గుల్ పచరించు దుష్కృతతతుల్ దూలుక్ మృగేంద్రధ్వనిక్ । మాగ్నోముల్ పడు లేటిమూఁకల నదన్నామంబు వాక్రుచ్చినక్ ॥ ౧౩౧ ॥ సీ ॥ ఉరసిజాదృతవీణ సరసిజాసనురాణి పూర్వకోటిగ మహాద్భుతచరిత్ర । గజవైరివాహ దుర్గాదేవి పశ్చిమకోటిగల స్తక్రోడసీమ । భువననాయకి గాఁగఁ బొంగడొంది మోజపార్థము విస్తృతియుఁ దదర్ధంబు నిడుపు । గలిగిన తక్షేత్రకార్ముకంబు ధరించి జగదేకధన్వి శ్రీశార్ఙ్గపాణి । తీర్థశరములు దొడిగి యుదీర్ణకలుష । విషమలక్ష్యపరంపరల్ విఱుగఁ జేయుఁ । గాన నదియ శరణ్యమై దీనుమిగులు । నైహికాముష్మికాకాంక్షులగు నరులకు ॥ ౧౩౨ ॥ తే ॥ ఆత్మనామవసచ్ఛుకరక్షకముల । నందుఁ బురుషార్థములు నాల్గు ననఁగి పెనఁగి । తలలు ముదిరిన దురితదంతావళములఁ । బౌండరీకంబు హరిలీలఁ జెండివైచు ॥ ౧౩౩ ॥ శా ॥ ఆక్షేత్రంబుననుందునట్టనదుమక్ యక్షకేళీరతుం । డక్షోభ్యుం డజరుం డనాదినిధనుం డక్షామరక్షామయుం । డీక్షామాత్రకృతాఖిలుండు నవశక్తీశుండు కృష్ణుండు ప్ర । త్యక్షంబై యనుపుక్ మరున్ముని

---

మరలపుట్టుటయను వ్యవహారముచేత. కనవు — పొందవు. ఏవంకక్ — ఏతట్టును. దుష్పంకశంకలు — చెడ్డపాపములనెడి సందేహములు. వడివడి — వేగముచేత. వారిజభూప్రసూతీ — బ్రహ్మకుమారుఁడా ॥ ౧౨౮ ॥ అనశ్వరంబు — నశింపని స్వభావము గలది. నిగుడు — అతిశయించు. పరిపాటి — పర్యాయము ॥ ౧౨౯ ॥ నిధనవాఃపానాదులక్ — చచ్చుట నీళ్లు త్రాగుట మొదలగువానిచేత. వెలుఁగో — కలుగునో ॥ ౧౩౦ ॥ భర్మస్తేయము — బంగారు దొంగిలించుట. అగమ్యగమనకర్మంబు — పొందరానిదానితోఁ గలయుపని. గృహదాహ — ఇల్లు కాల్చుట. పచరించు — జరపు — చేయు. దూలుక్ — నశించును. లేటిమూఁకలు — జింకలగుంపులు ॥ ౧౩౧ ॥ ఉరసిజాదృతవీణ — స్తనములచేత ఆదరింపఁబడిన వీణగలది. కోటిగ — కొనయందు పొందినది. లస్తక్రోడసీమక్ — వింటి నడుమైన లోపలి ప్రదేశమునందు. కార్ముకంబు — విల్లు. ధన్వి — విలుకాఁడు. శరములు — జలములనెడి బాణములు. తొడిగి — తొడిగి — సంధించి. ఉదీర్ణ — గొప్పదైన. విషమ — సమముకాని. లక్ష్యపరంపరలు — గుఱులబాకులను. దీను — బాగు. మనోజ్ఞత. ఆకాంక్షులు — కోరువారు ॥ ౧౩౨ ॥ వసత్ — ఉన్న. అనఁగి పెనఁగి — నలిసి పొలసియుండి. దురిత — పాపములనెడి. హరిలీలక్ — సింహమువిధమున. చెండి — నఱికి ॥ ౧౩౩ ॥ అక్షకేళీరతుండు — జూదమునందాసక్తుఁడు. అక్షోభ్యుండు — కలపరానివాఁడు. అజరుండు — ముదిమిలేనివాఁడు. అనాదినిధనుఁడు — పుట్టుచావులు లేనివాఁడు. అక్షామ — కొఱవులేని. ఈక్షామాత్రకృతాఖిలుండు — చూపుమాత్రముచేత నే చేయఁబడిన సమస్తము గలవాఁడు ఎల్లలోకములను చూపుచేత నే కలుగఁజేయువాఁడు. నవశక్తి + ఈశుండు — తొమ్మండ్రు శక్తులకును భర్త. మరున్ముని — దేవము

యనుమాపాణిశేఖుతోఁ జెట్లనన్ ॥౧౩౪॥ క॥ అద్భుతమయ్యెదునిఖిలజ । గద్భరితుఁడు
యోగిహృదయగమ్యుండచ్యు । తుద్భవమొందుటకీకథ । సద్భద్రానూనవృత్తసుప్రస
న్నతననుడున్ ॥౧౩౫॥ ఉ॥ ఆపురవైరిపల్కఁ గలహాశిఁ గుశేశయపాత్రవిస్మ
యున్ । ద్వాపరముజ్జగిల్లుతఱిదాంతుఁడు శాంతుఁడు హృద్విపక్షశి । క్షాపటుశక్తి
విష్ణుపదసంభృతభక్తియునై జనించెని । ష్పాపుఁడు పుండరీకుఁడను బ్రాహ్మణుఁడాక్క
జంబుగన్ ॥౧౩౬॥ సీ॥ పాతకంబుల పంచబంగాళముగఁ జేయుఁ గనఁగొన్న
మాత్రైమోక్షంబు నొసఁగు । ముమ్మణ్ణుప్రస్తరంబునకు నల్లణ్ణు సంపకునిదియనఁ దగఁ
బ్రకటమహిమ । బిందుసరఃప్రతిబింబమై సర్వస్వర్గద్వారమునకంటెఁ గరము మేటి । య
గుఁ జంద్రభాగమహాపుష్కరిణితటంబునఁ జూతఖర్జూరపనసజంబు । కాంచనయుతం
బు నృత్యచ్ఛిఖండికూజ । దిష్టపరభృష్టగాయదళీంద్రజుష్ట । మలసకల్హారపవననమ్రా
గ్రదళము । నైన యాశ్రమము మరించి యందునతఁడు ॥౧౩౭॥ సీ॥ నిండుమానంబునను దునా
రాయణుం డెట్టఁ గింజెనో సీటఁ బలునని కి । నోసలిలోపలి చక్కనెసఁగు చంద్రుఁ డుది
ద్దెనో మింటఁ బ్రేలెడు దీమసంబు । మూలాలవాలస్థలీలేలిహానంబు గోలిచెనో పవనంబు
గ్రోలునేర్పు । కమలంబులిరుమూఁడుగ విచ్చెనో సూర్యావలోకనంబున నాత్మలోఁ గ
నిధృతి । యనఁగ దత్తతంత్రులయందునలఁత లేక । భూరికైవల్యసామ్రాజ్యభోగ
కాంక్ష । బాధనిష్ఠానురక్తిం దపంబొనర్చు । కుదిసి ముల్లోకములు నుగ్గలు పడఁగ ॥
౧౩౮॥ తే॥ భక్తిసంయుక్తిఁ దనుపోఁత పాలనొయ్యఁ । జెట్టుకట్టుచు మునిశాఖి నిట్ట
చూప । నిజవనోమార్గ సంవసన్నీలవర్ణ । కైతవంబున లోఁ జేగ గలయనూ రె ॥౧౩౯॥
తే॥ పుండరీకాఖ్యుఁ డగుట నోపుండరీక । నేత్రభృంగంబు తనలోన నెలవుకొనఁగ ।
క్షితిసురేంద్రుండు తపమిట్లు సేయుచున్న । కాలమున నేగధరపిష్టుఁ గనుగొనంగ ॥

ని = నారదుఁడు ॥ ౧౩౪ ॥ హృదయగమ్యుండు — మనస్సునకుఁ బొందఁదగినవాఁడు. సద్భద్రా — మంచి మేలుగలవాఁడా ॥ ౧౩౫ ॥ కలహాశిన్ — నారదుని గూర్చి. కుశేశయపాత్ర — తామరకమను ముఁడా. ఉజ్జగిల్లుతఱిన్ — తొలఁగునట్టి సమయమునందు — ముగియునప్పుడు. హృద్విపక్షశిక్షాపటుశక్తి — తనలోని శత్రువులగు కామక్రోధాదులను శిక్షించుట (అణఁచుట) యందు సమర్థమయిన శక్తిగలవాఁడు. సంభృతభక్తి — పూర్ణమయిన భక్తిగలవాఁడు. అక్కజంబుగన్ — ఆశ్చర్యముగా ॥ ౧౩౬ ॥ పంచబంగాళముగన్ — శూన్యముగా. ముమ్మణ్ణు — మూడంతలు. నృత్యచ్ఛిఖండి — ఆడుచున్న నెమళ్లు గలది. కూజద్దిష్టపరభృష్టగాయదళీంద్రజుష్టము — కూయుచున్న యిష్టములైన కోవెలలచేతను, పాడుచున్న గండుతుమ్మెదలచేతను సేవింపఁబడినది. అలసకల్హారపవననమ్రాగ్రదళము — మెల్లని సౌగంధికములమీఁది గాలిచేత వంగినమీఁది ఆకులుగలది ॥ ౧౩౭ ॥ వలు — ఉండదు. చక్కిన్ — ప్రదేశమునందు. దిద్దెనో — నేర్చెనో. దీమసంబు — ఉపాయము. మూలాలవాలస్థలీలేలిహానంబు — కేళ్లతోడి పాదునందుండెడి పాము. గోలిచెనో — సరిపెట్టిచెనో — బోధించెనో. గ్రోలు — త్రాగు. ఇరుమూఁడు — ఆఱు. లోఁగని — తగ్గని. బాధ — దృఢమైన. కుదిసి — అణఁగి. ఉగ్గలుపడఁగన్ — కలఁతనొందఁగా ॥ ౧౩౮ ॥ ఒయ్యన్ — తిన్నఁగా. జెట్టుకట్టుచున్ — చెట్టుగా నేర్పడుచు. మునిశాఖి — మునియనెడి వృక్షము. నిట్ట — నిక్కను. సంవసత్ — ఉన్న. నీలవర్ణకైతవంబునన్ — విష్ణుదేవుని మిషచేత. చేగ — చేవ ॥ ౧౩౯ ॥ నెలవుకొనఁగన్ — ఉనికి చేయఁగా. ధర — భూమి ॥ ౧౪౦ ॥ అలఁత

౧౪౦ ॥ తే ॥ డెందమునఁ బుట్టునలఁతను కుందువలనఁ । దీర్పనూహించి చనుమహీచే విక్లొసఁగె । కలశపాథోనిధానంబు గన్నుఁగవల । తెలివిబలితంపునమృతవర్తియు నుబోలె ॥ ౧౪౧ ॥ సీ ॥ నీరజోదరయోగనిద్రావరణసీమ చతురంబు సితసామజప్రభు నకు । పానలుబ్ధాబ్దప్రపాకల్పనము సూతికానికేతనము పుష్కరసదనకుఁ । గామధు క్సందానసీమధ్యదేశంబు రసవతీదేవతావిసరమునకు । గోత్రభిల్లోకచకోరదృగ్గోత్రం బుముందురాస్థానము మర్త్యహారికి । కాయమానంబు బలిగృహాంగణవసుధకు । సకల వాహినులకు జనాంతికపదంబు । సారలోహరరము భూధ్రవైరిబద్ధ । బుద్ధిఁజొంగఁబాం చియున్నదంభోళికక్షి ॥ ౧౪౨ ॥ చ ॥ అమితపిశాచభర్తృపురంతకుఁ డొందినరా జశేఖర । త్వముఁ బెనుగొల్లఁ డచ్యుతుఁడు దాలుచు శ్రీపతిభావముల్ మరు । త్తరుమను లుకూటిపేదలటు గాక సవాయమృతాన్నభోజులౌ । క్రమముఁ సుధాబ్ధిపుణ్యమునఁ గ ల్గినవంచు నుతించులోకముల్ ॥ ౧౪౩ ॥ ఉ ॥ ధేనుగజాశ్వరత్నసుదతీప్రముఖాఖిల వస్తుకోటివై । మానికభర్తము గ్గొనియుఁ చప్పరమారఁ బయోధిలోఁతుగా । కొనసె సకొల్పెనో బలుముగుళ్ళ విప్లుష్టకరీషపిండరే । ఖానిభవృత్తిన త్తెఱఁగు గాకల సేరవిదా వనేటికిన్ ॥ ౧౪౪ ॥ శా ॥ అంతర్మగ్నదిగంతదంతికటనిర్యద్దానధారాఝరా । క్రాం తంబుల్ నిజవేగభగ్నవపురుగ్రగ్రాహముల్ మేఘఘో । షాంతేవాసిపశంకటఘ్నము లు నాగావాసగాహుల్ పయ । స్స్వంతానంబులు గ్రాలు పాలకడలిన్ జాగ్రత్ప్రచా రంబులై ॥ ౧౪౫ ॥ శా ॥ మాణిక్యంబులు మున్నుగాఁ సిగుము భ్రామ్యద్భంగసత్త్వంబుల । క్షీణశ్రీగిరలన్ జలద్విపకరచ్ఛిన్నప్రవాళద్రుమ । శ్రేణింగర్వము డిగ్గియార్నవదపసంశ్రే

---

—శ్రమము. పాథోనిధానంబు—సముద్రము. తెలివి—తెల్లఁదనము నైడి ॥ ౧౪౧ ॥ చతురంబు— ఏనుఁగులుండుశాల. సితసామజప్రభునకున్ — ఐరావతమునకు. పానలుబ్ధాబ్దప్రపాకల్పనము— త్రాగనిచ్ఛగల మేఘములకుఁ జలిపందిరిగాఁ జేయుట. సూతికానికేతనము—పురిటిల్లు. పుష్కరస దనకున్—లక్ష్మీదేవికి. కామధుక్సందానసీ—కామధేనువుయొక్క దామెనత్రాటిదైన. రసవతి—గ సముగలది. గోత్రభిల్లోకచకోరదృగ్గోత్రంబు—గోత్రభిల్లోక—ఇంద్రలోకమునందలి. చకోరదృక్ —స్త్రీలయొక్క గోత్రంబు—వంశము—జన్మస్థానము. మందురాస్థానము—లాయము. అమర్త్యహా రికిన్—ఉచ్చైశ్శ్రవమునకు. కాయమానంబు—పందిరి. జనాంతికపదంబు—రవ్వపట్టు. సారలోహ రరము—శ్రేష్ఠమయినయినుపతలుపు భూధ్రవైరి—ఇంద్రుఁడు. దంభోళికిన్—వజ్రాయుధమున కు ॥ ౧౪౨ ॥ ౧౪౩ ॥ మానికభర్త—దేవేంద్రుఁడు. చప్పరము—పగ. ఎసకొల్పెనో—వెగటించె నో. ముగుళ్ళన్—మేఘములను. విప్లుష్టకరీషపిండరేఖానిభవృత్తిన్—మిక్కిలి కాల్పఁబడిన యెండు పేడముద్దవిధమును బోలిన వ్యాపారముతో ॥ ౧౪౪ ॥ అంతర్మగ్న—లోపలమునిఁగిన. కట—చె క్కిళ్ళనుండి. నిర్యత్—కారుచున్న. ఝర—సెలయేళ్ళచేత. ఆక్రాంతంబులు—ఆక్రమింపఁబడిన వి. భగ్నవపురుగ్రగ్రాహములు—చెడినదేహములుగల భయంకరములయిన గ్రాహిహింసకమత్స్య ములుగలవి. నాగావాసగాహులు — పాతాళమునందు మునిఁగినవి. పయస్స్వంతానంబులు— జల చరములసమూహములు. జాగ్రత్ప్రచారంబులు—ఎచ్చరికతోడిసంచారములుగలవి ॥ ౧౪౫ ॥ భ్రామ్యత్—చలించుచున్న. భంగసత్త్వంబులు—అలలలోనిప్రాణులు. క్షీణన్—రేఁగఁగా. జలద్విప —నీరేనుఁగులయొక్క. ప్రవాళ—జడబాగ్నియనెడి కార్చిచ్చుచేత. సంకీర్ణంబులు—మిక్కిలిచెడి

ర్ణంబులై కానన । కోణంబుల్ వోలెదలిర్చు నిచ్చలు సుధాకూపారపారస్థలుల్ ॥ ౧౪౬ ॥
క ॥ తరుణప్రవాళశోణో । దరతలములై శంఖచక్రధరములై వరపు । ష్కరపుష్కలమై హరికర । సరసీరుహమునఁగఁగలశజలనిధి చెలఁగుఁ ॥ ౧౪౭ ॥ తే ॥ నూత్నవీచుల సముపోఢరత్నపుష్ప । నికరనిబిరీసమగునీరు నించి తెచ్చి । యబ్ధి వేలాసమాభ్యాగతాతురాచ । లార్థులకునర్థిఁబాద్యార్ఘ్యమాచరించు ॥ ౧౪౮ ॥ తే ॥ వార్ధినావర్తగర్త ప్రవర్తులగుచు । సుదరరత్నాంశువులుగ్రమ్మ త్రిదశులవర । తరులునలుకంగఁదమ్మా లతలునులవ్రాత । సేకమున వెండిచిగిరించు చిగురులనఁగ ॥ ౧౪౯ ॥ వ ॥ ఇట్లు గణితగుణాభిరామంబగు సమ్మినధామంబు సంగ్రామాభీరుండగు శూరుండునుంబోలె బెనువాలుగంటులంగను పట్టికుశలభటవిముక్తంబగు విశిఖంబునుంబోలె నెల్లకందువల నుమీఱి పాటలస్ఫురితంబై జరఠవిలోచనంబునుంబోలె నీరుపాపలంబొదువుటగలిగి పేదపడిన ప్రదమి వేలుపుంబోలె బలియింటి వాకిటనడంగి వీరభద్రగదావిదారితంబగు పూషాముఖవదనగహ్వరంబునుంబోలెఁ బలువరుసబిగి దెరలనొరలిమఱంగకుఁ కన్యకయుంబోలెఁ బలుకఁదగక బిఱుకడదాల్చి విభావరీవిరామసమయంబునుంబోలె వెల్లదీవిచలఁబుంచుటకుఁగుఱియై మఱియు నొక్కొక్కచోటం గుముదోదర విశదంబులు నొక్కొక్కయెడ నీలోత్పలమాలికామేచకంబులు నొక్కొక్కకడ శుకచంచూపుటపాటలంబులు నొక్కొక్కచక్కి శుక్తిశబరోదరంబులు నరుణోపల పట్టంబులం బొట్టువెంచుచు నిట్టలంబుగ మిట్టించు వేలానిలసముద్భూతసూక్ష్మశీకరనికరంబులవలన నలినభవాండంబునకుఁ గర్పూరకరండభావంబును దెప్పించుచు నుత్తాలకాలసర్పం

---

నవి. చిలిర్చుఁ — చిగిరించును. నిచ్చలు — ఎల్లప్పుడు. పారస్థలులు — గట్టుప్రదేశములు ॥ ౧౪౬ ॥ శోణోదరములై — ఎఱ్ఱనిలోపలిభాగముగలవై. వరపుష్కరపుష్కలములై — మంచిజలముచేత సమృద్ధమై. కలశజలనిధి — పాలసముద్రము. చెలఁగుఁ — ప్రకాశించును ॥ ౧౪౭ ॥ నూత్నవీచులఁ — క్రొత్తలగు అలలయందు. సముపోఢరత్న — మంచిపండుపోఁకవంటిరత్నములనెడి. నిబిరీసము — నిండినది. ఆతుర — శ్రమనొందిన ॥ ౧౪౮ ॥ ఆవర్తగర్త — సుళ్ళనెడి బొక్కలయందు. అంశువులు — మెఱుఁగులు. అమృతసేకమునఁ — అమృతముతోడఁదడుపుట చేత ॥ ౧౪౯ ॥ సినధామంబు — సముద్రము. అభీరుండు — భయపడనివాఁడు. వాలుఁగంటులఁ — కత్తిగాయములచేత; చేపలసంబంధములచేత. కుశల — సమర్థుఁడైన. విశిఖంబు — బాణము. కందువలను — బాడలచేతను; సంకేతస్థలములచేతను. పాటలస్ఫురితంబు — పండుటాకుటనుతోఁపించునది. జరఠ — ముసలివాని. నీరుపాపలంబొదువుట — నీటిమనుష్యులనుపొదువుట; ఊఁపుకంటిపాపలపై కప్పుట. బలి — బలవంతుఁడు; బలిచక్రవర్తి. పలువరుసబిగితెరలఁ — పండ్లవరుసబిగువు వదలఁగా; అనేకములైన వరుసలుగల బిగువుతోడియలలచేత. ఒరలి — ధ్వనించి. పలుకఁ — నిందింప; చెప్ప. విభావరీ — రాత్రి. వెల్లదీవిచలమించుటకుఁ — తెల్లఁబాఱినదీపములచేతమించుటకు; శ్వేతద్వీపమును ఆక్రమింపఁజేయుటకు. విశదంబులు — తెలుపులు. మేచకంబులు — చామనిచాయలు. పాటలంబులు — ఇంచుకయెఱుపులు. చక్కిఁ — చోటను. శబరోదరంబులు — చేఁపకడుపులు; నీటిలోపలిభాగములు. ఇట్టలంబుగ — అధికముగ. మిట్టించు — మీఁదికెగయు. కరండభావంబు — భరణివిధము. ఉత్తాల...పంబులు — పొడవైన చీఁకటిప్రమాణయాకు

త్రిభువనదీపకుఁడగువానిఁ జంద్రదినకరమయూఖ। తొగ్గపాతదళితనిజభ। క్తాపధ్వాంతప్రవాహుఁడనఁదగువానిన్ ॥ ౧౬౧ ॥ తే ॥ నగవుసురుపులుమణిపూరనలినహంసి। కుంతలగ్రాహములు నేత్రకుముదరుచియుఁ। గలుగుతనుకాంతికాళిందిఁ గన్నతరుణి। తరణియునుబోనియురమురత్నంబువాని ॥ ౧౬౨ ॥ తే ॥ పుండరీకతపోజాతభువనపీడ। విన్నపము సేయ నజునంసవీథిఁ గేలు। సాచి హేమాద్రికంధరాసక్తమేఘ। మాలికంబగు గగనంబుఁ బోలువాని ॥ ౧౬౩ ॥ తే ॥ లలితలక్ష్మీనఖాంకురలాలనమునఁ। గ్రమకల్హారదళగంధగౌరవమున। నతులనైపథ్యరత్నచంద్రాతపమున। నొప్పుమీఱి ననునుసేసకొప్పువాని ॥ ౧౬౪ ॥ తే ॥ ఊరుయుగళంబుమీఁదఁ జెల్వారునడిమి। తానవంబునెపంబున దనుజసూన। నిర్మితస్తంభసంభవనిజపురాణ। పురుషహరిలీలఁ దెలిపెడుపోలుపువాని ॥ ౧౬౫ ॥ తే ॥ అభినవాయాతుఁ దనపుత్రు నజునిఁ గాంచి। సంతసంబున నాభివేశంతజలజ। ముబ్బి వెలిగ్రాయుపుప్పొడియొలపు నెఱపు। హాళఁదిపట్టంబు కటిసీమ నమరువాని ॥ ౧౬౬ ॥ తే ॥ అడుగునడుగులఁ బొడముచిహ్నంపుసీల। మేనిచిప్పలు వోలె నానానిలింప। కనకకోటీరహీరాగ్రఘుష్ణణమున। మెఱుఁగువచ్చిననఖపఙ్క్తి మించువాని ॥ ౧౬౭ ॥ తే ॥ ఆద్యప్రణవస్వరూపు వేదాంతవేద్యు। మోక్షవిద్యోపదేష్టనిర్ముక్తజనను। విష్ణుఁ బ్రభవిష్ణు నిత్యవర్ధిష్ణుఁ గాంచి। మ్రొక్కె నారీజనోచితంబుగ ధరిత్రి ॥ ౧౬౮ ॥ క ॥ మ్రొక్కి వినుతించె దనమది। నెక్కొను నెగులెల్ల నేలనెలఁతుక కన్నీ। రొక్కొక్కబొట్టు మెఱుఁగుం। జెక్కుల దిగజాఱుఁ గోరఁ జిమ్ముచు హరికిన్ ॥ ౧౬౯ ॥ క ॥ బలుబ్రేఁగునొప్పి నిమ్మై। నిలవలికిన పలుకు కతన హృదయముఁ గలఁగన్। నలినోదరునకు విలయా। నిలయాతాయాతచలితనీరధివోలెన్ ॥ ౧౭౦ ॥

వ ॥ ఇవ్విధంబున నమ్మధుమథనుండు వసుంధరమీఁదం గల కనికరంబునం దరంగితంబగునంతరంగంబు తదభిరక్షణంబునకభిముఖంబుగావించి యటమున్న యకాండప్రళ

---

చీఁకట్లవ్యాపనముగలవాఁడు ॥ ౧౬౧ ॥ గ్రాహములు—మొసళ్లు. తరుణి—లేఁతసూర్యుఁడు ॥ ౧౬౨ ॥ అజునంసవీథిక్—బ్రహ్మయొక్కమూఁపుప్రదేశమునందు. కంధరాసక్తమేఘమాలికము—మెడయంటినమబ్బుచాలుగలది ॥ ౧౬౩ ॥ నైపథ్య—అలంకారమువలని. చంద్రాతపమునన్—వెన్నెలచేత. సేసకొప్పు—కొండెసిగ ॥ ౧౬౪ ॥ తానవంబు—సూక్ష్మత్వము. పురాణపురుషహరి—పురాతనుఁడైననృసింహుఁడు ॥ ౧౬౫ ॥ అభినవాయాతుక్—క్రొత్తగావచ్చినవానిని. నాభివేశంతజలజము—బొడ్డునడియ యందలితామర. వెలిగ్రాయి—బయటనుమియు. ఒలపు—అందము. హాళఁదిపట్టంబు—పసుపువన్నెవస్త్రము ॥ ౧౬౬ ॥ హీర—వజ్రమణులయొక్క. ఘుష్ణణమునన్—ఒరపిడిచేత ॥ ౧౬౭ ॥ ఉపదేష్ట—ఉపదేశించువాఁడు ॥ ౧౬౮ ॥ నెక్కొను—పాదుకొను. నెగులు—దుఃఖము ॥ ౧౬౯ ॥ బలుబ్రేఁగునొప్పిన్—అధికభారమనెడివ్యాధిచేత. నలినోదరునకున్—విష్ణుదేవునకు. యాతాయాతచలితము—పోకరాకలచేత చలించినది ॥ ౧౭౦ ॥ మధుమథనుండు—విష్ణువు. తదభిరక్షణంబునకున్—దానిసంరక్షణమునకు. అటమున్న—అంతకుముందే. అకాండప్రళయంబు—కాలముగాని కాలమునఁ గు ప్రళయము. తపోదహనంబు—తపస్సువలని యగ్ని. దురవగాహంబు—అకళింపుచేసికొనశక్యముగానిది. త్రిభువనదాహదోహలంబు—మూఁడు

యంబగు పుండరీకుతపోదహనంబు దురవగాహంబును త్రిభువనదాహదోహళంబు
నగునని విన్నపంబుచేసి డాసియున్న విరించిం గించిత్ప్రహసితాననుండై కనుంగొనుచు ॥
౧౮౧ ॥ సీ ॥ శాంభరీకచ్ఛపేశ్వరకంఠసందీప్తతాపింఛవల్లీమతల్లియనఁగ । బవ
నపారణపతిస్ఫాటికస్తంభజంభద్విషన్మణిసాలభంజియనఁగ । పవనవరాహదం
ష్ట్రాశిఖరిత్రప్రోత కనకాకఘనకాలఖాడమనఁగ । కకుబంతకరివరస్కంధసింధు
ద్వీప సాంసారికాసితహంసియనఁగ । భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరియనఁ
గ । నృగుభగీరథభరతాదినృపభుజాగ్ర । ఘటితకాలాగరుస్థాసకంబనఁగ । దగు
వసుంధరఁ గృపాణంబు లరిసైన్యభేది ॥ ౧౮౨ ॥ శా ॥ ఓయంభోరుహపత్రనేత్రమదనీ
యుద్వేగముఁ జూనకై । దైతేయప్రాయనృపాన్వవాయములమర్దింతుఁ భావద్భాగ
పుఁ । బౌరంద్రోయుసుఁ జేయుదుఁ సుఖులగా మర్త్యక్షితియుక్తాత్ములఁ । మా
యామానుషమూర్తినై పొసమి నానావిక్రమక్రీడలఁ ॥ ౧౮౩ ॥ సీ ॥ క్రూరాసి
ధారావిదారితద్విపకుంభకూటముక్తాశుక్తిగోస్తనములఁ । బటుగదాపాతనిర్భ
గ్న సైంధవశిరస్స్రవదస్రకుంకుమస్థాసకములఁ । శరలూనరథకేతుసౌవర్ణకింకిణీకసు
మగుచ్ఛగుంభనముల । ముసలమర్దితపదాతిసమాస ఘనాపానవినరజఃపటీవె
ల్లసముల । విజయలక్ష్మికి నైపథ్యవిభవమొసఁగి । చటులరోషకషాయితాశయవిరో
ధి । యూథమథనక్రియాహోపుయుద్ధకేళిః । చెలిసికిత్తునానంద మోలతాంగి ॥ ౧౮౪ ॥
వ ॥ మత్కృతంబులు మదీయారచితంబులు నగు నగణితాహవక్రీడనంబుల సక్రోధ
విరోధివధంబొనరించి తదీయకంఠనాళకరాళరుధిరధారాసారంబుల నీకుం దాపో

---

లోకములను గాల్చుటకు సమర్థమయినది. డాసి — సమీపించి ॥ ౧౮౧ ॥ శాంభరీకచ్ఛపేశ్వర — మా
యలచేఁ బేర్చిన రాజుయొక్క. తాపింఛవల్లి — చీకటిప్రాఁకెరవుబ్బ. పవనపారణపతి — సర్పరాజు. జంభ
ద్విషన్మణి — ఇంద్రనీలము. సాలభంజి — పుత్తడిబొమ్మ. పవనవరాహ — యజ్ఞవరాహముయొక్క.
శిఖరిత్రిక — గుద్దలిచేత. ప్రోత — గ్రుచ్చఁబడిన. కాలఖాడము — కపుపలోహయుకువలకపము. క
కుబంతకరి — దిగ్గజము. సింధుద్వీప — ఏడిదీవిబ్బయుదలి. అసితహంసి — నల్లనిఆఁడుహంస. భూరి
భూభృచ్ఛిఖోద్యన్మయూరి — విస్తారమయిన కొండలనెడి శిఖలుపుట్టుచున్న దంపుపెనలి. కాలాగ
రుస్థాసకము — నల్లయగరుతోఁ జేరిన కుంకుమపుప్పొడిమొదలుగువాసనపూఁత ॥ ౧౮౨ ॥ ఉద్వేగముఁ
— మనోవ్యథను. దైతేయప్రాయ — రాక్షసులను బోలిన. అన్వవాయములఁ — వంశములను ॥
౧౮౩ ॥ అసి — కత్తి. కూట — శిఖరములందలి. ముక్తాశుక్తి — ముత్యపుఁజిప్పలచే నైన. గోస్తనము
లఁ — నలువదిపూసలహారములచేతను. పాత — పాటువలన. నిర్భగ్న — మిక్కిలిభంగమునొందిన.
సైంధవశిరస్స్రవదస్రకుంకుమస్థాసకములఁ — గుఱ్ఱములతలలయందుండి కాఱుచున్న నెత్తురనెడి
కుంకుమపుప్పొడితోడి పరిమళచందనపుఁ బూఁతలచేతను. శరలూన — బాణములచేతఁ ద్రుం
చబడిన. సౌవర్ణ — బంగారుమయములైన. గుంభనములఁ — కూర్పులచేతను. నవీనరజః
పటీవెల్లనములఁ — క్రొత్తధూళియనెడి చాలరుంచేతను. నైపథ్యవిభవము — అలంకారవైభవ
మును. చటుల — చలించెడి. రోషకషాయిత — కోపముచేత ఎఱ్ఱవారిన. ఆశయ — మనసుగల (లేక)
స్థానమయిన ॥ ౧౮౪ ॥ క్రీడనంబులు — ఆటలు. సక్రోధ — కోపముతోఁ గూడిన. కంఠనాళ —
గొంతుక్రోవులందలి. ఆసారంబులఁ — ఎడతెగనిధారలుగలవానలచేత. ఆపాదించెదను — కలిగించె

పశునుంబాపాదించెదం బాపకారినిరసనంబు నాకునవశ్యకృత్యంబగుట యెఱుంగ వే యుత్తరంబగుభవద్భాగంబు తొలంగించుటయుకాదు సముత్పాదిత త్రిభువనోపప్లవంబగు పుండరీకతపోదహన విసారంబువారించు తలంపునన్నాయది యున్నాఁడ వ యిప్పుడిటమున్న తన్నిమిత్తంబున పనివిన్నవాఁడ నెన్నికదినంబులనిన్నియు శుభోదర్కంబులయ్యెనని ప్రమదపడంతి యడలుడిపి సగౌరవంబుగా వీడుకొలిపి పరమపురుషుఁ డంతర్ధానంబునొందె. శతానందుండును సానందంబుగ యథాస్థానంబునకుఁ జనియెనిట్లు ॥ ౧౭౫ ॥ ఆ ॥ పుండరీకుతపముభూదేవిభారంబు । ఫలమునందఁజేయఁగోరఁగఁద్రోయఁ । గోరినట్ల్యుఁకయ్యెఁ బరార్థమై । పురుషవరునివికృతిఁబొరయుటొప్పు ॥ ౧౭౬ ॥ సీ ॥ వసుమతీభార నిర్వాపణోద్యుక్తుఁ డుర్ధితయాదవాన్వయపయోధి । దేవకీవసుదేవశేవధినందనుందిరరసాలావాసపరభృతంబు । పూతనాప్రాణసంఘాతవాతూలాహిశకటాంగవిఘటనచటులబుద్ధి । సనదస్పృహావర్తసంవర్తసమవర్తి పాతితార్జునపాదపద్మయుగుఁడు । వత్సహృత్సాయకంబభివ్యథితబకుఁడు । మర్దితాఘుఁడు కాళియమానభేది । నిష్ఠురానలపారణనైష్ఠికుండు । కృష్ణుఁడాశ్రితలోకవర్ధిష్ణుఁడలరు ॥ ౧౭౭ ॥ సీ ॥ కనుఁగట్టిగాంగేయగర్భుఁ డాఁగురుమహాఁతలాడించెవత్సాపహరణవేళ । నాలమందలఁబోవ శైలమెత్తెడిపూనికిఁ గేలిమైకందుకక్రీడసలిపెఁ । బాటించెఁగంబాలయాటరాసక్రీడ నాభీరభీరుమధ్యాంకపాళి । వెలయించెయమునావిహారంబులఁ గాధిరాజుకింకరశిరోరత్నరాజిఁ । దన్నిపిల్లాడెనంగుష్ఠదళితసర్ప । తనుసుదర్శనసామవిద్యాధరేంద్ర । కఠినజఠరస్థలమునసగ్రజుఁడుదాను । నందసూనుఁడుబృందావనంబునందు ॥ ౧౭౮ ॥ వ ॥ ఇవ్విధంబునసమ్మధుకైటభవిరోధియమానుష విగ్రహంబునంగీకరించియు నమానుషంబులగు విక్రమవిశేషంబులు బ్రవర్తించుచుండె నంతనటమున్నయవ్వనమునకు మనఃప్రీణనంబుగావింపందలంచిపిరి. చినిఖిలభువనమోహినిగాగునాకర్షశక్తిఁబుట్టించుట

---

దను. పాపకారినిరసనంబు — పాపముచేయువానిని చంపుట. ఉత్తరంబు—అధికము. సముత్పాదిత—కలుగఁజేయఁబడిన. ఉపప్లవంబు—ఉపద్రవముగలది. నలువ—బ్రహ్మ. ఇటుమున్న—ఇంతకుముందె. పనివిన్నవాఁడు—వచ్చినవాఁడు. శుభోదర్కంబులు—శుభమురాఁగలకాలములు. అడలు—దుఃఖము. ఉడిపి—మాన్పి. వీడుకొలిపి—పంపి. అంతర్ధానంబున్—కనఁబడకపోవుటను. శతానందుఁడు—బ్రహ్మ ॥ ౧౭౫ ॥ వికృతి—వికారమును. పొరయుట—పొందుట ॥ ౧౭౬ ॥ నిర్వాపణ—నశింపఁజేయుటయందు. శేవధి—నిధి. రసాల—తియ్యమామిడిచెట్టునందు. పరభృతంబు—కోకిలము. వాతూల—గాలికి. అహి—పాము. సంవర్త—నాశమునకు. సమవర్తి—యముఁడు. వత్సహృత్సాయకంబు—వత్సాసురుని హృదయమునకు బాణము. అభివ్యథిత—బాధనొందింపఁబడిన. మర్దితాఘుఁడు—మర్దింపఁబడిన అఘాసురుఁడుగలవాఁడు. నిష్ఠురానలపారణనైష్ఠికుండు—క్రూరమయినదవానలమును భక్షించునట్టినిష్ఠగలవాఁడు ॥ ౧౭౭ ॥ గాంగేయగర్భున్—బ్రహ్మను. అభీరభీరు—గోపికాస్త్రీలయొక్క. అంకపాళిన్—కౌఁగిలింతయందు. యమునావిహరణంబు—కుబేరాత్మజులు అట; అంగుష్ఠదళితసర్పతను—బొటనవ్రేలితోఁబోఁగొట్టఁబడినపాము దేహముగల ॥ ౧౭౮ ॥ అమానుషంబులు—మనుష్యవిషయములుకానివి. వెన్నునకున్—విష్ణునకు. ప్రీణనంబు—

యునమ్మత్తకాశినితదాదేశంబుననందుమఱందియగు శతగోపుండను గోపాలునకుం
గూరిమిపుత్త్రియై పెరుగుచుండె నంతదంతావళమరాళశిఖావళిగమనంబులగమకంబు
దమకుందోడవగుచు నిగుడునడవడుల బెడంగారిబంగారంపుమెట్ట కెందమ్ములకునె
త్తురుంబొత్తుచుట్టంబులనంజూపట్టు చిగురుటడుగులును, దారలగౌరవంబును ముత్తి
యంబుల క్రొందళుకును చంద్రమండలంబునఖండలావణ్యంబును సేవగించు చరణ
నఖముకురంబులును, మకరధ్వజ శరధి శాలి గర్భ గోపుచ్ఛ కాహళా సందర్భంబుల
సౌభాగ్యంబునావరించు చిఱుతొడలును, వలుదతనంబుల సలపందనంబులు సిద్ధం
పుఁదనంబులు తద్దయుంగలిగికరికరాకారంబులై కరభనిభంబులై కనకకదళీ మృదు
లంబులునైన పెందొడలును, కరటిశిరః కఠినంబును రథాంగరమాధురంధరంబును
పులినఘనంబునగు జఘనంబును, ఆవర్తవర్తులంబును నితాంతపున్నాగలతాంత
కాంతంబును నతిగంభీరంబునగు నాభిసరోవరంబును, అసితబిలేశయబాలికంబున
కునెలికన్నైచలిచీమచాలునకుంబోలికయై శైవాలవల్లికిం దల్లియైచెలువారు నూగారు
ను, ఆగడపలంగడవై చిపీచీ రేఖలంబోద్రోచికుసుమనారాచుకేళాకూళింగలజాం
బువాసోబనంబులఁ బ్రతిఘటించుత్రివళీ విభాగంబులును, కమలకోరక కనకకలశ
కరికుంభ ప్రముఖంబులగునుపమాద్రవ్యంబుం గొఱివ్వడంచి పచారించి నిక్కటిల్లి పె
రిగి నిక్కిక్కసించి కవజక్కవలఁ బెక్కువలలంబెట్టుచుఁజూపట్టుదోర్మూలకూలం
కషంబులగు కుచలికుచంబులును, ప్లక్షపల్లవవల్లభంబును చపేటపుట పరిస్ఫుటంబు
ను నగు వేదీమధ్యనిభమధ్యంబును, ఫణిఫణాఫలక భాసురంబునును తాంబూలీదళ

---

తృప్తిని. భువనమోహిని—లోకమును మోహింపఁజేయునది. మత్తకాశిని—ఉత్తమస్త్రీ. తదాదే
శంబునన్—ఆయనదైనయాజ్ఞచేత. శిఖావళి—నెమలి. గమకము—మనోజ్ఞత. తోడవు—ఆభర
ణము. బెడంగారి—అందగించి. కెందమ్ములకున్—ఎఱ్ఱతామరలకు. చూపట్టు—తోఁచు. లావణ్యంబు
—కాంతి. సేవగించు—రోయు. ముకురంబులు—అద్దములు. మకరధ్వజశరధి—మన్మథునియమ్ము
లపొది. శాలిగర్భ—వరిపొట్ట. గోపుచ్ఛ—ఆవుతోఁక. కాహళ—తుతార. సందర్భంబుల—పూ
ర్వులయొక్క. సౌందర్యంబున్—చక్కఁదనమును. వలుదతనంబులు—లావుఁదనములు. సలపం
దనంబులు—గానుగానులావుతగ్గియుండుటలు. సిద్ధంపుఁదనంబులు—నునుపుఁదనములు. కరభ
నిభంబులు—చిటికెనవ్రేలి మొదటనుండి మణికట్టుదాఁకనుండు అరచేతిలోవలిపార్శ్వభాగమును
బోలినవి. మృదులంబులు—మెత్తనివి. రథాంగరమాధురంధరంబు—చక్రసంపద్భారమునువహిం
చినది. జఘనంబు—మడికట్టు. ఆవర్తవర్తులంబు—సుడివంటిగుండ్రఁదనముకలది. పున్నాగలతాంత
కాంతంబు—పొన్నపువ్వువంటిమనోజ్ఞతగలది. గభీరంబు—లోఁతుగలది. అసితబిలేశయబాలికం
బునకున్—నల్లత్రాఁచుపిల్లకు. చెలువారు—అందగించు. ఆగడపలన్—దొంతిమబ్బులను. వీచీరేఖ
లన్—అలలచాళ్ళను. కేళాకూళిన్—క్రీడాసరస్సునందు. జాంబువాసోబనంబులన్—బంగారుమెట్ల
ను. ప్రతిఘటించు—ఎదిరించు. త్రివళీ—కడుపునందిమూడుమడుఁతలయొక్క. కమలకోరక—తా
మరమొగ్గ. ఉపమాద్రవ్యంబుల—సరిపోల్పువస్తువుల. పచారించి—వ్యాపించి. నిక్కటిల్లి—కదిసి.
కక్కసించి—బాధించి. దోర్మూలకూలంకషంబులు—చంకలపార్శ్వములనొరయునవి. లికుచంబు
లు—గజనిమ్మ (పండ్లు) ప్లక్షపల్లవ—జువ్విచిగురుటాకు. వల్లభంబును—ప్రియమయినదియు. చపేట

తరుణంబులునునై నిగనిగనిపసిండితగడుండెగడు కరమూలంబులును, కందర్పకళల చెన్నునం బూవుబెత్తులమెత్తున సోగలేఁగలబాగునబుజగలిగినబుజంబులును, కలువ ఱేకులచెలువున జోకమీరువాలారు కొనగోరులును, పవడంపుఁజివురులపగిదిగలర క్తాంగుళి ప్రవాళంబులునుంగలిగి నెత్తురుట్టిపడుకరతలంబులును, కంబుబిబ్బోకావ హంబును క్రముకతరుకమనీయంబును కోమలాంశుమత్ఫలాముకుళ మోహనంబున గుకంధరాభోగంబును, సమ్మిశ్రవటఫలద్వయశోభాద్వైగుణిబిడంబగుచిబుకంబును, చక్కెరలధికరించితేనెలంబోనాడి చెఱకురసంబుల నిరసించి మధురిమ నమరునధ ర బంధుజీవ ప్రసూనంబును, మొల్లలనుల్లసంబాడి యాణిముత్తియంబుల నుత్తరిం చుసుధాబిందువులఁ బలువరుసల సరసంబాడుపలువరుసయు, సంధ్యారాగరంజితం బగు కళారాజరేఖ పొత్తువడయు నుత్తరోష్ఠపుటంబును, పరిస్ఫుటనాసికాసుగం ధనిశ్వాసధారాధోరణీ నిశితమార్గంబునుంబోనియయ్యూర్ధ్వోష్ఠబింబ ఫలంబుమీఁ దినిమ్నభావంబును, సూనసాయకుదోనివిల్లును పల్లవకరవాలులాంగలాయుధంబును సామివికసిత చంపకకోరకంబును నవ్వుఁబువ్వునునవ్వుచునివ్వటిల్లు నుల్లసితనాసి కాశిఖరంబును, సితమయూఖరేఖా సఖంబగునాసలును, నింబకిసలయంబుల కసన యంబొందించు ముకురంబును నరంటిమొక్క మొదలియాకు లెక్కలనెకసక్కెం బుసేయుచుఁ గాయజునింగిణుల వంగడంబగునెలవంక కన్నుబొమల కొమలును

---

పుట—చాఁచిన వ్రేళ్లుగల అఱచేతిలోపలిభాగమువలె. పరిస్ఫుటంబు—ప్రకాశించునది. యజ్ఞవేదిమధ్య—యజ్ఞవేదికనడిమిభాగముతోడ. ఫలాఫలక—పలకవ. లెపడగవలె తాంబూలీదళ—తమలపా కులయొక్క. పసిఁడి—బంగారు. తెగడు—తిరస్కరించు. కరమూలంబులు—చంకలు. పూవుబెత్తుల—పువ్వులసరముల. ఎత్తునన్—విధమున. సోగ—నిడుపైన. బుజ—వ్రేలువతనము. జోక—అం దము. వాలారు—వాఁడియైన. ప్రవాళంబులు—చిగుళ్లు. కంబుబిబ్బోకావహంబు — శ ఖ మునకు అందమును కలిగించునదియు. క్రముకతరుకమనీయంబు—పోఁకమ్రానిని మనోహరత్వముక లది. కోమలాంశుమత్ఫలాముకుళమోహనము—మృదువైనయరఁటిమొగ్గవలెమోహముపుట్టిం చునది. కంధరాభోగంబు—మెడయొక్క వైశాల్యము. చిబుకము—గడ్డము. పోనాడి—నిందించి నిరసించి—తిరస్కరించి. మధురిమన్—తియ్యఁదనముచేత. బంధుజీవప్రసూనంబు — మంకెన పువ్వు. ఉల్లసంబాడి—పరిహసించి. అణి—గుండ్రఁదనముగల. ఉత్తరించి — దాఁటి— మీరి పలువరుసలన్—బహువిధములయిన బావమాటలు మొదలగు పరుసలచేత. రంజితంబు — ఎఱ్ఱనైనది. కళారాజరేఖ—కళామాత్రమైన చంద్రరేఖ. పొత్తు—స్నేహము. ఉత్తరోష్ఠపు టంబు—పైపెదవి. సుగంధనిశ్వాసధారాధోరణీనిశితమార్గంబు — మంచివాసనతోడియూర్పుల ప్రసరణముయొక్క అడ్డములేనిచుఱుకుగలదారి. పోని—వంటి. బింబఫలంబు—దొండపండు. నిమ్న భావంబు—పల్లము. దోనివిల్లు—అల్పధనుస్సు. పల్లవకరవాలు—మన్మథునియొక్క. సామి—సగము చంపకకోరకంబు—సంపెఁగమొగ్గ. ఉల్లసిత—మీఁదికినిక్కిన. నాసికాశిఖరంబు—ముక్కుమొన. సఖము—మిత్రము. ఎకసక్కెంబు—పరిహాసము. వంగడంబు—వంశము. లాలసంబు—తలప డుట—అతిశయము. ఒఱపు—అందము. కోపు—విధము. విసూత్రితంబులు—సూత్రములేనివి. పత

చకోరంబుల ప్రకారంబును జేరలఁతీగను సారసంబుల దారసంబును మీలమేలును మెఱుపులమెఱుపును మరుతూపులకోపును నుత్పలంబులయొప్పును కైరవంబులగౌరవంబును నేణనేత్రంబుల వైచిత్రియు విసూత్రితంబులుగావించి మించుశ్రవణపుటకూప పతయాళువులగువిలోలవిలోచనంబులును, దర్పణంబులదర్పంబును సరోజంబులరోజయు సుధాకలశంబుల విలసనంబును నంబురుహబింబంబుల మదంబును నంబోషించి యశేషకళాకలాపపాణంధమ స్వర భాస్వరంబగు వదనవలయంబును, శ్రీకారంబులజోకయుఁదొమ్మిదింటి లెక్కలయొమ్మికయు మోదుగు విరులసిరులు నుబోసరించి వాసివడయు శ్రుతిశష్కులికలును, నిష్కలంకంబులై నిబిడంబులై స్నిగ్ధంబులై నీరంధ్రంబులై నీలంపు గుంపులసొంపు లామతింపుమంచి నెఱికురులునంగలిగి వలరాజునెత్తపలకతళుకునం గనుపట్టుపేరునమేపారి యాపారిజాతామోదమేదురవిలాసంబులభాసిల్లి వెండియు ॥ ౧౭౯ ॥ ఆ ॥ వివిధయువతికోటివేమఱుసృజియించి । యవ్వధూటిఁజేయ నజుఁడుతలఁచి । కేలుదోయిగడుగఁగ్రేళుల తుదనంటు । జలకణంబులేమొసతినఖాళి ॥ ౧౮౦ ॥ తే ॥ అంబుజాననపెందొడలరఁటులగుట । దానఁగలిగిన లావణ్యసూనభరము । వలనిపైతేఁకలాకరెండు వ్రాలి బోర । గిలఁబడినరీతి మీఁగాళులలరుసతికి ॥ ౧౮౧ ॥ క ॥ మదిరాక్షిజంఘులంగజు । గదలగుసూహింపఁగావుకాహళులైన । న్నదుకుపడకగీపెట్టక । పదనుదివిసిరాగిదేఱిపలుకకయున్నే ॥ ౧౮౨ ॥ తే ॥ కరికరంబులుత్వగ్దోషకల్మషంబు । నసనయింపంగ సతియూరువులైపొడమియుఁ । బుష్కరంబులతగులంబుఁ బూనెచరణ । దంభమునఁ బూర్వవాసన తలఁగుటెట్లు ॥ ౧౮౩ ॥ తే ॥ విసమహాసనకటిసీమపృథివియగుట । నికరమటుగాకయున్నఁబై నెలవుకొనునె । కాంచియనుమధ్య మాయయుఁగన్రమ నాభి । లక్ష్మియును ద్వారవతియును సలక్షణముగ ॥ ౧౮౪ ॥ తే ॥ సకియనాభియము నమంకిజన్మనంపు । బాలకృష్ణుండువెడలింపబయలుపడిన । కాళియఫణీంద్రుఁడేమొ రోమాళిమధ్య । విష్ణుపదమున నణఁగిన విధముగలిగె ॥ ౧౮౫ ॥ ఉ ॥ మానవతీల

యాళువులు—పడునట్టి స్వభావముగలవి. విలోల—మిక్కిలిచలించెడి. ఓజ—శోభము. విలసనము—ప్రకాశము. పాణింధము—ఊఁదునట్టి. అంబురుహబింబంబులు—చంద్రబింబములు. జోక—విధము. ఒమ్మిక—ఇమిడిక. బోసరించి—బలిసి. శ్రుతిశష్కులికలు—చెవులనెడిచక్కిలములు. నిబిడంబులు—నిండుకొన్నవి. స్నిగ్ధంబులు—మెఱుఁగుగలవి. నీరంధ్రంబులు—సందులేనివి. సొంపులు—అందములు. ఆమతించు—పూజించునట్టి. నెఱి—వంకరగల. వలరాజునెత్తపలకతళుకునన్—మన్మథుని సొగటాలపుపలకయొక్క ప్రకాశముచేత. ఏపారి—అతిశయించి. ఆమోదమేదుర—పరిమళాతిశయముయొక్క. భాసిల్లి—ప్రకాశించి ॥ ౧౭౯ ॥ ౧౮౦ ॥ సూనభరము—పూగుత్తి ॥ ౧౮౧ ॥ ౧౮౨ ॥ త్వగ్దోషకల్మషంబున్—తోలువలనిదోషమయినమైలిని. పుష్కరంబుల—తామరల; తొండపుఁగొనల. తగులంబున్—ఆసక్తిని—సంబంధమును. దంభమునన్—నెపముచేత. తలఁగుటు—తొలఁగించుట ॥ ౧౮౩ ॥ కాంచి—మొలనూలు; ఒకపట్టణము. మాయ—ఇంద్రజాలము—లేమి, ఒకపట్టణము. ద్వారవతి—ద్వారములుకలది, ఒకపట్టణము ॥ ౧౮౪ ॥ రోమాళి—నూఁగా

లామతనుమధ్యమపక్ గజవైరికులకృత । ధ్యానమరుస్మదావళము యౌవనపుంబో
దరిల్లుదూలఁగాఁ । గానఁగవచ్చు కుంభములుగా పుగదాకుచకుంభయుగ్మకం । బౌ
నటులైన వల్లభనఖాంకుశరేఖలుగల్గి మీటగున్ ॥ ౧౮౬ ॥ తే ॥ వళులులాంఛన్యవా
రిధివలననిగుడు । వీచిలతికలు కాంబోలు వెలఁది కేలు । విపులకంకణ వంగుళీవిద్రు
మంబు । మత్స్యరేఖాంకితమునగు మహిమకలిమి ॥ ౧౮౭ ॥ తే ॥ ముదితకరమూ
లములయొప్పుప్రముచ్చిలించ । యీకయుండినసోకోర్కెనాళీకభవుఁడు । ఫణిగణంబు
లఁదవ్వోభగపద్మరాగ । యోగమున తాలు మోపించుచున్నవాఁడు ॥ ౧౮౮ ॥ ఆ ॥
కంబుపాణితనకుఁ గాంతుండుగాఁగల్గు । టెఱిఁగి కంఠకంబు నింతి దాల్చె । నోకోర్కె
యొప్పుగాదె యుత్తమసతులకుఁ । బతులుపూనినట్టి వ్రతము దాల్ప ॥ ౧౮౯ ॥ ఉ ॥
సోమబింబాస్యదశనవాసోమతల్లి । యొప్పుచంద్రికఁగుసుంబాలుగుప్పళించి । జిలుఁగుఁ
బలుచనివాసోవిశేషములకుఁ । జెన్నొసఁగుఁగాదె యొటులంటికన్నెకలిమి ॥ ౧౯౦ ॥
తే ॥ అలముఁజేసియనాసిబిసములకట్టి । శశికరాబ్జములుసుధాశాదభూమి । భా
వజుఁడువిత్తులవిధమొలచినపైరుపేర । వెదవిలాసంబుపూఁబోఁడిపెదవిపదవి ॥ ౧౯౧ ॥
తే ॥ దాడిమీబీజరాజికెందళుకు మొల్ల । మొగ్గలపిసాళమును ముత్యములసుహాణి ।
తమ్మిపువ్వుటంగోలుచున్న నెమ్మి వడయు । దంతురాలకసుస్నిగ్ధదంతపఙ్క్తి ॥ ౧౯౨ ॥
తే ॥ క్షీరకంఠంబులిఁబ్రహ్మవారువముల । గెంటసంబాముసవగల్గుకీసలగోష్ఠి । సుస్వ
రములెకర్కగసనోటుసూపినట్టి । పల్లవగ్రాహిపాండిత్య పరభృతములు ॥ ౧౯౩ ॥
క ॥ వదనారవిందదళమున । మృదుగతిజనునుందహాసమిషచంద్రికల । న్మృదదంతా
వళిగమనకు । నుదధిశయనదృక్చకోరయుగహర్షదమౌ ॥ ౧౯౪ ॥ తే ॥ యువమ
నోజాంగలక్షేత్రముత్తరించి । గరుసుపడమున్నమదనలాంగలికుహాలము । కామినీమ
ణిమకర్కటుగాకయున్న । నాసికాభంగిపుప్పొడిగట్టునాటునోటు ॥ ౧౯౫ ॥ క ॥ బిస
రుహరజముననక్షత్రకం । దుసిమినదగదగవెలుఁగునుడు రాజ్యశ్రీయున్ । బిసరుహపాణి

---

రుచిష్ణుపదమునన్—విష్ణుని పాదమునందు; ఆకాశమునందు ॥ ౧౮౬ ॥ ఉలికి—భయపడి. మరుస్మదావళము—దేవతలయేనుఁగు. ॥ ౧౮౬ ॥ కంకణము—నీటిబొట్టు; ముంజేతకడియము. విద్రుమంబు—చిగురు; పగడము. మత్స్యరేఖ—చేపరేఖ; చేఁపలచాలు ॥ ౧౮౭ ॥ ౧౮౯ ॥ కంబుపాణి—విష్ణువు ॥ ౧౮౯ ॥ దశనవాసోమతల్లి—మేలిమైన పెదవి. చంద్రిక—వెన్నెల; కుసుంబా పట్టము. గుప్పళించి—వ్యాపింపఁజేసి. జిలుఁగు—సూక్ష్మమైన. వాసోవిశేషములకున్—వస్త్రవిశేషములకు. కన్నెకలిమి—నూతనసంపద ॥ ౧౯౦ ॥ శాదభూమి—అనుసునేల. వెద—విత్తనాలు ఉద్దిగమునందు దిగవిడుచుట ॥ ౧౯౧ ॥ కెందళుకు—ఎఱ్ఱని మెఱుపు. పిసాళము—వికాసము. సుహాణి—స్వచ్ఛమయిన మెఱుఁగుసిరు. దంతురాలక—నొక్కులపాడి వెంట్రుకలుగలది ॥ ౧౯౨ ॥ గెంటసము—పరిహాసము. ఓటు—ఓటమి—అపజయము. పల్లవగ్రాహి—చిగుళ్లనుగ్రహించునది; విటు నుగ్రహించునది. పాండిత్య—నేర్పుగల. పరభృతములు—కోకిలములు ॥ ౧౯౩ ॥ ౧౯౪ ॥ జాంగలక్షేత్రము—బీటిపొలము. గరుసు—మేర—మొత్తని. నాటునోటు—నాటునా ॥ ౧౯౫ ॥ రజము—పుప్పొడి చే; ఉసిమినన్—కోమికగగి వేయఁగా. జృంభించున్—విజృంభించును ॥ ౧౯౬ ॥

ముఖాంబుజ । మసమాయుధసాధకుంభమై జృంభించున్ ॥ ౧౯౬ ॥ క ॥ ఆవృత్తో
ర్మిలులితరా । జీవములకుమరుపతాకజీవంబునకున్ । జీవంజీవంబులకా । జీవంబు
లుచెలువకన్నుసిరులమెఱుంగుల్ ॥ ౧౯౭ ॥ తే ॥ వాసుదేవాదినవశక్తివైభవంబు
రుక్మిణీసత్యభామలరూపరేఖ । యిదియెవహించుననల్పయిడినపదునో । కొం
టిలెక్కనంగనబొమ్మలువిదకమరు ॥ ౧౯౮ ॥ చ ॥ పడతిముఖాంశునివహములుభా
సురవర్ణలలాటపత్త్రకం । బిడిబుణలీలఁగైకొనియె నిందుఁడునద్దముసాటిగాఁగ
నె । న్నఁడొజలజాతమప్పుజతసంబుగఁ దీర్పనిబల్మినాకొకాపే । రమునునీటనెండ
నిల నాఁగినదూఁగిననోర్చుచుండుటల్ ॥ ౧౯౯ ॥ తే ॥ సితకరశ్రీఁబయోరుహ
శ్రీనిజేయు । కాంతమొగమనిశ్రుతిపుటీకైతవమున । నలువవ్రాసినశ్రీకారములయు
గంబు । వర్ణనాతీతరుచిమించుకర్ణయుగళి ॥ ౨౦౦ ॥ సీ ॥ ముఖమంబురుహమని ము
మ్మరంబుగనప్పళించుతేనియదిండిలెంకలనగ । నాననచంద్రునియంకకర్దమమొకకడ
కోసరించినపోడవనంగ । నధరసుధాపూరితాస్యహేమకలశిమూసినీలంపుమూకు
డనఁగ । వదనపద్మనిధిపైవ్రాలినయువమనో మోహాంధకారసమూహమనఁగఁ ।
గఱకుఁదనముఁజాలఁదఱచుఁదనంబును । నెరులసిరులఁగలిగివిరులపేరి । కీర్తిబుగు
లుకొనఁగఁగిసలయాధరకొప్ప । కొప్పుకప్పుమీఱియొప్పుటొప్పు ॥ ౨౦౧ ॥ క ॥ వల
రాజుకేలివాలుం । బలుకయుబలెనలరువేణిపాణింధమమై । లలితాంగివెన్నుపట్టియు ।
ధళధళమనుకుందనంపుఁ దగడున్ దెగడున్ ॥ ౨౦౨ ॥ శా ॥ ఈధారన్ భువనైక
మోహనకళాహేలావిలాసంబులన్ । రాధాకన్యకధన్యకాంతిఁదనరారన్ దద్వశా
శారతిన్ । గోధుగ్బాలకదివ్యమూర్తియగుశ్రీగోవిందుఁ డంభోజినీ । మాధుర్యం
బునకగ్గలించునళిసమ్రాడాకృతిం గైకొనున్ ॥ ౨౦౩ ॥ క ॥ ఆరాధామాధవులకుఁ ।
గోరికలన్యోన్యహృదయకోటరములనం । కూరితములయ్యెదినముఖ । వారిజగర్భ
ములనుబ్బు వాసనలక్రియన్ ॥ ౨౦౪ ॥ ... ... *

---

లులిత — చలింపఁజేయఁబడిన. మరుపతాకజీవంబులకున్ — మత్స్యములకును. జీవంజీవంబుల
కున్ — చకోరములకును ॥ ౧౯౭ ॥ నవశక్తులు — ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఉత్సాహశ
క్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, సత్త్వశక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి ॥ ౧౯౮ ॥ నివహములు — వరుసలు. పత్త్రకం
బు — పత్త్రము. అఁగినన్ — అడ్డగించినను. తూఁగినన్ — ఊఁగినను ॥ ౧౯౯ ॥ ౨౦౦ ॥ ముమ్మరం
బున్ — అధికముగ. అప్పళించు — కప్పునట్టి. తేనియదిండిలెంకలు — తుమ్మెదబంట్లు. ఓసరించిన
— తొలఁగించిన. పోడవు — ఆకృతి. హేమకలశి — బంగారుకలశము. విరులపేరికీర్తి — పుష్పంబులే
కీర్తి. బుగులుకొనఁగన్ — వ్యాపింపఁగా ॥ ౨౦౧ ॥ వాలున్ — కత్తియు. పలకయున్ — కేడెము
ను. పాణింధమమై — చీఁకటియై. తెగడున్ — తిరస్కరించును ॥ ౨౦౨ ॥ ఈధారన్ — ఈవిధమున.
హేలా — ఒయ్యారముగల. గోధుగ్బాలకదివ్యమూర్తి — గొల్లపిల్లవానియొక్క అప్రాకృతమయిన
యాకారముగలవాఁడు. అంభోజినీ — తామరతీఁగయొక్క. అగ్గలించు — ఉత్సహించు. అళిసమ్రాట్
— తుమ్మెదరాజుయొక్క ॥ ౨౦౩ ॥ కోటరములన్ — తొఱ్ఱలయందు. అంకూరితములు — మొల
కెత్తినవి. దినముఖ — ప్రాతఃకాలమునందు ॥ ౨౦౪ ॥

శా ॥ చాణక్యప్రథిత ప్రభావసుషమాసర్వస్వపుష్పాస్త్రశ్రీ । వాణీనిత్య
నివాసనేత్రముఖసేవాసావధానాఖిల । క్షోణీనాథచమూపనందనభుజాకోదండ
లంకారి । యక్షీణోదర్కుఁ జితార్కుఁ సూనృతలతాశృంగారచైత్రాగమా ॥ ౨౦౫ ॥

క ॥ సకలాస్థానసరోవర । నికరమరాళాయమాననిజకీర్తివిభా । ముకుర
ప్రతిఫలితదయా । సుకృతవితరణప్రతాపశుభముఖ్యగుణా ॥ ౨౦౬ ॥

మాలిని ॥ వితరణరణదక్షా వేదవేద్యాసపక్షా । చతురమతివిశేషాసార
సంగీతపోషా । క్రతుభుగధిపభోగాకాఙ్క్యదత్తానురాగా । ప్రతిభయభుజగర్వాభ
క్తికాభ్యాసశర్వా ॥ ౨౦౭ ॥ ... ... ... ... ... ... ... *

గద్యము ॥ ఇది శ్రీ పరమపదనాథనిరవధికకృపాపరిపాక పరిచితసరస
కవితాసనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగ
మాహాత్మ్యంబను పరమభాగవతచరిత్రంబునందుఁ
దృతీయాశ్వాసము.

---

ప్రథిత — ప్రసిద్ధమయిన. సుషమాసర్వస్వ — మనోజ్ఞతయొక్క సమస్తమునుగల. భుజాకో
దండలంకారి — తన విల్లుపట్టుటయందు శ్రీరాముఁడా. అక్షీణోదర్కుఁ — తక్కువకాని భవిష్య
త్ఫలములుగలవాఁడా. జితార్కుఁ — (తేజస్సుచేత) జయింపఁబడినసూర్యుఁడుగలవాఁడా. చైత్రాగ
మా — వసంతుఁడా ॥ ౨౦౫ ॥ ౨౦౬ ॥

సపక్ష — సమానపక్షముగలవాఁడా. క్రతుభుగధిప — దేవేంద్రునియొక్క. ప్రతిభయ — శ
త్రువులకు వెఱపునుగలుగఁజేసెడి. భక్తికాభ్యాసశర్వా — సేవకాభ్యాసమునందు శివుఁడా ॥ ౨౦౭.]



# పాండురంగమాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీద్యుతిసువర్ణరేఖా । విద్యోతితసదననికషకద్వదనీక । ప్రద్యోతనను
తగుణశత । వేద్యారామానుజేంద్రవేదాద్రీశా॥ ౧ ॥ వ॥ ఆకర్ణింపుమానిలింపనదీకో
టీరుండు హాటకగర్భసంభవునితో నిట్లనియె. అట్లు దినదినప్రవర్ధమానంబగు ననురా
గంబు చిగురుగొమ్మనుం జేగయై కొనసాగుచునికిం దనికి రాధ మాధవుం దనకు నధినా
థుం గాఁ గోరి గోవర్ధనాచల సమీపవర్తియగు ఋణవిమోచనతీర్థంబునం దపంబు
సేయం గడంగె ॥ ౨ ॥ సీ॥ ననలక్రొందావిమయొత్తినఁ గంటగిలు మస్తకం బెట్టులోర్చె
నో కటకుజడలు । కస్తూరితిలకంబు గాలివాలిన నేర్చు నో సలెట్లు ననిచెనో భసిత
మునకు । వజ్రాలనూలు నోర్వని కటీతటి యెట్లు తాల్చెనో పటుదర్భదామకాంచి ।
జిలుఁగుదువ్వలువింత బెళకిన కరుదాల్చు తనువెట్టులోర్చెనో ధాతువస్త్ర । భరణ
మునకంచు జనములచ్చెరువు నొందఁ । గొమ్మ గావించెఁ దపమట్టి క్రూరనిష్ఠ । కపలికిం
పించుక్రియ జగంబడలి వణఁకఁ । దన్నమయ జాత హేమంతదారుణవాత్య ॥ ౩ ॥ శా॥
తత్తాదృగ్జృంభమాణతరుణీతారుణ్యసంపద్దశా । ప్రోత్తుంగస్తనసిద్ధులోష్ఠకపచం
బుల్ పూనఁగా నోఁచుటల్ । చిత్తానందముగల్గుభోగులకుఁ ద్రింశోగ్రసంపాతమై ।
యుత్తాలంబగు సీతుకందువ కరంబుద్వేగమొందింపఁగన్ ॥ ౪ ॥ తే॥ చంద్రబింబా
స్యకుచశైలజన్మభూమి । గానరారూపుఁ బోలేనకట డిఁడిచకి । సింబకంతయుఁగం
పింపఁ దివముకొనుచు । మజ్జగంబులుపచరింపమూఁటిలోనఁ ॥ ౫ ॥ తే॥ పారదం

---

[ విద్యోతిత—ప్రకాశింపఁజేయఁబడిన. నికష—సానరాయిగనైన. కద్వదనీక—ఖద్యోతముల
మొత్త. అనీక—సమూహముగల. ప్రద్యోతన—సూర్యుఁడా— విద్యాంయియిరులకుచేత ...
చేసానపెట్టఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించువాఁడా. నుతగుణశతవేద్యా—పొగడఁబడిన య
నేకసద్గుణములచేతఁ దెలియఁదగినవాఁడా ॥ ౧ ॥ నిలింపనదీకోటీరుఁడు—శివుఁడు. హాటకగర్భ
సంభవునితోన్—నారదునితో. చేగ—చేవ. తనికి—ప్రకాశించి. సమీపవర్తి—దాపుననుండునది.
౨॥ననలక్రొందావిమయొత్తిన్—పువ్వులక్రొత్తతావి దట్టమైనను. కంటగిలు—నొచ్చుకొను.
ఏర్చు—మండు. ననిచెనో—అనురాగమునొందెనో. నూలు—మొలనూలు. దర్భదామకాంచి—
దర్భత్రాటిమొలనూలు. జిలుగుదువ్వలువ—సన్నని కట్టుకోక. బెళకిన—కొంచము ఒక
కదల్చినను. కరుదాల్చు—గగుర్పాటునొందు. ధాతువస్త్రభరణమునకున్—కావికోక కట్టుకొను
టకు. కొమ్మ—స్త్రీ—రాధ. కపలి—కోపించి. దారుణవాత్యన్—చక్కగాసుడిసిడిచుచుండు గాలిచే
త ॥ ౩ ॥ తాదృగ్జృంభమాణ—దానివంటి మదముచేత విజృంభించుచున్న. ప్రోత్తుంగ—మిక్కిలి
యున్నతములైన. భోగులకున్—భోగపురుషులకు; సర్పములకు. నిస్త్రింశోగ్రసంపాత—కత్తియు
క్కు భయంకరమైనపాటు. ఉత్తాలము—అధికము. సీతుకందువ—చలికాలము. ఉద్వేగము—
భయమును ॥ ౪ ॥ కడింది—అసాధ్యమయిన. ఇవరుకొనుచున్—చలిగొనుచు ॥ ౫ ॥ పారదంబు

బునఁదోఁచినపసిఁడిక్రేఁగ । పగిదిరాజిల్లె రాధచంపకసువర్ణ । వర్ణమగు మేనుకుముదధవళతుషార । పటలకంచుకవేల్లనఘటనకలిమి ॥ ౬ ॥ తే॥ నవ్యకాలాగరూద్వృత్తసములసతుల । చన్నుఁగొండలనుష్ణాగ్నిసంభవించె । మతినవగ్రుగుల ధూమానుమానకల । నగ్నిసాధింతు రచలంబులందు నెపుడు ॥ ౭ ॥ తే॥ సురలుకళలెల్లఁ గ్రోలినసోముతనువు । కప్పురముగుమ్మరించినఁగనకక్రోలి । పుష్పఁదేసియవనినయంభోరుహాంబా । యనఁగమంచింక బ్రహ్మాండమగలెఁజలిని ॥ ౮ ॥ క॥ అగలుంగుంకుమపువ్వనా । దొంగరుంజేలలును సీతుఁద్రోవంగలవే । పొగలేనిముక్కురంబులు । మగువలపాలిండ్లుభోగమహనీయంబుల్ ॥ ౯ ॥ క॥ పైనిగుడుమంచుతువ్వర । వానలచేఁదడిసికమలవనలక్ష్మిహరి । ధ్యానసిమీలితలోచన । యానలరాధాపధూటికనుగలమయ్యెన్ ॥ ౧౦ ॥ తే॥ కాలుఁగాలును గేలునుగేలు మోవి । మోవియును దాల్చిభోగిసమూహమమరె । నూహసేయంగభోగిసమూహమునకుఁ । బొసఁగమసకింపుఁబెనఁకువలెసఁగుఁగాదె ॥ ౧౧ ॥ క॥ శ్యామలకాలాగురునవ । ధూమమెదకుసుఖమొనర్పఁదోరపుఁగన్నుల్ । వేమొగుచుకరణసౌధ । స్తోమముననెఁగప్పఁబడిసారణగండ్లన్ ॥ ౧౨ ॥ క॥ అంతవసంతముజితహే । మంతముదీపించిమత్తమధుకరకలభా । క్రాంతమురుపుష్పరసవే । శంతముసకలద్రుమలఁబిసాళముచెలఁగెన్ ॥ ౧౩ ॥ ఉ॥ కెంజిగురాకుడాలు దులకించినధాతుపటంబుచాయఁజే । యంజదుకెక్కుపుప్పొడులనంటినతేటులుభూతిభృజ్జటా । పుంజముఁబోలఁగావిపినభూములలో మధులక్ష్మిపాల్చెనీ । లాంజనవర్ణుగోఁరితపమట్లొనరించుమృగాక్షికైవడిన్ ॥ ౧౪ ॥ క॥ ఆవిర్భవించెనీల । గ్రీవాలికకీలికీలకేవలసఖమై । పూవులకారుడివోవం । గా వేస

---

నన్ — సోదరసమునంన. కుముద ధవళ — తెల్లగలువ తెలుపుగల. తుషారపటల — మంచుసమూహమునైడి. కంచుక — కవచముయొక్క. వేల్లన — చుట్టుకొనుటతోడ. ఘటన — కూడిక. కలిమిన్ — కలుగుటచేత ॥ ౬ ॥ ఉద్వృత్తసము — నలఁగు ॥ ౭ ॥ క్రోలి — త్రాగి. అగలెన్ — భేదిల్లెను ॥ ౮ ॥ అగలు — అగరు. చేలు — వస్త్రములు; సీతు — చలిని. ముక్కురంబులు — కన్నులు. పాలిండ్లు — స్తనములు ॥ ౯ ॥ అనుగలము — అనుకూలము ॥ ౧౦ ॥ మసకంపుఁబెనఁకువలు — సంభోగమునందలి యుచ్చవేఁబెనఁగులాడుటలు ॥ ౧౧ ॥ శ్యామల — చామనిచాయగల. తోరపు — విశాలమయిన. సారణగండ్లన్ — కిటికీలచేత ॥ ౧౨ ॥ జితహేమంతము — గెలువఁబడినహేమంతఋతువుగలది. మత్తమధుకరకలభాక్రాంతము — మత్తుగొన్నకొదమతుమ్మెదలచేత ఆక్రమింపఁబడినది. ఉరుపుష్పరసవేశంతము — అధికమయిన పూఁదేనెపడియలుగలది. సకలద్రుమలన్ — అన్నివృక్షములందును. విసాళము — వికాసము. చెలఁగెన్ — అతిశయింపఁగా. దీపించెన్ — ప్రకాశించెను ॥ ౧౩ ॥ డాలు — కాంతి. తులకించిన ధాతుపటంబు చాయన్ — ప్రకాశించిన కావికోకచాయను. చదుకెక్కు — బుగదలుదేయునట్టి. భూతిభృజ్జటాపుంజమున్ — భస్మమును ధరించుచున్న జడలసమూహమును. మధులక్ష్మి — వసంతఋతుసంపద. నీలాంజనవర్ణున్ — నల్లకాటుకవన్నెగలవానిని — కృష్ణుని ॥ ౧౪ ॥ ఆవిర్భవించెన్ — పుట్టెను. నీలగ్రీవాలికకీలికీలకేవలసఖము — శివుని నొసటియగ్నిజ్వాలకుముఖ్యమిత్రము. పూవులకారు — వసంతఋతువు. ఉడివోవఁగన్ — ఉడిపోఁగా. వేసవి — గ్రీష్మఋతువు

విహారసవిపులఖరకరమగుచుఁ ॥ ౧౫ ॥ వ ॥ అప్పు డప్పటుగభస్తిహస్తియుంబోలె పద్మినీప్రమోదావహకరప్రచారంబై, దవదహనంబు కురుమహీవిభుండునుంబోలె స్వగోత్రనిర్భేదనిపుణంబై, మల్లియలపెల్లు కన్నడకవితావితానంబునుంబోలె షట్పదవృత్తవిలాసభాసురంబై, సరసులుసరసులుంబోలె వనితావిహారమహనీయంబులై రహివహించె. అంచలంచలం జంచలాచపలంబులును విప్రలంబులగు పడమటిపవనంబులు పొరుగులయుపవనంబులం బెరుగుకరువలివారువంబులకు గమనాఢ్యయున గురువులుంబోలె వడిమెఱసి సుడిసి యసితయగు వసుధఁగాఁడినెఱియలువాఱినందు దుదర విస్ఫురితాంత్రలతామతల్లికలపెల్లునం బాతాళవ్యాళంబులు గానవచ్చె. పెచ్చువెరుగు ఖరకరకరనిపాతంబుల నాతప్తంబులగు నెలవులం దొరఁగిపఁగువెలఁదివెన్నెల నీర్వట్టు వెన్నెలపిట్టలు పొట్టలునిండ నాస్వాదించె. రక్కసజవ్వనులుమవ్వంపుమచ్చికలనిచ్చలు గ్రీడింప నావ్రీడావతుల యతులనాభీ వివరంబుల నింకినవియుంబోలె నదులయుదకంబు లింకె. విచికిలమాలికాలంకృతమౌళిభాగులును నారంజితధాతుపటలపగభాగులునగుభోగులబాగునఁగ్రుడ్డు మోచు నెఱచీమలచాలు చెమ్మయిమ్ములం గ్రుమ్మరందొడంగె. వ్యావహారికసత్యత్వంబు ప్రకటించు ప్రపంచంబుచేతవంచితులగు నెఱుకలేనికరటులకరణిహరిణంబులు మరీచికావీచికాపానవివశంబులై దిశలఁబరిభ్రమించె. ముంచుకొనుసంపెఁగల సౌరభంబునకుంజాలసరోలంబు

---

హాసవిపులఖరకరము—కిరణవిరిల్లుటచే అతిశయించినసూర్యుఁడుగలది॥ ౧౫॥ పటుగభస్తి—సూర్యుడు. పద్మినీప్రమోదావహకరప్రచారుఁడు— తామరతీఁగయందలి వాసనను పొందించుచున్న కరము (తొండము) యొక్క వ్యాపనముగలవాఁడు. తామరతీఁగకు సంతోషమును కలుగఁజేయుచున్నకిరణములవ్యాపనముగలవాఁడు. కురుమహీవిభుఁడు—దుర్యోధనుఁడు. స్వగోత్రనిర్భేదననిపుణము—తనవంశమునుభేదించుటయందు సమర్థము; తన దైనపర్వతమునుభేదించుటయందు సమర్థము. షట్పదవృత్తవిలాసభాసురంబు—షట్పదము అనెడివృత్తముయొక్క ప్రకాశముచేత ప్రకాశించునది; తుమ్మెదలయొక్కవర్తనవిలాసముచేత ప్రకాశించునది. సరసులు—కొలఁకులు. రహిన్—బాగుగ. అంచలంచల—ప్రతిపార్శ్వమునందును. చంచలాచపలంబులు—మెఱుపువలెఁజలించునవి. కరువలివారువంబులు—జింకలు. అసిత—నల్లనిది. కాఁడి—నాటి. నెఱియ—పగులు. తదుదర—వానిలోపలిభాగమనెడికడుపులోని. విస్ఫురిత—ప్రకాశించునట్టి. ఆంత్రలతా—ప్రేఁగులతీఁగెలయొక్క. మతల్లికల—శ్రేష్ఠముల. పెల్లునన్—అతిశయముచేత. వ్యాళంబులు—పాములు. ఖరకరకరనిపాతంబునన్—సూర్యునికిరణములపాటుచేత. ఆతప్తంబులు—అంతట తపింపఁజేయఁబడినవి. వెలఁది—స్వచ్ఛమయిన. నీర్వట్టువెన్నెలపిట్టలు—దప్పిగొన్నచకోరపక్షులు. ఆస్వాదించెన్—త్రాగెను. రక్కసజవ్వనులు—వయసుగలరాక్షసస్త్రీలు. మవ్వంపుమచ్చికలన్—కోమలములైనయాసక్తులచేత. నిచ్చలు—ఎల్లప్పుడు. వ్రీడావతి—సిగ్గుగలది—ఆఁడుది. నాభీవివరంబులన్—బొడ్డుబొక్కలయందు. విచికిల—మల్లెపువ్వులయొక్క. ఆరంజిత—అంతటను ఎఱ్ఱవాఱిన. బాగునన్—విధమున. చెమ్మయిమ్ములన్—తడిచోటులందు. కరటులకరణిన్—మూఢులవిధమున. మరీచికా

బులలీల వియోగిలోకంబులు విషయవిముఖంబులయ్యె. ఇసుకమెదువు నెలవులం బన్నిన
పసుపుటాకుంజప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుతోడి కరువేరు పరిమళం
బులును జాజిపిరులవలపును వట్టివేళ్ల వాసనలుం గల ప్రపాపాలికాఘనవర్జితంబుల
గు కలశోదకంబులు గ్రోలి సేదదేఱి తెరువరులు తాలవృంతానిలంబుల బలుపు కొలిపి
మున్ను పరిక్షీణంబులగు ప్రాణపవనంబులం బోసరింపం జేసిరి తత్కాలంబున. ౧౬ ||
క || ఆపద్మిని దినకరకర | తాపమునకు నోర్చి ఘోరతపమొనరించెన్ | శ్రీపతియుడు
గులగొడుగుల | ప్రాపొదవిన వారిదౌఘభరమేలంటున్ || ౧౭ || తే || ఇట్టులత్యుగ్ర
మగు గ్రీష్మమేసరేఁగి | కాలవశమునం దనందానదీలుపడియెం | బెచ్చువెరుగెట్టి దియు
హెచ్చుపేర్చు బెల్ల | ప్రస్ఫుటకెందునిలో కోక్తి చాటుగాదె || ౧౮ || క || దీపమణంగం జీకటి
యును | గోపమడంగ శాంతిగుణముం గోల్కొనుక్రియ నా | టోపోద్భటమగు వేసవి |
కైపుసడిలం దోచెం గారుకాలము దళమై || ౧౯ || క || ఆకాశతత్త్వతనుఁడగు | కాకోల గ్రీ
వు కంఠకాళిమయనంగాం | గోకిలనీలము జలధర | పాకము పర్యాయవృద్ధిం బ్రబలం దొ
డంగెన్ || ౨౦ || సీ || ధళుధళుక్కననింగిం దాటించెం బలుమారు నీరాళ్లగొండిగన్ని
యమెఱుంగు | పౌలస్త్యపవనసంపాతజాతప్రీతిని విరినమ్రికులకెలమివచ్చెం | బ్ర
థమోదబిందుసంభారంబు మందునూనియయ్యెం బగిలిన నేలమేని | కంజుముమంతు
రసానియనుభోలెం గనిపించెం దోరంపువణ్ణులవిదూనభూమిం | గొరలిసకిలించె పణ్మ
ఖుమెఱుపమావు | పరిమళముచూచెం గరిశుష్కపల్వలంబుం | గడిమిచిగిరించె గ్రాజ
వంగడముననిచె | నఖిలహితమైన మేఘోదయంబునందు || ౨౧ || తే || కారుచిచ్చనుభృ
గురాముకారణమునం | బెటిలి నిర్వంశమైన భూభృత్కులంబు | క్షేత్రములవంశవృ

---

వీచికాపానపిపాసంబులు — ఎండమావులయందలి నుత్రాగుటకై సోలినవి. మెదువు — మెత్తని. గుప్ప
ళించిన — నిండించిన. వాసన — వాసన. ప్రపాపాలికాఘనవర్జితంబులు — చలివందిరులనుండు పశు
వులదేహములనుండి విడువబడినవి. సేద — బడలిక. బలుపుకొలిపి — బలము కలుగంజేసి. పోసరిం
పన్ — బలియ || ౧౬ || పద్మిని — పద్మినీజాతిస్త్రీ, తామరతీఁగ || ౧౭ || ఏసరేఁగి — మిక్కిలివి
జృంభించి. దీలుపడియెన్ — బలము తగ్గినదాయెను. పేర్చుట — అతిశయించుట. ప్రస్ఫుటకె — తెగ్గుట
కె || ౧౮ || గోల్కొను — వర్ధిల్లు. కైపు — విజృంభణము. సడిలన్ — సళ్ళంగా — తగ్గంగా. కారు
కాలము — వానకాలము || ౧౯ || కాళిమ — నల్లదనము. జలధర — మేఘములయొక్క. పర్యాయ
వృద్ధిన్ — క్రమముగా నగునట్టి వృద్ధిచేత || ౨౦ || నింగి — ఆకాశము. కన్నియమెఱుంగు — క్రొత్త
మెఱుపు. పౌలస్త్యపవనసంపాతజాతప్రీతిన్ — ఉత్తరపుగాలిసోఁకుటవలనఁ బుట్టిన ప్రీతిచేత. ఇవి
రిన — ఎండిన. ఎలమి — వికాసము. ప్రథమోదబిందుసంభారంబు — తొలకరి వానచినుకుల సమూహ
ము. కంతురసాని — కంత్రసాని. ఖుమెఱుపమావు — మూఁగ గుఱ్ఱము. పల్వలంబు — అడుసుపడియ. వంగ
డము — వంశము — సమూహము. ననిచెన్ — పూచెను. మేఘోదయంబునందున్ — వానకాలము
నందు || ౨౧ || బెటిలి — పెట్లి. నిర్వంశము — వంశములేనిది, వెదుళ్లులేనిది. భూభృత్కులంబు —
రాచకులము, పర్వతసమూహము. క్షేత్రములన్ — భార్యలయందు, పొలములయందు. వంశవృద్ధి

ద్ధి రాజిల్లెఁ జెలియ । జలధరోదయవిప్రప్రసాదలబ్ధి॥ ౨౨॥ తే॥ ప్రబలుకడగండ్లనింద్ర
గోపములు జంబుఫలములు నుబొల్పెఁ బచ్చికసట్టులందు । వనధినీరానఁ జెరలు నమ్మణు
లనెల్ల । నంబుదంబులు వెలిగ్రాసె నఱుగకనఁగ॥ ౨౩॥ తే॥ మోవిచెలువంబు గేదంగిపూ
వుఱేకు । సోయగము నూఁపుకన్నులసొబగు జికుర । బర్హిబర్హప్రభయుఁ జూపి ప్రతి
ఘటించె । నంబుధరకాలసౌభాగ్యమంబుజాక్షి॥ ౨౪॥ క॥ సలిలంపువృద్ధజలధర । ముఖ
పూనినయూఁతకోలనొత్తములక్రియన్ । దొలువానకాళులెసఁగెన్ । కలహంసకు
లంబులెల్లఁ గలఁగంబడఁగన్॥ ౨౫॥ శా॥ అద్రిగ్రావములుర్విరాల బలఘోషాడం
బరంబుల్ విరహిద్రోహంబొనరింపవారినిధి కెంగేలంటఁగా వాహినుల్ । భద్రే
భప్రతిమానమూర్తియగుచున్ పాథోధరశ్రేణికుం । భద్రోణంబులుగుమ్మరించె వి
స్ఫులాంభఃపూరధారావళిన్॥ ౨౬॥ క॥ పాపటతెఱుఁగున నడిగి నా । సాపుటముక్తాఫ
లప్రచారంబై రా । ధాన్యధ్రుక్శ్రీగృహముల । పైపైఁ బథమోదబిందుపటలము ని
గిడెన్॥ ౨౭॥ సీ॥ పెరిఁ సూచీముఖాభేద్యంబులగు నంధకారధారాచ్ఛటల్ గాఱుకొ
నినఁ । గర్జజ్వరాపాదకంబులై దంభోళిగంభీరరవములు గడలుకొనిన । ముజ్జగంబుల
ముచ్చముడిఁగింపఁగాఁ జాలు నీఁదగాడ్పులు బిట్టేపురుకొనిన । దుర్దమకర్దమస్తోమసం
ఛన్నభూములసోనవానలు నించుకొనినఁ । జెదరకటు కాలఁగన్నవచ్చినవిధాన । నాథ
సంకేతములకేగు నడికిరేలు । కామసంభవబాధాసహిష్ణువగుచు । స్వైరిణీకోటిని

---

—వంశముయొక్క వృద్ధి, వెదుళ్లవృద్ధి. లబ్ధిన్ — పొందుటచేత ॥ ౨౨ ॥ పొల్చెన్ — ఒప్పెను. అనన్ — త్రాగఁగా. తెరలు — బగులుపెడలు, అఱుగక — జీర్ణింపక ॥ ౨౩ ॥ మోవి — అధరము, ఒకానొకపండు. గేదంగిపూవుఱేకు — పచ్చమొగలిపూఱేకు, మొగలిరేకునది యాభరణము. సోయగము — అందము. ఊఁపుగన్నులసొబగు — చలింపఁజేయునట్టి కన్నులయొక్క యందము. చలింపఁజేయఁబడునట్టి నెమలిపురికన్నులయొక్క యందము. బర్హిబర్హప్రభ — నెమలికుంచెయొక్క ప్రకాశము, దర్భపోచలయొక్క ప్రకాశము. ప్రతిఘటించెన్ — ఎదిరించెను. అంబుధరకాలసౌభాగ్యము — వర్షాకాలముయొక్క మనోజ్ఞత్వము ॥ ౨౪ ॥ సలిలంపు — నీళ్లుగల. ఊఁతకోల — ఊఁతకొనుకఱ్ఱ. వానకాళులు — వానచినుకులధారలు ॥ ౨౫ ॥ గ్రావములు — రాతిగుండ్లు. విరహి గి — విరహి, తననారినెడఁబాసినవాఁడు. ద్రోహంబు — చెఱుపు. కెంగేలు — ఎఱ్ఱనైనచేయి. వాహినులు — నదులు. పాథోధర — మేఘములయొక్క. కుంభద్రోణంబులు — కుండలుతూములు నుగా. అంభః — నీళ్లయొక్క ॥ ౨౬ ॥ ౨౭ ॥ సూచీముఖాభేద్యంబులు — సూదిమొనచేతను భేదింపరానివి. ఛటలు — సమూహములు. గాఱుకొనినన్ — నిండుకొనఁగా. ఆపాదకంబులు — కలుగఁజేయునవి. దంభోళిగంభీరరవములు — వజ్రాయుధముయొక్క వెలితిలేనిధ్వనులు. ముచ్చముడిఁగింపఁగాన్ — మిక్కిలి ముడుఁగుకొనునట్లు చేయను. ఈఁదగాడుపులు — శీతవాయువులు. బిట్టు — శీఘ్రముగ. దుర్దమ — అణఁపరాని. కర్దమ — బురదయొక్క. సంఛన్న — చక్కఁగాఁ గప్పఁబడిన. సోనవానలు — ముసురువానలు. నాథసంకేతములకున్ — ప్రియులు ఏర్పాటుచేసినచోటులకు. నడికిరేలు — అర్ధరాత్రములందు. కామసంభవ — మన్మథునియొక్క. స్వైరిణీకోటి — అంకుటాండ్రసమూహ

ర్భయస్వైరధాటి॥ ౨౮ ॥ క॥ త్రిదశగురుప్రతిమానులు । నిదిపగలిది రాత్రియనుచు నెఱుఁగరు పరులే । రుదళితహరినీలమణి । చ్ఛదనీలము మొగులు సూర్యచంద్రులమిగులన్॥ ౨౯ ॥ క॥ తరణిలయానంతరమునఁ । గరమమరు దిగంతములను ఖద్యోతంబుల్ । మరలఁగఁ దైజసస్పృష్టికిఁ । బరమాణుచయంబు గూడఁబడు చందమునన్ ॥ ౩౦ ॥ సీ॥ ఇంద్రచాపంబు గాదిది మౌళితలమున సవరించు బర్హిపింఛంబు గాని । భిదురఘోషంబు గాదిది పాంచజన్యసంజాతగంభీరఘోషంబు గాని । యాశ్రయించిన బలాకావళి గాదిది హారిముక్తాహారయష్టి గాని । యిది కోలమెఱుఁగు గాదుదిరి బంగారంపుఁ బసిమిగ్రమ్మెడు పచ్చపట్టు గాని । వృష్టి గాదిది కరుణాంబువృష్టి గాని । నీలమేఘంబు గాదిది నీలవర్ణుఁ । డౌఁగనా మ్రోలఁ బ్రత్యక్షమయ్యె ననుచు । హర్షపులకితతనువయ్యె నవ్వధూటి ॥ ౩౧ ॥
వ॥ ఇట్లనవరతధ్యానధారాప్రవాహమగ్నహృదయయగు నాగగనావలగ్నకు నిఖిలజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె నంత భక్తవత్సలుండగు శ్రీవత్సవత్సుండు॥ ౩౨ ॥ సీ॥ అరచంద్రులాసించు పూర్ణాంశంబునుం బోలె నుదుటఁ గస్తురిబొట్టు పదను కొనఁగ । గగనంబునం దలిఖరమరీచియుఁ బోలె నురమునఁ గౌస్తుభంబొఱపు మీఱ । సురభూజశాఖలఁ జుట్టు తీఁటులఁ బోలెఁ గేలఁ బచ్చలకడియాలు మెఱయఁ । గోదమసంపెఁగ మొగ్గతుద బొన్నవిరివోలె ముక్కున ముంగఱ ముత్యమమర । నీలగిరిఁ గప్పు వెన్నెలనిగ్గుఁ బోలె । నవకమగు మేన హరిచందనంబు వొదువ । వివిధమణిభూషణప్రభల్ వెలయఁ ఫలిత । కల్పతరులీల రాధయగ్రమున నిలిచె॥ ౩౩ ॥ ఉ॥ శ్రీదనరన్ గృపారసము చిల్కఁ దపోనలజాయమానహృ । త్ఖేదము మానిపించి తన కేలను గేల్దెమలించి నిర్భరాహ్లాదమెలర్ప నయ్యువతి నర్ధశరీరము నట్లు ప్రోచెన । య్యాదవరాజవంశమణి యు

---

ము. స్వైర—యథేచ్ఛమయిన ॥ ౨౮ ॥ ప్రతిమానులు—సమానులు. మొగులు—మేఘము ॥ ౨౯ ॥ తరణిలయానంతరమునన్—ప్రొద్దుగ్రుంకినపిమ్మట. ఖద్యోతంబులు—మిడుఁగుఱుఁబురుగులు. తైజస—తేజస్సుగలవానియొక్క ॥ ౩౦ ॥ బర్హిపింఛము—నెమలిపురి. భిదురఘోషంబు—పిడుగుచప్పుడు. బలాకావళి—కొంగలచాలు. హారి—మనోజ్ఞమయిన. యష్టి—సరము. కోలమెఱుఁగు—వంకరలేని మెఱపు. ఉదిరి—అపరంజి. మ్రోలన్—ఎదుటను. హర్షపులకితతనువు—సంతోషముచేతఁ గగుర్పాటునొందిన దేహముగలది ॥ ౩౧ ॥ అనవరతధ్యానధారాప్రవాహమగ్నహృదయ—ఎడతెగని ధ్యానము చేయుటయనెడి ప్రవాహమునందు మునిఁగిన మనసుగలది— ఎడతెగక ధ్యానముచేయునది. గగనావలగ్నకున్—ఆకాశమువంటి నడుముగలదానికి— రాధకు. జగద్వలయము—వలయాకారమయిన లోకము. శ్రీవత్సవత్సుఁడు—శ్రీవత్సమనుపుట్టుమచ్చ ఱొమ్మునందుఁగల కృష్ణమూర్తి ॥ ౩౨ ॥ పదనుకొనఁగన్—చెమ్మగిల్లఁగా. ఖరరుచి—సూర్యుఁడు. ఒఱపు—అందము. సురభూజ—కల్పవృక్షముయొక్క. గోదమ—లేఁతదైన. విరి—పువ్వు. ముంగఱ—ముక్కఱ. నిగ్గు—తెలినకాంతి. నవకము—మృదువైనది. హరిచందనంబు—పచ్చగంధము. అగ్రమునన్—ఎదుట॥ ౩౩ ॥ చిల్కన్—ప్రసరింపఁగా. జాయమాన—పుట్టుచున్న. ఖేదము—శ్రమము. తెమలించి—

ద్రిజనీ ననూలిపోలికన్ ॥ ౩౪ ॥ క ॥ రాధాసంగమము దిషని । మాధవుఁ గని యొట్ట
వడినమం డిల్లం డెంగలెశం । పాథరము తనదు వర్ణము । బాధితమగు నేని వెలుకఁ బా
ఘనుండున్ ॥ ౩౫ ॥ క ॥ నీలాంజనవర్ణుఁడు రా । ధాలీలావతిని పెనఁగి తనరెదు క
డిన్ । గాలము శరత్సమాగమ । హేలాసౌభాగ్యమహిమ నేర్పు వహించెన్ ॥ ౩౬ ॥ సీ ॥
కలఁ కనీ రెంతయు గతకల్మషము జేసెఁ గతకాఫలము రీతిగలశసూతి । పాపటదీర్ఘ
భూభాగంబునా స్యాన శాదంబు శకటౌఘచక్రధార । శిఖి తాండవము కళాసికఁ జే
సడలించెఁ గలకుటీకలపేరి కాసెపిగువు । లుడిగిన జడివానలు దయించె వెండియుఁ
రిఘటావదవృష్టికై తెవమున । తెల్లు శోభిల్లె వంకెనటుల్లసిల్లెఁ । గాలకంధరవాహుఁ
గజ్జుకేఁగె । ముదితశతగోపకన్యకా వదనతులిత । లలితరుచిఁ బొల్చె రాకాకళా
రుండు ॥ ౩౭ ॥ క ॥ చనుమొలకలుగల కన్యా । జనములఁ బురుకించెఁ బద్మసరసీ రేఖల్ ।
నవిలుతుమిట్టకోలలు । వనరుహముకుళములు గానవచ్చుట కతనన్ ॥ ౩౮ ॥ సీ ॥ అలరా
కాధరాధర । దళములయందు భర్తనిలువు దంగవతరే । ఖలుబోలెఁ గ్రొత్తమంకెన
యలరులపైఁ దేటులు మరెనా సమయమునన్ ॥ ౩౯ ॥ తే ॥ పాంచజన్యంబు రాధిక
చంచలాక్షి । కంధరకు నోడి యెచటనో కాఁగి పోవఁ । దద్గతధ్వని గర్భ ద్రదా
యని యొ । చేరె వృషభంబు కంఠకుటీరవాటి ॥ ౪౦ ॥ తే ॥ పుండరీకుసిరసించ పూ
భార । మణఁప నవనీతలంబున నవతరించిన । కల్లు సిగురించినద్భుత గాత్రయునఁగఁ
జంద్రికాపాండుజలధరచ్ఛాయ వొదలె ॥ ౪౧ ॥ సీ ॥ కలుగకుండిన నేమి కడిమి ఖడ్గ
తావి ననిచిన మరువమెంతటికినోప । దొరవకుండిన నేమి దకేకినటనంబు చాల
యంచల సుభ్రమంబు । మెఱువకుండిన నేమి మెఱుఁగుల పోలప మేనక్షాత్రములె శా
ధళధళములు । సుడియకుండిన నేమిసోన వానల కెల్లు గజవాన వృష్టికిఁ గడమ కలదె । క

---

కదలించి. ఎఱ్ఱన్ — అతిశయింపఁగా. ప్రోచెన్ — పోషించెను ॥ ౩౪ ॥ సంగమము — కలిసికొన
ముదితునన్ — సంతోషించినవానిని. ఓటుపడిన — ఓడిపోయిన. తెరలెన్ — చలించెను. జలధ
రము — మేఘము. వెలుకఁబాఱున్ — వెలవెలఁబోవును. ఘనుఁడు — గొప్పవాఁడు, మేఘుఁడు ॥ ౩౫ ॥
పెనఁగి — కలసిమెలసి. తనరెదు — అతిశయించెడు. శరత్సమాగమ — శరత్కాలము రాకయొ
క్క. హేలా — విలాసముయొక్క. నేర్పు — ఆధిక్యమును ॥ ౩౬ ॥ కతకాఫలము — చిల్లగింజ. కల
శసూతి — అగస్త్యుఁడు. భూభాగంబు నాస్యనశాదబు — భూప్రదేశముయొక్క మట్టిగాను బు
ఱదను. శిఖి — నెమలి. కళాసిఁ జేసి — నాట్యక్రియావిశేషము చేత. కరిఘటా — ఏనుఁగుగుంపు
లయొక్క. శైశవము — నైపవము. కాలకంధరవాహుఁబు గజ్జకేఁగెన్ — నృత్తముయొక్క మదము
తిశయించెను. రాకాధరుఁడు — చంద్రుఁడు ॥ ౩౭ ॥ ననవిలుతుమిట్టకోలలు — మన్మథుని వైనాన
బాణములు. వనరుహముకుళములు — తామరమొగ్గలు ॥ ౩౮ ॥ ౩౯ ॥ కంధర — మెడ. గ్రాఁగి —
నపించి. దాయ — శత్రువు. కుటీరవాటి — గుడిసెచాలునందు ॥ ౪౦ ॥ అవతరించిన — పుట్టిన.
౪౧ ॥ ననిచిన — చిగిరించిన. పొలపము — ప్రకాశము. శాలి — వరిపైరుయొక్క. సోన — ముసురు ॥
కడము — తక్కువ. కారుకాలానన్ — వర్షఋతుకాలమందు. డిరిలి — వదలి. ఓసరిలినన్ — తొలఁగిన

రుకాలానఁగలిగినగౌరవంబు । చొక్కమైతోఁచె శరదృతుసౌష్ఠవమున । నురివితొల్లిటి
యధికారియోసరిలిన । వెనుకయధికారియవికావెవిభవకళలు ॥౪౨॥ ఉ॥ పాఁడియుఁ
బంటయుఁ గలిగి పంకవిహీన మనోహరాంబువుల్ । వేడిన నెల్లచోటఁ బ్రభవింపఁగ
భానుఁడు శీతభానుఁడున్ । గాఁడినమేఘకాళిమవికారము దూరముసేయ నెంత
యున్ । నాఁడెము చూపె శారదదినంబులు నిర్మలమూర్తి కాకృతిన్ ॥౪౩॥ సీ॥ రక్షగట్టి
రిమహీరమణులశ్వములకు భూరినీరాజనపూర్వకముగ । ఫలకగ్రహణముఁ జౌపద
ములగరిమంబుఁ బరఁగ బాలకులకు గురువులిండ్ల । దుమికిచిచ్చులతోరణములు దూఁటిన
వారుదూఱరైరిక్రొత్తపంతుతోరణములు । భుజియించెఁ బ్రజ భుజాభోజనంబులు సిగ
బంటగాఁ దొలిక్రొత్తవంటకముల । నఖిలదిగ్జయకాంక్షుఁ బుష్పాయుధుఁడు । వెలిగు
డారంబులో వచ్చి విడిదిచేసె । మురళి మ్రోయించెఁ ద్రిభువనీమోహనముగ । రాధ
కింపుగ నాదినారాయణుండు ॥౪౪॥ వ॥ ఇట్లు నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు ఋ
ణత్రయవిమోచన హేతువగు నాఋణవిమోచనతీర్థంబునందపంబుచేసి రాధకృ
తార్థయయ్యెనయ్యాదవకిశోరంబును గృశోదరీసహాయుండై మాయాశబలితుండగు
జీవపురుషుని పరుసున వివిధభోగపరాయణుండై పరఁగుచుండె నవ్వ్యేడఁ బుండరీకుని
ప్రకారంబాకర్ణింపుము ॥౪౫॥ క॥ ఉపమింపఁగ రానితప । స్తపమునఁ గడువాఁడిమీరు
ధరణీసుమన । స్తపనుఁడు కమలవికాసం । బెపుడును నుడివోని తావి నింపు వహింపన్ ॥
౪౬॥ క॥ ఆద్యశివాధిష్ఠితమై । యుద్యజ్జ్యోతిర్విలాసయుతమై స్వశిరః । పద్యోద్భవమై
తనునన । పద్మము నొందశశతారవనజమునందున్ ॥౪౭॥ చ॥ జోటజోలధారగాపడి
యుచుంగడలెత్తుసుధారసంబు గ్రుంగి । గుటగుటనప్పటప్పటికిఁ గ్రోలుచు నాలుగురెండు
మూలలన్ । గుటిలతఁ దాల్చుభోగిని గగుర్పొడమించుచు దక్షిణశ్రవ । స్తటవిసరత్ప్ర
యోదనినదంబునఁ జొక్కుచు మబ్బుగ్రక్కుచున్ ॥౪౮॥ ఉ॥ విచ్చినకమ్మదమ్ములకు విందు

---

గా॥౪౨॥ పంకవిహీనమనోహరాంబువులు—బురదలేని తేటయైనమనోహరజలములు. వేఁడినన్—
కోరినను. శీతభానుఁడు—చంద్రుఁడు. కాళిమ—నల్లఁదనము యొక్క. శారద—శరత్కాలమునం
దలి ॥౪౩॥ నీరాజన—ఆరతులు. ఫలకగ్రహణము—పలకపట్టించుట. చౌపదముల—చిందులు
త్రొక్కుటల యొక్క. చిచ్చులతోరణములు—నిప్పుగుండముల చాళ్లు. సిగబంటిగాన్—తలమునుఁగ.
వంటకములు—అన్నములు. మురళి—పిల్లనగ్రోవి ॥౪౪॥ నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకున్—
తననీటియందు మునిఁగిన ప్రాణిసమూహములకు. ఋణత్రయవిమోచనహేతువు—దేవఋణము ఋ
షిఋణము పితృఋణము నను మూఁడువిధములయిన ఋణములను తీర్చుకొనుటకు కారణము. ఆయ్యాద
వకిశోరంబు—ఆయదువంశస్థుఁడైనపిల్లకాయ—కృష్ణుఁడు. మాయాశబలితుఁడు—మాయచేత పలు
రూపములుఁ గనఁబడినవాఁడు. పరుసునన్—విధమున ॥౪౫॥ ఉపమింపఁగన్—సరిపోల్ప. తపస్తపము
నన్—తపస్సనెడి వేసంగియందు. ధరణీసుమనస్తపనుఁడు—బ్రాహ్మణుఁడనెడిసూర్యుఁడు. ఉడివోని
—మానని ॥౪౬॥ ఉద్యత్—వెలుఁగుచున్న. స్వశిరఃపద్యోద్భవము—తనశిరోమార్గమునందుఁ బుట్టి
నది. దశశతారవనజము—సహస్రారకమలము ॥౪౭॥ కడలెత్తు—అలలుకొట్టు ॥౪౮॥ పీలినైట్టమ—

లుపెట్టు వెడందకన్నులున్ । బచ్చని పట్టుఁ జేరురముఁ బ్రాఁకిన మచ్చయుఁ బీలి నెట్టెముల్ ।
బచ్చికచాయయుం జిలుకపాయము గల్గు వెలుంగు నిచ్చలో । రచ్చయొనర్ప నందలి పరా
కునఁ దేలుచు వేడ్క నేలుచున్ ॥ ౪౯ ॥ చ॥ గురుజనభక్తియుం గపటగోపకుమారపదా
బ్జసక్తియుఁ । దరలఁగఁ జాపభూరుహవితానములీనముగాఁ జెలంగు భా। స్వరతర
యోగసీధువున సౌఖ్యము నొందుచుఁ జిద్బిసాంకురా । హరణమొనర్చి భూమిసురహం
సము చాలఁ బ్రశంస నొందఁగన్ ॥ ౫౦ ॥ సీ ॥ తన మొగఁబును బ్రాఁతమినుకుమానిక
ములగము లుద్భవిల్లెడు గనులు గాఁగఁ । దనకమండలువారి దనుజారిపాదార్ఘ్యమలవ
రించుటకూటచెలమ గాఁగఁ । దనమది నెద్ది దోఁచిన నది యొకొక్క రూపాంతరంబు
నఁ బ్రోదివడఁగ । దనకట్టునజినరత్నము సృష్టిదీక్షకై కప్పిన యుదివోలెఁ గప్పఁ జేర ।
వీచు వీవన చేఁబూని వెనుకఁ దనకుఁ । జిలుక చను దోయి యొరగుగాఁ జేసి పలుకుఁ । జె
లువ గొలువంగఁ దొలుకారు కలఁకవులఁగు । మావు రాహుత్తు నిలిచె బ్రాహ్మణుని
మౌళి ॥ ౫౧ ॥ చ ॥ నిలిచి నిలింపలోకతటినీతటినీరజహేమసీరజో । జ్జ్వలబిసనాళ
ఖాదనము వంకన పొంకము మీరు క్రొవ్వునన్ । గళముగ దప్పలేని తురగంబు దటాలు నడిగ్గి
నఁ బ్రమతా । కలితశరీరునిం దిగిచి కౌఁగిటఁ జేరిచెఁ బుండరీకుఁడున్ ॥ ౫౨ ॥ ఉ॥ చేరిచి సేన
మే సితకుశేశయలోచనగోచరాత్మ నీ । వారికి నీకు నన్నువిని వారిరుహాసనుఁ బల్కె నమ్మ
హాబా । దారుఁడ మీయభద్రసముదాయనిదానము నీవు వచ్చుటన్ । సారసగర్భ
యుంకఁ గొన సాగుఁ జుమీ కుశలంబు మాకెసన్ ॥ ౫౩ ॥ క ॥ అపవర మాసనమిదె త । న్ని
నిమిషులర్చించునట్టు లర్చించె జగ । జ్జననస్థితిలయకారణ । జననజనిన్ సుజనమతిరజని
రజనీశున్ ॥ ౫౪ ॥ క॥ అర్చించి నిలిచి చేతులు । గూర్చి పురస్స్థితికిఁ జాఁచి గోవిందపదా ।
బ్జార్చారసపానవిధుఁడ । నర్చితదివిజుఁ డుతిని సురాగ్రణి పల్కెన్ ॥ ౫౫ ॥ సీ॥ వి
జ్ఞానవంద్యుఁడ విశ్వనిర్మాతయాత్మా రాముఁడ త్రిలోకాధికారి । భూమధ్యజనితరు
ద్రుండ మహామతి యజ్ఞాతచర్యుఁడ ప్రాజ్ఞతముఁడు । సర్వావయవ వజ్రజా ద్రుజుఁడ వే

---

పికిలిపిట్టయీఁకలు చెక్కిన తలపాగ. ఇచ్చలో — మనస్సునందు. రచ్చయొనర్పక — కొలువు చే
యఁగా — ప్రకాశింపఁగా ॥ ౪౯ ॥ తరలఁగన్ — చలింపఁగా. భాస్వరతర — మిక్కిలి ప్రకాశించుచున్నట్టి. చిద్బి
సాంకురాహరణము — జ్ఞానమనెడి తామరతూఁడు మొలకను భుజించుట ॥ ౫౦ ॥ ప్రాఁతమినుకుమా
నికములగములు — వేదములనెడి రత్నసమూహములు. ప్రోది — రక్షణము. అజినరత్నము — శ్రేష్ఠమై
యున చర్మము. ఒరగు — ఆనుకొనెడి దిండు. పలుకుఁజెలువ — సరస్వతి. తొలుకారుకలఁకవులఁగు
రాహుత్తు — బ్రహ్మ. (తొలుకారుకలఁకవులఁగు — వర్షాకాలము కలఁగని హంసపక్షి; హంసవాహ్యము —
గుఱ్ఱము. రాహుత్తు — రౌతు) ॥ ౫౧ ॥ నీరజ — రేణువులు లేని. బిసనాళఖాదనము వంకన — తామర
తీఁగ కాఁడలను తినెడి నెపమున ॥ ౫౨ ॥ సితకుశేశయలోచనగోచరాత్మ — విష్ణుఁడు విషయముగాఁగల
మనసు గలవాఁడా ॥ ౫౩ ॥ జనిన్ — పుట్టుకగలవానిని. రజని — రాత్రికి. రజనీశున్ — చంద్రుని ॥ ౫౪ ॥
౫౫ ॥ నిర్మాత — నిర్మించువాఁడు. భూమధ్యజనితరుద్రుండు — కనుబొమలనడుమఁ బుట్టినరుద్రుఁడుఁగ

ల్పుముఖ్యాత్ముఁడీత్రయీమూలభూతి। దక్షాదికప్రజోద్భవహేతువీయయ్యకరైక
సాక్షియీసిర్మలుండు। శాంతుఁడీతఁడువాఙ్మనఃకాంతుఁడీతఁడు। ననఁగ వెలుఁగొం
దుసీవు నాకతిథివైతి। వేనుతోలు మేనఁ జేసిన దిట్టినో మొ॥ ౫౬ ॥ మ॥ అరుణావిష్కృ
తిభాస్కరోదయముఁబద్మామోదమంభోరుహా। కరముల్ వేలుపువిల్ ప్రవర్షణము
నోంకారంబు మంత్రాక్షర। స్ఫురణంబుల్ ప్రకటింపఁగా మొదలనుద్భూతంబులైన
ట్టులీ। శ్వరుఁడే తెంచుటకుల్ ద్వదాగమముహాసంసూచకంబయ్యెడుల్ ॥ ౫౭ ॥ ఉ॥
తత్త్వదృశులందు నందకము దాలుచు వేల్పు వసించునట్టుల। ర్చాదులనూఁదియుండఁడ
సియాడుదుఃరట్లగుటల్ సమస్తవ। స్తూదయహేతుభూతివెలుఁగొందెడు మీరిటకిట్లువ
చ్చుటల్। శ్రీదయితాగమంబుకదుఁ జేరువయానని నిశ్చయించితిల్ ॥ ౫౮ ॥ క ॥ నాపిని
నగుమొగమునన। ద్దేవజ్యేష్ఠుఁడు వాసుదేవప్రియుఁడు సం। భావించి సజలజలధర। రా
వనిభగభీరకంధరధ్వనిఁబలుకుల్॥ ౫౯ ॥ చ ॥ ఒసఁగెద నీకు వేఁడు వర మోపరమవ్రత
మొద్దిమేనియుల్। మసలకయన్న నన్నయసమన్వితుఁడిట్లను నట్టి దేనియుల్। బిసరుహ
గర్భదుర్భవవిభేదనుపైఁ దలఁపుం దదీయసం। గసుఖముఖండధర్మపరికర్మముఁ గూర్మి
నా సంగునా కొగిల్ ॥ ౬౦ ॥ చ ॥ అనవ్రుదునట్లుయిచ్చి కమలాసనుఁ డాశమశాలిఁ బల్కె
నో। మునివర నీవు సేయు తపముల్ జపముల్ బెరరేఁపనెల్లినే। టనభవదగ్రవీధికిఁగ
డారపటుండిటవచ్చు మున్నెయా। యనని ను నేలినాఁడు చరితార్థుఁడవీవు చతుర్థసంప
దల్ ॥ ౬౧ ॥ క ॥ నీయీ క్షేత్రమునోముని। నాయక దేవర్షి నరగణప్రార్థితని। శ్రే
యసవదాన్యమగునని। పోమెఁబయోజాతసూతిపోయిననతఁడుల్ ॥ ౬౨ ॥ ఉ॥ ధా
తఁదలంచిప్రొక్కి యవదాతసరోజదళాక్షుఁ గాంచిలో। భ్రాంతిపెనంచి యున్నలు
వపల్కులు సత్యము లోకొకవాక్కథా। శ్రోతముకుందుఁడెందునను బోఁటికిదక్క
నైదక్కకేమిభ। క్తాతురతాపహారి దనుజారియనావిన మే బుధోక్తులల్ ॥ ౬౩॥ సీ॥
అవచూడబర్హిబర్హమునవొండొంటిసిక్కములంటిచల్దిచిక్కముదలిర్పఁ। బంటకా
ర్వానిదమ్మిదంటగొంటసమాదు వెడఁదకన్నులకాంతి వెల్లివాదువ। మెఱుఁగుఁజెక్కుల

---

లవాఁడు. త్రయీ—మూఁడు వేదముల సముదాయము. వాఙ్మనఃకాంతుఁడు—సరస్వతికి ప్రియుఁడు॥ ౫౬ ॥ అరుణావిష్కృతి—అరుణోదయము. హా—ఔరా ॥ ౫౭ ॥ తాఁది—అవలంబించి. శ్రీదయితాగమము—విష్ణుదేవుని రాక ॥ ౫౮ ॥ కంధరధ్వనిల్—కంఠధ్వనితో ॥ ౫౯ ॥ మసలక—ఆలస్యముచేయక. దుర్భవవిభేదనుపైల్—చెడ్డజన్మములను చెఱుచువాఁడైన విష్ణునిమీఁద ॥ ౬౦॥ పెరరేఁపల్—ప్రేరేపింపఁగా. కడారపటుండు—గోరోజనపువన్నె వస్త్రముగలవాఁడు—విష్ణుఁడు. చరితార్థుఁడవు—కృతార్థుఁడవు. చతుర్థసంపదల్—మోక్షము కలిమిచేత॥ ౬౧ ॥ నిశ్రేయసవదాన్యము—మేలునిచ్చునది ॥ ౬౨ ॥ అవదాత—తెల్లని. భ్రాంతి—ప్రేమ. వాక్కథాశ్రోత—మాటలచేతను కథలచేతను మార్పఁబడినవాఁడగు ॥ ౬౩ ॥ అవచూడ—సిగచుంగులు. వంటకాఁడు—శరత్కాలపు. వలిదమ్మిదంటల్—శ్రేష్ఠమయిన తెల్లతామరను. గొంటసమాదు—పరిహసించు. వెల్లి

మీఁద మిట్టించి మొసలివాగడమద్దికాయలతళుకులమర । వక్షస్స్థలమునఁ శ్రీవత్సకౌస్తుభవైజయంతులిందిరతోడివంతువడఁగ । నిమ్ననాభియుఁ ద్రివళివల్గితజఠరము । కరకలితచిత్రభాస్త్రశంఖములునమర । మన్ననంబున నేప్రొద్దుమలయుచున్న । ధూర్తబాలుఁడు నా మ్రోలఁ దోఁచునొకొ ॥ ౬౪ ॥ క ॥ అనియోగతిమీమాంసావనికాననసమ్మృగము ద్రిప్పువైష్ణవరత్నం । బునకు నిజదక్షిణేక్షణ । వనజచ్ఛదమదరేఖాభాసివహాపిశునంబై ॥ ౬౫ ॥ తే॥ నాఁడు మఱునాఁడు నవ్విప్రనందనుండు । ధాతమాటలచందంబు దానవారి । తనకడకువచ్చురాములు దలఁచి తలఁచి । మచ్చటలమేటితరఁగలమునిఁగిమునిఁగి ॥ ౬౬ ॥ వ ॥ మూఁడవనాఁడు యథాకాలప్రబుద్ధుండై పూర్వసిద్ధాశ్రమంబున బద్ధపద్మాసనాసీనుండై ॥ ౬౭ ॥ క ॥ కరివదనదేవతామిళ । దరుణాభచతుర్దళాఢ్యవాదిమసాంతా । క్షరయుతమగునాధారాం । బురుహంబునఁ గలుగువలపుబుగులుకొనంగన్ ॥ ౬౮ ॥ క ॥ పూనఁదటిత్ప్రభషడ్దళ । మైనలువవసింపబాదిలాంతాక్షరసం । ధానస్ఫుటమగుస్వాధి । ష్ఠానాబ్జమునందు వెడలుసత్సౌరభముల్ ॥ ౬౯ ॥ క ॥ డాద్యము ఫాంతికమును నీ । లద్యుతియుఁ బురాణపురుషలాలితము సుధీ । వేద్యమునగుదశపత్త్రస । ముద్యన్మణిపూరకమున మొలవఁగ దావుల్ ॥ ౭౦ ॥ క ॥ శైవము ద్వాదశదళరే । ఖావళితకఠంబుకమ్రకనకచ్ఛాయా । శ్రీవహ

---

వాడువక్ — ప్రవహింపఁగా — అతిశయింపఁగా. మిట్టించి — మీఁదికెత్తి. మొసలివాగడమద్దికాయలతళుకులు — మకరకుండలముల కాంతులు, వంతు — సామ్యము. నిమ్న — లోఁతైన. త్రివళి — మూఁడు ముడుఁతలచేత. చిత్రభాస్త్ర — నానావర్ణములుగల కత్తి. మలయు — తిరుగు. మ్రోలన్ — ఎదుట ॥ ౬౪ ॥ యోగమీమాంసావనిక్ — పరబ్రహ్మప్రతిపాదకశాస్త్రమనెడిభూమియందు. దక్షిణేక్షణవనజచ్ఛదము — తామరరేకువంటికుడికన్ను. పిశునంబు — తోఁపించునది ॥ ౬౫ ॥ ౬౬ ॥ ప్రబుద్ధుఁడు — మేలుకొన్నవాఁడు ॥ ౬౭ ॥ కరి...యుతము — విఘ్నేశ్వరుఁడు దేవతయు ఇంచుకయెఱ్ఱనికాంతియు నాలుగురేకులును గలదియు వశషసవర్ణములతోఁగూడినదియును. ఆధారాంబురుహంబు — ఆధారకమలము. వలపు — వాసన. బుగులుకొనంగన్ — నిండుకొనఁగా ॥ ౬౮ ॥ తటిత్ప్రభన్ — మెఱుపుమొక్క వెలుఁగువంటి వెలుఁగుతో. షడ్దళము — ఆఱురేకులుగలది. నలువ — బ్రహ్మ. బాదిలాంతాక్షరసంధానస్ఫుటము — బభమయరలవర్ణములకూర్పుచేత ప్రకాశించునది. స్వాధిష్ఠానాబ్జము — స్వాధిష్ఠానకమలము. సత్సౌరభములు — మంచివాసనలు ॥ ౬౯ ॥ డాద్యము — డవర్ణము మొదటిది గాఁగలది. ఫాంతికము — ఫవర్ణము కడపటిది గాఁగలది. అనఁగా డఢణతథదధనపఫవర్ణములుగలది. నీలద్యుతి — నల్లనికాంతిగలది. పురాణపురుషలాలితము — విష్ణుదేవతాకము గుట చేమనోజ్ఞమైనది. సుధీవేద్యము — పండితులచేఁ దెలియఁదగినది. దశపత్త్రసముద్యన్మణిపూరకమునన్ — పది రేకులచే వెలుఁగునట్టి మణిపూరకకమలమునందు. మొలవఁగన్ — పుట్టఁగా. తావులు — పరిమళములు ॥ ౭౦ ॥ శైవము — శివుఁడు దేవతగాఁగలది. ద్వాదశదళరేఖావళితకఠంబు — పండ్రెండు రేకులచేత చుట్టఁబడినకఠవర్ణములాద్యంతములుగాఁగలది — అనఁగా కఖగఘఙచఛజఝఞటఠవర్ణములుగలది. కమ్రకనకచ్ఛాయా [illegible] శ్రీవహము — ప్రకాశించునట్టి బంగారువన్నెయొక్క కలిమిని వహించినది. బంగారువన్నె

మునౌననాహత । మే వేళం జెడనిగంధమిగురొత్తింపన్ ॥ ౭౧ ॥ క॥ పదియాఱుతే
కులందును । బదియాఱుసారంబులుంజుఁ బరమజ్యోతి । ష్ప్రదమైసురమునివశతన్ ।
బొదలు విశుద్ధమునఁ బొంకముగఁ బరిమళముల్ ॥ ౭౨ ॥ క॥ దళయుగమున హం
క్షంబులు । పొలుపొందఁ జిదంశమగుచు భూరిమణివిభా । వలిఁదగు నాజ్ఞాపురమునఁ ।
గలవాసన లేసరేఁగి కడలుకొనంగన్ ॥ ౭౩ ॥ ఉ॥ ఇంతకునూర్ధ్వమై శిరసునిక్కనధో
ముఖమూర్తిఁ బొల్చు న । త్యంతవికాసశాలియయి యాద్యశివాశ్రయమై సహస్రప ।
త్త్రాంతరచిత్సుధారసమహాఝురదుర్దినమాచరించున । ద్దాంతరపుష్పవనం గలుగు
తోరపుఁగంపులు పెంపుమీఱఁగన్ ॥ ౭౪ ॥ చ॥ కనదరుణప్రభావిభవగర్వముఖర్వముగా
నొనర్చుచుం । దనువుతళుక్కునన్ మెఱవఁ దత్సరసీరుహపత్త్రి పేరిసి । చ్చెనవడినె
క్కినిక్కి నిజజిహ్వకఁ జాఁచి లలాటమధ్యసం । జనితసుధామయూఖసుధ సర్వపురం
ధ్రిక గ్రోలి సోలఁగన్ ॥ ౭౫ ॥ క॥ హృన్మణిసూత్రాకృతియగు । చిన్మూర్తిం బురాణపు
రుషు శేషావాసుం । గన్మొగిచి లోనఁజూపున । సన్మాన్యుఁ డతండు చూచు సమయము
నందున్ ॥ ౭౬ ॥ దండకము॥ కడిఁదియసురు ధేనుకున్ ధేనుకుక్షీలదంభోళిసంస్తం
భిదోస్తంభ సంభూతశౌర్యాగ్నిచేఁ గాంచి గోలోకముం గాచి గోవర్ధనక్షోణిభృ

---

గలిగి ప్రకాశించునది. అనాహతము—అనాహతకమలము. ఇగురొత్తింపన్—చిగుర్చునట్లు చేయఁగా—అతిశయింపఁజేయఁగా॥ ౭౧॥ పదియాఱుసారంబులు—అకారము మొదలుగాఁగల పదియాఱచ్చులును. పరమజ్యోతిష్ప్రదము—మేలయిన వెలుఁగునకు చోటు. సురమునివశతన్—నారదుఁడు అధిదేవతగాఁగలదియగుటచేత. పొదలు—వర్ధిల్లునట్టి విశుద్ధమునన్—విశుద్ధకమలమునందు. పొంకముగన్—పొందికైనది కాఁగా॥ ౭౨॥ దళయుగమునన్—రెండుఱెకులచేత. హంక్షంబులు—హం క్షం అనువర్ణములు. పొలుపొందన్—పొందుపడఁగా. చిదంశము—జ్ఞానాంశమైనది. భూరిమణివిభావలిన్—విశేషమయిన మాణిక్యకాంతిసమూహములచేత. తగు—ఒప్పునట్టి. ఆజ్ఞాపురమునన్—ఆజ్ఞాచక్రమయినకమలమునందు. విసరేఁగి—మిక్కిలిరేఁగి. కడలుకొనంగన్—అతిశయింపఁగా॥ ౭౩॥ ఇంతకున్—ఈ చెప్పఁబడినవానికన్నిటికి. ఊర్ధ్వమై—మీఁదై. శిరసునిక్కన్—మూర్ధస్థానమునందు. అత్యంతవికాసశాలి—మేరలేని వికాసముచేత ఒప్పునది. ఆద్య—మొదటివాఁడైన. సహస్ర... దుర్దినము—సహస్రపత్త్ర—వేయిరేకులుగల సహస్రారకమలముయొక్క. అంతర—లోపలి. చిత్—జ్ఞానరూపమైన సుధా—అమృతముయొక్క. రస—జలముచేనైన. మహాఝుర—పెద్దసెలయేటివలన దుర్దినము—మబ్బుకమ్ముటచే సూర్యరశ్మి లేనిదినమును. ఆచరించునద్దాంతరపుష్పవనన్—చేయునట్టి యాదాంతిపుష్పవనందు. తోరపుఁగంపులు—అధికపరిమళములు. పెంపుమీఱఁగన్—వృద్ధిచేత అతిశయింపఁగా ॥ ౭౪ ॥ అఖర్వము—తక్కువకానిది. మెఱవన్—వెలుఁగఁగా. జిహ్వకన్—నాలుకను. సుధామయూఖసుధన్—చంద్రునియందలి యమృతమును. సర్వపురంధ్రిక—ఉత్తమయైన సర్పస్త్రీ॥ ౭౫ ॥ చిన్మూర్తిన్—జ్ఞానస్వరూపుని. మొగిచి—మూసి॥ ౭౬ ॥ కడిఁది—అసాధ్యుఁడైన, ధేనుకుక్షీల—గోవర్ధనపర్వతముచేత. దంభోళిసంస్తంభి—వజ్రాయుధమును నిలిపిన. దోస్తంభ—స్తంభమువంటి భుజమునందు. సంభూత—పుట్టిన. శౌర్యాగ్నిచేన్—శూరత్వపునిప్పుచేత.

తటాందరక్షోణిఁ గ్రీడించు విన్నాణి వెన్నాటకంబైన కాళ్లిగన్నులఁ గల్గు వెందళుకు-
లఁ దల్లడఁ జిలుకు నెన్మోము జాబిల్లి శోభిల్ల నుత్ఫుల్లగల్లద్వయిన్ హత్తి మ
త్తిల్లి నర్తించుచున్ మకరాకార రేఖాభిరామంబులౌ కుండలంబుల్ సమగ్రప్రభా
మండలంబుల్ చలింపన్ నిలింపాశుగాసాకృతిన్ మాసరంబైన మాయూరపింఛం
బుతో నైక్యముం బొందు నికరంబుచే గొప్పమై కొప్పు గప్పట్టఁ గప్పట్టఁగాఁ గోరివెం
టన్ మహాఫాలపట్టంబుపై నెట్టుకో, నిగమకమలగంధముల్ సంధిం జేయు నాసాపు
టిన్ బ్రస్ఫుటస్ఫూర్తి వర్తింప దృగ్వృద్ధను స్సంపదల్ పెంపు మీరంగ రంగద్రుచిన్ శా
క్వరసంధబంధుత్వగంధంబు రూపించు మూఁపుల్ పురాయింపనింపారు రేఖాత్ర
యీనైత్రినేత్రప్రియంబిచ్చుచున్ గంబుపాకంబునం బంధురంబై వలక్షంధరంబొ
ప్పఁగ న్పైకకూసీలంపుఁ గంబంబులం బోలు బన్లైలు లీలావిధూపావళిం జాలభాసిల్ల
నల్లోకసౌందర్యధుర్యస్థితిన్ విస్తృతంబౌను స్సీమజీమూతమై హారవర్గోపలశ్రేణి
రాణించు మించుంబు రాణింపఁగాఁ జేయు నచ్ఛోనయుచ్ఛాన జానచ్ఛవిన్ దుచ్ఛ
ముం జేసి కంజాతవాసాంఘ్రి కంజాతలాఞ్ఛాంకశంకావహంబైన పంకేజరాగంబు
గుర్వంగ, శ్రీచరణయుగళ హాటకంబై కనద్ధాటకోద్యత్తులాకోటులూటాడుచున్
జాటువాచాటతం జాటి నుప్పొంగఁ బుట్టింపఁగన్ జీగముట్టుల్ గటిన్ సంఘటిల్లన్ ద
టిల్లేఖ లేఖర్ఘ ఘుం జేరి రంజిల్లు రానల్ల పుల్లంతి గోయుష్టి యుత్కృష్టమై సొప్పగా

---

క్రాంచి = కాల్చి. గోలోకముఁ = గోవుల సమూహమును. ఘోటభృత్ = గొండెయొక్క. కంటరక్షోణి = గుహాప్రదేశమునందు. విన్నాణి = నేర్పరి. వెన్నాటకంబు = మిక్కిలి చలించునట్టిది. కాళ్లు = ప్రకాశించునట్టి. వెన్దళుకులఁ = అధికమయిన తళతళయను కాంతులను. చిలుకు = వ్యాపింపఁ జేయునట్టి. ఉత్ఫుల్లగల్లద్వయిన్ = వికాసముగల చెక్కిళ్లజంటయందు. హత్తి = అంటి. మకరాకారరేఖాభిరామంబులు = మొసలియాకృతివంటి యాకృతిగల రేఖలచేత మనోజ్ఞములయినవి. సమగ్రప్రభామండలంబులు = కొఱఁత లేని వెలుఁగుల సముదాయముగలవి. మాసరంబు = అతిశయించినది. మాయూరపింఛంబు = నెమలియీఁకలకుచ్చు. శాక్వరస్కంధబంధుత్వగంధంబున్ = ఎద్దు మూఁపురమును బోలి నిక్కుగల గర్వమును. పురాయింపన్ = కల్పింపఁబడఁగా. కంబుపాకంబునన్ = శంఖము పిన్నమున. బంధురంబై = నిమ్నోన్నతములుగలదై. వలక్షంధరంబు = గుండ్రని మెడ. ఉల్లోక = లోకాతీతమయిన. విస్తృతంబు = విరివిగలయునది. జీమూతము = మేఘము. హారవర్గోపలశ్రేణి = ముత్యాలపేరులనెడి వడగండ్లచాలు. రాణించు = ప్రకాశించునట్టి. మించు = మెఱపు. పురాణింపఁగాన్ = వర్ధిల్ల. ఉచ్ఛాన = దట్టమయిన. జానుచ్ఛవిన్ = మోకాళ్ళకాంతిని. కంజాతవాస = లక్ష్మీదేవియొక్క. లాఞ్ఛాంక = లక్షణయుతులనెడి. శంకా = సందేహమును. ఆవహంబు = కలిగించునది. పంకేజరాగంబు = పద్మరాగము — కౌస్తుభమణి. ఇగుర్వంగన్ = చిగిరింపఁగా — ప్రకాశింపఁగా. హాటకంబు = బంగారు. తులాకోటులు = అందెలు. ఊటాడుచున్ = కదలాడుచు. చాటు = చాటించు. వాచాటతన్ = మాటకారితనమును. కటిన్ = పిఱుఁదున. తటిల్లేఖ = మెఱపుతీఁగ. లేఖర్షభున్ = ఇంద్రుని. ఉల్లంతి = తళతళలాడుచున్న. గోయష్టి = ఆవులను తో

నిప్పుడున్ వచ్చుచున్ గచ్చకాయల్ కరాధిష్ఠితాజాండషండంబులో నాఁగఁ దగున్ జి
త్రభద్రంబునన్ నిల్చినం బోల్పఁగాఁ గల్పకస్వచ్ఛగుచ్ఛంబు సత్యార్థమై నిత్యముం
గోరి తత్తరంబూనియున్నాఁడనన్ భవ్యశంఖంబు సవ్యాగ్రహస్తంబునందున్న గాదివ్య
భూషావిశేషార్పితుల్ గ్రమ్మ లేఁదెమ్మెరల్ గ్రమ్మఁగా నమ్రదిక్పాలకప్రస్తుతుల్
స్వస్థలంబంటగాఁ గంటఁగాఁ గాక రాకాసుధాభానుభానూజ్జ్వలజ్జ్వాల కీలాకులప్రౌ
ఢరీఢాకృదారూఢ గాఢత్విడౌఘంబు మోఘంబుగా మేనుపీఠింధరాధో జగద్ధోర
ణిన్ దోరణుల్ గట్ట, యాదవరమణుండు నాభిసంజాతకంజాత జాతాండఖండాం
ఘ్రిపీఠీభవద్విశ్వవిశ్వంభరాభాగుఁ డాభోగవద్భోగి భోగాసనుం డాసవామోద
సంఘుష్యద్ధుర్యాసురస్త్రీకపోలద్వయీపత్రరేఖాంకకారక్రియా క్రూరచక్రాంకుఁ
డోంకారసర్వస్వనిర్వాహకుం డుద్వహద్దుర్వహాంగప్రభాగుర్వవేనోపధుల్ గన్న
పృథ్వీవ్యర్థ్యపృథ్వీశమున్ బ్యుడు పుండ్రేక్షుకోదండలక్ష్మీభుఁ డంచద్దరస్మేరసారుం
డుదారుండు దారోత్తమల్ నీలనన్ బాలయున్ లక్ష్మియున్ బద్మలాక్షీశిరోర
త్నమున్ భూమియున్ భామయున్ బ్రేమఁ గామించి వెన్నాడఁగా మించి పంబాఱుఁ
డయ్యున్ గడున్ బ్రోడతాబోడలుం బాడఁగా లేచెఁ బెన్నిక్కన్ నికరంబయా విష్క్రా
తిం బూపిదీపించియుండన్ ॥ ౭౭ ॥ క ॥ కనుదెఱచి తనదులోనం । గను సేజముఁ బ్రో
లఁగాంచి కమలాసనుఁడా । డినయట్లనికర మయ్యెనె । విసఁగ ననిద్రికొత్తఁదనుచు
వెనుస్థితుఁడై ॥ ౭౮ ॥ సీ ॥ చామరధ్వజశంఖచాపప్రముఖచిహ్న లక్షిత పదార్ప
ణాలంకృతసహా । దళితోపరిత్వగుజ్జ్వలదంతసుమస్ఫులా స్తంభాభరామోరుదండ

---

తెడుకట్లు. కరాధిష్ఠిత — చేతియందుంచుకోఁబడిన. షండంబులు — సమూహములు. లేఁదెమ్మెరలు — లేఁతివాయువులు. నమ్ర — వంగిన. కమ్ర — మనోజ్ఞమైన. సుధాభాను — అమృతకిరణుఁడు — చంద్రుఁడు. ఉజ్జ్వలత్ — వెలుఁగుచున్న. జ్వాలకీలాకుల — మంటల లేశముచే కలతనొందిన. రీఢాకృత్ — అవమాన పఱుచుచున్న. ఆరూఢ — మీఁదికి ప్రసరించిన. గాఢత్విడౌఘంబు — అధిక కాంతిసమూహము. మోఘంబు — కొట్టుకపోయినది — వ్యర్థము. అధోజగద్ధోరణిన్ = క్రిందిలోకము పథమున. తోరణల్గట్టు — బారులుదీర. నాభిసంజాత కంజాతుండు — బొడ్డునందుఁబుట్టిన బ్రహ్మగల వాఁడు. పీఠీభవత్ — పీఠముగాఁ జేయఁబడిన. విశ్వ — సమస్తమయిన. విశ్వంభరాభాగుఁడు — భూప్రదేశముగలవాఁడు. ఆభోగవత్ — పరిపూర్ణత్వమువంటి. భోగిభోగాసనుండు — పాముదేహము పీఠముగాఁ గలవాఁడు. ఆసవ — మద్యముయొక్క. ఆమోద — పరిమళముయొక్క. ప… ఘా — మకరికాపత్రరేఖలకు చక్రాంకుఁడు — చక్రము గుఱుతుగలవాఁడు. దుర్వహాంగప్రభాగు ర్వ — వహింపరాని అవయవముల కాంతిచే గొప్పది. పుండ్రేక్షుకోదండలక్ష్మీభుఁడు — మన్మథుల యొక్క లక్ష్మిని బోలినవాఁడు. అంచద్దరస్మేరసారుండు — ఒప్పమయిన చిఱునవ్వుయొక్క సత్తకల వాఁడు. దారోత్తములు — ఉత్తమురాండ్రయిన భార్యలు. పద్మలాక్షి — స్త్రీ. వెన్నాడఁగాన్ — వెంటనంటిరాఁగా. బోడలు — ఏకదండిసన్యాసులు. పెన్నిక్కన్ — దొడ్డగా వునఁడు. ఆవిష్క్రి తిన్ — అవతరించుటను ॥ ౭౭ ॥ మ్రోలన్ — ఎదుట. ఉత్థితుఁడు — లేచినవాఁడు ॥ ౭౮ ॥ పదా ర్పణ — అడుగులు పెట్టుటచేత. దళిత — భేదింపఁబడిన — బిఱుపఁబడిన. ఉపరిత్వక్ — మీఁదితోలువ

యుగళు । వరదానముద్రాబ్జధరణభూషితకటిన్యస్తకుంచితసమున్నతభుజాఢ్యు । సింహావలగ్నలక్ష్మీపరిహాసితోయజగర్భగర్భవృత్తావలగ్ను । జలదసంకాశునిర్వ్యాజజఘనదేశుఁ । గోటికందర్పలావణ్యుఁ గుశరణ్యు । విష్ణు నిజభక్తవర్ధిష్ణుఁ గృష్ణుఁ గాంచి । పఱచె సాక్రోశుఁ డగుచు నా బ్రాహ్మణుండు ॥ ౭౯ ॥ చ ॥ పరచిన దేవకీసుతుఁడు పక్కుననవ్విఁ గ్రమ్మఁజిల్లి మైఁ జెలఁగురోమహర్షణముదంచితభక్తిభరాకులత్వమే । భుజమునఁ గేల్సాఁచి పలుపల్కులతళ్కులసన్నవెన్నెలల్ । బరపుచుఁ బ్రస్తుతించెమునిబంధవిభంజనుభక్తరంజనుల్ ॥ ౮౦ ॥ మాలిని ॥ విధిశివసనకాదుల్ వేదముల్ గూడి నిన్నో । మధుమథన యితండిప్పాడిఁగ వాఁడంచు నెన్నన్ । విధురులయిన చోటల్ నేర్చునే గాథ మోహా । బుధివశిఁ బఱచుచున్నాఁ బోఁటసేవాట మెన్నన్ ॥ ౮౧ ॥ తరల ॥ హరిహయోపలభూధరాకృతి నందమొందినయట్టి సే । యురుభృగుస్తుతిపాత్రముఁ గటకోజ్జ్వలంబుఁగ శోభుర । త్నరుచిమిత్రము నైనపాదము నందుసించె వనంగని త్వరతిఁ బూసితలంతుఁ దాపనిదాఘవృత్తినివృత్తికిన్ ॥ ౮౨ ॥ భుజంగప్రయాతము ॥ స్ఫురన్నాభిగర్తప్రభూతాంబుజాతోఁ । దరత్కోణిలోఁ వేల్పు తాతన్ విధాతన్ । నిరాతంకసర్గైకనిర్దేశఁ గంటే । హరీ తాతకుం దాత వైయుంట యొప్పన్ ॥ ౮౩ ॥ స్రగ్విణి ॥ నీతిమై వైన్యభూనేత వై రత్నసం । ఘాతదివ్యౌషధిగ్రామముల్ ధాత్రి ప్రీతిగన్ బట్టి వేస్ఫీతహర్షోత్కటల్ । భూతధాత్రీగవిన్ బూతనాఘాతనా ॥ ౮౪ ॥ లయగ్రాహి ॥ ఆగమసముద్ధరణరాగరసలంపటసుధాగమనియామకరసాగరవికారీ । భోగపదవీసహితభాగవతభూగగనభాగపరిపూర్ణపరభాగవపురగ్రా । త్యాగగు

---

లన. ఉజ్జ్వలత్ — వెలుఁగుచున్న. అంశుమన్నలాస్తంభ — అరఁటికంబములవలె. ఊరుదండ — దండాకారమయిన తొడలయొక్క. అబ్జధరణ — కమలమును ధరించుటచేత. కుంచిత — వంపఁబడిన. సమున్నత — మిక్కిలి పొడవులైన. సింహావలగ్నలక్ష్మీపరిహాసి — సింహము నడుముయొక్క యందమును పరిహసించునది. వృత్త — వర్తులమైన. జలదసంకాశున్ — మేఘమును బోలినవానిని. నిర్వ్యాజజఘనదేశున్ — సిగ్గువిడిచిన మొలగలవానిని — దిగంబరుని. సాక్రోశుఁడు — ఏడ్పుతోఁ గూడినవాఁడు ॥ ౭౯ ॥ క్రమ్మఁజిల్లి — వెనుక కురిసి. రోమహర్షణము — గగుర్పాటు. భక్తిభరాకులత్వము — భక్తియొక్క యతిశయమువలని కలఁతపాటు. తళ్కుల — తళతళలాడుచున్న. పఱపుచున్ — వ్యాపింపఁజేయుచు. బంధవిభంజనున్ — మోహబంధములను జెఱుచువానిని ॥ ౮౦ ॥ విధురులు — వికలత్వము నొందినవారు. సేవాటము — సీమపీఠమును ॥ ౮౧ ॥ హరిహయోపల — ఇంద్రనీలమణుల. భృగు — చఱియ; భృగువనెడిముని. కటక — కొండమీఁది చదురపునేల; కడియము. పాదము — కొండవెంబడి చిన్నకొండ; అడుగు. తాపనిదాఘవృత్తి — తాపత్రయమనెడి వేసఁగికాలముయొక్క ప్రవర్తనము ॥ ౮౨ ॥ నాభిగర్తప్రభూత — బొడ్డుబొక్కయందుఁ బుట్టిన. నిరాతంక — భయములేని. సర్గ — సృష్టికి. తాత — బ్రహ్మ; తండ్రి ॥ ౮౩ ॥ వైన్యభూనేత — వైన్యుఁడను రాజు — పృథుచక్రవర్తి. దివ్యౌషధిగ్రామములు — ఒప్పిదములైన ఓషధులసమూహములు. స్ఫీత — అధికమైన. ఉత్కటల్ — మదించినవానిని. భూతధాత్రీగవిన్ — భూమియైన ఆవును ॥ ౮౪ ॥ లంపట — అత్యాసక్తిగల. పదవీ — మార్గమున.

ంధుర్యమునియోగపరిరక్షక హలాగతసమిద్విజయసౌగతమతార్హా । ద్యోగకలికా
లకలుషౌఘకులిశాంకకొనసాగినకృపన్ మనుపుయోగిహితమ్ముగన్॥౮౫॥ మ॥ కవిధా
మంబుల్ సిద్ధమంత్రములు చంద్రజ్యోత్స్నికల్ సన్మణి । ప్రవరశ్రేణులు భవ్యభేషజత
తుల్ పాథోధరంబుల్ సుధీ । భవనిస్తారక నీ మమిద్ధజగమున్ బాలించు మర్యాద
నీ । యవతారంబు లశేషలోకహితచర్యాధుర్యసంచారముల్॥ ౮౬ ॥ ఉ ॥ అంజన
పుంజనవ్యతరమై తగు నీ తిరుమేని కప్పుక । కింజులుకంగఁ జేరుచుఁ జుమీ కమలేక్షణ
సూక్ష్మదృక్కులౌ । గంజభవాదివృద్ధులకుఁ గాథత రాక్షరలక్ష్మి యెందుఁగా । సంజ
నుఁగాదె కప్పు కలనన్ మును దోఁప నియక్షరస్థితుల్॥ ౮౭ ॥ క॥ కమిచియణురేణుతృణ
కా । ష్ఠములంబరిపూర్ణవృత్తిసమకూరెను నీ । యమితమహామహిమాబ్ధికిఁ । గమ
లభవప్రముఖు లెన్నఁగా బుద్బుదముల్॥ ౮౮॥ పృథ్వి ॥ జగత్పతి భవత్పదాబ్జయుగభ
క్తిసంయుక్తితో । నగుర్వడువనన్యథాగతి యెఱుంగ కెవ్వాఁడు నీ । యగణ్యగుణకీ
ర్తనంబధిగమించుటన్ మించెనే । నగాధభవసాగరంబతఁడు దాఁటు నొక్కొత్తునన్॥
౮౯॥ క॥ భవదంఘ్రిసూనునకుఁ బు । ణ్యవసతి సులభంబె వెలఁతు నన్యభవంబుల్ । స
వరింపయమ్మదర్చా । ప్రవణమతిం జేయు నన్నుఁ బరధామపతీ ॥ ౯౦ ॥ క । జయ
విజయపూర్ణపార్శ్వవి । జయజయకల్పనధురీణ సమదదనుజరా । డ్జయసంరక్షి
తభువనా । జయజయసగుణాగుణాత్మ జయశార్ఙ్గధరా ॥ ౯౧ ॥ సీ ॥ నడతు నీ
క్షేత్రంబునకుఁ జెయి చాఁచి యర్చింతు నీ నమ్మిన సేవకులను । మ్రొక్కుదు నీ పాదము
లకు జిహ్వ పీఠి నీ నామములు వకాణింతు నెపుడు । నర్పింతు నీ సేవకై సర్వదేహంబుఁ
జింతింతు నీ లీలఁ జిత్తసరణిఁ । దనివోక నీ చక్కఁదనము సంవీక్షింతు నీ యవధానంబు నె
మ్మి విందు । బ్రహ్మరుద్రాదులకుఁ గానఁబడని నీవు । నేఁడు నామ్రోల నిలిచితి నీలవర్ణ ।
వర్ణనాతీతమత్ప్రాగ్భవప్రవృత్త । పుణ్యపరిపాక మేరికిఁ బొగడఁదరమె॥౯౨॥ శా॥

---

దు. నిహిత—ఉంచఁబడిన. వజ్రకరాగ్రా—దేహముకొనగలవాఁడా. హలాగత — నాఁగటివలనవ
చ్చిన. సమిద్విజయ — యుద్ధమునందలి గెలుపుగలవాఁడా. సౌగత—బుద్ధునిదైన. కలుషౌఘకులి
శాంక—పాపములనెడి కొండలకు వజ్రాయుధ చిహ్నముగలవాఁడా. మనుపు—రక్షింపుము ॥ ౮౫ ॥
జ్యోత్స్నికలు—వెన్నెలలు. భేషజ—మందులయొక్క. పాథోధరంబులు—మేఘములు. సుధీభవని
స్తారక—విద్వాంసులను జన్మములవలననుండి తరింపఁజేయువాఁడా ॥ ౮౬ ॥ అంజనపుంజ—
కాటుకరాశికి. నవ్యతరమై —మిక్కిలిశ్లాఘ్యమై. తిరుమేని—మంచిదేహముయొక్క. వృద్ధులకున్
—పెద్దలకు॥ ౮౭ ॥ కమిచి—గ్రహించి—లోపలనణఁచుకొని. బుద్బుదములు—నీటిబుగ్గలు ॥ ౮౮ ॥
సంయుక్తి—కూడిక. అధిగమించుటన్—చదువుటచేత. అగాధ—మిక్కిలిలోఁతైన. ఒక్కొత్తు
నన్—ఒక్కపూనికతో ॥ ౮౯ ॥ వసతి—ఉనికిపట్టు. సవరింపన్—పొందను. ప్రవణ—అభిముఖ
మైన. పరధామపతీ—పరమపదము నేలువాఁడా ॥ ౯౦ ॥ ౯౧ ॥ వకాణింతున్—వక్కాణింతు
ను—చెప్పుదును. తనివోక—తృప్తిలేక. అవధానంబు—ఎచ్చరిక—ఎచ్చరికతో చేయుప్రసంగము
ను. నెమ్మి—నెమ్మది. ప్రాగ్భవ—పూర్వజన్మమునందలి ॥ ౯౨ ॥ నిత్యస్ఫూర్తిసనాథులు—శాశ్వత

నిత్యస్ఫూర్తిసనాథులై రెరి విధికంఠేకాలముఖ్యుల్ కృత । క్షిత్యానందయనాదిమూ
ర్తిఁ గనుచేఁ దత్సనాథత్వసం । పత్త్యాదిస్ఫూర్తి నాకునుం గలుగుఁ దత్ప్రీయుండ నే
కాననే । మృత్యుక్రూరభయంబుఁ బాసితి నిజమ్మీ నీదయాసంపదన్ ॥ ౯౩ ॥ మ ॥ అ
నిలోకత్రయమోహనుండగు రమాప్రాణేశు నెమ్మోమునం । దనచూడ్కుల్ నిగుడం
గ భూమిసురరత్నంబూరకన్నంత నే । మును గాథాత్మసమన్వితాఖిలమరున్ముఖ్యుల్
తగన్ మ్రొక్కిరే మో । ద్పున కేలింపఁగ నమ్మునీశ్వరుగుణంబుల్ సారెఁ గీర్తించినన్ ॥
౯౪ ॥ క ॥ వినిముగ్ధహాసరుచిరా । ననుఁడై తనచుట్టునున్న నానామరరా । జనితా
యముతోఁ బలుకన్ । దనుజారివహీసురాస్యదత్తైకిణుఁడై ॥ ౯౫ ॥ సీ ॥ దాంతుండుస
త్యసంధాఘురంధరుండు మద్భక్తుండు పితృహితోద్యముఁడునైన । యిద్ధరామరసూతి
కీప్సితంబొసఁగ నేవచ్చుచో మీరెల్లవారు నితని । కర్మిలి సాహాయ్యమాచరించుటకు
నై యేతెంచినారు నాకెవ్వరేని । హితులు వారలవను లెల్లనీయవికానపరతాపతప్త
లుపరముదేక । ముదితులస్మత్ప్రశంసాభిముఖులునైన । వారు నాభక్తులగు వారి
వారియందుఁ । బ్రీతిగలవారి నేనుద్ధరింతుఁ గీను । వలన వారలకంటె నవశ్యమగుట ॥ ౯౬ ॥
క ॥ సద్భక్తసేవచేతన్ । మద్భావముతుష్టిఁ గన్నమాడ్కిఁ దమశిలా । ద్యుద్భూత
ప్రతిమార్చల । మద్భరితము గాదు నిక్కముగఁ దలపోయన్ ॥ ౯౭ ॥ మ ॥ వలనా మే
టికి నాశ్రయించి మనఁగా వానీరముల్ నీరముల్ । దలవేత్రోపచరింప నేటికి సమిద్ధానం
బుదానంబున । చ్ఛలమా యేటికి నెత్తిఁ గొట్టుకొనఁగా సన్యాసము న్యాసముల్ । గ
లిఁగేఁ జాలుమదీయభక్తిరుచిభక్తశ్రేణికిఁ బ్రాంతముల్ ॥ ౯౮ ॥ తే ॥ సర్వధర్మవిహీన
ప్రచారుఁడైన । నాత్మ మద్భక్తిగలదేని యతఁడ చూవె । నాకు నత్యంతహితుఁడు సు
శ్లోకరతుడు । నిఖిలధర్మప్రవర్తననిశ్చితుండు ॥ ౯౯ ॥ ఆ ॥ అస్మదంకధారియగు భక్త
వరు మేను । నాకుఁ గూర్చినట్లు నాకులార । వదల కేసఁ సింధువైకుంఠనగరంబు । నందు
గొలుపదంతరంగమునకు ॥ ౧౦౦ ॥ క ॥ నాయందు భక్తుఁ డుండున్ । బాయక యే
నధివసింతు భక్తునియందున్ । మాయిరువురకుం గలుగున్ । గాఁగ ప్రాణానుకూల్య

---

మైనస్ఫురణతోఁ గూడినవారు. విధికంఠేకాలముఖ్యులు—బ్రహ్మశివ్రుఁడు మొదలగువారు. క్షిత్యానం
ద—భూమిని సంతోషింపఁజేయువాఁడా. తత్సనాథత్వసంపత్త్యాదిస్ఫ్రుతి—అనూనముకొన్నతన
పుకలిమియొక్క వెలయుట ॥ ౯౩ ॥ ఇంపఁగన్—ఇంపుగాఁగా ॥ ౯౪ ॥ ముగ్ధహాసరుచిరాన
నుఁడు—మనోజ్ఞమయిన చిఱునవ్వుచే వెలుఁగునట్టి ముఖముగలవాఁడు ॥ ౯౫ ॥ దాంతుఁడు—
ఇంద్రియనిగ్రహముగలవాఁడు. ఉద్యముఁడు—ప్రయత్నముగలవాఁడు. అర్మిలిన్—ప్రేమతో. పర
ముదేకముదితులు—ఇతరులసంతోషము ఒకటిచేతనే సంతోషించినవారు ॥ ౯౬ ॥ తుష్టిన్—సం
తోషమును. మద్భరితము—సంతోషమును పొందినది ॥ ౯౭ ॥ వానీరము—ప్రబ్బలిచెట్టు. సమి
ద్ధానంబు—సమిధలనిచ్చుట—హోమము. అచ్ఛలము—అగ్రహము. న్యాసము—ధనమును దాచి
పెట్టుట ॥ ౯౮ ॥ సుశ్లోకరతుఁడు—మంచికీర్తియందాసక్తుఁడు. నిశ్చితుఁడు—నిశ్చయింపఁబడిన
వాఁడు ॥ ౯౯ ॥ అంక—చిహ్నమును. నాకులార—దేవతలారా. కొలుపదు—సరిపడదు ॥ ౧౦౦ ॥

కౌశల్యంబుల్ ॥ ౧౦౧ ॥ ఆ ॥ మహితపుణ్యులైన మద్భక్తవరులకు । గానివాఁడు నా
కుఁ గానివాఁడు । భాగవతులనన్ను భావించి యొకటగాఁ । గన్నవాఁడు నన్నుఁ గన్న
వాఁడు ॥ ౧౦౨ ॥ క ॥ మీ మొదమద్భక్తిగుణో । చ్ఛ్రాయము గనుఁగొంటి నేను సత్యం
బు బహూ । పాయంబుల మద్భక్తుని । కైయిట కేతెంచుట స్వియచ్చరులారా ॥ ౧౦౩ ॥
మ ॥ సురకర్మంది హిరణ్యదైత్యసుతువ్యాసుల్ శౌనకుల్ శ్రీపరా । శరురుక్మాంగదు
నంబరీష సరమాజానిల్ వసిష్ఠుల్ బురం । దరపుత్రుల్ శుకువాల్మ్యభీష్మవిజుఁ
గొందం జేయు మద్భక్తితఁ । బ్పరుఁడీపుణ్యుఁడు పుండరీకుఁడితనిల్ భావింతు మేలీవులల్ ॥
౧౦౪ ॥ ఆ ॥ వినుఁడు మీకు నేనిఁక సరాని యీహితం । బీతపస్వివరునికిత్తు నేడ । యెద్ది వేఁ
డె భక్తుఁడద్ది యొసఁగంగ । గట్టినాఁడఁ గేలఁ గంకణంబు ॥ ౧౦౫ ॥ క ॥ అని దేవ
కీదుమారుఁడు । మునిపదనముఁ జూచి పలుకు మోదాంబుదగ । ర్జనమనఁ బ్రసాదసా
గర । జనితధ్వనియనఁగ నిగుడు సరసారభటిల్ ॥ ౧౦౬ ॥ ఉ ॥ నీపితృభక్తి నీతపము నీవని
శంబునొనర్చు నర్చయు । ద్దీపితహర్షుఁ జేసె జగతీసురనందన నన్ను నీకు నా । రూపము
భక్తిమత్సదనరోహణశైలము చాలదక్కఁగాం । జూపరిపూర్తిగా వరమొసంగెద
వేఁడుము ధారుచిప్రభల్ ॥ ౧౦౭ ॥ క ॥ భాగ్యవనైయిహపరపరి । భోగ్యార్థవనైయ
గణ్యపుణ్యవనైవై । రాగ్యజ్ఞానోన్నతులగు । యోగ్యతముల పాలవాలియుండు
దుఁజుమ్మీ ॥ ౧౦౮ ॥ వ ॥ విశేషించి నీయెడం బ్రసన్నుండనై యున్నవాఁడ నభీష్టవృష్టిఘ
నాఘనంబగు మదీయఘృణాగుణంబునకు భాజనంబవైతివి జగజ్జాలంబున వస్తుజాలం
బు నీకు దుర్లభంబు లేదని పలుకు యదువల్లభు వలనం బ్రబోధితుండై ॥ ౧౦౯ ॥ సీ ॥ పుం
డరీకుఁడు వల్కెఁ బుద్బుదాభములైన సిరులుఁ గిల్ గామింపఁ జేరి కల్ప । విటపిఁ గల్మాష
ముల్ వేఁడు వెఱ్ఱిగలాఁడె నిఖిలదుర్లభుఁడగు నీవు నన్నుఁ । గరుణించి తువరమిత్తుఁ గాతు
నీడేరుతునని యుఁ గఁ భయమేది యద్భుతార్థ । మర్థింతు నిపుడున్నయట్లయస్మన్నామ
చిహ్నితైతన్మహాక్షేత్రతీర్థ । మధ్యతలమున నిలువు నామనవిఁ జేసి । సకలజనులకు
మోక్షరాజ్యము నొసఁగుచు । నిదియ నాకోర్కె జగదేకహితము నిదియ । దీనిమీఱిన

---

౧౦౧ ॥ ౧౦౨ ॥ ఉచ్ఛ్రాయము—ఆధిక్యము ॥ ౧౦౩ ॥ సురకర్మంది—నారదుఁడు. సరమా
జాని—విభీషణుఁడు. పురందరపుత్రుఁడు—అర్జునుఁడు. మేలీవులల్—శ్రేష్ఠమయిన దానముల
చేత ॥ ౧౦౪ ॥ ఈహితము—కోరిక ॥ ౧౦౫ ॥ మోదాంబుదగర్జనము—సంతోషరూపమయిన
మేఘము యొక్క యురుము. ప్రసాదసాగర—అనుగ్రహమనెడి సముద్రమునందు ॥ ౧౦౬ ॥ రో
హణశైలము—రత్నపర్వతము ॥ ౧౦౭ ॥ పరిభోగ్యార్థము—చక్కగా అనుభవింపఁదగిన వస్తువు.
వాలి—అతిశయించి ॥ ౧౦౮ ॥ అభీష్టవృష్టి ఘనాఘనంబు—కోరికలను కురియునట్టి వానకాఁ
రుమబ్బు. ఘృణాగుణంబు—దయాగుణము. భాజనంబు—పాత్రము. ప్రబోధితుఁడు—మేలుకొలుప
ఁబడినవాఁడు ॥ ౧౦౯ ॥ కల్పవిటపి—కల్పవృక్షము. కల్మాషములు—గుగ్గిళ్లు. కలాఁడె—కలఁడా.
ఉన్కి—ఉండుట. ఏది—చెడి. అద్భుతార్థము—వింతయైన విషయమును. అర్థింతుల్—కోరెదను.
అస్మన్నామచిహ్నితైతన్మహాక్షేత్రతీర్థమధ్యతలమునన్—నాపేరిచే గుఱుతింపఁబడిన యీగొప్పక్షే

సిరియొల్ల దేవదేవ ॥ ౧౧ ॥ వ ॥ అని వెండియు నతండు చాపలాతిశయంబునం జర్వి
తచర్వణంబుగా సర్వసుపర్వదుష్ప్రాపంబగు నీరూపంబు కృపాపరతంత్రంబగుచు
నాకు నగపడుటకు భూతవ్రాతంబులు ప్రభూతాద్భుతరసమస్పృణమానసంబులగు
చున్నయవి భవదీయంబగు నకారణసుకృతత్వంబునకు నియంతయుం గలండె-
యుత్తరంగంబగు సంసారతరంగమాలి మునుంగుచుం బొనుంగుపడి యనంగీకృతవి
జ్ఞానజ్ఞానవిలాసులై దోసంబులఁ జేసిన కరువుల నందగు నలసులకు వెలసులభంబు నధి
కఫలంబు నునగు యుష్మద్దర్శనంబు భవభయకర్శనంబు నుపసర్గజలదవర్గస్పర్శనంబు
నపవర్గదర్శనదర్శనంబు ననగుంగాక. పక్షేత్రంబు నీయాజ్ఞ శేషక్షేత్రవిశేషోత్తం
సంబగుంగాక- ఈ తీర్థంబు నస్మన్నామాంకిత సమర్థంబున నుత్తమంబగుంగాతమ
ని॥ ౧౧౧॥ ఉ ॥ ఆనతమౌళినై యిటులు ప్రార్థన సేయు మునీంద్రు శాంబరీ। మానుష
వేషధారి దయమానమనస్స్థితి బిగ్గ నవ్వుచున్ । వీనులఁ దాఁకు గన్గడల వేవఁ జిలుచూచు
చుం బలుకం జిలుకం బూఁ । దేనియసోనకెల్లఁ గలఁ దెప్పలఁ దేలెడు మేలిపలుకన్ ॥
౧౧౨ ॥ సీ ॥ అతిదుర్లభంబు వేఁడితి దుర్లభుఁడనైన నే నీకు దక్కుట మౌనివర్య । త్వ
త్ప్రియార్థము గనీస్థలమున పరివారయుక్తుఁడనై నిల్చియున్న నన్ను । సేవించువారెల్లఁ
జిరపుణ్యవంతులు నిహపరసుఖలాభహృష్టమతులు । కలికాలకల్మషగరళకూటాటోప
కాకోలకంఠులు గళితభవులు । నమ్యోదమ సర్వదివ్యోత్తమాస్పదాజ్ఞఁ । బూని యీ
క్షేత్రమును దీర్థమును సమస్త । భువనవర్ణితవిఖ్యాతిఁ బొదలుఁగాత । నెల్ల పుణ్యస్థల
ములకు నెక్కుడగుచు ॥ ౧౧౩ ॥ క ॥ త్వన్నామచిహ్నితంబగు । నిన్నేల యెల్ల
దీవి యేనుండుటకున్ । మన్నించి భక్తవాంఛా । భ్యున్నతులొసఁగుట యె నాకు యుక్తవ
తమున్ ॥ ౧౧౪ ॥ సీ ॥ వినుధాతృసుతయుష్పడ మిషలసురారికృపకు నచ్చెరువొంది

---

త్రమునకును తీర్థమునకును నడిమితావునందు॥ ౧౧౦॥ చర్వితచర్వణంబుగాన్ — నమలినదానినే న
మలుటగా—చెప్పినదానినే చెప్పి. దుష్ప్రాపంబు—పొందరానిది. అద్భుతరసమస్పృణమానసంబు
లు—ఆశ్చర్యరసముచేత చిక్కైన మనసుగలవి. నియంత—నియమించువాఁడు. ఉత్తరంగము—
లేచిన అలలుగలది. తరంగమాలి—సముద్రము. పొనుంగుపడి—కెడస్సిచెడి. కరువులు—పోఁతపో
సెడియచ్చులు. అలసులు—మందులు. భవభయకర్శనంబు—జన్మములవలని భయమును క్షీణింపఁజే
యునది. ఉపసర్గజలదవర్గస్పర్శనంబు—ఆపదలనెడి మేఘసమూహములకు గాలి. అపవర్గదర్శనదర
్శనంబు—మోక్షమును జూపుటకుఁ దారక్షణము. అశేష క్షేత్రవిశేషోత్తంసంబు— ఎల్లవిశేషించి
న క్షేత్రములలోను శ్రేష్ఠము. సమర్థనంబునన్ — నాయ పేర్పుటచేత ॥ ౧౧౧ ॥ శాంబరీమానుషవేష
ధారి — మాయామనుష్యవేషము ధరించినవాఁడు. దయమాన — దయగలదిగాఁ జేయఁబడు
చున్న. బిగ్గ—గట్టిగా. వీనులన్ — చెవులను. కన్గడలన్ — కడకన్నులచేత. చిల్కు—కురియుచు
న్న. సోన—వానవలని. తెప్పలఁ దేలెడు—ఊఁదులాడుచున్న ॥ ౧౧౨ ॥ దక్కుటన్ — అధీనుఁడనగు
టచేత. హృష్ట—సంతోషించిన. కలికాల...కంఠులు—కలికాలము నందలి పాపములనెడి విషస
మూహము యొక్క విజృంభణమునకు శివులైనవారు. గళితభవులు—తొలఁగిన జన్మములుగలవారు ॥
౧౧౩ ॥ చిహ్నితము — గుఱుతుపెట్టఁబడినది ॥ ౧౧౪ ॥ ధాతృసుత — నారదుఁడు. అపవర్గము—

కేలు మొగిచి । పరమేశయోభక్తపరతంత్రభావానువర్తిపరబ్రహ్మవరదనిన్ను।నరచే
తిమణిఁ జేసియవనివారలకెల్ల నపవర్గ మొసఁగునీయయ్యనెట్లు।వోలువిశ్రాణనసాలం
బుయాచకకాంక్షితమాత్రప్రాప్తికారణంబు । నీకెతగునీతనికెతగుః ఖిలగమ్య । పూ
జవడయుంగఁబూజించిపొగడవడయ । ననిమురద్వేషిఁ బుండరీకునిఁ బొగడుచుఁ।జని
రిసమ్మర్దముగనిజస్థానములకు॥౧౧౫॥ ఆ॥ పొగడిరఖిలమునులుజగములానందించె । నా
టపాటచూపిరమరరమణు।లాదినంబుసుదినమయ్యెదుర్దినమవ్వె।విబుధవరులు లతాం
తవృష్టి గురియ॥౧౧౬॥ సీ॥ శిఖిపింఛధారినై చేదోయికటిసిల్పిహరితీర్థమునఁ బశ్చిమా
భిముఖుఁడు। క్షేత్రంబునందుఁ బ్రాగ్దిగభిముఖుండునై రెండుమూర్తులు దాల్చుచుండు
నతని । పదపీఠమైయొప్పుఫణిభర్తరమఁ గొల్చుహ్రీయనశ్రీయనరెండుగడలఁ । జామ
రహస్తయైఛందోమయాకృతి ఖగలోకనాథుఁడగ్రమున వెలయు । దక్షిణంబున సనక
ప్రధానమునులు । దానుబొగడుచు సేవించుఁదమ్మిచూలి । యేనురుద్రులు సేవింతు మె
డమువలన । వెనుకనుండుదురింద్రాదివిబుధవరులు॥౧౧౭॥ వ॥ వత్సా శ్రీవత్సలాంఛను
భక్తవత్సలత్వంబునీవు నెఱింగినదియకదా వినుమత్తెఱంగున మెఱుంగుటొల్లియ
గొల్లదొర కరకలితచిత్రభస్త్రజలజశక్తియు విరచితవినతముక్తియుఁగుటిలకో
మలవినీలకుంతలనికరుండును నపరిమితకరుణాకరుండును, గటితటఘటితదోస్తంభ
యుగళుండునుజటులనిశాటగళనిగళుండును, మకరకుండలమండితకపోలఫలకుండు
నుయదుకులతిలకుండును, క్షుల్లకాశక్యసఖ్యాభిరామవృగులోరుద్వయుండును నద్వ
యుండును, బుండరీకప్రభృతిమునిజనసేవ్యమానుండును ననూనుండును, అఖండజ్ఞా
నానందైకవిగ్రహుండును విదళితజగన్నిగ్రహుండునై పంచాబ్దంబును పంచశరసహ
స్రాతిశాయివిలసనసరసంబును నిచ్ఛాదిగంబరంబును నైన ప్రాయంబును నవరత్న
సానుప్రాయంబును, బాహ్యాభ్యంతరిక ద్వారాష్టకవిస్పష్టంబు నదభ్రంబునభ్రంక
షంబును శరదభ్రశుభ్రంబునునగుమహాప్రాసాదంబునందు వాసవవైశ్రవణవైవస్వ

---

[illegible] విశ్రాణనసాలంబు—కల్పవృక్షము. యాచకకాంక్షితమాత్రప్రాప్తికారణంబు—అడిగిన వారికోరికలనుమాత్రము పొందించుటకు హేతువు, సమ్మర్దముగన్—సందడిగా॥౧౧౫॥ దుర్దినము—చెడ్డదినము; మబ్బు ఆవరించుటచే సూర్యరశ్మి కానరాని దినము. లతాంతవృష్టి—పూలవాన. ఫణిభర్త—సర్పరాజు—శేషుఁడు, ఛందోమయాకృతిన్—వేదస్వరూపముతో. తమ్మిచూలి—బ్రహ్మ॥౧౧౬॥ శ్రీవత్సలాంఛనుభక్తవత్సలత్వంబు—శ్రీవిష్ణుదేవుని భక్తులయందు ప్రేమగలిగినతనము. మెఱుంగుటొల్లియ—మెఱయుచున్న వస్త్రము, జలజశక్తి—శంఖము నైడి ముత్తెపుఁజిప్ప గలవాఁడు. కుటిల—వంకరైన. చటులనిశాటగళనిగళుఁడు—క్రూరులైన రాక్షసుల మెడలకు సంకెలయైనవాఁడు. మండిత—అలంకరింపఁబడిన. కపోలఫలకుఁడు—పలకలవంటి చెక్కిళ్లుగలవాఁడు. క్షుల్లక—నీచులకు. అద్వయుండు—తనకు రెండవది లేనివాఁడు. అనూనుఁడు—తక్కువలేనివాఁడు. విదళితజగన్నిగ్రహుండు—ఖండింపఁబడిన లోకముల భయముగలవాఁడు. అతిశాయి—మించిన. సానుప్రాయంబు—కొండచఱియనుపోలినది. విస్పష్టంబు—విడువఁబడినది. అదభ్రంబు—అల్పముకానిది.

త్రప్రముఖమఖభుగలఘుకిరీట మణిగణఘృణిమంజరీపింజరీకృతంబగు శేషపీఠంబున ధిష్ఠించి చరణద్వయాంతరాళోపలాలిత గోయష్టి లతామతల్లియై భువనత్రితయకామిత కల్పవల్లియునైన తినయాకృతి యవికృతభావంబునం బ్రిభపింపఁ దత్తైత్రిర్థమధ్యంబులనంగీకృతాధ్యాసీనుండై వాసుదేవాదివ్యూహంబులు జ్ఞానక్రియాదిశక్తులు వసురుద్రాదిత్యాదిమరుద్విశేషంబులు నశేషనిగమంబులు నఖిలశుద్ధాంతంబులు సమస్తార్థసార్థంబులు సకలమంత్రరహస్యంబులు సర్వగంధర్వస్వరసారస్యంబులు విశ్వవిశ్వాధికైశ్వర్యంబులు ననశ్వరసంపదలం బొదలి సేవింపఁ బెంపు మెఱసియుండె నని వెండియుఁ గుండలికుండలుం డిట్లనియె ॥ ౧౧౮ ॥ క ॥ నారదధృతహేమరసా । సారచ్ఛురితంబు విష్ణుసదనంబదివే । దీరచితారాత్రికతతి । భూరమణీమణికిరీటముంబురుడించుక్ ॥ ౧౧౯ ॥ క ॥ అలతీర్థస్థలిక్షేత్ర । స్థలలీలావిగ్రహద్వితయయుతుండై భా । సిలుపౌండరీకవల్లభుఁ । దలఁచినఁ గనుఁగొన్నఁ గరగతములిహపరముల్ ॥ ౧౨౦ ॥ క ॥ వినఁబడఁడు చెవులఁ గన్నుల । గనఁబడఁ డత్యుగ్రనారకవ్యథచేతన్ । బొనుఁగుపడి జడియు వైష్ణవుఁ । డనవధిదురితప్రవర్తియయ్యుఁ గుమారా ॥ ౧౨౧ ॥ చ ॥ ఇరుగడలన్ ద్విరూపములఁ గృష్ణుఁడు దైత్యనిరాకరిష్ణుఁడ । ప్పురుసుననుండ నన్నడిమిభాగమునందు వసింతు రెవ్వరా । నరులు మనుష్యరూపభరణంబునఁ గ్రీడయొనర్చు యక్షకి । న్నరగరుడోరగద్యుచరనాథులు గాఁ గొని మ్రొక్కఁగాఁ దగన్ ॥ ౧౨౨ ॥ ఉ ॥ ఎయ్యదిదివ్యసేవ్యతర మెయ్యదిమౌనిమనోభిగమ్యమా । నెయ్యదినీవు నేను భజియింపఁగ నింపగునెల్లనాడు నా । దయ్యపువెల్గు సుమ్ము సతతస్థితి వెల్గెడుపుండరీకవా । గ్ధాయ్యలఁ బ్రజ్వరిల్లుచు జగత్త్రయదుష్కృ

---

అభ్రంకషంబు—ఆకాశమునొరయునది. ప్రాసాదంబు—నగరు. మఖభుక్—దేవతలయొక్క. అలఘు—దొడ్డదైన. ఘృణిమంజరీ పింజరీకృతంబు—కాంతిసమూహముచేత ఎఱుపుమించిన పసుపు వన్నెగలదిగాఁ జేయఁబడినది. అధిష్ఠించి—ఆశ్రయించి—చేరి. అంతరాళ—నడుమ. ఉపలాలిత—బుజ్జగింపఁబడిన—నిలుపఁబడిన. గోయష్టి—సెలగోల. లతామతల్లి—శ్రేష్ఠమయినతీఁగ. భువనత్రయకామితకల్పవల్లి—మూడులోకములవారికోరికలనిచ్చుటకు కల్పవృక్షము. అవికృతభావంబు—వికారములేనితనము. అధ్యాసీనుఁడు—కూర్చున్నవాఁడు. వ్యూహంబులు—స్వరూపరచనలు. నిగమంబులు—వేదములు. శుద్ధాంతంబులు—ఏకాంతస్థానములు. సార్థంబులు—సమూహములు. సారస్యంబులు—సరసభావములు. విశ్వ—సమస్తమైన. అనశ్వరసంపదలు—చెడనికలుములు. కుండలికుండలుఁడు—శివుఁడు ॥ ౧౧౮ ॥ హేమరసాసారచ్ఛురితంబు—బంగారునీటివానకురియునది. ఆరాత్రికతతి—ఆరతులసమూహము. పురుడించుక్—పోలును ॥ ౧౧౯ ॥ కరగతములు—చేతిఁబొందినవి—చేతిలోనివి ॥ ౧౨౦ ॥ పొనుఁగుపడి—తేజోహీనుఁడై. జడియు—తొలఁగునట్టి. అనవధిదురితప్రవర్తి—మేరలేని పాపములను చేసినవాఁడు ॥ ౧౨౧ ॥ నిరాకరిష్ణుఁడు—తిరస్కరించువాఁడు. పురుసన్—విధమున. ద్యుచరనాథులు—గంధర్వశ్రేష్ఠులు ॥ ౧౨౨ ॥ సేవ్యతరము—మిక్కిలి సేవింపఁదగినది. అభిగమ్యము—పొందఁదగినది. దయ్యపువెల్గు—దేవజ్యోతి. వాగ్ధాయ్యలన్—వాక్కులనెడి అగ్నిని ప్రజ్వలింపఁజేసెడిబుక్కులచేత. ప్రజ్వరిల్లుచున్—మిక్కిలి వెలుఁగుచు. దుష్కృతిదావాద

శదాహదక్షమై ॥ ౧౨౩ ॥ మ ॥ అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్త
ముల్ పాతకం । బులనిర్జింపఁగ విష్ణుభక్తియుతగుణ్ బో దానికింబూనఁబా । ముల ప
ల్గాటులఁ జీరలం దుడిచి నంబో నేర్చునే మాంత్రికా । కలితాహి ప్రతివీరమంత్రపద రేఖా
శ్లాఘ చేతంబలెన్ ॥ ౧౨౪ ॥ సీ ॥ జగదధిష్ఠానంబు సచ్చిదానందాత్మకము నందనం
దనాత్మకము క్షేత్ర । తీర్థస్థితము పృథగ్దీపితంబు నృసింహ రామ మత్స్యాది విగ్రహ
ములెట్టి । యవిఘనదగి యుండు నట్టిదయగు దాని హేతికు లఘుతమఃప్రోతమతు
లు । గాంచి యుర్వులఁ గాంచొకటి గాఁగఁ దలఁచి వికత్థనంబొనరించి గరుసులేని । రౌ
రవంబుల డించి పారంబులేక । వనరుదురు గాని విజ్ఞానవంతులైన । వారు శిలగాఁగఁ ద
లఁచ రేవ్వానుదృష్టి । గోచర బ్రహ్మ చూచి కొలిచి యునికి ॥ ౧౨౫ ॥ శా ॥ ఆవా
ణీరమణుండు ప్రార్థనము సేయన్ దేవకీదేవిగర్భం । దావిర్భావము నొంది యేరికిసల
భ్యంబైన రేవన్ జగ । జ్జీవాతుస్థితినుండు నిందువారవిస్మేరాననున్ నిత్యసం । సేవం
దెల్పు జితేంద్రియుండు తమముం జించుం గనుం దత్త్వమున్ ॥ ౧౨౬ ॥ తే ॥ భక్తిగ
ద్గదరీతి వాగ్భరములొలయ । నటనమునఁ గూడి గోపికానాథు మ్రోల । నిలిచి కీర్తిం
చు ఘణ్యుండు నలినబంధు । దళన మొనరించి తత్త్వపదమునకరుగు ॥ ౧౨౭ ॥ క ॥ హ
రి సోపహారలక్ష్మీ । శ్వరు నెవ్వరు చూతురట్టి వారలు సకలా । మరపూజ్యులు వారందు
నఁ । బొరసిన పుణ్యములగణ్యములు గుణజలధీ ॥ ౧౨౮ ॥ క ॥ ఇతిహాసపురాణకథా ।
శ్రుతిస్మృతులు నందగోప సుతుకట్టెదురన్ । సతతము పఠియించు మహా । మతి పరమ
పదంబునందు మతిమన్మఖ్యా ॥ ౧౨౯ ॥ క ॥ తీర్థమున నాడి బ్రహ్మా । భ్యర్థిత లీలావ
తారు భక్తాధారున్ । పార్థసఖుఁ గొల్వఁగల మో । క్షార్థులకున్ గలవు సచ్చిదానం
దంబుల్ ॥ ౧౩౦ ॥ సీ ॥ భ్రూణహుండును సురాపుఁడు బ్రహ్మఘాతియు గురుతల్ప

---

త్తము—పాపములను గొల్పఁజాలినది ॥ ౧౨౩ ॥ అలసంబులు=మాంద్యముగలవి. పూనన్—సరియగు
టకు. పల్గాటులు—పండ్లు నాటిన గాయములు ॥ ౧౨౪ ॥ సచ్చిదానందాత్మకము—సత్తుచిత్తుల స్వరూప
ము ఆనందము గాగలది. నందనందనాత్మకము—కృష్ణుఁడు స్వరూపము గాగలది. పృథగ్దీపితంబు—
వేఱుగా వెలుఁగునది. హేతికులు—ఆయుధములు పూనినవారు. అఘతమఃప్రోతమతులు—పాపముల
నెడి చీఁకట్లను భేదించు బుద్ధిగలవారు. వికత్థనము—అబద్ధము. గరుసు—మేర. డించి—అణఁగి. వనరుదు
రు—దుఃఖింతురు ॥ ౧౨౫ ॥ రేవన్—విధమున. జగజ్జీవాతుస్థితిన్—లోకమునకు ప్రాణరక్షకమైనయునికి
తో. విస్మేర—వికసితమైన. తెల్పు—అర్పించు; మ్రొక్కు ॥ ౧౨౬ ॥ వాగ్భరములు—మాటలయతిశ
యములు. నలినబంధుదళనము—సూర్యబింబము యొక్క భేదించుటను. తత్త్వపదమునకున్—పరబ్ర
హ్మస్థానమునకు ॥ ౧౨౭ ॥ సోపహారిన్—కానుకలోఁ గూడినవానిని. అందునన్—ఆదర్శనమువలన. పొ
రసిన—పొందిన ॥ ౧౨౮ ॥ మతిమన్మఖ్యా—బుద్ధిమంతులలో ప్రధానుఁడా ॥ ౧౨౯ ॥ ఆడి—
స్నానము చేసి. అభ్యర్థిత—వేఁడఁబడిన. సచ్చిదానందంబులు—శాశ్వతములయిన జ్ఞానసంతోష
ములు ॥ ౧౩౦ ॥ భ్రూణహుండు—కడుపులోని పిండములను జంపినవాఁడు. గురుతల్పగ—గురుభా

గస్తేయగోవధోప । జీవిపితృద్రోహిశిశుహంతపరదారరతుఁడునిందకుఁడుసర్వస్వ
భోక్త । సత్యరిక్తుండును సర్వాభిమర్శి హేరికుఁడు సర్వాపలాపకుఁడశుచియు । ని
జసత్వవిద్వేషినీచుండుపాపప్రవణుఁడు స్వేచ్ఛావిహారహారి। కృతమెఱుంగనివాఁ
డుసూనృతములేని । వాఁడునమ్మినఁజెడఁజూచువాఁడు మొదలు । పాపకారులకేని
యుఁబౌండరీక । తీర్థహరిమూర్తియుఁగమిచ్చుదివ్యపదము ॥ ౧౩౧ ॥ చ ॥ అలఁతి
పిసాళినవ్వు మధురాధరబింబఫలంబుతమ్మితే । కులనగుసోగకన్నులుప్రకుంచితకుం
తలచారుఫాలముల్ । బలుచనిచెక్కులంగలయఁబర్వినకుండలరత్నకాంతులున్ । గ
లశిఖిపింఛలాంఛను మొగంబుగనందగు ధూపవేళలన్ ॥ ౧౩౨ ॥ క ॥ ఘనముఘ
నార్థమైనద్రి । ఘనలలితంబగుపయోధిశయనువదనమీ । ఘనమొనరించుకృతికినా ।
ఘనమునఁగలవఖిలసుకృతజాతఫలంబుల్ ॥ ౧౩౩ ॥ సీ ॥ ముజ్వంకమురువుతోముర
ళియొక్కొకవేళ మోయించుభువనైకమోహనముగఁ । గ్రీడించునొకవేళఁదోడి
బాలురఁగూడి యక్షీణగతిఁగుబేరాక్షకేళి । సవరించునొకవేళ జలవిహారముచాలఁ
బ్రేమభీమరథీగభీరవారి । కొలువుండునొకవేళ నలినసంభవపుండరీకాస్మదాదులు
ప్రీతిఁగొలువ । నురగరిపువాహనముననొక్కొకవేళ । వేడ్కవేంచేసిమెలయఁ
దిర్వీధులందు । నెన్నికల్పంబులరిగినమేనయేండ్ల । వెలయుప్రాయంబుగలకొయ్య
విట్ఠలయ్య ॥ ౧౩౪ ॥ శా ॥ శ్రీరంగంబున ద్వారకన్ గయఁ గురుక్షేత్రంబునన్ నై
మిశా । శ్యారణ్యాంజనశైల పుష్కర మహేంద్రా నంతశయ్యాహరి । ద్వార
శ్రీపురుషోత్తమంబుల నయోధ్యన్ సేతుగంగాభిసం । గారూఢస్థలిఁబౌండరీకము
న దైత్యారాతియుండుంగడున్ ॥ ౧౩౫ ॥ క ॥ హరియుత్తరభాగంబునఁ । బురు
షుఁడు దాఁబాపమైనఁబుణ్యంబైనన్ । సురకానియంతచేసినఁ । బరిణతమైమేరువు
ధరభారముఁజూపున్ ॥ ౧౩౬ ॥ సీ ॥ సమ్మార్జనమునధ్వాంతము నుపలేపనంబున
మరాళము రంగమునవిచిత్ర । శుకముదీపాంకురప్రకటనంబునఁ బాముపదసద్మతీ
ర్థానుభవముకతన । సరఘయు నూధస్యపరిషేచనంబున ధేనువు మోక్షంబుతెరు

---

వ్యనుపొందినవాఁడు. స్తేయ — దొంగ. గోవధోపజీవి — ఆవులను చంపిరిని బ్రతుకువాఁడు. శిశుహం
త — పసిబిడ్డలను జంపువాఁడు. పరదారరతుఁడు — అన్యుని భార్యను పొందువాఁడు. నిందకుఁడు —
ఒకరిని నిందించువాఁడు. సర్వస్వభోక్త — ఎల్లసొత్తును భుజించువాఁడు. సత్యరిక్తుఁడు — నిజ
ములేనివాఁడు. సర్వాభిమర్శి — అన్నిటి నంటువాఁడు. హేరికుఁడు — కొండెపెట్టువాఁడు.
సర్వాపలాపకుఁడు — సర్వమును దాఁచుకొనువాఁడు. ప్రవణుఁడు — ఆసక్తుఁ
డు ॥ ౧౩౧ ॥ అలఁతి — అల్పము. పిసాళి — మనోజ్ఞము. సోగ — దీర్ఘము. ప్రకుంచిత —
మిక్కిలి వంకరయిన. కలయఁబర్విన — అంతట వ్యాపించిన. శిఖిపింఛలాంఛను — కృష్ణుఁడైన ॥
౧౩౨ ॥ కృతికిన్ — కృతార్థునికి ॥ ౧౩౩ ॥ ముజ్వంకమురువు — మూఁడు వంకలతోడి మనోజ్ఞత. కుబే
రాక్షకేళి — వెన్నెలకుప్పలయాట. ఏన — అయిదే ॥ ౧౩౪ ॥ ౧౩౫ ॥ పరిణతము — నెఱవేఱి
నది ॥ ౧౩౬ ॥ ధ్వాంతము — చీకటి. సరఘ — తేనెటీఁగ. ఊధస్యపరిషేచనము — పాలచేఁపు

వృగనిరి । గానసేతత్పరికల్పనంబునఁ బాండురంగాధినాథుఁ జేరంగవలయు । ననిన
నారదుఁడిట్లనునభవజ్ఞాన । విరహితంబులు జడములువీని కెట్లు । మనుజకృత్యంబుచే
కరారెమధువిరోధి । యెట్లువరమిచ్చెనని వేఁడనీశుడనియె ॥ ౧౩౭ ॥ ఉ ॥ మూర్తి
మదిక్షుకార్ముకసముజ్జ్వలకీర్తియుఁబోనిచంద్రికా । స్ఫూర్తివెలుంగఁజేయుచున
భోవనకేసరిచంద్రుఁడుబ్బగాఁ । గాత్రికపూర్ణిమన్ యదుశిఖామణిమున్నొకనాడు
చూళికా। నతిఁతపింఛగుచ్ఛలసనంబునభీమరథీతటంబునన్ ॥ ౧౩౮ ॥ మ ॥ సుర
లీలావతులున్ నరాంగనలుచక్షుశ్శ్రోత్రకన్యల్ స్మర । జ్వరపీడాశయులై సనుంగో
లువరాసక్రీడఁ బెన్ప్రోడలై । కరలీనోర్మికలంగుళీచలన రింఖత్తాళవంతులై క్రాలఁ
గా । మురళీనాదవినోదకేళిఁ దవిలెన్ మోదంబుసాదంబుగన్ ॥ ౧౩౯ ॥ క ॥ ఆ
నాదముదన్వనజగ । తీనివసన్నాని ఘోషామధేనువుకటిసాం । ద్రానందమొదవవిని
తన । మేనుమఱచికురిసెనపరిమితదుగ్ధంబుల్ ॥ ౧౪౦ ॥ ఉ ॥ కాననగంధవాహ
వశగంబగుటన్ వెసనొందుతత్పయః । ఫేనకణంబువచ్చిమురభేదను మౌళినలంక
రించె శ్రీ । జానియుఁబాటమానినిజసౌధమునందుసుఖించుచుండెనా । ధేనువులెస్స
గాముదిసి దేహమునూడ్చిభవాంతరంబునన్ ॥ ౧౪౧ ॥ క ॥ హరిమౌళిపతితనిజదు
గ్ధగసోత్కరఫేనకణకృతపరమసుకృత । స్ఫురణంబుననొకవైష్ణవ । వరునకుఁదను
జాతయగుచు వసుధంబుట్టెన్ ॥ ౧౪౨ ॥ వ ॥ సుశీలాభిధానయగు నబ్బాలగుణభా
స్వరయై యథోచితకాలంబున ॥ ౧౪౩ ॥ ఉ ॥ తాళివిభుండుగట్టెనమొదల్ పతిదేవ
త యాసుశీలకున్ । గోలతనంబునన్ మగఁడు కొట్టినఁదిట్టినరట్టుచేసినం । దాళిది
నంబుఁదచ్చరణ తామరసంబులుగొల్చునేలయున్ । బోలునెయీపెకంచుఁగృతబు
ద్ధులువృద్ధులుప్రస్తుతింపఁగన్ ॥ ౧౪౪ ॥ సీ ॥ రూపహీనుఁడుమహాక్రోధనుఁడతిలో
భి బద్ధమత్సరుఁడన్యబుద్ధిమాయి । చంచలస్వాంతుండుసకలబంధువిరోధి బహుశప
థోక్తిలంపటుఁడుశఠుఁడు । సంతతావిశ్వాసనస్యప్రరోహుండు గర్వపర్వతమస్తక

---

టీ ॥ ౧౩౭ ॥ మూర్తిమత్ = స్వరూపముగల. ఇక్షుకార్ముక = మన్మథునియొక్క. చూళిక = పిల్ల
జుట్టు. లసనంబునన్ = ప్రకాశముచేత ॥ ౧౩౮ ॥ చక్షుశ్శ్రోత్రకన్యలు = నాగకన్యలు. స్మరజ్వర
= మన్మథతాపమువలని. పెన్ప్రోడ = మిక్కిలి నేర్పరి. కరలీనోర్మికలు = చేతియందుఁ దగిలిన యుంగ
రములు. రింఖత్ = చలించుచున్న. సాదంబుగన్ = కలిగాఁగా ॥ ౧౩౯ ॥ నివసత్ = ఉన్న. సాం
ద్రానందము = అధికసంతోషము. దుగ్ధంబులు = పాలు ॥ ౧౪౦ ॥ గంధవాహ = గాలియొక్క.
తత్పయః ఫేనకణంబు = ఆ పాలనురుఁగుచుక్క. శ్రీజాని = లక్ష్మీభర్త. భవాంతరంబునన్ = జన్మాంత
రమునందు ॥ ౧౪౧ ॥ ౧౪౨ ॥ ౧౪౩ ॥ తాళి = తాళిబొట్టు. గోలతనంబునన్ = ఏమియెఱుంగని
తనముచేత. రట్టు = అల్లరి. తాళి = ఓర్చి ॥ ౧౪౪ ॥ మహాక్రోధనుఁడు = మిక్కిలి కోపముగలవాఁ
డు. బద్ధమత్సరుఁడు = మిక్కిలి చలముగలవాఁడు. మాయి = కపటముగలవాఁడు. శపథోక్తిలం
పటుఁడు = ఒట్టుపెట్టుకొనుటయందాసక్తుఁడు. అవిశ్వాసనస్యప్రరోహుండు = అవనమ్మకమనెడి

స్థితుండు। కలహాశనుండుతరక్రియాకుశలుండుసంగతోన్మాదోత్తమాంగకుండు।
నగునయేనియునట్టువంటి మగనితోడఁ। గాపురము సేయుసతిదొడ్డగరితయగుచు।గ
సిడిగోఁతకునోర్చిలోవిసిగికొనక। ధాతమూరకతంత్రిఁసేఁతకువగవక॥ ౧౪౫॥శా॥
ఆతీవ్రాంశునివేఁడికోర్చిమనుఛాయాదేవియుంబోలెస। త్పాతివ్రత్యగుణాభిరామ
యగుచాభామాలలామంబుసం। ప్రీతింజేయునసహ్యదర్శనములన్ బిర్వీఁకులంబెట్టు
దు।ర్జాతున్ వీతదయానయున్ దదుచితాచారంబులన్ నిచ్చలున్॥౧౪౬॥ఉ॥కొన్నిగొ
ణంగికొన్నినిసికొన్నితుటారములాడిమానరా। కెన్నకనిన్నినాళ్లకిదియున్ననికూటికిఁ
బిచ్చపాటిగో।మ్మన్నమహాప్రసాదమనిహర్షరసోల్లసదాననాబ్జయై। యన్నలినాక్షి
భర్తయిడునన్నియ గైకొను ప్రముక్కుధాన్యముల్ ॥ ౧౪౭ ॥ సీ ॥ చతురసమ్మార్జ
నాచరణంబుతోలువాటి ప్రాఁచివన్నియతోప్పువదుటగాఁగ। గోమయగోముఖశ్రీ
ముంగిటఘటించుటలుముఖమజ్జనకలనగాఁగ। గమనీయపూర్ణకుంభములపూజా క్లృ
ప్తికువలికుచాకల్పరచనగాఁగ। నన్నసంపాదనార్హాగ్నిఁబుట్టిన ధూమపటలిసం
స్కారధూపంబుగాఁగ। విఘటితకవాటకద్వారవిశదనయన।యుచ్ఛితాధరగేహాళి
కాధరోష్ఠ। భాండగోపనయవనికాంబరపరీత। యింతిగృహలక్ష్మినత్యంత కాంతిఁ
దనరు॥౧౪౮॥సీ॥ప్రస్తుతంబనిపదార్థములురాజులవేఁడికొనితెచ్చియమ్మించుకోమటిం
డ్ల। మూసిముల్లడిచిగుమ్ములకొల్చుపైమెత్తులూష్వఁదుపస్తైనుండుగాని। యె
ట్టిచుట్టంబేనియింటికేతేర రెండవసూతకముదెల్పియవలఁజొనుపు। మునుప్రతిశ్రిత
ముచేసినపైఁడిరాకున్న ముచ్చిచ్చునను వేఁగువచ్చుదనుక। వనరు శాకాయలవణా
యువాయటంచుఁ। పెనగుధూళిఃపరగృహాదపియనునాస। ముంచియీగకుఁగా
టుపామునకుబలియు। నాసఁగఁడనిభర్తకైపొక్కనువిదమదిని ॥ ౧౪౯ ॥ వ ॥ ఇ
వ్విధంబున నవ్విధుబింబవదన వివిధకుటిలాచార చతురుండగు జీవితేశ్వరునీశ్వరుం

---

పైరును మొలపించువాఁడును. సంగతోన్మాదోత్తమాంగకుండు — కూడిఁపిచ్చికెత్తలకెక్కినవాఁడు. కసిడిగోఁతకున్ — రాపాడుటకు. చేఁతకున్ — పనికి ॥ ౧౪౫ ॥ తీవ్రాంశుని — సూర్యుని. పిర్వీఁకులంబెట్టు — బాధించు. నిచ్చలున్ — ఎల్లప్పుడు ॥ ౧౪౬ ॥ తుటారములు — అంత్యపుమాటలు బిచ్చపాటి — కొంచెపాటి. ప్రముక్కు — ప్రాఁతగిలి సారముచెడిన ॥ ౧౪౭ ॥ సమ్మార్జనాచరణము — కసవూడ్చుట. గోముఖశ్రీ — అలుకనట్టియలంకారము. క్లృప్తి — నియతి. ఆకల్పరచన — వస్త్రాదిభ్యలంకారము చేసికొనుట. యవనికాంబరపరీత — తెరచీరచే ఆవరింపఁబడినది ॥ ౧౪౮ ॥ ప్రస్తుతంబు — వివాహాది కార్యము. గుమ్ములకొల్చు — బొట్టెలలోనిధాన్యము. రెండవసూతకము — మృతాశౌచము. ప్రతిశ్రితము — ఒకరియధీనము. పైఁడి — ధనము. వనరున్ — దేవురించుచుయాచించును. శాకాయలవణాయవా — కూరకైనను ఉప్పునకైనను. ధూళిఃపరగృహాదపి — పొరిగింటనుండిదుమ్మైనను రానిమ్ము. పొక్కున్ — దుఃఖించును ॥ ౧౪౯ ॥ విధుబింబవదన — చంద్రబింబమువంటి మొగము గలది — స్త్రీ. కుటిలాచారచతురుఁడు — వంకరనడతలయందు నేర్పరి. జీవితేశ్వరున్ — పెనిమిటిని.

గాఁదలంచుచుఁ దదుపాసనంబు తనకునిహపర సిద్ధిసంసూచకంబుగ నిండుడెందం
బునం గోచరింపంజేయుచుఁ గీర్తితచరిత్రంబునం బ్రవర్తిల్లుచుండునంత ॥ ౧౫౦ ॥
క ॥ అటనొకనాఁడాభూసుర । కుటుంబినీసదనమునకుఁగుహనావటువున్ । బటువ
గుమైజిగిఁదెగడున్ । బటువగునొకవడుగువచ్చెభుక్త్యాపేక్షన్ ॥ ౧౫౧ ॥ వ ॥ వ
చ్చినవమ్మచ్చెకంటిగెంటని నెయ్యంబులియ్యంబగు నంతఃకరణంబున నడలుగడలుకొన
గ్రామాంతరాసక్తుండగుప్రాణనాథుండు తనుంబిలిచినయట్లయినలోనింటిబోనమా
నితొంగిచూచుతఱింబొడకట్టి బొట్టునకు మేదావిమెదుపలవాటునం గందిన యంగు
ళీవ్రాతయంబు దేఁటిగుట్టినం బృథగ్వర్ణమూర్తులగు సంవర్తికలుగల జలరుహంబనఁ
బ్రశస్తంబగుహస్తంబెత్తి స్వస్త్యస్తుతేయని యాశీర్వదించుటయుఁ గృతనమస్కా
రమైయాసారసామోద మృదులస్వరంబుననిట్లనియె । ౧౫౨ ॥ సీ ॥ ఎందుండి రా
కయుండెదేతెఱఁగితమేమిఁ గ్రాసార్థిభావంబుగానవచ్చె । నగునన్న నట్లైనమొగసాలనుం
డుఁడాయనయూరలేఁడుయాదూర్థమునకె । కావింతునన్నసంస్కారంబుమీరా
రగింతురుగాని వేగిరమెయనుడు । మాణవకుఁడుపలుకుమగువనేఁడేన్నాళ్లనుండియు
గుడువఁగూడాదవకునికి । వేఁడియుగుదాఁక నోరువమాఁడుగలిగెఁ । బలిసినది
గల్గెనన్నంబుపోఁకయంత । యొసగిత్తుత్తార్పువెసచల్దిమెసవనైన । పాపముఁడిపించు
కొందుఁదపంబుకలిమి॥ ౧౫౩ ॥ తే ॥ అనుడునెలనాగయిట్లనుసనఘునికుఁ । జలిదియో
నెట్టులిడనేర్తుక్షణములోన । వంటగావింతు భుజియించివలయునెడకు । నేగునా
వినిసతిఁబలుకఁ టాఁగవడుగు॥ ౧౫౪ ॥ తే॥ త్రోవగమియించుచోటనోపూవుఁబోఁడి।
యవరవర్ణసమాచారమైనఁజెడదు । బ్రాహ్మ్యమీతడవేటికిఁబ్రాణరక్ష । నెఱవుమొ
కయింతమెదుకిన్నినీళ్లనొసఁగి ॥ ౧౫౫ ॥ తే ॥ వాఙ్మనఃకాయకర్మప్రవర్తనముల।

---

ఉపాసనము—పరిచర్య. నిండుడెందంబునన్—కొఱఁతలేనిమనసుతో. కీర్తిత—పొగడఁబడిన ॥ ౧౫౦ ॥ కుటుంబిని—ఇల్లాలు. కుహనావటువున్ — కపటబ్రహ్మచారియైనవామనుని, పటువు—మిక్కుటము. మైజిగిన్—దేహకాంతిచేత. తెగడుంబటువు—తిరస్కరించునట్టి ప్రౌఢికగలవాఁడు—చక్కఁదనముగలవాఁడు. వడుగు—బ్రహ్మచారి. భుక్త్యాపేక్షన్—భోజనముచేయు నపేక్షతో ॥ ౧౫౧ ॥ గెంటని—తొలఁగని. లియ్యంబు—ఐక్యము. అంతఃకరణంబునన్—మనసుతో. అడలు—భయము. కడలుకొనన్—అతిశయింపఁగా. బోనమాని—వంటచేయుతావునుండి. పొడకట్టి—కనఁబడి. మేదావి—ఔపాసనముచేసిన నిప్పునుసి. మెదు—మెదుపునట్టి. అలవాటునన్— వాడుకచేత. పృథగ్వర్ణమూర్తులు — వర్ణముమాఱిన స్వరూపముగలవి. సంవర్తికలు—క్రొత్తరేకులు. స్వస్త్యస్తుతే—నీకు మేలగుఁగాక. సారసామోద—తామరవాసనవంటిదేహవాసనగలది॥ ౧౫౨ ॥ ఏతెరన్—రాక. గ్రాసార్థిభావంబు—అన్నముగోరినవానితనము. మొగసాలన్—ఇంటిముందటివసికిలో. మాణవకుఁడు—చిన్నవాఁడు. ఏన్నాళ్ళనుండి—అయిదుదినములనుండి॥ ౧౫౩ ॥ టాఁగవడుగు—ధూర్తుఁడైనబ్రహ్మచారి॥ ౧౫౪ ॥ గమియించుచోటన్— నడచునప్పుడు. అవరవర్ణసమాచారము—శూద్రునియాచారమువంటి యాచారము. బ్రాహ్మ్యము—బ్రాహ్మణధర్మము ॥ ౧౫౫ ॥ అభ్యాగత

సంభవించినపాపంబుసంహరించి । యతిథిగృహమేధికిచ్చు శాశ్వతసుఖములు । వి నవెయభ్యాగతస్స్వయంవిష్ణువనఁగ ॥ ౧౫౬ ॥ తే ॥ అతివతీర్థాదరత్వరనరుగుదెంచి । త్రోవనాఁకటివేళకుదొరకకునికి । కాంచనీయానయేఁగూటికలనజరఁ । వహ్ని నొకరమేనకాదెట్టివాఁడునెరియు ॥ ౧౫౭ ॥ వ ॥ నాతోడంగూడియాడువడుగులుఁబడుగులయ్యును వడిఁజెడకకడఁకమెఱసియేమసంకల్పించి మున్నెతెరసమకట్టినపుండరీకంబునకుఁ బాండురంగసేవా సావధానులైచనిరి నేనుకూటిబీద తోడుదప్పినతెఱంగునవిచ్చటందడసితివెండియువినుము ॥ ౧౫౮ ॥ క ॥ తరుణక్షుధాతురాణాం । నరువిర్నచకాలమనుచునరులాడుటలో । నరసివివేకింపఁగఁదగు । తెరువరులకుఁ బాయసంబుతిరిసినఁగలదే ॥ ౧౫౯ ॥ ఆ ॥ ఎంతభాండశుద్ధియెటువంటిగృహశుద్ధి । యెట్టిచిత్తశుద్ధియుచితచలిది । కూడుచికుర నెడఁబురోడాశమునకునో । యమ్మసాటివచ్చునదియుఁగాక ॥ ౧౬౦ ॥ క ॥ అనుచితశతములొనర్చియుఁ । దనువులురక్షించుకొనరెదమశమతేజో । ధనులగుగాధిసుతాదులు । తనప్రాణమునిలుపు కన్నధర్మముగలదే ॥ ౧౬౧ ॥ తే ॥ తొలుతనేవేఁడినప్పుడుచలిదిసీకు । ననఘనేనెట్టులిడుదాననంటిగాన । యశనశేషస్థితికిసందియంబువలదు । చాలుఁజాలదోయను వృథాశంకవిడువు ॥ ౧౬౨ ॥ క ॥ సతియాత్మస్తుతియతిగ । ర్హితమనినాపెంపుదెలుపనేనొకఁడనో । గతిదృష్టిగనినభువన । శ్రితయమునకుఁబరితుష్టితిలకించుఁజుమీ ॥ ౧౬౩ ॥ వ ॥ అనియంతనిలువక ॥ ౧౬౪ ॥ క ॥ పెట్టకపోననియాఁకటఁ । దొట్రిగిలంబడుచుఁబడుచుదురదురఁజనివే । నట్టింటఁగూరుచుండిన । నెట్టుననంజాలకమ్మ గేహంభీకర ॥ ౧౬౫ ॥ సీ ॥ పరిహరించుటకీడుతెరువరిఁ బసిబిడ్డ నర్థినాఁకటిచేతనలయువానిఁ । బర్యుషితమునర్పణసేయఁజాలఁబాపమురాదెయుపచారపరతమెలఁగ । మినుకొకటిచ్చి పొమ్మనినఁబోవునాపోవఁడధ్వప్రయాసవిహ్వలుఁడితండు । చాలునోచాలదోచలిది

---

స్స్వయంవిష్ణుః—అభ్యాగతుఁడుతానేవిష్ణువు ॥ ౧౫౬ ॥ ఎరియుర్—కాలును—తపించును ॥ ౧౫౭ ॥ బడుగులు—చిక్కినవారు. కడఁక—పూనిక. ఏతెర్—పోను. సమకట్టిన—యత్నించిన. సావధానులు—ఎచ్చరికతోఁగూడినవారు. తడసితిర్—బాగుపడినిలిచితిని ॥ ౧౫౮ ॥ క్షుధాతురాణామ్—ఆఁకటిబాధగలవారికి. రుచిః—చవి. న—లేదు. కాలంచ—కాలమును. న—లేదు. తిరిసినర్—చివ్వమెత్తినను ॥ ౧౫౯ ॥ పురోడాశము—పిండముశేషమైనయన్నము ॥ ౧౬౦ ॥ అనుచితశతములు—అనేకములయినతగనిపనులు. దమశమతేజోధనులు—ఇంద్రియనిగ్రహము శాంతిపీనివలనితేజస్సేధనముగాఁగలవారు. నిలుపు—నిలుచుట ॥ ౧౬౧ ॥ అశనశేషస్థితికిర్—భుజింపఁగామిగిలియుండుటకు. చాలుర్—చాలునో ॥ ౧౬౨ ॥ గర్హితము—నిందింపఁబడినది. పెంపు—ఘనత. మనోగతిర్—మనసునందు. కనినర్—పొందినను. పరితుష్టి—తృప్తి. తిలకించుర్—ప్రకాశించును—కలుగును ॥ ౧౬౩ ॥ ౧౬౪ ॥ తొట్రుగిలంబడుచుర్—తత్తఱపడుచు. పడుచు—పిల్లకాయ. దురదురర్—శీఘ్రముగా ॥ ౧౬౫ ॥ పరిహరించుట—పట్టుట— లేదుపొమ్మనుట. పర్యుషితము—చల్ది. మినుకు—చిన్నదినెడిబంగారునాణెము. అధ్వప్రయాస విహ్వలుఁడు—దారిబడలికచేత అవయవ

యుపద్భ్రష్టపాథేయ శేషమల్పంబె యగుటఁ । జాలకుండిన నగుఁ జెట్టబాయుఁ డితఁ
డు । కొసరి గొంతెమ కోరికల్ కోరెనేని । యిడకపోఁబోల విడఁబోల నీరుదినియఁ ।
బేసురాకున్న తైర్థికుల్ పెళుచులంద్రు ॥ ౧౬౬ ॥ తే ॥ వంటయగుదాఁక నుండఁడె పీడ
డుగుబండి । మీఁదఁబోవు మనున్నాఁడు మీటిఘోటి । నైనదయ్యెడుఁగా కేమి యిప్పటికి
ని । నీఁదుగడఁగట్ట నేలంచు మించుఁబోఁడి ॥ ౧౬౭ ॥ శా ॥ రారయ్యా యనుశుద్ధము
చ్చరణు గోత్రాదేవతాపుత్రుని । స్మేరాగ్నిప్రభుఁ గూరుచుండఁ డిడి ప్రోల్చెట్టుగా
వించిన్ । రారంబాడిన ప్రాంతరాజనపు దివ్యాన్నంబు నొక్కింత వా । ర్ధారాధౌతముఁ
గుండయూడ్చి మొసఁగెన్ రంభాపలాశంబునన్ ॥ ౧౬౮ ॥ తే ॥ ఒసఁగి యవ్యంజ
నంబు దధ్యోదనంబు । నారగింపుఁడు కుమియింపుఁడనుచుఁ బలికి । ముదితమది తత్త్వ
భావసంపదయుఁబోని । సలిలపరిపూర్ణమగు గిండి సేర్చి పిదప ॥ ౧౬౯ ॥ క ॥ చేసెం
బోశనమున్నపుడు । ధ్యానంబొనరించి యుపశమహుతనుమతిఁ జం । ద్రాననచేఁ గొసరి పొ
సఁగన్ । బ్రాణాహుతి విరచితముగఁ బర్యుషితంబున్ ॥ ౧౭౦ ॥ తే ॥ తిరిగి యూ
చినయంత నాత్రిమష్కరీఁడు । సిద్ధమొక్కటియేని యుఁజిక్కనీక । మ్రింగిమీఁదులు చూ
చుచున్నృదుల ఫణితిఁ । బిలిచి యిట్లను శరదిందుబింబముఖిని ॥ ౧౭౧ ॥ తే ॥ చూడు
మీసారిభాండ మోశోభనాంగి । భిస్సటంబొండెడెఁ నాఁటిదప్పినదియొండెఁ । గలుగు లేకుం
డనూడ్చి తెమ్మ లఘుజఠర । జాతవేదంబు హెచ్చెఁ జిన్న్వల్పపుసక్తి ॥ ౧౭౨ ॥ చ ॥ అను
టయు సంభ్రమంబునవసంగన తొట్టటి యింటియామినిం । దనకని వండి డెంచికొనినాఁడుఁ
డు పల్లియకేగు నెంజిలిం । దనికి ఘుజింపకుండ కుంభరితంబయి యట్టుకనట్టుకట్టియు । భృ
నభినవోదనంబొసఁగెఁ బూర్ణసితదాక్షుఁ గ్రావమూఁకుటన్ ॥ ౧౭౩ ॥ తే ॥ ఒసఁ
గి యెడపెప్పులోఁగాఁగుచున్న యాల । పాలికఁ ద్దించుట యు మాసిపాలవేళ । మవలి

---

ములస్వాధీనత లేనివాఁడు. పాథేయశేషము — దారికట్టి యుద్యోగముమిగిలినది. చెట్ట — కీడు. గొం, తెమకోరికలు — కోరరాని కోరికలు. పోఁడు — తగదు. తైర్థికులు — తీర్థయాత్ర చేయువారు — బ్రాహ్మణులు. పెళుచులు — విరసపుమాటలాడువారు ॥ ౧౬౬ ॥ ౧౬౭ ॥ శుద్ధమచ్చరణున్ — శాస్త్రము గడుగుకొన్నవానిని. గోత్రాదేవతాపుత్రున్ — బ్రాహ్మణకుమారుని. పిస్మేరాగ్నిప్రభున్ — వెలుఁగుచున్న నిప్పునఁబోలిన తేజస్సుగలవానిని. ప్రోల్చెట్టుగావించి — ముందటిచోటు శుద్ధిచేసి. నీరారన్ — నీళ్ళసమృద్ధిగా. వార్ధారాధౌతమున్ — నీటిధారలచేత పరిశుద్ధముగాఁ జేయఁబడినదానిని, రంభాపలాశంబునన్ — అరఁటాకున ॥ ౧౬౮ ॥ అవ్యంజనంబు — కూరలులేనిది. దధ్యోదనంబు — పెరుగన్నము. ముదిత — స్త్రీ; సంతోషించినది. సలిల — నీటిచేత. గిండి — చిన్ననోరుగలచిన్న చెంబు ॥ ౧౬౯ ॥ పొసఁగన్ — భుజించెను ॥ ౧౭౦ ॥ త్రిమస్కరీఁడు — యథేచ్ఛముగా ప్రవర్తించువాఁడు. సిద్ధము — మెతుకు ॥ ౧౭౧ ॥ భిస్సటంబు — కూడు. అలఘుజఠరజాతవేదంబు — అధికమయినజఠరాగ్ని ॥ ౧౭౨ ॥ యామినిన్ — రాత్రియందు. నెంజిలిన్ — విచారముచేత. తనికి — సంతాపించి. అట్టుకన్ — అటుకయందు. అట్టుకట్టి — అట్టుగా నేర్పడి. అభినవోదనంబు — క్రొత్తయన్నము — సద్దికావనుట. గ్రావమూఁకుటన్ — కంచమువంటిమూఁకుటియందు ॥ ౧౭౩ ॥ ఎడపెప్పు

వారల చేతికి నందియిచ్చు । వడువున భుజించె వడు నివుర్వాంటకంబు ॥ ౧౭౪ ॥ క ॥ భుజియిం
చి మఱియుఁ దెమ్మని । గజిబిజి సేయుటయు సతియుఁ గలఁగక వికసన్నిజవదనయగుచు హా
స్యాం । బుజములు మొగిడించి పలుకు భూసురసూతిన్ ॥ ౧౭౫ ॥ శా ॥ అన్నం బొం
డొక లేదు చల్దియు దివిన్నధ్వశ్రమారూఢ తె । మ్మన్నం దెచ్చెద సాధుగుప్తములు నవ్యం
బుల్ కజ్జాయంబులుం । దెన్నేనన్న వి క్రొత్తయట్టికలఁ గాదే లేచి వార్పుండు వే । గన్ని
ర్మించెదఁ గూడుఁ గూర మఱియుం గ్రైకోలు మేల్భుక్తికిన్ ॥ ౧౭౬ ॥ ఉ ॥ నావినినా
తిఁ బలుకుఁ గుహనా వటువో వని తామతల్లి యో । పావనశీల తైలపరిపక్వము లెన్నియుఁ
దెమ్ము గాదనన్ । లేవడినైన భుక్తి గొని లేవ దిగంబడ దాఁక లింతయున్ । ధావనమాచ
రించుకతనన్ దడవున్ నిలఁ బోలదిచ్చటన్ ॥ ౧౭౭ ॥ మహాస్రగ్ధర ॥ అసినన్ వడ్డింపఁ
జొచ్చెన్ హరిణనయన నిండారు డెందంబుతో వే । గనభావి ప్రాణనాథాగ్రహసహమ
తితోఁ గమ్మనై కారమై నే । తనవండంబొల్చి చేసం దడవినఁ దుమురై తాలుటల్ లేక స
ద్యో । జనితంబుల్ వోలెఁ జాలం జవులొదవు సమచ్చండి కాపూపపఙ్క్తుల్ ॥ ౧౭౮ ॥
వ ॥ ఇట్లరుణాగ్రహణప్రవణపురుషోపధికృతంబులు ప్రాణవల్లభసమ్యగభిరక్షితం
బులు తదుపహితగణనావహంబులు నచ్ఛిద్రముద్రాముద్రితంబులునై సజ్జనవితరణం
బులగతి మహితభాజననిహితంబులు ననురక్తవధూహృదయంబులపగిది నతిస్నేహ

---

లోన్ — దాలియందు. అలపాలు — అవుపాలు. వేశము — శుభ్రముగ. వడువు — బ్రహ్మచారి. ఇవు
ర్వాంటకంబు — ఇగురవెట్టిన యన్నము ॥ ౧౭౪ ॥ గజిబిజి — తొందర. కలఁగక — కలఁతనొందక.
వికసత్ — వికాసముఁ బొందుచున్న ॥ ౧౭౫ ॥ పిండొక — కొంచెమైనను. అధ్వశ్రమారూఢ —
త్రోవనడచిన బడలిక పొచ్చినదానా. సాధుగుప్తములు — బాగుగా దాఁచఁబడినవి. నవ్యములు —
క్రొత్తవి. కజ్జాయములు — పిండివంటలు. ఎన్నేని — కావలసినన్ని. అట్టికలన్ — అటికలయందు.
కాదేని — అవి సరిపడనియెడ. వార్పుండు — చేయికడుగుకొని యాసనమున చేయుండుము. నిర్మించె
దన్ — చేసెదను. మఱియున్ — కూరల. క్రైకోలు — అంగీకారము. భుక్తికిన్ — భోజనమునకు ॥
౧౭౬ ॥ తైలపరిపక్వములు — నూనెతో వండినవి. ఎన్నియున్ — ఎన్నియున్నవో అన్నియును. కా
దనన్ — కాదు అనకు. లేవడి — దారిద్ర్యము — తక్కువ. దిగంబడదు — తగ్గదు. ఇంతయున్ —
కొంచెమయినను. ధావనమాచరించుకతనన్ — పరుగెత్తుటచేత ॥ ౧౭౭ ॥ నిండారు — నిండిన
న. భావిప్రాణనాథాగ్రహసహమతితోన్ — ఇప్పటి పెనిమిటికోపము నోర్చునట్టి బుద్ధితో. సేత
న — చేతితోనే. పొల్చి — ఒప్పి. తుమురై — పొడియై. తాలుటలు — మఱుఁగు పడుటలు. సద్యోజ
నితంబులు — అప్పుడు పుట్టినవి ॥ ౧౭౮ ॥ అరుణాగ్రహణప్రవణపురుషోపధికృతంబులు — ఎఱుపు
ను అనఁగా కోపమును పొందుటయందు ఆసక్తుఁడయిన పెనిమిటిచేత కపటముగా చేయఁబడినవి.
ప్రాణవల్లభసమ్యగభిరక్షితంబులు — పెనిమిటిచేత లెస్సగాఁ గాపాడఁబడినవి. తదుపహితగణ
నావహంబులు — అతనిచేత పెట్టఁబడిన లెక్కను పొందినవి. అచ్ఛిద్రముద్రాముద్రితంబులు — సందు
లేక వాసెనకట్టుచేత ముద్రవేయఁబడినవి. వితరణములగతిన్ — దానములవలె. మహితభాజనని
హితంబులు — గొప్పపాత్రమునందుంచఁబడినవి. అనురక్తవధూ — అనురాగముగల స్త్రీయొ

చ్ఛిలంబులు నుపవనంబులయు ననుసురభిష్ఠంబులు నైన పిష్టవికారంబులు నిర్వికా
రుఁడై భూసురకుమారుండు నిరవశేషంబుగా నాహరించియు వెండియు నవనతా
ననంబగు మిథ్యాలజ్జాభినయంబునఁ దనబహుభోక్తృత్వంబు నపశ్లోక కలుషితంబగు
ననివిశంకమానమానసుండు నుంబోతేఁగానఁదగు తాఁ బొట్టి నైట్టికసీలదిట్టపడుచుకడు
పునిండమి యెఱింగి తరంగితాద్భుతాంతరంగయై యాకురంగనయన యిట్లనివిత
ర్కించు ॥ ౧౭౯ ॥ క ॥ ఇసుమంతగాని లేఁడీ । పసిబాలుఁడు కూడుగూటిప్రియ
మువాఁడీ । దైసరిబహుభక్ష్యరాసులు । మెసఁగెడి విసువఁడు ప్రతుష్టి మేకొనఁడు
గదే ॥ ౧౮౦ ॥ ఉ ॥ మాయప్రవిష్ట యీశిసువు మానిసిపుట్టువుగాదు దేవతా । నా
యకుఁడో చతుర్ముఖుఁడొ నా భవబంధములూడ్ప నన్నునా । రాయణమూర్తియో
యెఱుఁగరాదొకయించుక యుక్ బుభుక్షపైఁ । జేయిదొ యంగఁడప్పములు సెల్లె సమస్త
మునందు నివ్వెఱక్ ॥ ౧౮౧ ॥ చ ॥ తలఁచు మనంబులోన వసుధామరయాజకధర్మ
పత్నిని । ర్మలకనకావదాతముఁ గరాళతరాలఘులీలమాలికో । జ్జ్వలముజగత్ప్ర
యాచరణసాక్షిముదక్షిమదంగభాగతా । తిలకితవిభ్రమంబగు సుదీర్ణమహత్త్వ
ముదివ్యతత్త్వముక్ ॥ ౧౮౨ ॥ క ॥ సతి యాగతిశ్రియమిచ్ఛే । ద్ధుతాశనాత్తనుట
యెఱిఁగి హుతవహునఖిలే । ప్సితవితరణగుణలీలా । చతురుం బ్రార్థింపఁదల్ప్ర
సాదనుకొనిమిక్ ॥ ౧౮౩ ॥ సీ ॥ ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగు లొకకొన్ని తె
ఁగులమొలుపుఁబప్పు । లొకకొన్ని దబ్బెడ లొకకొన్ని తాలింపు లొకకొన్ని విధము

---

కు. స్నేహపిచ్ఛిలంబులు—స్నేహముచేత పేరుకొన్నవి; నేయి పేరుకొన్నవి. ఉపధుక్—విధమున. సురభిష్ఠంబులు—మంచిపరిమళముకలవి. పిష్టవికారంబులు—పిండివంటలు. నిరవశేషంబుగాక్—మిగులులేకుండ. ఆహరించి—భక్షించి. అవనతాననంబు—వంచినమొగముగలది. మిథ్యాలజ్జాభినయంబునక్—అబద్ధపు సిగ్గును తోఁపించునట్టి చేష్టచేత. బహుభోక్తృత్వంబు—తిండిపోతుతనము. అపశ్లోకకలుషితంబు—అపకీర్తివలన కలఁతనొందింపఁబడినది—అపకీర్తినొందినది. విశంకమాన—మిక్కిలి సంశయించుచున్న. నైట్టికసీలదిట్టపడుచు—నైష్ఠికశీలుఁడైన భాగ్యముగల బాలునియొక్క. తరంగితాద్భుతాంతరంగ—అతిశయించిన యాశ్చర్యమునొందిన మనసుకలది. వితర్కించుక్—తనలోఁదానాలోచించెను ॥ ౧౭౯ ॥ ఇసుమంత—రవంత. ఎసరి—విజృంభించి. ప్రతుష్టి—తృప్తిని. మేకొనఁడు—పొందఁడు ॥ ౧౮౦ ॥ సిసువు—శిశువు. నివ్వెఱక్—నిండినయాశ్చర్యముతో ॥ ౧౮౧ ॥ నిర్మలకనకావదాతము—స్వచ్ఛమయిన బంగారమువంటిదియు, తెల్లనిదియు. కరాళతర—మిక్కిలియున్నతమైన. ముదక్షిమత్—సంతోషించిన కన్నులుగల. తిలకితవిభ్రమంబు—బొట్టుగలదిగాఁజేయఁబడినవిలాసముగలది. దివ్యతత్త్వముక్—అప్రాకృతమయినపరబ్రహ్మమును ॥ ౧౮౨ ॥ శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్—హుతాశనాత్—అగ్నిదేవునివలన. శ్రియమ్—సంపదను. ఇచ్ఛేత్—కోరవలసినది. హుతవహుక్—అగ్నిదేవుని. అఖి...తురుక్—అఖిల—సకలమైన. ఈప్సిత—కోరికలను. వితరణ—ఇచ్చునట్టి. గుణ—గుణముయొక్క. లీలా—వ్యాపారమునందు. చతురుక్—నేర్పుగలవానిని ॥ ౧౮౩ ॥ దబ్బెడలు—ఒకవిధమయిన భక్ష్య

చే । తివలిదిభుజియింపఁజాలదృష్టిమొదవెడిం । బదరంగాదిమ్ములను । రుచి
యింపదుశబరివిందుద్రోణదివిందన్ ॥ ౧౮౯ ॥ క ॥ అతిమానషమసిధారావ్రత
మగుమనవంటనిస్పృవంటిదిదియనన్ । బతిదేవతవై మననీ । గతిభావారూఢమయ్యెఁగా
జగములకున్ ॥ ౧౯౦ ॥ చ ॥ తనుశతకోటిజెత్తిబహుధవర్జవిసర్జింపఁబేర్మిగాంచి
నన్ । ననుఁగనలేనిలేఁతలకునాతియభోగ్యముభాగ్యమీవు ప్రా । గ్జననమునందొ
నర్చిచివాకానాకయర్చననన్నుఁగూర్చిదా । ననసనకూరెఁజున్ము సుజనవ్రజనందితచ
ర్యనీదెసన్ ॥ ౧౯౧ ॥ తే ॥ అటివతొల్లింటిపుట్టువునందునొకట । మానివేలిమిజ
న్నువై మన్నవాడు । నావధురవేణునాదంబునపదిగరఁగి । తొరఁగఁజేసితిసుస్నిగ్ధ
దుగ్ధరసము ॥ ౧౯౨ ॥ క ॥ ఆపాలనరువుపవన । వ్యాపారముచేతఁదొలివచ్చిని
లిచెలీ । లాపింఛచ్ఛవిభర్త్సిత । తాపింఛమదీయమౌళితటిఁగుచలికుచా ॥ ౧౯౩ ॥
క ॥ దానఁబయస్సంతానము । దానంబునన్నుఁదనువుదానవయతిచం । ద్రానతత్ప
లమునఁగా । దానికనుదక్కితిన్ మదనుమదిఁబొదలన్ ॥ ౧౯౪ ॥ ఆ ॥ ఒకడఁడ
కృతసత్క్రియుండనువిప్రుండు । గలఁడుఘోరనీతికలుషబుద్ధి । వసుధనెల్లఁదిరు
గువసుధానవనువేరి । పట్టణమునఁనందుఁబుట్టువడుగు ॥ ౧౯౫ ॥ సీ ॥ ధనవంతుఁ
డయ్యునుద్వాహంబుదొలఁగి మాతులునాకు పెఱవితంతువులఁదగిలి । కులవంతుఁ
డయ్యుఁబెద్దలఁబాసివిహరించుఁబాపండషండానుబంధియగుచు । మతిమంతుఁడయ్యు
నామ్నాయముల్ చెవిఁబెట్టఁడశ్లీలశైలన్యసనమెసఁగి । స్థితిమంతుఁడయ్యు లక్ష్మికిఁ
గాకత్రిమ్మరుపలుగూడు మరిగి యాఢ్యులఁభజించి । తలఁచు బ్రహ్మస్వ దేవస్వము
లమనెగ్గు । కుప్పఁజిచ్చిడిపేలాలుకొఱుకఁదివురు । గ్రహణకాలంబులందు మున్గఁడు
జలముల । నిబ్బచెంచడమాబ్రాహ్మణబ్రువుఁడు ॥ ౧౯౬ ॥ వ ॥ వాఁడొకకందు
వనొకవెలయాలికిఁజిక్కి మహీమండలకుండలంబగు పౌండరీకంబునఁ గొండొక
కాలంబుండి యొక్కపెనుఁబండువునఁగన్నులపండువగుమదీయనైవేద్యప్రకల్పనంబు
ధూపోత్సవానంతరంబున నెడముగాచి చూచి తనవలయుతెఱంగునం జనిబహువి

---

మనువు—బ్రతుకు ॥ ౧౯౦ ॥ లేఁతలు—అల్పులు. అభోగ్యము—అనుభవింపఁదగనిది. ప్రాగ్జనన
ము—పూర్వజన్మము ॥ ౧౯౧ ॥ వేలిమిజన్నువు—హోమధేనువు. మన్న—బ్రదికెన. సుస్నిగ్ధ—
మిక్కిలిచిక్కనైన ॥ ౧౯౨ ॥ లీలాపింఛచ్ఛవి—విలాసరూపమైన నెమలియీఁకలకుచ్ఛాయ
చేత. భర్త్సిత—తిరస్కరింపఁబడిన. తాపింఛ—చీఁకటిమ్రానుగలది ॥ ౧౯౩ ॥ పయస్సంతా
నముదానంబునన్ — పాలసమూహమునిచ్చుటచేత. పొదలన్—వర్ధిల్లఁగా ॥ ౧౯౪ ॥ ౧౯౫ ॥
ఉద్వాహంబు—పెండ్లి. వితంతువులన్—విధవలను. షండ — నపుంసకులతోడి. అనుబంధి—సం
బంధముగలవాఁడు. అశ్లీలశైలన—అసభ్యపుమాటలాడుటయందు. స్థితి—ఉనికి—కలిమి. ఆఢ్యు
లన్—ధనవంతులను. కుప్పన్—పెండ్లిదిబ్బయందు. తివురున్—యత్నించును. మున్గఁడు—స్నాన
ముచేయఁడు. నిబ్బచెంచడము—బెడ్డడేగ—బెడ్డడేగవలె ప్రాణిహింసచేయువాఁడు. బ్రాహ్మణ
బ్రువుండు—నీచబ్రాహ్మణుఁడు ॥ ౧౯౬ ॥ కందువన్—సమయమునందు. పెనుఁబండువునన్—

ధంబగు కాలంబుమని ముదిసితనువు విడిచి యుత్తమంబగు నగ్రహారవంశంబునం బుట్టి పుట్టిన నాటనుండియుఁ జనవుచదువుననచతురుండై నిందు ప్రాయంబునని మ్నంజెట్టవట్టించి యిట్లున్నవాఁడు వినుము ॥ ౧౯౭ ॥ తే ॥ తనుణి మద్భక్తదర్శ నోత్సవసుకృతము । పాపవహ్నికిసలిలమై భద్రమొసఁగెఁ । గాక లేకున్నసితఁడు ప్రాగ్జనినొనర్చు । కల్మషములకునిష్కృతిగలదెయెందు॥ ౧౯౮ ॥ వ ॥ అవ్విధంబు గసోపహారంబగు మదీయరూపంబు నాకిన్నికంబుగఁ గనుంగొనిభస్మసాత్కృతదు ష్కృతనీరసయవసరాశియై భూసురకేసరికిశోరంబై వాసివడసియు నతండుకట్టిఁ డినగుటకుఁగారణంబువినుము ॥ ౧౯౯ ॥ క ॥ నీభావశుద్ధియారయు। శోభనచా రిత్ర యేనుజువ్వేయతసికిఁ । లోభక్రోధములమనః। క్షోభముగావించిబాలిశుం డనిపింతుఁ ॥ ౨౦౦ ॥ క ॥ పతికొట్టినఁబతిదిట్టినఁ। బతినిదఁయుఁడగుచునెట్టిపా టుపఱిచినఁ । మతినన్యధాత్వమొందరు। పతిదేవతలతివనీకుఁబ్రతియగువారల్॥ ౨౦౧ ॥ తే ॥ నిష్ఠురత్వంబుతొలఁగించి నేటనుండి। నీకుననుకూలుఁడయ్యెడునీవిభుం డు । మత్పదద్వయభక్తిసమగ్రులైన। సుతులనేవురఁగాంచెదూర్జితవిభూతి॥ ౨౦౨ ॥ తే ॥ వెండిఁబైఁడిద్రవ్యశతంబుగా మేలి!కూడుఁబాఁడి యింటఁగొలఁదిమీర। నోము లెల్లనోఁదినూతేండ్లుబ్రదికినీ । భర్తతోడఁబరముపదముగను ॥ ౨౦౩॥ ఉ॥ మన్న నచేసి రాఁడుమురమదనుఁడంచునహంకరింపకో।కిన్నరకంఠి యిట్లయినఁగీడొదవుఁ వినుతొంటికన్నన । స్నన్నిహితాంతరంగవయి సత్యసమార్జవశుద్ధిలక్ష్మికిఁ । వన్ని యుఁపెట్టుమీమహితవర్తనకీర్తులునిర్వహించుచుఁ॥ ౨౦౪ ॥ క ॥ తృష్ణారహితులు మత్పద । నిష్ణాతులు నిత్యసత్య నిరతులు నగుశ్రీ। వైష్ణవులఁగాంచిననుఁగా। విష్ణు పదవలగ్నగారవించికొలువుమీ ॥ ౨౦౫ ॥ క । అనివరమిచ్చిన హీసుర । వనితఁ మన్నించిభక్తవత్సలుఁడగుఁగం। దననెలవునకుసుధారస । మునఁగుముదినిఁ దేర్చియ రుగుపూర్ణేందుఁడనఁ ॥ ౨౦౬ ॥ తే ॥ అటసుశీలమగఁడునరుదెంచినొకకొన్ని। దివసములకుదొరలఁదిరియునాస । గోసితనకులంబువాసియువన్నెయఁ । దలఁచు

---

గొప్పయుత్సవమునందు. చదురుఁడు—చతురుఁడు—నేర్పరి ॥ ౧౯౭ ॥ ప్రాగ్జనిఁ — పూర్వజన్మ మునందు. కల్మషము—పాపము. నిష్కృతి—ప్రాయశ్చిత్తము ॥ ౧౯౮ ॥ సోపహారంబు—నైవేద్య ములోఁగూడినది. భస్మసాత్కృత—బూడిదయైన. నీరసయవసరాశి—ఎండినగడ్డిప్రోవు. భూసు రకేసరికిశోరంబు—బ్రాహ్మణశ్రేష్ఠునిబిడ్డ. వాసి—ఘనత. కట్టిఁడి—కట్టుతప్పినవాఁడు — అక్రమ మైననడవడిగలవాఁడు ॥ ౧౯౯ ॥ బాలిశుండు—మూర్ఖుఁడు ॥ ౨౦౦ ॥ ౨౦౧ ॥ ఊర్జిత—ఎ న్నఁదగినదని ॥ ౨౦౨ ॥ ద్రవ్యశతంబు—అపరిమితము ॥ ౨౦౩ ॥ తొంటికన్నఁ—మునుప టికంటెను. సన్నిహితాంతరంగవు—నాయందుంచఁబడినమనసుగలదానవు. సమార్జవ—మం చిఋజుభావముయొక్క ॥ ౨౦౪ ॥ నిష్ణాతులు—నిష్ఠగలవారు. విష్ణుపదవలగ్న— ఆకాశమువంటి నడుముగలదానా— సూక్ష్మమైననడుముగలదానా ॥ ౨౦౫ ॥ కుముదినిఁ—కలువతీఁగను. పూ ర్ణేందుఁడు—నిండుచంద్రుఁడు ॥ ౨౦౬ ॥ తిరియు—యాచించు. గోసి—సఱకి—విడిచి ॥ ౨౦౭॥

కోనుచుఁ దెలివి మొలకలెత్త ॥ ౨౦౭ ॥ తే ॥ అతనిఁ దవసొమ్ము చేసి మున్నాఁగియున్న। మోహముఖులైన జ్ఞాతులమూలఁ ద్రోచి। సంహృతాసురులైన నిర్జరులకరణి। మది వివేకాదివర్గ మభ్యుదయమయ్యె ॥ ౨౦౮ ॥ క ॥ కోపంబు నాఁగి మిక్కిలి। పాపమునకుఁ లోఁగి బుద్ధి పశ్చాత్తాపా। టోపశిఖిఁ గ్రాఁగి కరుణా। దీపవతీలహరిఁ దోఁగి విప్రుఁడు మఱియున్ ॥ ౨౦౯ ॥ సీ ॥ కాలిచ పడ నిండ్లకడకేగి వనరుచుండెడువాఁడు వైరాగ్యనిష్ఠుఁడయ్యెఁ। గయ్యాలక్రచ్చనై కాలుద్రవ్వుచు సదా మండువాఁడతిశాంతిమహితుఁడయ్యె। గసరి యెంగిలిచేతఁ గాకి వేయనివాఁడు సతతాన్నదానప్రశస్తుఁ డయ్యె। బ్రహ్మకల్పను దాఁక బ్రతుకఁ గాసఁగడకట్టువాఁడస్థిరముగ విశ్వముఁ దలంచెఁ। చాటిగాఁ గోనకాపద్మభవుని నైన। నీరసము సేయువాఁడు వినీతుఁ డయ్యె। నారులలచ్చికి ముచ్చిరియుడుకువాఁడు। సర్వసముఁ డయ్యె విష్ణుప్రసాదమహిమ ॥ ౨౧౦ ॥ ఉ ॥ పాళము మీరు పెద్ద పెద పాళములై బలితంపుఁ గాఁగులన్। మూలుగుచున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థులకిచ్చు విష్ణుదే। వాలయసుప్రతిష్ఠలకునై యొసఁగున్ సతికేలనించునా। నాలఘుకర్మనిర్మితికి నగ్రకులేంద్రుఁడనుగ్రహంబునన్ ॥ ౨౧౧ ॥ క ॥ ఆయాలు మగలు విష్ణుప। రాయణులై పెక్కుగతుల వ్రతములు తఱితోఁ। జేయుచునుండఁగ నటని। శ్శ్రేయసపదమైన పౌండరీకక్షోణిన్ ॥ ౨౧౨ ॥ మ ॥ యమరాడ్దూతశిఖావతంసము చిరప్రాణంబు దూరప్రియా। గమశంసిస్ఫుటకాకలీకలన మేకప్రక్రియాపాతదీ। క్షము శీతర్తుబలీయ మొక్క బలిభుగ్రాజంబు రాజిల్లు శ్రీ। రమణాగారపురోద్ధరోత్థ చలపత్రస్థూలశాఖాశిఖన్ ॥ ౨౧౩ ॥ శా ॥ తాతల్దండ్రులు మామ లల్లురునుము

---

ఆఁగి—అక్రమించి. మోహముఖులు—మోహుఁడు మొదలగువారు — మోహము మదము మొదలగునవి. జ్ఞాతులన్—దాయాదులను—తనలోని శత్రువులను. సంహృతాసురులు—చంపఁబడిన రాక్షసులుగలవారు. అభ్యుదయమయ్యెన్—వృద్ధిపొందెను ॥ ౨౦౮ ॥ అఁగి—అణఁచి. లోఁగి—వెనుదీసి. కరుణాదీపవతీలహరిన్—దయయనెడి నదీప్రవాహమునందు. తోఁగి—మునిఁగి ॥ ౨౦౯ ॥ కాచపడన్—చచ్చిపోనిపోఁగా. వనరు—దేవురించు. కయ్యాలక్రచ్చ—జగడగొండి. కాలుద్రవ్వుచున్—కలహమునకు యత్నించుచు. మండువాఁడు—కోపవికారమును జూపునట్టి వాఁడు. కసరి—కోపించి. కడకట్టు—నిర్ణయించు. చాటిగాన్—లక్ష్యముగా. ముచ్చిరి—దుఃఖపడి. ఉడుకు—తపించు ॥ ౨౧౦ ॥ పాళము—మేర; శక్తి. బలితంపుఁగాఁగులన్—మిక్కిలి పెద్దవైన బానయందు. మూలుగుచున్న—స్థిరముగా కదలకయున్న. ప్రాఁబసిఁడి—బహుదినములనాటి ధనము. నిర్మితికిన్—చేయుటకు ॥ ౨౧౧ ॥ నిశ్శ్రేయసపదము—మోక్షస్థానము ॥ ౨౧౨ ॥ చిరప్రాణము—బహుకాలము బ్రదికియుండునది. దూర...శంసి—దూర—దూరమునందలి. ప్రియ—ఇష్టవస్తువుయొక్క. ఆగమ—రాకను. శంసి—కోరునది. స్ఫుటకాకలీకలనము—స్ఫుట—స్పష్టముగా వినఁబడెడి. కాకలీ—సన్ననికంఠస్వరముతోడ. కలనము—కూడినది. ఏకప్రక్రియాపాతదీక్షము—ఏకవిధమైన పాటునందలి దీక్ష (నియమము) గలది. బలిభుగ్రాజము—శ్రేష్ఠమయిన కాకి. శ్రీరమణా...శిఖన్—శ్రీవిష్ణుదేవుని గుడికెదుట మొలచి పెరిగిన రావిచెట్టుయొక్క లావైన కొమ్మకొనయందు ॥ ౨౧౩ ॥ సహా

త్రాతల్ సహాయుల్ సహ । శ్రోత్రల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్రుల్ పు
త్రులోలిందివా । భీతాభీతములై తనుంగొలువఁగాఁ బెన్మ్రాఁకు వాయస ।
వ్రాతశ్రేష్ఠము గ్రాలు రేలు వగలున్ భ్రాంతాగమాంతంబునన్ ॥ ౨౧౪ ॥ చ ॥ అవి
యొకనాఁడు విట్ఠలగృహాంగణభూబలిపీఠవర్తులై । మెదుకులు మేయఁ గన్గొని యు
మేయగతిన్ బలువన్ దదాఖ్యత । చ్ఛదభవభూరి మాయకవశంబున నయ్యెడభూరి
వేవన । ఘ్యుదితములయ్యె వానగుడియూర్చినఁ గల్గునగణ్యపుణ్యముల్ ॥ ౨౧౫ ॥ వ ॥
ఇట్లు తరిక్రతోపన్నంబగు సన్నగళాయన సదనసమ్మార్జన సముదితసుకృత పరిపా
కంబునఁ గాకంబు నతిలోకంబయ్యె వినుము ॥ ౨౧౬ ॥ క ॥ కలహంసము కట్టి
యదుకుల । కలహంసము గుడిఁ జరించుఁ గుసుమాయుధకీ । ర్తిలతాంగుచ్ఛము క్రేవ
డి । జలరుహసంభవమరాళసంకాశగతిన్ ॥ ౨౧౭ ॥ వ ॥ ఇట్లు వర్తించి వర్తించి ॥ ౨౧౮ ॥
మ ॥ కుతుకంబింకకకుంకుమద్రవమిళద్గోరోచనాపంకని । ర్మితపత్త్రాంకకలంకితాం
బుధికుమారీహారిపక్షోరుహ । ద్వితయాస్ఫాలనలాలనోదితపయోవిస్ఫారకాసా
రసం । తతినానీడభవంబు క్రీడసలుపున్ దద్దివ్యధామంబునన్ ॥ ౨౧౯ ॥ సీ ॥
మొనరెండుగాఁగఁ ద్రెవ్విన విద్రుమద్రుకందము నేలు ముక్కునఁ దడవి తడవి । మొగ
విచ్చు పసిఁడి గేదఁగి ఱేకు గమి మించు విశదచ్ఛదములను విద్రిచి విద్రిచి । నగు మొగంబు
లదాసనపుఁ గ్రొవ్విరులనవ్వ చిగురాకు నడుగులఁ జిమ్మి చిమ్మి । నిద్దంపుఁ బండు వెన్నెల
గుత్తి కడకొత్తిమలయు మైముంపులఁ గెలఁకి కలఁచి । శార్ఙ్గి సౌధప్రఘాణకాసారసార
సారసామోదమేదురవారిఁ దేలి । వల్లియాయంచ కుక్షిలో నుజ్జ్వలాకర । నాఁడు ప
వలింటి బిఱ్ఱెండ వేఁడిఁ దలఁకి ॥ ౨౨౦ ॥ క ॥ అవితనదేహంబచ్చట । విదలింపఁబడ

---

శ్రోత్రలు — తనతోడివారికి గలవారు. దివాభీతాభీతములు — గ్రుడ్లగూబవలని భయము లేనివి. భ్రాంతాగమ — రావిచెట్టుయొక్క ॥ ౨౧౪ ॥ బలిపీఠవర్తులు — బలిపీఠమునందుండునవి. అమేయ — కొలఁదిపెట్టరాని. ఛద — ఱెక్కలవలన ॥ ౨౧౫ ॥ తరిక్రతోపన్నంబు — ఊహింపరానివిధము సఁగలినది. సమ్మార్జన సముదిత — ఊడ్చుటవలనఁ బుట్టిన. అతిలోకంబు — లోకాతీతము ॥ ౨౧౬ ॥ కలహంసము — ఉత్తమజాతిహంస; శ్రేష్ఠుఁడు. సంకాశ — పోలిన ॥ ౨౧౭ ॥ ౨౧౮ ॥ ఇంకక — తగ్గక. పత్త్రాంక — మకరికాపత్త్రచిహ్నములచేత. కలంకిత — కళంకముగాఁ జేయఁబడిన. హారి — మనోజ్ఞమైన. ఆస్ఫాలన — చఱచుటలచేత. పయోవిస్ఫార — జలములచేత అతిశయించిన. నీడభవంబు — పక్షి. తద్దివ్యధామంబునన్ — ఆదేవాలయమునందు. త్రెవ్విన — తెగిన. కందమున్ — గడ్డను. మొగవిచ్చు — ముఖభాగము విరియునట్టి. విశద — స్వచ్ఛమైన. విద్రిచి — విదలించి. నిద్దంపు — నునుపైన - శీతలమైన. మలయు — విజృంభించు. ముంపులన్ — ముంచుటలచేత. ప్రఘాణ — మొగసాలయందలి. సారసామోదమేదురవారిన్ — తామరల వాసనవలన నతిశయించిన జలమునందు. పవలింటి — పగటివేళయందలి. బీఱెండ — మిక్కుటమయినయెండ. తలఁకి — భయపడి ॥ ౨౨౦ ॥ విప్రుషములచేన్ — తుంపరలచేత. చాదుకు — తడి. పాదకట్టు — కలుగఁజేయునట్టి రజో

సలిలవిప్రుషములచేఁ। జొదుకొదవించుచుగాడ్పులు। పొదవెట్టురజోవికారములు
దూరముగన్ ॥ ౨౨౧ ॥ తే ॥ సలిలఖగమున కేతదాచరణమునన। కలిగె నాకస్మి
కంబుగఁగంబుపాణి। గర్భగేహోపలేపసంస్కారసార। సుకృతపరిపాకనిర
పాయశోభనంబు ॥ ౨౨౨ ॥ క ॥ శుకమొకటి వంచుజితకిం। శుకమై హరిహయ
శరాసనరుచిరవపురం। శుకమై కుసుమాకరకిం। శుకమానందమున నందనుఁడుగు
డిఁ జెరుగన్ ॥ ౨౨౩ ॥ చ ॥ అలమిత్రిలోకముల్ గెలుచునత్తఱి తేరువహించుదోఁషి
చి। లఱుబదగద్రొట్టిసుందరికిలాగకయుండినఁదానతద్ధురం। బెలమివహింపమెచ్చి
మనుఁడిచ్చుమణీమయమాలికాత్రయిన్। గళమునఁదాల్చి చిత్రశుకనాథుఁడు రేఖలపే
రనిచ్చుటన్ ॥ ౨౨౪ ॥ క ॥ కీరమదియొక్కహరిపురి। చారికచేరికవసించుఁజదివింపఁగ మే।
పారసియొసఁగభవనహూ। ఙ్గారాదులవలనఁదన్నుసంరక్షింపన్ ॥ ౨౨౫ ॥ క ॥
దేవాలయమునఁగొన్నిని। జావాసమునందుఁగొన్నియహములుదగఁబై। చేవదలక
పాటించుచుఁ। బూవుఁబలెఁ బువ్వుబోఁడివులుఁగుఁబ్రోచున్ ॥ ౨౨౬ ॥ మ ॥ పసు
పొర్చుందడియొత్తు నెండసెకఁగంపంబాఁగిమైఁగుప్పుచున్। వసయున్ వెన్నయుమేపు
మేపునొసఁగున్ వల్లించుశ్రీరామనా। మసుధామాధురిసాధురీతి కుచకుంభస్థాయి
గాఁజేయుచున్। బిసపుష్పప్రియవాస రాగములన్ బింబోష్ఠి రాచిలుకన్ ॥
౨౨౭ ॥ తే ॥ కనకమణిపంజరంబుల నునిచియుంచి। చక్కెరయు నుక్కెరయు
సాక్రైగుకిక్రకికి। మొలఫుఁబలుకులుపలుమాఱుగఁబికబవి। కలికి చిలుకలకొకకి
రాచిలుకఁబెనుచు ॥ ౨౨౮ ॥ మ ॥ కలహంసోపమయాన చక్రకుచ ప్రేంఖత్ఖంజరీ
టాంబకిఁగో। కిలసారస్వరబర్హిబర్హచికురం గీరప్రియాలాపఁదో। య్యాలిఁజాలన్
మరిగెన్ శుకంబదిమహీయః ప్రేమగావించుచున్। బులుఁగుంబొందునఁనందిపొందిఁ
నగతిన్ బొత్రోత్తులన్ హత్తుచున్ ॥ ౨౨౯ ॥ తే ॥ ఆశుకద్విజరాజునకంతఁగొంత।
కాలమరుగంగ నాకనాడుఁకలిగెబంధ। మోక్షమాకస్మికంబనిమ్మత్తికలేమి। యా
శుకద్విజరాజున కద్భుతంబె ॥ ౨౩౦ ॥ సీ ॥ జనియించెనొక్కపచ్చవిమొలక యు

---

వికారములు—దుమ్ముయొక్క ప్రసరించుటలు ॥ ౨౨౧ ॥ ఉపలేపసంస్కార—అలుకుటవలని. సార—శ్రేష్ఠమైన. నిరపాయ—చెడని. శోభనంబు—శుభము ॥ ౨౨౨ ॥ వంచుజితకింశుకము—ముక్కచేగెలువఁబడిన మోదుగుమొగ్గగలది. అంశుకము—కాంతులుకలది. కుసుమాకర—వసంతఋతువునందలి ॥ ౨౨౩ ॥ అలమి—ఆక్రమించి. దగ—దాహము—దప్పి. తొట్టి—కలిగి ॥ ౨౨౪ ॥ ౨౨౫ ॥ అహములు—దినములు ॥ ౨౨౬ ॥ పసుపొర్చుట—పసుపుపూసి స్నానముచేయించుట. సెక—తాపముచేత. బిసపుష్పప్రియవాసరాగములన్—గ్రీష్మఋతుదినముల రాకలయందు ॥ ౨౨౭ ॥ ౨౨౮ ॥ ప్రేంఖత్—ఎగురుచున్న. ఖంజరీటాక్షి—కాటుకపిట్టలవంటి కన్నులుగలది. చికుర—ముంగురులుగలది. మహీయః—అధికమయిన. పొత్రోత్తులన్—పొత్తిగుడ్డలచే ఒత్తుటలచేత ॥ ౨౨౯ ॥ శుకద్విజరాజునకున్—చిలుకపక్షిశ్రేష్ఠమునకు. శుకుఁడనెడి బ్రాహ్మణశ్రేష్ఠునకు ॥ ౨౩౦ ॥ కామరు—మనోజ్ఞమగు. పొడకట్టెన్—కనఁబడెను. ఇంద్రశిలల—నీలమణుల

నుబుద్ధిఁ గుచ్చినపచ్చలకొనరుచులన । సమకూరెనోకొ దాడిమఫలోద్భ బీజము
తిపద్మరాగసామగ్రివలనఁ । బొడకట్టెనొకొ జంబూఫలంబనుమనోభ్రమ మిం
ద్రనీలవిభ్రమమువలనఁ । దోఁతెంచెనొకొ మధూకపుష్పములను నాసహుర్ముం
జిముత్యములవలన । దాదియటుపెట్టి పసుపాడఁదలఁగిచనుడు । బరణిమూఁకుట
నెలకొన్నబన్నసరము । గఱచికొనిపోయెఁజిలుక ప్రగల్భవిటుఁడు । బాలికామా
ననముగొనుపగిదినపుడు ॥ ౨౩౧ ॥ క ॥ బారాదిసౌమ్ముఖుఁడఁగ । హారమునేకొ
నుచుఁజనియె నండజముప్రియుం । బారయఫలకాముకులగు । వారిలుగుణవస్త్రిస
క్తివదలవిడుతురే ॥ ౨౩౨ ॥ క ॥ ఆధవళకిరణముఖికిన । సాధుశుకాచరణమపుడస
హ్యాంబయ్యెక్ । గోధుక్ప్రతిసతికిన్ । బాధకమగుకృష్ణధూర్తబాల్యముఁబో
లెక్ ॥ ౨౩౩ ॥ మ ॥ కటిఁజేలాగ్రముపట్టిచిక్కినదిమేనంబుట్టిపాలిండ్లమీఁదటసం
ధించునార్ద్రిదేహలతమాద్యద్వర్షధారావల । త్తటిదాకారముఁజూపఁద్రోసికొ
నుచుక్ధమ్మిల్లబంధంబుముం । గిటికిక్ సుస్తనితచ్ఛైగోస్తనహరత్కీరగ్రహవ్యగ్ర
న్నై ॥ ౨౩౪ ॥ తే ॥ వర్షధారావశేషాన్వవాయయుక్తి । వాయువశమునఁదెగలు
ముఖ్వన్నెవిల్లు । వేడలవెన్నాడుశశివోలెవెలఁదిచాపలమునసరమాహరించుశుకము
దవులును ॥ ౨౩౫ ॥ మ ॥ గుహమాతృస్ఫటికాకుసూత్రమసితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛ
టా । స్పృహఁ గైకొన్నశుకంబొయేమఱుటచేక్ జీరాడుపూవాఁగితో । బహిరు
డ్డీనతనొడ్డివిల్చురతిరాట్పట్టాశ్వమొనాఁగన । మృహిళావిభ్రమకీరమొప్పను ముఖసీ
మాంగామిముక్తాళినై ॥ ౨౩౬ ॥ వ ॥ ఈచందంబునఁగందర్పస్యందనంబువినిందితుం

---

యొక్క. తోఁతెంచెను—తోఁచెను. హుర్మ్యంజి—ఒకానొకదేశము. తలఁగి—తొలఁగి. మూఁకుటన్—మూఁతయందు. నెలకొన్న—ఉన్న. బన్నసరము—రత్నములహారము. ప్రగల్భ—నేర్పరియైన ॥ ౨౩౧ ॥ బారాది—అనేకములైన ॥ ౨౩౨ ॥ ధవళకిరణముఖి—చంద్రునివంటిమొగముగలది. సాధు—చెడ్డ. ఆచరణము—పని. గోధుక్ప్రతిసతికిన్—గోపికాస్త్రీకి ॥ ౨౩౩ ॥ కటిన్—నడుమునందు. చేలాగ్రము—సగముకొక. ఆర్ద్రదేహలత—తడిసినతీఁగవంటిదేహము. మాద్యద్వర్షధారావలత్తటిదాకారమున్—కట్టుఁడయినవానచినుకులచేతచుట్టఁబడినమెఱుపుయొక్క ఆకారమును. ధమ్మిల్లబంధంబు—కొప్పుముడి. ముంగిటికిన్—ఇంటిమొగసాలకు. గోస్తన...వ్యగ్ర—గోస్తన—రత్నములహారమును. హరత్—ఎత్తుకొనిపోవుచున్న. కీర—చిలుకయొ. గ్రహ—పట్టుటయందు. వ్యగ్ర—త్వరగలది ॥ ౨౩౪ ॥ అవశేష—మిగిలిన. అన్వయయుక్తిన్—సమూహముయొక్కకూడికచేత. తెగలు—బయలువెడలు. ముఖ్వన్నెవిల్లు—ఇంద్రధనుస్సును. వెన్నాడు—వెంబడించు. తవులుచున్—వెంబడించుచు ॥ ౨౩౫ ॥ గుహమాతృ—పార్వతియొక్క. సితేక్షుచ్ఛేదగుచ్ఛస్ఫటాస్పృహాక్—తెల్లచెఱకుతునుకలగుచెలమొక్క సమూహమునందలి యపేక్షచేత. బహిరుడ్డీనతన్—బయట ఎగురునట్టి స్వభావముతో. ఒడ్డి—అడ్డగించి. రతిరాట్పట్టాశ్వము—మన్మథునిపట్టపుగుఱ్ఱము. ఆ మృహిళావిభ్రమకీరము—ఆ యాఁడుశారివినోదపుఁజిలుక. ముఖసీమాగామి. ముక్తాళి—ముక్కునందుతగులుకొన్న ముత్యాల సరముగలది ॥ ౨౩౬ ॥ కందర్పస్యందనంబు—చిలుక. విసిందితు

డన మందమందప్రచారంబును మలిమ్లుచుండన దుర్గమప్రవేశనిపుణంబును నవివేకి
యన శిథిలీకృత స్వపక్షంబును దనుజగృహీతజనకజయన రామానుసరణ సముచి
తంబునునై యున్మత్తుపాలికం జంచుచుంబితలలంతికావ్యాజంబున లాలగ్రక్కుచుం
బుష్పవద్బింబంబు విధంబున శరీరప్రభాదంభంబుననంభోధరంబులచేఁ గప్పంబ
డుచు యోగిబాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబున పాశచ్ఛేదంబు సేయుచుం బ
రవధూపయోధరంబుపగిదిఁ బట్టరాక నీతివిదుహృదయంబుగతి దూరదర్శనయోగ్యం
బై కరువలిమురుపునం బొడమి యడంగుచుఁ బరబ్రహ్మంబుచాడ్పున నగోచరంబ
య్యును దదీయమాయావిలసితంబునునై సకలంబును నిజప్రతిభాసంబున యాథా
ర్థ్యభూమికి నభినయించుచు శశాంకశిలా సౌధవిటంకంబుల నునుకువఁ గొన్నతఱిశ
రన్నీరదపరిశంవదంబగు శునాసీరశిలాశకలంబన మెలంగుచు నంతరిక్షమహాప్లక్షం
బునకు నశ్వేతచంచుపుటప్రవాళఖండ ప్రభాహిండనంబునం దొరలి సఫలవిట
పలక్ష్మి నాపహించుచుఁ బ్రమాదవిగళితంబగు నగవిరోధికోలువు వీవనయుచ్చరల
పచ్చల కడియంబు వడువున నిరాలంబనస్థలంబునం బఱుమఱు చక్రచంక్రమణ చమ
త్కారంబు సూపుచు సమీపారామశ్యామల పలాశపటల గర్భంబునందు ముకుంద
విగ్రహంబునందు భక్తిసమగ్రుండగు పురుషశ్రేష్ఠుండునుంబోలె నేర్పడరాక డిందు
చుండం దజ్జాతిపుంగవులు వినుజగంధధురంధరంబగుటను జగడంబు విగిచినం గినిసి

---

డు — మిక్కిలి నిందింపఁబడినవాఁడు. మలిమ్లుచుండు — దొంగ. దుర్గమ — పోనువల్లపడనితావు. శిథిలీకృత — సడలింపఁబడిన. స్వపక్షంబు — తన ఱెక్కలుగలది; తనవారుగలది. రామానుసరణ — స్త్రీయొక్క అనుసరించుటకు; శ్రీరాముని ననుసరించుటకు. లలంతికా — హారము. లాల — చొంగ. పుష్పవద్బింబంబు — సూర్యచంద్రమండలము. బాగునన్ — విధమున. విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబునన్ — తెగిన కాలిగొలుసుల కారణముచేత; కట్టివేసిన కాలిగొలుసులు వీడిపోయినందున. పాశచ్ఛేదంబు — త్రాటిని త్రెంచుట; ఆశలను త్రెంచుట. పయోధరము — స్తనము. దూరదర్శనయోగ్యంబు — దూరమునందుండి చూచుటకుఁ దగినది; దీర్ఘాలోచన చేయుటకుఁ దగినది. కరువలిమురుపునన్ — గాలిరీతిని. పొడమి — పుట్టి. చాడ్పునన్ — విధమున. అగోచరము — కానరానిది; ఇంద్రియములకు విషయము కానిది. మాయ — మోసము; ప్రకృతి. ప్రతిభాసము — [illegible] తోఁపిక. భూమిక — వేషము. విటంకంబులన్ — ముంజూరుసందిలిగూండ్లయందు. ఉనుకున — ఉనికి. శరన్నీరదపరిశంవదంబు — శరత్కాలమేఘము నందణఁగినది. శునాసీరశిలాశకలంబు — ఇంద్రనీలమణిఖండము. ప్లక్షంబునకున్ — జువ్విచెట్టునకు. అశ్వేతచంచుపుటప్రవాళఖండప్రభాహిండనంబునన్ — తెల్లఁబాటులేని ముక్కుపుటము అనెడి పగడపుపలుకు కాంతియొక్క వ్యాపనముతోడ. దొరలిన — కలసిన. ఫలవిటపలక్ష్మిన్ — పండ్లతోడికొమ్మకలిమిని. విగళితంబు — జాఱినది. నగవిరోధి — ఇంద్రుని. వీవన — విసనకఱ్ఱలుగల. వడువునన్ — విధమున. నిరాలంబన — నిలువ నాధారములేని. చంక్రమణ — దాఁటుపట్టి. శ్యామలపలాశపటలగర్భంబునందున్ — నలుపుతేలుచున్న పచ్చనియాకుల జొంపముయొక్క లోపలిభాగమునందు. డిందుచున్ — అణఁగుచు. అండంది —

విస్ఫురత్తనూరుహదంతుర కపోలాంతరంబును విఘూర్ణనపక్ష్మళవీక్షణంబునై తు
ణంబు మణివలయ వలయితంబగు రతియువతిముంజేతి రీతిం జెలువడరు మెడనిగిడించి
మగుడం బడి కాకుప్రకార వికారస్వరంబుగ వానిని రాకరించుచుం బలుచనప్పఱమ్మంజి
లుకం గరంగినయది వోలె నన్న్యాన్న వెన్నాడం బెన్నాటకంబై బోటికత్తియ లుత్సంగ
కుచోత్సంగ సంగతకురంగలాంఛన కళావలోకనంబున మునిముసినగవులు నెఱ
యు గోరువంక గాన వచ్చెంగాని కీరంబు మూరంబన్యోంగదే యని గర్భోక్తి వైదర్భిం
గూడి యాడుచుం బాడుచు పంజరంబును జిలుక చాలు తెరయును చేరికఁ జేసి యెలయిం
పక యించుచు నడితెక్కెక్కిరింతించుచు నొక్కెడ నెండగాలు వాడిచి ముక్కునన
కెంపుతమ్మితరళంబు నొక్కెడ ముంజికెంపుం జికెంపు నిక్కడ నిక్కడ నక్కెడ యుక్కడ గనిచేటి
కానికరంబు పోలసిన పులుంగెటింగి మెఱుంగు మెఱసి తోలంగిన తెఱంగున డా
యవచ్చినట్టుల మాయాంబగు మాయలేటి పాటిం బోవంబోవ దూరంబగుచునుండు
నెడ మూవుల మాడిక్ దివియనచ్చట నటించి మువ్వాలోనిరాయి సోయగంబున నొ
కింత వడివట్టు వడటింపచరించి ప్రచురరయంబున ఖచరపుర ప్రాసాదంబులు మో
వంబూంవున నెగసితిరిగి పెఱ తెరువునం బఱతెంచి పాండురంగాయతనంబు మధ్యరం
గంబు చొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చనుండు దండియంబు పైప్రవాల నిచ్చట ॥
౨౩౭ ॥ సీ ॥ మదఘూర్ణ దురుసంకుమదమలీమసకుచ ద్వీపము మోహార్ధతింగొనఁ
దీంగనలియ । ఘనసారపుండ్రకగ్లాని బనికట ఘర్మహిమాప్తి మోముదామర చ
లింప । నాసికానూత్న గంధఫలియూరుపుం దావి నధరదంతపదవత్త్రాళివిరియఁ ।
కింకిణీక్వణనశంకిత గర్జితస్రస్తకాంచిచంచలగతి యంచజడియ । బంధనిర్ముక్తశుక
సక్తభావయగుచు । నలపరాశరసుతు చంద మధిగమించు । మించు ననంబోఁడిచం
దంబు మేలుకనిన । వాఁడు తలపోయుఁ గలలోని వార్తయవ్వ ॥ ౨౩౮ ॥ తే ॥ కక్కు-

---

మణిమణి. విస్ఫురత్తనూరుహదంతురకపోలాంతరంబు — ప్రసరించుస్వభావముగల (నిక్కుచున్న) మేనిపెంద్రుకలచేత మిట్టపల్లములగునట్టి చెక్కిటిప్రదేశము గలది. విఘూర్ణన — తిరుగుపడుచున్న. చెలువడరు — అందగించు. పలుచ — పలువ — చెడ్డ. అన్ను — స్త్రీ. వెన్నాడఁ — వెంబడింపఁగా. పెన్నాటకంబు — పెద్దయాట. ఉత్సంగ — మీఁదిభాగమునందు. గోరువంక — ఒకపక్షి; నఖశశము. గర్భోక్తివైదర్భిఁ — అర్థాంతరముతోఁ జెప్పినట్టిమాటలరీతిని. ఎలయింపక — దగ్గఱకురప్పింప. తరళంబు — నాయకమణి. పులుంగు — జాతి. పాటిక — విధమున. దివియక — తీయ మువ్వ — పెద్దగజ్జె. సోయగంబునక — విధమున. పచరించి — నటించి. ప్రచుర — అధికమయిన. మోవక — తాఁకునట్లు. వూంపునక — పూనికతో. ఆయతన — దేవళము ॥ ౨౩౭ ॥ ఘూర్ణత్ — తిరుగుడుపడుచున్న. మలీమస — మాసిన. నలియక — చలింపఁగా. పుండ్రక — బొట్టుచేసి. గ్లాని — చంద్రబింబమునకు. గంధఫలి — సంపెఁగ. దంతపద — పలునొక్కు. స్రస్త — జాఱిన. జడియక — బెదరఁగా. శుకసక్త — చిలుకయందుండుటచే, శుకునియందుంచిన. అధిగమించు — పొందు ॥

సపువంకఁ గోరులఁ ద్రొక్కి త్రొక్కి । కలకుమురువ నసందందగ బికలబి । పూసయొ
కటియుఁ బోఁగునఁ బొందనీక । చెరిపెను త్యాలపేరు విచ్చికపుఁ బులుఁగు ॥ ౨౩౯ ॥
క ॥ బహువిధరచనోజ్జ్వలమగు । మహిళామణిమణిసరంబు మణులన్నియున । య్యా
హితయను సదనశరధికి । నహీనరత్నాకరత్వము ననుసంధించెన్ ॥ ౨౪౦ ॥ క ॥ శుకమున
కొఁదవెనయత్న । ప్రకటితమణిరంగవల్లిపరికల్పనకో । రకితసుకృతానుకృతి దా । ని
కి మెచ్చెన్ బౌండరీకనిలయుం డాత్మన్ ॥ ౨౪౧ ॥ క ॥ గిరికానుషక్తబుద్ధిను । పరిచ
రునిం బోలు నొక్క పన్నగమొకనా । డురవడి నెచ్చట నుండియొ । మురవైర్ద ను దివ్యభ
వనమునకే తెంచెన్ ॥ ౨౪౨ ॥ వ ॥ ఆసమయంబున ॥ ౨౪౩ ॥ క ॥ యమదండచం
డమగు భుజ । గమునకు వెలవెలఁబియ్యాఖుకన్యకకమలా । రమణాంఘ్రిఁ జేరెగురుభీ ।
తమతికి నామక్తమాల్యదను నైనయుగుచున్ ॥ ౨౪౪ ॥ క ॥ హరిపదపీఠస్థితిగల । స
రియను చిట్టెలుక దాఁగె సంవర్తహతిన్ । దెరలిమ్మ్యకందూర్ధ్వ నృఁడా । తురతం దజ్జఠరపే
టిఁ దూఱినభాతిన్ ॥ ౨౪౫ ॥ ఆ ॥ వీడిపడినగాజు వెదకంగ వెదకంగఁ । బద్మరాగ
మొదవువగిది నహిక్రి । దొరకె నెలుకనూఱితొలఁగిన తెఱెరమూ । కమనచరణకైతక
ప్రసవము ॥ ౨౪౬ ॥ చ ॥ చరణసరోరుహప్రసవశైవలినీనివసద్విసాంకురా । హ
రణ వసీమఁ జేరిన బిసాశనశాబము నాఁగ బొల్చు సా । గరశయపూజనాచరణకైత
కకోరకమున్ భజించెమ । తక్కరవరకంకణంబు మిహికాఘృణి రాహువుగప్పనొప్ప
నన్ ॥ ౨౪౭ ॥ తే ॥ మధురమదిరారసామోదమైత్రినలరు । పొలఁతినెమ్మోము వ
లపానుభోగిఁ బోలె । హరిపదాబ్జమధూళిమయంబుఁ గ్రోలె । జాతిగేవంగి తా విభు
జంగభర్త ॥ ౨౪౮ ॥ క ॥ అలరునలరు చిరమతుర్రం । డలముపయిన్ నిలిపె సవ్యన
ఖరపదముపై । నలరునిజకంటకక్షత । విలసనమును విటుని మేనవేశ్యయుఁబోలెన్ ॥
౨౪౯ ॥ సీ ॥ సరసిజాక్షకల్యాణసమయార్హ్యజతులక్ష్మి గలిగించుఁబదనఖాగ్రమునఁదఁ
గిలి । తళుకొత్తు మిన్నేటి తెలిసీటి దెమలునముదురు చెందొవచాలు మొలపఁబెట్టు । సీ
మంతసీమాంతసిందూరరుచిఁ జేయు మ్రొక్కిలేవ నివతుశ్శ్రీతిసతులకుఁ । బీరరూపం

---

౨౩౮ ॥ కర్కశపు — కఠినమైన. విచ్చికపు — దుష్టమైన ॥ ౨౩౯ ॥ శరధికిన్ — సముద్రమునకు ॥ ౨౪౦ ॥ కోరకిత — మొలకలెత్తిన ॥ ౨౪౧ ॥ గిరికానుషక్త — చిట్టెలుకయందాసక్తమయిన; గిరికాదేవియందాసక్తమైన ॥ ౨౪౨ ॥ ౨౪౩ ॥ చండము — భయంకరము. ఆఖుకన్యక — ఎలుకపిల్లను ॥ ౨౪౪ ॥ సరియన్ — సంమనందు. సంవర్తహతిన్ — ప్రళయకాలపుదెబ్బచేత ॥ ౨౪౫ ॥ రమాకమన — కృష్ణదేవునియొక్క. కైతకప్రసవము — గేదఁగిపువ్వు ॥ ౨౪౬ ॥ బిసాశనశాబము — హంసపిల్ల. కోరకమున్ — మొగ్గను. మిహికాఘృణిన్ — మంచువెలుఁగును — చంద్రుని ॥ ౨౪౭ ॥ మదిర — మద్యము. వంపు — వాసన ఆను — గ్రోలు. మధూళి — మకరందము — తేనె. భుజంగభర్త — పాములరాజు; విటశ్రేష్ఠుఁడు ॥ ౨౪౮ ॥ రుచిర — ప్రకాశించునట్టి ॥ ౨౪౯ ॥ అతులక్ష్మిన్ — లత్తుక కలిమిని. తెమలునన్ — చలనమునందు. చెందొవ — ఎఱ్ఱగలువ. సీమంత సీమాంత —

ఋనఁబెట్టిన శేషునిఫణరత్నఘృణులకుఁ బ్రాఁకువెట్టు । కైటభాంతకపూజనాకైతక
ప్ర । సవనవామోదపారణాసౌఖ్యముదిత । భుజగరాజస్ఫటాభోగభూరిమణిస ।
మాజరాజశ్రీభాపుంజమంజిమములు ॥ ౨౫౦ ॥ క ॥ వ్యాపించుతిమిరహరమై ।
దీపించునిజోత్తమాంగదివ్యమణిరుచిన్ । దీపావళిహరికిచ్చుచు । నాపుణ్యఫలాను
భవమునయ్యహిఁగనియెన్ ॥ ౨౫౧ ॥ క ॥ ఆతఱినొకకందువన । వ్వాతాశనశయను
కేళివనవసుమతిను౦ । డేతెంచెన్ సరఘాసం । ఘాతముతమపెరకుఁగడువిఘాతంబ
గుటన్ ॥ ౨౫౨ ॥ క ॥ కాయన్యతిజిడ్డుకొనఁగ । నాయీఁగలమొత్తమాశ్రితాఖిల
దిశమై । యాయెడఁ బ్రైలతటాక । న్యాయంబొనరించె జలధరాధ్వంబునకున్ ॥ ౨౫౩ ॥
శా ॥ ఆమందోద్భవబీజషండ రుచి సయ్యాటించుచున్ మక్షికా । స్తోమంబాతతప
క్షగుచ్ఛమగుచున్ దోతేరగాశ్మశ్రులం । బైమిన్నొప్పుతదంగసంగతిమధువ్యామో
హాముం జేయుచో । ద్యోమర్త్యాలికిఁ దద్విపక్షకలితద్రుమస్కంధవీరుచ్ఛిఖల్ ॥ ౨౫౪ ॥
క ॥ ఆమధుమక్షికలటఁజని । దామోదరమందిరాగ్రతలగతనిర్మా । ల్యామోదా
మేదురమధు । ప్రేమాకులబుద్ధిమైఁజరింపఁగనంతన్ ॥ ౨౫౫ ॥ క ॥ అందునొకసరఘ
గ్రోలెను । కుందపదార్ఘ్యాంబు బిందుగుంభితసుమనో । మందమకరందశీకర ।
మందీర్థస్వార్థముల్ సమున్నతి వెలయన్ ॥ ౨౫౬ ॥ క ॥ కలిగెనుమధుమక్షికమునకుఁ ।
దలఁపనితలఁపస్మదాదిధార్యముగంగా । జలవలమానముయదుకుల । తిలకాంఘ్రిస
రోజదివ్యతీర్థముగ్రోలన్ ॥ ౨౫౭ ॥ తే ॥ దానసంభవించెఁ జనియ యీఁగకు ।
సోమపానరతుల సుకృతఫలము । భాగ్యమొదవె నేసిఁ బ్రాపించుతనుఁ దాన । పుణ్య
లక్ష్మినిధియుఁబోలెఁబురుషు ॥ ౨౫౮ ॥ సీ ॥ జనియించెనే సాధ్విజాతిస్మరత్వసంప
దకల్మినిజకులాభరణమగుచు । వర్తించెనే పతివ్రతతాటిమించటి తపమైనతనువునఁ

---

పాపటకొనయందలి. ప్రాఁకు — (తీఁగలకుఁబెట్టునట్టి) యల్లుడుకట్టు. పారణ — ఒక ప్రొద్దున్న దిన
మునకుమఱునాటిభోజనము — ఇక్కడభోజనమనియర్థము. స్ఫటా — పడగయొక్క. ఆభోగ — వి
శాలప్రదేశమునందలి. రాజత్ — ప్రకాశించుచున్న. మంజిమములు — మనోజ్ఞతలు ॥ ౨౫౦ ॥ దీపిం
చు — వెలుఁగునట్టి. ఉత్తమాంగ — తలయందలి. రుచిన్ — ప్రకాశముచేత. దీపావళిన్ — దీపముల
వరుసను ॥ ౨౫౧ ॥ కందువన్ — సమయమునందు. వాతాశనశయను — శేషశాయియొక్క.
సరఘాసంఘాతము — తేనెటీఁగలగుంపు. పెరకున్ — తేనెతెట్టుకు ॥ ౨౫౨ ॥ జిడ్డుకొను — మెఱుఁగు
దేఱు. ఆశ్రితాఖిలదిశము — ఆశ్రయింపఁబడినయెల్లదిశలుగలది. జలధరాధ్వము — ఆకాశము ॥
౨౫౩ ॥ ఆమందోద్భవబీజషండరుచిన్ — ఆముదాలరాశివిధమును. సయ్యాటించు — పరిహసిం
చు. తోతేరఁగాన్ — తోఁచఁగా. శ్మశ్రులము — గడ్డమీసములుగలది. ద్రుమస్కంధవీరుచ్ఛిఖలు —
చెట్లమొదళ్లయందలిచిగురుఁగొమ్మలకొనలు ॥ ౨౫౪ ॥ ౨౫౫ ॥ సరఘ — తేనెటీఁగ. గుంభిత —
కూర్పఁబడిన ॥ ౨౫౬ ॥ ధార్యము — ధరింపఁదగినది. వలమానము — కదలుచున్నది. గ్రోలన్ — త్రా
గను ॥ ౨౫౭ ॥ ౨౫౮ ॥ జాతిస్మరత్వసంపదకల్మిన్ — పూర్వజన్మజ్ఞానముకలిమికలుగుటచేత.

దార్మిమిగిలి । నెలకొల్పె నేయపాంసుల మానసమునందుఁ బరమవైష్ణవధర్మపా
టవంబు । మెప్పించె నేసతియప్పౌండరీకతీర్థవిభునిష్టాన్నవిశ్రాణనమున । నాసుశీల
కునకాఁకహంసచిత్ర । శుకభుజంగమసరఘులుసుగథసులభ । సుముఖసువ్రతసుకృ
తినామములవరుసఁ । దాల్చిజనియించెశుక్తిముత్యాలువోలె ॥ ౨౫౯ ॥ క ॥ భూ
లేఖకులకేయే । కాలంబున నెట్టి మెట్టిక్ష్మామోనర్పం । బోలుంద త్తత్కృత్యము ।
లాలించిత్వకృత్యములయి గుణోన్నతిఁ బెనుపన్ ॥ ౨౬౦ ॥ శా ॥ శాణోత్తేజితర
త్నలక్ష్మిగురుశిక్షావతిఁ గాంకృతిన్ । రేణుక్షాళనశారిమూర్తి కలభశ్రీదోహ
దోద్యన్నవ । క్షోణీజప్రభముక్తకంచుక ఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ । శ్రేణిప్రీ
ణకారణోజ్జ్వల కళోత్సేకాఢ్యులై రేవురున్ ॥ ౨౬౧ ॥ చ ॥ ఒకఁడునిరూఢకృష్ణ
రుచియొక్కఁడు నిర్మలమానసప్రియుం । డొకఁడుప్రయత్నయోగ్యఫలుఁడొక్కఁడ
నాదృతబంధకంచుకుం । డొకఁడురసానుకూలమతియుక్తుఁడునై విలసిల్లిరంతపు । త్ర
కులఁట నెట్టివారలకుఁ దప్పునెతొల్లిటిజన్మవాసనల్ ॥ ౨౬౨ ॥ ఉ ॥ లౌకికవైదికాచ
రణలాలసులై హరిభక్తిసత్తమ । శ్లోకులువీరనందగిరిసూనృతలక్ష్మికిఁబట్టుగొమ్మలై ।
యేకడసర్వభూతదయయే తమసొమ్ముగదీనమానస । వ్యాకులతాపనోదనధనా
ఢ్యులనన్ విలసిల్లి రేవురున్ ॥ ౨౬౩ ॥ క ॥ అత్త్రాలుగోలమలరులసర । మెత్తిఁ క్రియఁ
జాలుపొంగు నెసవికసితమౌ । నైత్తమ్మికొలని చెలువునఁ । దత్తత్సౌభాగ్యములను
దాత్తంబయ్యెన్ ॥ ౨౬౪ ॥ ఉ ॥ కేసరిశాబశోభిగృహకర్తయుభానుమదంశవిస్ఫు
ర । ద్వాసరలక్ష్మివైభవమువారిధిలగ్నసమగ్రవేలయు । ల్లాసముదాల్చియొప్పెమ
హీశౌతిలకంబుపతిప్రసాదవి । న్యాసముచేతఁ జేవుఱినసందను లేవురు నందమందఁ

---

అపాంసుల—అంకటాలుకానిది—పతివ్రత. విశ్రాణనమునన్—ఈవిచేత ॥ ౨౫౯ ॥ భూలేఖకు
లులకున్—బ్రాహ్మణకులముగలవారికి॥ ౨౬౦ ॥ శాణోత్తేజిత—సానయందుమెఱుఁగివ్యఁబడిన.
ముక్తకంచుక—కుబుసమువిడిచిన. ప్రీణన—తృప్తినొందించుటకు. ఉత్సేకాఢ్యులు—అతిశయముగ
లవారు ॥ ౨౬౧ ॥ కృష్ణరుచి—నల్లనికాంతిగలవాఁడు; కృష్ణునిబోలినవాఁడు. నిర్మలమానసప్రి
యుఁడు—నిర్మలమయిన మానససరస్సునందుఁబ్రియముగలవాఁడు; నిర్మలమయినమనసుగలవారి
కిఁబ్రియుఁడు. ప్రయత్న యోగ్యఫలుఁడు — ప్రయత్నమునకుఁ దగిన పండు గలవాఁడు; ప్ర
యత్నమునకుఁదగిన ప్రయోజనముగలవాఁడు. అనాదృతబంధకంచుకుఁడు—ఆదరింపఁబడనికట్టు
యినకుబుసము గలవాఁడు; ఆదరింపఁబడని సంసారబంధమనెడి కవచముగలవాఁడు. రసాను
కూల—రసమునకు అనుకూలమయిన; భూమికి (లోకమునకు) అనుకూలమయిన॥ ౨౬౨ ॥ పట్టు
గొమ్మలు—ఆధారములు. అపనోదన — తొలఁగించుటయనెడి ॥ ౨౬౩ ॥ అత్త్రాలుగొలము—
అబ్రాహ్మణవంశము. ఎసన్—అతిశయముతో. చెలువునన్—అందముతో. ఉద్దాత్తము—హెచ్చిన
ది ॥ ౨౬౪ ॥ కేసరిశాబశోభి—సింహపుపిల్లవలె (స్వచ్ఛముగా) ప్రకాశించునట్టి. భానుమదంశు
విస్ఫురద్వాసరలక్ష్మి—సూర్యప్రకాశముచేత వెలుఁగునట్టిపగటి సంపద. లగ్న—అంటిన. విన్యా

గన్ ॥ ౨౬౫ ॥ తే ॥ అఖిలకల్యాణగుణశీలయగు సుశీల । పెట్టెఁ జేమీఁదు గానెల్లను
ట్టములకు । భర్తతోఁ గూడ ముత్తాటిపండుదినియె । నైత్తెయున్నన్న గుబ్బలనెంద తేని ॥
౨౬౬ ॥ ఉ ॥ ఆనలినాయతాక్షి ప్రసవాపగమంబునఁ బండఁబాఱుచున్ । బ్రాణవిభూ
పలాలనము ప్రాఁకుడుఁ గోర్క్యఁగనిశ్చివన్నసం । తానమొసర్చు ప్రోదిజర దైన్యము
నాఁగ నతీతవర్షను । ద్యానతరౌషధి ప్రవహదంబు సమీపనిమగ్నఁ బోలదే ॥ ౨౬౭ ॥
క ॥ సకలాగవజ్ఞయగుని । ప్రకులాంగనయొక్కనాడు పలుకు నిజకుమా । రకులఁగని
ముమమదాలస । శుకతుల్యులఁ గూర్మి యాత్మజులఁ బలుక క్రియన్ ॥ ౨౬౮ ॥ మ ॥ అ
నుభూతాఖిలభోగపోషిత సమస్తార్యంకృతానేకకాం । చనముఖ్యోచిత దానదృష్టి
గతయున్ క్షేమజీవత్పృషన్ । జనతామాన్యనశీతివృద్ధనను నీసంసారదుర్వారబం ।
ధననిర్బంధమునందుఁ బాపుటకు యత్నంబింకఁ జేయందగున్ ॥ ౨౬౯ ॥ క ॥ సభవజ్జన
కంబుగఁ జని । ప్రభవజ్జగదండషండపరిపూర్ణతనున్ । శుభదాయిఁ బౌండరీక । ప్ర
భునారాధించి కాంతుఁ బరమపదంబున్ ॥ ౨౭౦ ॥ క ॥ ఓకబుద్ధి వినుండొండొ । డకసక
లాగమమతంబు దక్క దెలిసిమీ । కకుటిలమతి నెఱిఁగింతు జ । నకసనకశుకాదు లెఱిఁగి
న తెరువుఁ దెలియన్ ॥ ౨౭౧ ॥ సీ ॥ అమితభోగాయతనము దేహమను సర్పము గ్రక్కు
త్యములేల యడిగియుండు । ధాతుమయంబు గాత్రమను ధాత్రీధరంబున యేల రాగం
బు నవ్వులఁ ద్రోయు । నిచితనానాగుణప్రచురసీతనువను ఫలమేల చిరుఁగకపడిలమొం
దు । మూర్మివరంపరాయుతమంగమనువార్ధి నేజీవనభ్రాంతి యేలయునుగు । నాగ్ర
వంబు చాలదతికరి వాశయు । మెప్పుదు మైలవిడువ దెండుఁ జివుకఁ । బటకికొక్క దీనిఁ బా
టింప రెప్పాట । లక్షియేఁ యయును ముముక్షుజనులు ॥ ౨౭౨ ॥ ఉ ॥ మాయయుఁ జీ
వుఁడుం బెరసి మైత్రియొకానొకఁ డాచరించుచుం । బాయకయాఁడఁ బాటునుగ పా
టువడన్ వివిధత్వమొందిప । ల్పాయులఁ బొంద భౌతికవృగ్నైరుదయిం చితలిర్ప్రమో

---

సము—ఉంచుట. చేకుఱిన—కలిగిన ॥ ౨౬౫ ॥ ముస్నన్న గుబ్బలన్—మనుమలకు కొడుకులైన బిడ్డ
లను, ముత్తాటిపండుదినియెన్—ముత్తైదువతనమువలని ఫలమును అనుభవించెను. ఎందఱినిన్—
ఎందఱినో—అనేకులను ॥ ౨౬౬ ॥ ప్రసవాపగమంబునన్—కానుపులయుడిగిపోవుటచేత; పూ
వులుడిగిపోవుటచేత. ప్రోది—రక్షణము. అఁగన్—త్రోసివేయఁగా ॥ ౨౬౭ ॥ ౨౬౮ ॥ అను
భూత—అనుభవింపఁబడిన. అర్యంకృత—యోగ్యముగాఁ జేయఁబడిన. ముఖ్య—మొదలగు. దృష్టి
గతన్—చూపును బొందిన దానిని. అశీతివృద్ధన్—ఎనుబదియేండ్లు మసలిదానిని ॥ ౨౬౯ ॥ సభవ
జ్జనకంబుగన్—మీతండ్రితోఁగూడ. ప్రభవత్—పుట్టుచున్న ॥ ౨౭౦ ॥ ౨౭౧ ॥ ఆయతనము—
ఇల్లు. రాగంబున్—అనురాగమును; ఎఱుపువన్నెను. నిచిత—వ్యాపింపఁజేయఁబడిన. చిరుఁగక
—చినుఁగక. ఊర్మి—తరఁగము; అల. జీవనభ్రాంతి—బ్రదుకునందలిభ్రమ; నీటివలని తిరుగుడు ॥
ఆశయము—చోటు ॥ ౨౭౨ ॥ పెరసి—చేరి. కడంగరీయములు—తాలుగడ్డమీఁదయున్నట్టి యొక్కలు

దుగా । మేయుజరామయవ్యసనమృత్యువియుక్తిఁ గడంగరే యముల్ ॥ ౨౬౩ ॥ శా॥ అంతర్వాణికుశేశయద్యుమణిఁ బద్మాక్షున్ మదిన్ నిల్పి దు । ర్దాంతానంతభవాంధకూపతరణప్రౌఢిన్ దృఢస్థేమఁ బ్రా । ణింతుర్పెద్దలు తద్దయమ్మినుయిదాఁటేవానికిన్ జింతయా । కంతైనం గడమేనియుం గడమగా దాయంచునూహించుచున్ ॥ ౨౬౪ ॥ క॥ తలముచ్చుట్టులు దిరిగిన । తలపోయఁగ నోరిలోనిద చుకడియన్న । ట్లిలనే తెలుఁగుఁదిరిగినఁ । గలుగదు గతి విష్ణుసేవ గావింపకయున్ ॥ ౨౬౫ ॥ మ॥ పురుషశ్రేష్ఠులు గొందఱాత్మచరితంబుల్ జ్ఞానవైరాగ్యభా । స్వరముల్ గావిహరించుచున్ గురుకృపాసంపన్నులై సాధనాం । తరమంత్రాంతరదేవతాంతరములందర్కించి క్షీరోదక । స్ఫురణం బొప్పముకుందలీనతనులై పొందర్పునర్జన్మముల్ ॥ ౨౬౬ ॥ సీ॥ విషయాంకురము గిల్లివేయనివారికి నినుపకచ్చడమునకెంతదవ్వు । తెగఁగోసి కసటుఁగడుగనివారికి త్రిషవణంబునకు నెన్నిచాళ్లపట్టు । చింతలన్నియు మోఁదు సేయనివారికి బోడయాదలలకు నేడకేడ । యేనుతత్వంబులు నెఱుఁగనివారికి నెఱుకకు నేయూరికేది తెరువు । తమమొగంబుఁ జూడు తముఁ జూడు మేనుంగు । మీఁదనున్నవాని మెరమీరి । సున్నమదుగఁ జూచుచున్నారు హరిభక్త । గవ్యథామకాంక్షఁ గర్మపరులు ॥ ౨౬౭ ॥ సీ॥ పరదారపరధనాహరణవైముఖ్యంబు వశవర్తి గావించువారుదక్కఁ । బరగుణపరమాణుపర్వతీకరణంబు వ్రతముగాఁ బాటించువారుదక్కఁ । బరుఁడైనఁ గొడుకైనను మరియాద చెడనవశ్యమున శిక్ష యొనర్చువారుదక్కఁ । బరమసంపదలనాపద్వేళ సత్యంబు వదలక భాషించువారుదక్క । గూరమగు కోరిక్కఁ గోరనివారుదక్కఁ । గ్రూరకర్మంబు లుడివోవువారుదక్కఁ । బూరుషార్థపరతఁ గ్రాలువారుదక్కఁ । దక్కవారెల్ల భవవహ్నిదక్కువారు ॥ ౨౬౮ ॥ క॥ పలువేల్పుల బడి నడవక । యిలువేలుపుగా భజింపుఁడీ మీరలు వి । ట్ఠలు శిక్యగదధిరసగం । ధిలకేళుం బాండరీకతీర్థాధీశున్ ॥ ౨౬౯ ॥ ఉ॥ మస్తకిరీటహాటకసమంచితకుంభయుతంబు పీవరో । రస్తటరత్నదీప్తిరుచిరంబు రమాసమసాలభంజికా । శస్తమునైన శార్ఙ్గితనుసౌధము నెక్కి సుఖించు బుద్ధికిన్ । నిస్తులభక్తిగౌరవమనిచ్చెనసైచ ననిచ్చు మీఁదికిన్ ॥ ౨౭౦ ॥ క॥ మీరును గృహస్థధర్మము । మేరకుఁ జలమీఱి చనక

---

౨౬౩ ॥ అంతర్వాణికుశేశయద్యుమణిన్— విద్వాంసులనెడిపద్మములకు సూర్యుని. స్థేమన్— బలమును. కడమ— తక్కువ ॥ ౨౬౪ ॥ ముచ్చుట్టులు— మూడుచుట్లు ॥ ౨౬౫ ॥ భాస్వరములు— వెలుఁగునవి. తర్కించి— విచారించి. లీన— ఐక్యమైన ॥ ౨౬౬ ॥ కసటు— మలిని. త్రిషవణంబు— త్రికాలస్నానము. బోడయావల— బోడితల. తెరువు— మార్గము. గవ్య— పొందఁదగిన ॥ ౨౬౭ ॥ ఉడివోవు— ఉడుగు. క్రాలు— ప్రకాశించు ॥ ౨౬౮ ॥ అడిన్— మార్గమున. శిక్యగ— ఉట్టిఁబొందిన. గంధిల— వాసనగొట్టుచున్న ॥ ౨౬౯ ॥ మస్త— తల. పీవర— బలిసిన. ఉరస్తట— రొమ్ముప్రదేశమునందలి. శస్తము— శ్లాఘ్యము ॥ ౨౭౦ ॥ మేరకున్— మర్యాదకు. తలమీఱి—

మిత్రామాత్యో । దారహితదారదారక । వారకములతోఁ దీర్ఘవాసఃరులరై ॥ ౨౮౧ ॥ క ॥ కోమలతులసీపల్లవ । దామాంచితవత్సలక్ష్మధాముఁ బయోద । శ్యాముఁ బదద్వయనుతసు । త్రాముఁ మనపౌండరీకధాముఁ గొలువుఁడీ ॥ ౨౮౨ ॥ క ॥ అనుచుండ నరహరిసభ్యులగు । ననిమిషయానంబు దెచ్చి హరిపార్శ్వచరుల్ । కొనిచని సిరిసభర్తృకముగ । ఘనశీలసుశీలవిష్ణుగాథాలోలన్ ॥ ౨౮౩ ॥ తే ॥ అపుడు నీసుతుండు వాయసమునం చ । రాజకీరంబు పామునరఘుయునిట్లు । ముక్తి కేగి నకథవినుభక్తతతికిఁ । బర్వతాగ్రశిలాబ్జసంభవము భవము ॥ ౨౮౪ ॥ వ ॥ అని వెండియు నిందుధనుండు శతానందనందనుతో నిట్లనియె ॥ ౨౮౫ ॥ సీ ॥ నీలమో కాలాభ్రజాలమో బాలశైవాలమో యీసిద్ధవరునికాంతి । కెంపులో పవడంపుగుంపులో యీ రెండసొంపులో యీ మేటిజోగిజడలు । హారమో హారనీహారమో భూరికర్పూరమో యీయాదిపురుషునగవు । మెఱుపులో వజ్రంపుఁదొఱపులో శశిరేఖ తఱపులో యీ టూర్తము నికోలు । లనఁగ శార్ఙ్గికి నాదిఋక్షనందు నిలిచి । ప్రేతభూతనిశాచరపీడఁ దఁపి । క్షేత్రరక్షణదక్షుఁడై క్షేత్రపాలుఁ । డుండు విభునాజ్ఞ తలమోచి యో మునీంద్ర ॥ ౨౮౬ ॥ క ॥ శిక్యావచూడునాజ్ఞా । వాక్యార్థము సేయుభోగివలయుప్రభావా । ధిక్యంబు మీఱి మోక్ష । శక్యమెతత్ప్రమునఁ బ్రచారము నెర్పన్ ॥ ౨౮౭ ॥ చ ॥ చెనకఁగలవిష్ణుభక్తి నిరసించు దురాత్ముల మోక్షలక్ష్మి చే । పడుటకుఁ గానిహీనులఁ బ్రభావతరస్ఫురాలోకపాలుఁడా । బుడిబుడితాల్పుడందు నొకబూఁటయు నుండఁగ నీకుత్రోచిపో । నడుచుఁగలంపు డెందములనాగటఁ బెట్టు మహోగ్రమూర్తియై ॥ ౨౮౮ ॥ ఉ ॥ పువ్వును బూఁతపుట్టనును భూషయు దివ్యములై చెలంగ లే । జవ్వనులర్థిఁ గోల్వనొకచక్రనిషేచరుఁడొక్కనాఁడు ము । న్నవ్వనమాలిహాటకనుయావసథోపరివీథిఁ బిమ్మరుఁగ్ । గొవ్వుసఁగన్వెమాసరుచి కోకనదప్రియుఁ గోచి మెచ్చఁగన్ ॥ ౨౮౯ ॥ ఉ ॥ ఏధితయౌవనోత్థమతి నెద్దియుమీఁ దెఱుఁగంగ లేక వి । ద్యాధరుఁ డాతఁ డాత్మరుచినాక

---

అతిక్రమించి. ఉదార—చిన్నదనముగల. దారకవారకములతోన్—పిల్లకాయలసమూహములతో ॥ ౨౮౧ ॥ వత్సలక్ష్మ—శ్రీవత్సమనెడి చిహ్నముగలది ॥ ౨౮౨ ॥ అనిమిషయానము—విమానము. సభర్తృకముగన్—పెనిమిటితోఁ గూడుకొనునట్టుగా. విష్ణుగాథాలోలన్—విష్ణునికథలయందాసక్తురాలైనదానిని ॥ ౨౮౩ ॥ ౨౮౪ ॥ శతానంద—బ్రహ్మయొక్క ॥ ౨౮౫ ॥ బాలశైవాలము—లేఁతపాఁచి. ఈరెండ—కొంచెపుఎండ. జోగి—యోగి. హారము—ముత్యాలసరము. హారి—మనోజ్ఞమైన. వజ్రంపుఁదొఱపులో—రవలవెలుఁగులో. తఱపులో—ముదురుఁదనములో. మోచి—వహించి ॥ ౨౮౬ ॥ శిక్యావచూడు—చిక్కము సిగయందుఁగలవానియొక్క. ప్రచారము—సంచారము ॥ ౨౮౭ ॥ నిరసించు—తిరస్కరించు. బుడిబుడితాల్పుడు—బాలచంద్రుని ధరించినవాఁడు—క్షేత్రపాలుఁడు ॥ ౨౮౮ ॥ ఖేచరుఁడు—విద్యాధరుఁడు. వనమాలి—విష్ణుదేవునియొక్క. ఆవసథోపరివీథిన్—ఆలయముమీఁదిమార్గమున. ఎసఁగన్—అతిశయించఁగా. కోకనదప్రియరోచి—వెన్నెలవెలుఁగువంటి వెలుఁగు ॥ ౨౮౯ ॥ ఏధిత—పెరిగిన. యౌవనోత్థమతిన్—ప్రాయమువల

ఘనహాసన్ముఖుఁ । మేచకమేఘసమాకృతిదినమిత్రసమానసమరత్నభూషితుఁ । లో చనశశికర్ణికాంబుజదళుఁ శతకోటిసుధాకరాగ్నిరు । గ్విదిపరంపరోపమనవీనత నుప్రభుయాదవప్రభుఁ ॥ ౨౯౭ ॥ వ ॥ ఇట్లుసచ్చిదానందకందంబగునచ్చిందంబు దాల్చి నసల్పాద్భుతరసనిర్మగ్నుండై కనుంగొనుచునవతీర్ణ గర్వవిద్యాధరుండైయవ్విద్యాధరుండిట్లనివితర్కించు ॥ ౨౯౮ ॥ శా ॥ ఈపుంగ్రామణి యెవ్వఁడో కో హరియిట్లొప్పెం దె సందేహమే । లాపద్మాక్షుఁడెయంచులోఁదెలిసి యేలక్ష్మీశయేఁద్వన్నివా । సోపర్యభ్రిచరద్విమానగుఁడనై యుండుండియిష్టాకృయు । తోఁపోదగ్రుఁడుగూల్పఁగొవ్వఁటెఁగి కఁగొంటిఁసురేశుఁనినుఁ ॥ ౨౯౯ ॥ క ॥ నిర్మలులకుఁదోఁచినకిరియ । దుర్మలులకుఁదోఁపవీవెదుటననుచుమనో । మర్మరవాపింబడిమనుజ । ధర్మభటుఁడుతత్పదద్వితయక్ష్పతమతినై ॥ ౩౦౦ ॥ స్రగ్ధర ॥ పాపోహంపాపకోపప్రవణమతిరహం బాలిశోహంసుధీదు । ష్ప్రాపోహం దుష్టకష్టప్రకృతిరహమహంపామరాత్మాస్మి నానా । రూపదోషాపచారార్బుదనిహితధీగుఁక్రోధినంమామవత్వ । చ్ఛ్రీపాదాసక్తియుక్తఁ శివకరయనుచుఁ జిష్ణుఁగృష్ణుఁనుతించెఁ ॥ ౩౦౧ ॥ వ ॥ అనిమఱియును ॥ ౩౦౨ ॥ చ ॥ యదుకులనాథయిష్టసిద్ధిఁగాగ్రహవృత్తినొసర్చునిగ్రహం । బిదియుననుగ్రహంబగునిందిరయరాజీకిబంటుసేయుశ్రీ । మదమునణంచి నీయడుగుమానిసిగాననుఁజేసెఁగానసం । పదగలగర్వనిర్మమునిమాడిక్కినినుంగనికొల్వఁజాలునే ॥ ౩౦౩ ॥ క ॥ మూఢుఁడననుఁబ్రోవుమహా । దీర్ఘకుఁకఁజొరకనామతివెలయుతదయా । గాధత్వాజ్ఞవిమానా । గూఢుఁడనై జగములందిరుగువాఁడహరీ ॥ ౩౦౪ ॥ చ ॥ సురసదనంబునందయినఁక్రోణితలంబునయందునైనఁభీ । కరనిరయంబునందయినఁగర్మవశంబుననుండునామదిం । బొరయునుగాతఁగాతరసముద్ధరణోచితకార్యధుర్యత్వ । చ్చరణసరోరుహద్వితయసంతతసంస్మరణానుషంగముల్ ॥ ౩౦౫ ॥ క ॥ అనివలగొనియాయదునం । దనుసిరుపమదివ్యరూపదర్శనమునలోఁ । దనియుచుఁజొక్కుచుమ్రొక్కుచుఁ । జనియెఁ విద్యాధరుండు శతధృతితనయా ॥ ౩౦౬ ॥ క ॥ మధుమథనునాజ్ఞనేవం । విధ

---

ఘ—నీలమేఘమువంటి ॥ ౨౯౭ ॥ కందము—మంప. చిందంబు దాల్చి—శంఖమునుధరించినవాఁడు—కృష్ణుఁడు. నిర్మగ్నుఁడు—మునిఁగినవాఁడు. అవతీర్ణ—దిగిన—పోయిన ॥ ౨౯౮ ॥ పుంగ్రామణి—పురుషశ్రేష్ఠుఁడు. అభ్రిచరత్—ఆకాశమునందుఁదిరుగుచున్న ॥ ౨౯౯ ॥ మర్మరవాటి—మమ్ముబావియందు ॥ ౩౦౦ ॥ సుధీదుష్ప్రాపః—విద్వాంసులకుఁబొందరానివాఁడను. పామరాత్మాస్మి — మూఢమనసు గలవాఁడనైతిని. మామవ — నన్ను రక్షింపుము ॥ ౩౦౧ ॥ ౩౦౨ ॥ అడుగుమానిసి—పాదసేవకుఁడు. నిర్మమునిమాడ్కిఁ — మమతలేనివానివిధమున ॥ ౩౦౩ ॥ మహాదీర్ఘకుఁ—పెద్దలయవమానమునకు ॥ ౩౦౪ ॥ కాతర—భయపడినవారియొక్క. అనుషంగములు—కూడినవి ॥ ౩౦౫ ॥ వలగొని—ప్రదక్షిణముచేసి. శతధృతి—బ్రహ్మయొక్క ॥ ౩౦౬ ॥ ఏవంవిధమహిమన్—ఈవిధమయినమహాత్మ్యముచేత ॥ ౩౦౭ ॥

